# కృష్ణాజిల్లా పత్రికా రంగం - ఒక అధ్యయనం


పరిశోధకుడు

కప్పగంతు రామకృష్ణ





పర్యవేక్షణ

డాక్టర్ గుమ్మా సాంబశివరావు

ఎం.ఎ., పిహెచ్.డి.,

తెలుగు శాఖాగ్రణి

ఆంధ్ర లొయోలా కళాశాల, విజయవాడ.




పి.హెచ్.డి. పట్టం కోసం దూరవిద్యా కేంద్రం ద్వారా

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయానికి

సమర్పించిన సిద్ధాంత గ్రంథం

ఏప్రిల్ - 2013

# కృష్ణాజిల్లా పత్రికారంగం - ఒక అధ్యయనం

పరిశోధకుడు

**కప్పగంతు రామకృష్ణ**

ఎన్‌రోల్‌మెంట్ నంబరు : A08PD042003



పర్యవేక్షణ

**డాక్టర్ గుమ్మా సాంబశివరావు**

ఎం.ఎ., పిహెచ్.డి.,

తెలుగు శాఖాగ్రణి,

ఆంధ్ర లొయోలా కళాశాల, విజయవాడ

దూరవిద్యాకేంద్రం

**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం**

నాగార్జున నగర్ - 522 510



దూరవిద్యాకేంద్రం

**ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం**

నాగార్జునగర్ -522 310, ఆంధ్రప్రదేశ్.

**దాక్టర్ గుమ్మా సాంబశివరావు,**
ఎం.ఎ., పిహెచ్‌డి.,
తెలుగుశాఖాగ్రణి, ఆంధ్ర లొయోలా కళాశాల,
విజయవాడ-10.

## ధ్రువీకరణ పత్రం

**కృష్ణాజిల్లా పత్రికారంగం – ఒక అధ్యయనం** అనే అంశంపై

పరిశోధకుడు **కప్పగంతు రామకృష్ణ** (ఎన్‌రోల్‌మెంట్ నంబరు : A08PD042003)

- పూర్తిగా నా పర్యవేక్షణలో పరిశోధన సాగించాడని,
- సిద్ధాంత గ్రంథాన్ని పిహెచ్.డి పట్టం కోసం స్వయంగా రచించాడని,
- పరిశోధన ప్రమాణాలకు అనుగుణంగా ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించాడని,
- ఇంతకుపూర్వం ఇతరులెవ్వరు ఏ ఇతర విశ్వవిద్యాలయానికి, ఎటువంటి పట్టం కోసం ఈ సిద్ధాంత గ్రంథాన్ని సమర్పించలేదని

ఇందుమూలముగా ధ్రువపరుస్తున్నాను.

స్థలం: విజయవాడ

తేదీ:

**దాక్టర్ గుమ్మా సాంబశివరావు**

పరిశోధన మార్గదర్శకులు

# హామీ పత్రం

**కృష్ణాజిల్లా పత్రికారంగం - ఒక అధ్యయనం**

అనే సిద్ధాంత గ్రంథాన్ని నేను స్వయంగా రాశాననీ,

ఈ పరిశోధన నా స్వయంకృషి ఫలితమేననీ హామీ ఇస్తున్నాను.

మా పర్యవేక్షకులు **డాక్టర్ గుమ్మా సాంబశివరావు** గారి

(తెలుగు శాఖాగ్రణి, ఆంధ్ర లొయోలా కళాశాల, విజయవాడ)

ప్రత్యక్ష పర్యవేక్షణలో ఈ సిద్ధాంత వ్యాసాన్ని రాశాననీ,

ఇంతకుముందు ఏ ఇతర విశ్వవిద్యాలయానికి గాని, మరే ఇతర సంస్థకు గానీ,

ఏ ఇతర పట్టం కొరకు దీన్ని సమర్పించలేదని ఇందుమూలంగా తెలియజేస్తున్నాను.

స్థలం : విజయవాడ
తేదీ :

**కప్పగంతు రామకృష్ణ**
పరిశోధకుడు
(ఎన్‌రోల్‌మెంట్ నంబరు : A08PD042003)

# కృతజ్ఞతలు

**కృష్ణాజిల్లా పత్రికారంగం - ఒక అధ్యయనం** అనే పరిశోధనాంశాన్ని సూచించడం మొదలు పి.హెచ్‌డి పట్టం కోసం ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయానికి ఈ పరిశోధన గ్రంథాన్ని సమర్పించే వరకు వెన్నంటి ఉండి నాకు మార్గదర్శకత్వం వహించిన విజయవాడ ఆంధ్ర లొయోలా కళాశాల తెలుగు శాఖాగ్రణి **డాక్టర్ గుమ్మా సాంబశివరావు** గారికి తొలిగా హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. పరిశోధన క్రమంలో ఎప్పటికప్పుడు నన్ను ఉత్తేజపరుస్తూ, విలువైన సూచనలతో అత్యంత ప్రామాణికంగా నాచేత పరిశోధన చేయించిన ఆయనకు అక్షర రూపంలో చెప్పే ధన్యవాదాలు ఎంతమాత్రమూ సరిపోవు.

పరిశోధన మార్గంలో అనుక్షణం చేయి పట్టుకుని నన్ను నడిపించిన వ్యక్తి **డాక్టర్ పమ్మి పవన్‌కుమార్** (అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం) గారు. ఏదో తెలియని ఆత్మీయతను నాలో నింపి, నా చేత పరిశోధన పూర్తిచేయించినందుకు కృతజ్ఞతలు చెప్పి ఆయన్ను దూరంగా ఉంచలేను.

పాఠశాల దశ నుంచి విద్యార్థిగా కాకుండా ఇంటి మనిషిగా నన్ను ఆదరించి, ఈ సిద్ధాంత గ్రంథం మేలు ప్రతిని తయారుచేయడం వరకు ప్రతి అంశంలో తన ఆశీర్వాదబలాన్ని నాకందించిన మా మాస్టారు **డాక్టర్ ప్రఖ్య సత్యనారాయణశర్మ** (విశ్రాంత ప్రధానోపాధ్యాయుడు, శిశువిద్యామందిరం ఉన్నత పాఠశాల, విజయవాడ) గారికి; నాలో పరిశోధనాసక్తిని రేకెత్తించి, ఎం.ఈడి; ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసాలు రాయించడంతో పాటు ప్రస్తుత పరిశోధనకు అమూల్యమైన సలహాలనిచ్చిన **ప్రొఫెసర్ డి.ఎస్.ఎన్.శాస్త్రి** (విశ్రాంత ప్రాచార్యుడు, ఎ.జె.కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, మచిలీపట్నం) గారికి నా నమస్కారాలు తెలియజేస్తున్నాను.

అక్షర దోషాలతో పాటు నా ఆలోచనల్లోని దోషాలను సైతం సవరించి, ప్రస్తుత సిద్ధాంత గ్రంథ శుద్ధప్రతిని సిద్ధం చేయించిన **డాక్టర్ వారణాసి వేంకట భానుమూర్తి** (విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు, ఎస్.ఆర్.ఎస్.వి.కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, విజయవాడ) గారికి నిండైన మనసుతో ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. కృష్ణాజిల్లా నుంచి వెలువడిన వివిధ పత్రికల తొలిసంచికల చిత్రాలను సహృదయంతో అందించిన **పులిపాటి దుర్గారావు** (ఉపాధ్యాయుడు, నగరపాలక సంస్థ పాఠశాల, విజయవాడ) గారికి ప్రత్యేక ధన్యవాదాలు చెబుతున్నాను.

పరిశోధన త్వరగా పూర్తిచేసుకోమంటూ ఉత్సాహాన్ని అందించి ప్రోత్సహించిన మా **ఎస్.ఆర్.ఎస్.వి. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్** అధ్యాపక, అధ్యాపకేతర మిత్ర బృందానికి కృతజ్ఞతలు. ఇంకా ఈ క్రమంలో నాకు ఆత్మీయ సహకారాన్ని అందించిన **శ్రీసన్‌ఫ్లవర్‌న్యూస్ దినపత్రిక** యాజమాన్య, ఉద్యోగ బృందానికి; ఈనాడు దినపత్రిక విజయవాడ ఎడిషన్ ఇన్‌ఛార్జి **శ్రీ గొడవర్తి శ్రీనివాస భరణికుమార్**గారికి; ఇంకా ఎందరో..ఎందరెందరో.. హితులు, సన్నిహితులు, పాత్రికేయ మిత్రులు.. అందరికీ కైదండలు.

**పరిశోధకుడు**

## అధ్యాయం - 1

# ఉపోద్ఘాతం

సమాజ శ్రేయస్సుకు, దేశాభివృద్ధికి అత్యంత మూలమైన నైతిక విలువలను ప్రజల్లో ఇనుమడింపజేయడానికి, వారి మనోభావాలను చాలావరకు తీర్చిదిద్దడానికి పత్రికలు కృషి చేస్తుంటాయి. ఈ క్రమంలో అవి పోషిస్తున్న పాత్ర ఎంతో క్రియాశీలకంగా ఉంటుంది. ఏదేశ రాజ్యాంగంలో అయినా దేశాభివృద్ధికి, ప్రజాస్వామ్య పరిరక్షణకు, ప్రజల ప్రయోజనాలను సాధించేందుకు రాజ్యాంగంలో ముఖ్యంగా మూడు విభాగాలు ఉంటాయి. అవి 1. ప్రభుత్వం. 2. పార్లమెంటు. 3. న్యాయవ్యవస్థ. ఈ మూడు వ్యవస్థలను ప్రభావితం చేయగలిగిన శక్తి పత్రికలకు ఉంటుంది. అందుకే పత్రికారంగాన్ని నాలుగో వ్యవస్థ (ఫోర్త్ ఎస్టేట్)గా వ్యవహరిస్తుంటారు. ప్రభుత్వాలను మార్చగలిగన శక్తి, ప్రభుత్వాల్ని ఏర్పాటు చేయగలిగిన శక్తి కూడా పత్రికలకు ఉంది.

'చుట్టూ ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూచునే కంటే ఓ చిరుదీపం వెలిగించు' అని ఓ కవి చెప్పినట్లు అనేక సమస్యలతో సతమతమవుతూ, నడిచేందుకు ఇబ్బందిపడే సమాజ నావను సరైన దిశలో పయనింపజేసే దిక్సూచికలుగా పత్రికల్ని పేర్కొనవచ్చు. మానవుడు ఆశాజీవి. అనేక అంశాలపట్ల ఆసక్తి కలిగిన బుద్ధిజీవి. కానీ ఈ అంశాలు అతని దృష్టికి తెచ్చేదెవరు? ఇలాంటి ప్రశ్నలకు తేలికగా సమాధానాలు చెప్పే అక్షరదర్పణాలు పత్రికలు. ఓ నిరుద్యోగి ఉపాధి కోసం వెదుకులాడాలనుకున్నా, ఓ నిరుపేద తన కూతురిని అత్తవారింటికి పంపించేందుకు వేట సాగించాలనుకున్నా, ఓ రాజకీయ పక్షి విజయావకాశాల కోసం వెర్రిగంగలెత్తినా, ఓ విద్యార్థి తన అదృష్టాన్ని పరీక్షించుకోదలచినా ముందుగా పత్రికలనే ఆశ్రయిస్తారు. అనుక్షణం పత్రికలనే వెతుకుతుంటారు. పత్రికల్ని సమాజం నుంచి విడదీయలేం. అనాది నుంచి ఇది కొనసాగుతోంది. సంఘ సంస్కరణలతోను, సమాజోద్ధరణలతోను మొదలైన పత్రికా వ్యాసంగం ఎన్నో ప్రయాసలకోర్చి, ప్రసవ వేదనలు దాటి విశ్వమంతా వ్యాప్తి చెందింది. నల్లధనం ఆచూకీ, దగాకోర్ల చిరునామాలు, పైరవీకార్ల ప్రహసనాలు... ఒకటేమిటి సమాచారం చేరవేతలో వీటికి మించిన సాధనం మరొకటి లేదు. అందుకనే పత్రికలు లేని సమాజాన్ని ఊహించుకోవడం కష్టమనే నానుడి వ్యాప్తిలో ఉంది. పొద్దునే నిద్రలేవగానే ఒక చేత్తో కాఫీ కప్పు మరోచేత్తో దినపత్రిక పుచ్చుకునే వారు ఎందరో ఉన్నారు.

పత్రికలు కేవలం జరిగిన విషయాలను తెలిపేవి మాత్రమే కాదు. అంతకుమించిన లక్ష్యం పత్రికలకు ఉంది. నాడు తెల్లదొరల పెత్తనాన్ని నిలదీయడానికి నిలువెత్తు సాక్ష్యాలుగా పత్రికలు నిలిచాయి. టంగుటూరి, వీరేశలింగం, తిలక్, గాంధీ వంటి నేతలు పత్రికల్నే ఆయుధాలుగా చేపట్టి వలసదారుల పీచమణిచారు. నాటి సమాజం యావత్తూ పత్రికల్ని కరదీపికలుగా పరిగణించి, చైతన్యవంతం అయింది. ఈవిధంగా పత్రికలు భారతదేశ స్వాతంత్ర్య సమరంలోనూ ఓ కీలకపాత్ర పోషించాయి.

భోజనం లేకున్నా భరించగలిగిన మానవుడు సమాచారం కరువైతే మనుగడ సాగించలేడు. మానవ మనుగడే సమాజ వికాసానికి ఆయువుపట్టు. అసలైన గుట్టు, సామాజిక పరిస్థితులను ఎప్పటికప్పుడు ప్రజల దృష్టిలోకి తెస్తూ, వారిలో చైతన్యాన్ని రగుల్కొలిపే సాధనాలుగా పత్రికల్ని వర్ణించవచ్చు. ఎక్కడో నిక్షిప్తమైన నిధి విలాసాన్ని, నిర్లిప్తంగా బతికేసే యువ మేధాశక్తిని వెలుగులోకి తెచ్చే కారకాలు పత్రికలు. మానవుడు చంద్రునిపై కాలుమోపిన వైనాన్ని చరిత్రీకరించినవి పత్రికలే. నిత్యావసరాలతో పాటు వివిధ వస్తువుల ధరలు, రైళ్ళ రాకపోకల వివరాలు, వాన రాకపోకల సంగతులు, వినోద, విజ్ఞాన అంశాలు మొదలైన వాటిని ఎప్పటికప్పుడు సమాజం ముందు ఆవిష్కరించే అక్షరాల అల్లికలు పత్రికలు. విద్యాసుగంధాల్ని, విదేశీ సంబంధాల్ని, ప్రభుత్వాల మనుగడల్ని, ప్రముఖుల రాకపోకల్ని ప్రాచుర్యానికి నోచుకునే వీలుకల్పించే సంపత్తులు పత్రికలు. రాతియుగం నాటి సంగతుల్ని, రాచరికంలోని విశేషాల్ని తెలియజేసినంత తేలికగానే – నాతి పాటించాల్సిన మెలకువల్ని, నానాజాతి సమితి చర్యల్ని సమాజానికి చేరవేసే సంధానకర్తలుగా పత్రికలు పనిచేస్తాయి.

సమాజాభివృద్ధికి సైతం పత్రికలు ఎంతగనో ఉపయోగిస్తాయనడం అతిశయోక్తి కాదు. ఏ ప్రాంతం ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడి ఉందో, ఏ అంశాలకు ప్రాధాన్యతనిస్తే అభివృద్ధి సాధ్యమవుతుందో తన సంపాదకీయాలు, ప్రత్యేక వ్యాసాల ద్వారా విధాన నిర్ణేతల దృష్టికి తీసుకురావడంలో పత్రికలు ప్రధానపాత్ర పోషిస్తాయి. మరోమాటలో చెప్పాలంటే ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వానికి పత్రికలు సూచనలు చేస్తాయన్నమాట.

కత్తికి భయపడని వాడు కలానికి భయపడతాడన్న నానుడికి నిఖార్సయిన నకళ్ళు పత్రికలు. దుందుడుకుగా వ్యవహరిస్తున్న ప్రభుత్వాల పతనానికి పత్రికలే దోహదపడిన దాఖలాలు కోకొల్లలు. ప్రజాస్వామ్య మనుగడ పత్రికల మీదనే ఆధారపడి ఉంటుంది.

చట్టసభలు, న్యాయస్థానాలు సైతం కొన్ని కారణాల వల్ల నిర్వర్తించలేకపోయిన విధుల్ని పత్రికలు నిర్వహిస్తాయి. ఇందుకు అనేక ఉదాహరణలు కూడా ఉన్నాయి. ప్రభుత్వాల మనుగడ తాము నిర్వహించే ప్రణాళికాబద్ధమైన అంశాలమీద ఆధారపడి ఉంటుంది. దీనికి ప్రతిపక్షాల పాత్ర అతి కీలకమైంది. దురదృష్టవశాత్తూ నేటి సమాజంలో ప్రతిపక్షాల పాత్ర ప్రశ్నార్థకంగా మారింది. గొడవలు, రగడలకు మాత్రమే ఇవి పరిమితమవుతున్నాయి.

ఇలాంటిచోట్ల పత్రికలే ప్రతిపక్షాల పాత్ర నిర్వహిస్తూ, ప్రభుత్వ పనితీరు మీద కొరడాల వంటి విమర్శనాస్త్రాలు సంధించడం కూడా కద్దు. దీనివల్ల ప్రజోపయోగం ఎంతగానో ఉంటోంది. వితంతు వివాహాల్ని ప్రోత్సహించడం, సామాజిక దురాచారాల్ని తుదముట్టించడం వంటి ప్రజోపయోగ చర్యలకు నాటి పత్రికలు పూనుకుంటే, సమాజానికి పనికొచ్చే ప్రతి అంశాన్ని వెలుగులోకి తీసుకురావడం ద్వారా ఇప్పటి పత్రికలు నిజమైన సామాజిక దర్పణాలుగా వెలుగొందుతున్నాయి. వెలుగు చూపుతున్నాయి.

పత్రికలు లేని ఆధునిక ప్రపంచాన్ని ఊహించలేం. మనిషి జీవిత విధానాన్ని, ఆలోచన క్రమాన్ని సమూలంగా మార్చివేసే శక్తి పత్రికలకు ఉంది. తెలుగులో పత్రికా రచన అంటే స్థూలంగా సామాజిక చరిత్ర రచనే అవుతుంది. ఏ పత్రికనైనా సరే అందులో ప్రచురించిన అంశాలన్నింటినీ ఓ క్రమపద్ధతిలో పరిశీలన చేస్తే ఆ సమాజంలోని కొంతభాగం లేదా భాగాలు మనకు అవగాహనకు వస్తాయి.

## 1.1 పత్రిక – పదావిర్భావం

పత్రిక అనే పదం తొలిరోజుల్లో కేవలం వ్యవహారరూపంలో వాడుకలో ఉండేది. కేవలం ఇద్దరు వ్యక్తుల మధ్య క్రయవిక్రయాల ఒప్పందం మొదలైనవి రాతపూర్వకంగా భద్రపరచుకునే విధానానికి పత్రిక అనే పదాన్ని ఉపయోగించేవారు. తర్వాతి కాలంలో ఇద్దరు వ్యక్తులు పరస్పరం రాతపూర్వకంగా సమాచారాన్ని చేరవేసుకునేందుకు ఉపయోగించే సాధనాన్ని పత్రిక అని వ్యవహరించడం ప్రారంభమైంది. శబ్దరత్నాకర రచయిత బహుజనపల్లి సీతారామాచార్యులు తన గ్రంథం (శబ్దరత్నాకరం: పుట 548)లో పత్రిక అనేపదానికి 'వ్యవహారం యొక్క చెల్లుబడికై యొకరికొకరు వ్రాసుకొనడి పత్రము' అని అర్థం ఇచ్చారు. వార్తాపత్రిక అనే అర్థం ఈ నిఘంటువులో లేదు.

ఆ తర్వాత దాదాపు 50 సంవత్సరాలకు అంటే 1936లో వెలువడిన సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'వ్రాతకాధారమగు తాటియాకు కాగితం, వ్యవహారంలో పరస్పరం వ్రాసుకొనెడు పత్రం' అనే అర్థాన్ని పత్రికకు ఇచ్చారు.

ముద్రణకు లేదా రాతకు కాగితాన్ని ఉపయోగించడానికి పూర్వం తాటాకులు లేదా భూర్జపత్రాలను ఉపయోగించేవారు. ఈ కారణంగా వ్యక్తులు వేటిని రాతకు ఉపయోగించేవారో వాటిని పత్రికలుగా వ్యవహరించడం మొదలైంది. 'విడియాకులు', 'విడాకులు' మొదలైన పదబంధాల ఉపయోగాన్నిబట్టి తొలిరోజుల్లో రాతకు పత్రాలను ఉపయోగించేవారని తెలుస్తోంది. ఈవిధంగా పత్రం నుంచి పత్రిక ఆవిర్భవించిందని భావించవచ్చు.

సాహిత్యపరంగా పత్రిక పదావిర్భావాన్ని పరిశీలిస్తే మొట్టమొదటగా పింగళి సూరన రచించిన ప్రభావతీప్రద్యుమ్నంలో పత్రిక అనే పదం కనిపిస్తుంది. వజ్రపురానికి వెళుతున్న చిలుకతో ప్రద్యుమ్నుడు తన ప్రణయలేఖను ప్రభావతికి అందించమని చెబుతున్న సందర్భంలో పత్రిక అనే పదాన్ని సూరన ప్రయోగించాడు.

సీ॥ *ఓ పక్షివర! విను, మా పురి శుచిముఖి*
*యనుపేర యొక రాజహంసియుండు,*
*నదియున్న చోట నీవరసి యీ పత్త్రిక*
*యందింప వలయు మత్ప్రార్థనమున...!*

(తృతీయాశ్వాసం, పద్యం 32)

ఈవిధంగా పత్రం నుంచి పత్రిక అనే పదం ఉద్భవించిందని రూఢి అవుతుంది. అయితే కాలక్రమంలో పత్రిక అనే పదానికి అనేక అర్థాలు మారుతూ వచ్చాయి. వర్తమానంలో పత్రిక అనేపదానికి వార్తలు ప్రచురించే దినపత్రిక అనే అర్థం ఎక్కువగా వాడుకలో ఉంది. దినపత్రికలో రీతిలో ఉండే వార, పక్ష, మాస తదితర పత్రికలకు కూడా ఈ అర్థాన్ని ఉపయోగిస్తున్నారు. అయితే దినపత్రికలకు ఉన్న అత్యధిక ప్రజాదరణ కారణంగా పత్రిక పదానికి వార్తాపత్రిక అనే పదమే సర్వసాధారణంగా వాడుకలో ఉంది. పత్రికకు సమానార్థకంగా ఇంగ్లిషులో పేపర్ (Paper) అనే పదాన్ని ఉపయోగిస్తున్నారు. ఇక్కడ కూడా పేపర్ అంటే అది ఏ కాగితమైనా కావచ్చు. కానీ సర్వసాధారణంగా పేపర్ అంటే దినపత్రిక (Daily News Paper) అనే భావమే అందరికీ స్ఫురిస్తుంది.

## 1.2 లక్షణాలు

పత్రిక సమాజ ప్రతిబింబం. వాస్తవ సమాజంలో జరిగే ప్రతి అంశాన్ని పత్రిక ప్రకటిస్తుంది. ఒక్కోసారి సమాజం ఎలా ఉండాలో కూడా పత్రిక నేర్పిస్తుంది. సమాజంలోని అన్ని వర్గాల భావాలకు పత్రిక దర్పణంగా నిలుస్తుంది. వంటింటి నుంచి విమానయానం దాకా, గల్లీ ఆట నుంచి అంతర్జాతీయ క్రీడల దాకా, రచ్చబండ నుంచి విదేశీ రాజకీయాల దాకా, ఒకటనేమిటి మానవ జీవితంలోని ప్రతి అంశాన్ని, అడుగుని పత్రిక స్పృశిస్తుంది. అందుకనే పత్రిక అనేది సర్వజన ఆమోదయోగ్యంగా ఉండాలి. ప్రతి పత్రికకూ ఉండాల్సిన ప్రాథమిక లక్షణం ఇది. కర్తవ్యం కూడా. ఇదేవిషయాన్ని సమర్థిస్తూ కొక్కొండ వేంకటరత్నం పంతులు తమ *ఆంధ్రభాషా సంజీవని పత్రిక*లో పత్రిక, సంపాదకుడు, విలేఖరి, ఉపసంపాదకుడు, పాఠకుడు, చందాదారుల లక్షణాలు (*శ్రీమద్వర్తమాన తరంగిణి*, ఏప్రిల్ 1895, సంచిక 1, సంపుటి 2) ఎలా ఉండాలో వివరించారు. ఆ లక్షణాలను 1.2.1 నుంచి 1.2.5 వరకు సంక్షిప్తంగా వివరించడం జరిగింది.

### 1.2.1 పత్రిక – లక్షణాలు

"నాణ్యత కలిగిన కాగితం, చక్కనిభాష, ధర్మం, నీతి, న్యాయతత్త్వప్రతిపాదకమైన వ్యాసం, రకరకాల వార్తలు, కావ్యవిమర్శ, మంచిలేఖల సమాచారం, శాస్త్రాల్లో చెప్పిన మంచి ఆచారాలు, తన ఆశయాన్ని ప్రతిబింబించేవార్తలు, అర్ధలాభం కోసం తగిన క్రియలు."

### 1.2.2 విలేకరి – లక్షణాలు

"పాండిత్యం, లోకజ్ఞత, ధైర్యం, స్థైర్యం, సత్ప్రవర్తన, ధనం, ఉచితజ్ఞత, సూక్తిచతురత్వం."

### 1.2.3 ఉపసంపాదకుడు – లక్షణాలు

"వార్తలోని సారాంశాన్ని పూర్తిగా తెలుసుకోవాలి. వార్తను సంగ్రహంగా రాయాలి. విషయ వివరణ స్పష్టంగా ఉండాలి. సందర్భం, అర్థం సక్రమంగా ఉండాలి. ఎవరినీ నొప్పించకూడదు. అబద్ధపు పొగడ్తలు పనికిరావు. వాస్తవమైన వార్తనే రాయాలి."

### 1.2.4 చందాదారుడు - లక్షణాలు

"పత్రికకు చెల్లించాల్సిన చందాను క్రమం తప్పకుండా చెల్లించాలి. పత్రిక అందకపోతే అడిగి తెప్పించుకోవాలి. పత్రికలను ఒక కట్టగా కట్టి ఉంచుకోవాలి. ఇతరులకు ఇవ్వకూడదు. ఒకవేళ ఇస్తే డబ్బు అప్పిచ్చినవాని దగ్గర ఎలా వసూలు చేస్తామో అలాగే పత్రికలు కూడా వారినుంచి తీసుకోవాలి. పాతపత్రికలు చెడిపోకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి."

### 1.2.5 పాఠకుడు - లక్షణాలు

"పత్రిక పాడవకుండా జాగ్రత్తగా పై అట్ట తొలగించాలి. మొదటగా శీర్షికలు చదవాలి. ముందుగా తన విషయాలు, ఆ తర్వాత తనవాళ్ళ విషయాలు చదవాలి. చివరగా పరుల విషయాలు చదవాలి. పత్రిక మడతలు మార్చకూడదు. ముడతలు పడనీయకూడదు. చదవడం పూర్తయిన తర్వాత ఏమాత్రం నలగకుండా జాగ్రత్త చేయాలి."

## 1.3 పత్రికలు - లక్ష్యం

ప్రజల జీవితంలో పత్రికల పాత్ర ఎంతో కీలకమైంది. దేశచరిత్రలో, మరీముఖ్యంగా ఆంధ్రరాష్ట్రచరిత్రలో పత్రికలు పోషించిన పాత్ర అనిర్వచనీయమైంది. ఎన్నో సామాజిక మార్పులకు పత్రికలు ఆధారంగా నిలుస్తాయి. ఇంతటి ప్రధానస్థానం పత్రికలకు ఉంది కాబట్టే ప్రతి పత్రిక ఓ లక్ష్యంతో పనిచేస్తుంటుంది. పత్రిక యొక్క లక్ష్యం ఎలా ఉండాలనేది చాలా ప్రధానమైన అంశం. కవులకే కాదు పాత్రికేయులు, సంపాదకులకు కూడా విశ్వశ్రేయస్సు ప్రధానమైన అంశం కావాలి. అందుకు రాతలో నిజాయితీ ఉండాలి. మాటలో విశ్వసనీయత ఉండాలి.

తెలుగు పత్రికారంగ జనకుడిగా విఖ్యాతి పొందిన కాశీనాథుని నాగేశ్వరరావు అభిప్రాయం ప్రకారం... "ప్రజలకు విద్యాభివృద్ధీ, ప్రపంచజ్ఞానాభివృద్ధీ గావించడం ముఖ్యం. ప్రజల యోగక్షేమాభివృద్ధికి దేశాభిమానం మిక్కిలి సహకారి. తెలుగు వాఙ్మయ వికాసానికి ప్రజాహృదయం సుక్షేత్రం. ప్రజాహృదయం విజ్ఞానవంతం కాకుండా ప్రజల వికాసం సాధ్యంకాదు. అంతేకాదు... మానవాభ్యుదయానికి మానవ విజ్ఞానం మూలధనం. సకల శాస్త్రాల విజ్ఞానమూ మానవ అభ్యుదయానికి, విశ్వకల్యాణానికి వినియోగించడమే విజ్ఞానానికి పరమార్థం.

ఇంతకుమించి లక్ష్యం పత్రికలకు ఉండదు. ప్రజల విషయాలు, ప్రజాభివృద్ధి, ప్రజావ్యాపనం, వాఙ్మయాభివృద్ధికి కారణం కాగా ప్రజాక్షయం, ప్రజాదౌర్బల్యం, వాఙ్మయం ఎదుగుబొదుగూ లేకుండా స్తంభించి పోవడానికి కారణమవుతుందీనాడు. దేశం విశాలం. భాష మధురం. జనులూ ఉత్సాహ సంపన్నులు. ఇక పత్రికలు చెలిమితో తమ తనాన్ని ముద్రవేసుకోవాలి" (బాలశౌరి రెడ్డి, తెలుగు పత్రికల చరిత్ర, పుట 12). కవులకే కాదు పాత్రికేయులకు, సంపాదకులకు సైతం విశ్వశ్రేయస్సు ప్రధానమైన ఎజెండా కావాలి. అందుకు రాతలో నిజాయితీ, మాటలో విశ్వసనీయత ఉండాలి.

*త్రిలింగ* పత్రిక తొలి సంపాదకీయాన్ని రాస్తూ వావిళ్ళవారు "...జాతి యొక్క నాగరకత దాని వాఙ్మయమున ప్రదర్శితమగుచుండును. నాగరకతను అనుసరించి వాఙ్మయము మార్పుచెందుట సహజము. నూతన భావములను, నవీన ఆదర్శములను వ్యాప్తిలోనికి తెచ్చుటకు పత్రికలు ముఖ్యసాధనముగా ఉండవలెను. పత్రికలు చేయవలసిన పని విస్తారముగా కలదు." (బాలశౌరి రెడ్డి, *తెలుగు పత్రికల చరిత్ర*, పుట 13) అన్నారు. ఈవిధంగా ఉన్నత ఆశయాలు, ఆకాంక్షలతో ప్రారంభమైన తెలుగు పత్రికారంగం కాలక్రమంలో ఎన్నో మార్పులకు లోనవుతూ వచ్చింది. ప్రధానంగా భాషా వ్యవహారంలో వచ్చిన మార్పు స్పష్టంగా కనిపిస్తుంది. వ్యావహారిక భాషోద్యమం తెలుగు పత్రికలపై తీవ్రప్రభావాన్ని చూపించింది. స్వీయలక్ష్యం, సమాజసేవ–రెండు అంశాలను ఏకకాలంలో సమన్వయం చేసుకుంటూ తెలుగుపత్రికారంగం ప్రయాణం సాగిస్తోంది.

## 1.4 'వార్త' నిర్వచనం

'పత్రిక'; 'వార్త' రెండూ అవిభాజ్యమైన అంశాలు. ఈ రెండూ చక్కగా అమరితేనే పత్రిక ప్రజాదరణ పొందుతుంది. ఆ వార్త ప్రజలకు సరైన తీరులో చేరుతుంది. తద్వారా పత్రికా ప్రయోజనం నెరవేరుతుంది. పురా నవ అర్థాల్లో వార్త అనే శీర్షికతో డాక్టర్ పమ్మి పవన్‌కుమార్ అక్టోబరు 10, 2010న *ఆంధ్రజ్యోతి* దినపత్రికలో రాసిన వ్యాసంలో వార్త అనే పదాన్ని ప్రాచీన సాహిత్యంలో ఎలా ఉపయోగించారో విస్తృతంగా వివరించారు. ఆయన ప్రకారం "వార్త అనే పదాన్ని వ్యాస, కవిత్రయ భారతాలతో పాటు మనుస్మృతి (10:80), యాజ్ఞవల్క్యస్మృతి (1:311), అర్థశాస్త్రం (క్రీ.పూ. 4వ శతాబ్ది) తదితర గ్రంథాల్లో కృషి, జీవనాధారం, పశుపాలనం, వాణిజ్యం.. అనే అర్థాల్లో వాడారు. మలివేద కాలానికే (క్రీ.పూ. 1000 – ఇతిహాసయుగానికి ముందు) 'వార్తావహులు' ఉన్నట్లు చరిత్రకారులు పేర్కొంటున్నారు. నాటిపాలనలో రాజుకు, పురోహితవర్గం, మంత్రిమండలితో పాటు వార్తావహులు... వంటివారు సేవలు అందించేవారని చరిత్ర చెబుతోంది."

వర్తమాన వ్యవహారంలో వాడుకలో ఉన్న అర్థంలోనే వార్త అనేపదం నన్నయ కాలానికే వాడుకలో ఉన్నట్లు మనకు తెలుస్తోంది. ఇందుకు ఉదాహరణగా ఈ కింది పద్యాన్ని పేర్కొనవచ్చు.

*వార్తయంద జగము వర్తిల్లుచున్నది - యదియులేని నాడ యఖిల జనులు*
*నంధకారమగ్నులగుదురు గావున - వార్త నిర్వహింపవలయు బతికి ॥*

(ఆంధ్రమహాభారతం, సభాపర్వం, 1-51)

మహాభారతంలో రాజసూయ యాగాన్ని సందర్శించడానికి వచ్చిన నారదమహర్షి ధర్మరాజుతో అనేక రాజ్యపాలన విషయాలు, ధర్మాల గురించి మాట్లాడుతూ రాజ్యానికి అధినేత అయినవాడు వార్తను ఎలా నిర్వహించాలో తెలిపే సన్నివేశం లోనిది ఈ పద్యం. ఇందులో వార్త అనేపదానికి సమాచారం అనే అర్థం అన్వయించుకోవాలి. 'వార్త నిర్వహింపవలయు పతికి...' అంటే రాజుకు వార్తను నడపవలసిన అవసరం ఉందని అర్థం. వర్తమాన ప్రజాస్వామ్యరాజ్యంలో పౌరుడే దేశానికి రాజు కాబట్టి ప్రజలకు వార్తలు (సమాచారం) అందించాలని అర్థం అన్వయం అవుతుంది.

కాలానుగుణంగా వార్త అనే పదానికి ఎందరో ప్రముఖులు ఎన్నో నిర్వచనాలు చెప్పారు. అయితే వీటిలో ఏఒక్కటీ సర్వజనామోదం పొందలేదు. వార్తకు ఉన్న విస్తృతార్థాన్ని వీటిలో సంపూర్ణంగా వివరించలేకపోవడం ఇందుకు కారణం కావచ్చు. అయితే అయా నిర్వచనాలను పరిశీలిస్తే వార్తకు ఉండాల్సిన ప్రాథమిక లక్షణాలు మనకు కనిపిస్తాయి. వార్త అనే పదానికి పత్రికా రంగంలో వ్యాప్తిలో ఉన్న నిర్వచనాలు ఈ దిగువున ఇవ్వడం జరిగింది.

- వక్రతలేని ఉక్తి వార్త.
- సంభవించిన సంఘటన తాలూకు తాజా వివరాలన్నీ కలిపితే వార్త అవుతుంది.
- ఆసక్తి కలిగించే కొత్త విషయాలు వార్తలు అవుతాయి.
- పాతవిషయాన్ని కొత్తగా చెబితే వార్త అవుతుంది.
- వార్త అంటే ఆసక్తి కలిగించేది.
- అసహజంగా ఉండే విషయాలు, అసాధారణమైన సంగతులన్నీ వార్తలు అవుతాయి.

– ఆంగ్లంలో వార్తను న్యూస్ (NEWS) అంటారు.

N అంటే నార్త్ (ఉత్తరం) E అంటే ఈస్ట్ (తూర్పు)

W అంటే వెస్ట్ (పడమర) S అంటే సౌత్ (దక్షిణం)

ఈ వివరణ ద్వారా న్యూస్ అంటే నాలుగు దిక్కుల నుంచి వచ్చే సమాచారం అని తెలుస్తోంది.

### 1.4.1 ప్రముఖుల నిర్వచనాలు / అభిప్రాయాలు

– పరిగణనలోకి తీసుకున్న ప్రతి నూతన విషయం వార్త అవుతుంది.

(News is something new and notable)

– ఎక్కువమందికి ఆసక్తి కలిగించేదిగా ఉన్న తాజా సంఘటన ఏదైనా వార్త అవుతుంది. అందులో కూడా అత్యధిక సంఖ్యాకుల్లో అత్యధిక ఉత్సుకతను రేకెత్తించేది ఉత్తమవార్త అవుతుంది.

(News is any thing timely that interests a number of persons and the best news is that which has the greatest interest for the greatest number - W.C.Bleyer)

– సామాన్యుడికి తృప్తి కలిగించే లేదా అతనిలో ప్రేరణ కలిగించే సమాచారం వార్త అవుతుంది.

(News is usually stimulating information from which the ordinary human being derives satisfaction or stimulation - Chilten.R.Bush)

– అప్పుడే జరిగిన సంఘటనకు సంబంధించి తాజా సమాచారం వార్త అవుతుంది.

(Something that is heared of is news, first information of some thing that has just happened. - Chambers Dictionary)

– అనుభవజ్ఞుడైన సంపాదకుడు తన పత్రికలో ప్రచురించుకోవడానికి ఎన్నుకున్న సమాచారం వార్త అవుతుంది.

(News is that a well trained editor decided to put in his paper. - Gerald W. Johnson)

– News paper is the Bible of democracy. It is the only serious book most people read. It is the book out of which a people determine its behaviour.
(ఆంధ్ర విశ్వవిద్యాలయం, స్కూల్ ఆఫ్ కరస్పాండెన్స్ కోర్సు, ఎం.ఎ. (జర్నలిజం) – పేపరు 4, పుట 4)

ఇంకా ఎందరో ప్రముఖ సంపాదకులు, విమర్శకులు వార్తను అనేకరకాలుగా నిర్వచించారు. ఒక్కో నిర్వచనం వార్తకు ఉండాల్సిన ఒక్కో లక్షణాన్ని చెబుతుంది. దీన్నిబట్టి చూస్తే ఈ నిర్వచనాలన్నిటి లక్షణ సారాంశం ప్రతివార్తలో తప్పకుండా ఉండాలని తెలుస్తోంది. నిర్వచనాల ఆధారంగా వార్తకు ఉండాల్సిన లక్షణాలను ఈ క్రిందివిధంగా క్రోడీకరించవచ్చు.

### 1.4.2 వార్త : లక్షణాలు / విలువలు

1. ప్రాముఖ్యం
2. సామీప్యం
3. పర్యవసానం
4. అన్వయింపు
5. సంఘర్షణ
6. సంచలనశీలత
7. మానవాసక్తి
8. వేగం – సమయానుకూలత
9. ప్రమాదం – అభివృద్ధి

**ప్రాముఖ్యం** (Prominence)

సమాజంలో అంతకుముందే ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న వ్యక్తులు, ప్రదేశాలు, సంఘటనలు, సంస్థల వివరాలు వార్తా ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటాయి. రాష్ట్రపతి, ప్రధానమంత్రి, ప్రముఖ శాస్త్రవేత్తలు, సంఘసేవకులు, రాజకీయ నాయకులు, విదేశీ నేతలు, గొప్ప నటీనటులు, ఉన్నత ప్రభుత్వాధికారులు, మత ప్రవక్తల వంటి కొందరు వ్యక్తుల ఉనికే ఒక వార్త అవుతుంది. వారు ఏం మాట్లాడినా, ఎక్కడికి వెళ్ళినా ఆ విషయం వార్తా ప్రాధాన్యం సంతరించుకుంటుంది.

రాష్ట్రపతి, ప్రధానమంత్రి లాంటి వారు హైదరాబాద్ రావడం విశేషం. అది వార్త అవుతుంది. క్రిస్టియన్ మతప్రవక్త పోప్, అమెరికా అధ్యక్షుడు లేదా ఇతర దేశాధినేత ఎవరైనా భారతదేశాన్ని సందర్శించడంలో విశేషం ఉంటుంది. కాబట్టి వారి రాక వార్త అవుతుంది. ఈ విధంగా ప్రముఖ వ్యక్తులకు సంబంధించిన పలు అంశాలు వార్తా ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటాయి.

అలాగే కొన్ని చారిత్రక ప్రదేశాలు లేదా ఇతర ప్రదేశాలు కూడా వార్తా ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటాయి. పార్లమెంటు భవనం, ఆవరణ, శాసన సభ, సచివాలయం, ప్రముఖ దేవాలయాలు, రాయబార కార్యాలయాలు, చారిత్రక ప్రాధాన్యం ఉన్న కట్టడాలు, ప్రదేశాలు మ్యూజియంలాంటి ప్రాంతాలన్నీ ఆ కోవకు చెందినవే. ఇలాంటి ప్రదేశాల్లో క్రమం తప్పి చిన్న సంఘటన జరిగినా, ప్రమాదం వాటిల్లినా అదొక వార్త అవుతుంది.

పార్లమెంట్, శాసనసభల్లో ఎలా మసలుకోవాలో సభ్యులు కానివారు కూడా ప్రవర్తించడానికి కొన్ని నియమాలు, పద్ధతులుంటాయి. వాటిని అతిక్రమించి ఎవరైనా అక్కడ దురుసుగా ప్రవర్తించడం లాంటివి చేస్తే ఆ సంఘటనకు వార్తా ప్రాముఖ్యత వస్తుంది. అలాగే మ్యూజియం, దేవాలయాల్లో దొంగతనం జరగడం, అక్రమంగా చొరబడటం, విపరీతంగా ప్రవర్తించడం లాంటి సంఘటనలు వార్తలు అవుతాయి. జనాకర్షణ ఉన్న నాయకులు, సినీనటుల వ్యక్తిగత విషయాలపట్ల సామాన్య జనులకు, అభిమానులకు మంచి ఆసక్తి ఉంటుంది. వారు ఎలాంటి వంటకాలను ఇష్టపడతారు? వారికి ఏ రంగు అంటే ఇష్టం? వారి బాల్యం ఎలా గడిచింది? ఇలాంటి చిన్న విషయాలు కూడా అభిమానులకు ఆసక్తి కలిగిస్తాయి. ఇలాంటి సందర్భాల్లో వీరికి సంబంధించిన ప్రతి విషయం వార్త అవుతుంది.

**సామీప్యం** (Proximity)

వ్యక్తి తన సమీప పరిధిలో జరిగే సంఘటనల పట్ల ఎంతో ఆసక్తి కనబరుస్తాడు. సంఘటన ఎంత సమీపంలో జరిగితే ఆ విషయానికి అంత ప్రాధాన్యం ఇస్తాడు. ఎక్కడో అమెరికా బ్యాంకులో కోటి రూపాయల దొంగతనం, ఢిల్లీలో లక్షరూపాయల దొంగతనం జరిగిందన్న వార్తకన్నా మన పక్కింట్లో జరిగిన వంద రూపాయల దొంగతనం వివరాలు అతనికి ఎక్కువ ఆసక్తి కలిగిస్తాయి. ఇలా సామీప్యం అన్నది వార్తకు ముఖ్య లక్షణం. బంగ్లాదేశ్‌లో సాధారణ ఎన్నికలు జరుగనున్నాయి అనే వార్తకన్నా తన ఊరిలో మున్సిపాలిటీ లేదా పంచాయతీ సమితికి ఎన్నికలు జరగనున్నాయి అనే వార్త అతనిలో ఎక్కువ ఆసక్తిని కల్పిస్తుంది. దీన్ని గుర్తించే ప్రాంతీయ వార్తలకు మన పత్రికలు ఇటీవలి కాలంలో ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి ప్రచురిస్తున్నాయి. దీన్ని ప్రత్యేకంగా మఫిసిల్ వార్తలు అని కూడా అంటారు. ఆయా జిల్లాలకు సంబంధించి ఆయా జిల్లా ఎడిషన్లు కూడా ప్రచురిస్తున్నారు. ఈ ఎడిషన్లలో ఆయా ప్రాంతాలకు సంబంధించిన వార్తలకే ప్రాధాన్యమిస్తారు.

**పర్యవసానం** (Consequence)

ఏ సంఘటనల ప్రభావం తమపై పడుతుందో ఆ సంఘటనల వివరాల్ని తెలుసుకోడానికి పాఠకులు ఎక్కువ ఆసక్తి చూపిస్తారు, ప్రభుత్వ విధానాలు, నాయకుల మాటలు, వ్యాపార సంస్థల ప్రకటనలు, కొత్త చట్టాల వివరాలు మొదలైనవి ప్రజల సాంఘిక, ఆర్థిక పరిస్థితులపై ఎక్కువ ప్రభావం చూపిస్తాయి.

'ఆ చట్టం పర్యవసానంగా నేను ఇంత పన్ను అదనంగా కట్టాల్సి వస్తుంది' అన్న విషయం పాఠకుడికి ఆ సమాచారంపట్ల ఆసక్తిని పెంచుంతుంది. దైనందిన జీవితాలపై ప్రభావం చూపే వార్తలపట్ల పాఠకులు ఎక్కువ ఆసక్తి కలిగి ఉంటారు. కాబట్టి పర్యవసానం అన్నది కూడా ముఖ్య వార్తా లక్షణమైంది. ద్విచక్ర వాహనాలపై లైఫ్‌ట్రాక్స్, భూమిశిస్తు రద్దు, కరెంట్ కోత, ఉద్యోగుల సమ్మె, యుద్ధం, ఎన్నికలు, బడ్జెట్, వాతావరణ సూచన మొదలైన వార్తలు పర్యవసానం అనే లక్షణం వల్లనే పాఠకుల దృష్టిని ఆకర్షిస్తాయి. గల్ఫ్ యుద్ధం వల్ల మనదేశంలో పెట్రోలియం ఉత్పత్తుల కొరత ఏర్పడింది. దేశంలో ప్రతి వస్తువు ధర పెరిగిపోయింది. వ్యక్తుల జీవితం అతలాకుతలం అయ్యింది. అందుకే ఆ యుద్ధ వార్తలపట్ల మనందరికి అంత ఆసక్తి చూపించింది. కాబట్టి పర్యవసానం అనే లక్షణం కూడా వార్తా లక్షణాల్లో ఒకటైంది.

**అన్వయింపు** (Applicability)

వ్యక్తులు తమ జీవిత విధానంతో, ఆలోచనలతో పోలిన సంఘటనల సమాచారం పట్ల ఆసక్తి చూపిస్తారు. సంఘటనల ఫలితాలను, సంఘటన జరిగిన తీరుతెన్నులను తమకు అన్వయించుకొని దాని ప్రభావాన్ని అంచనా వేసుకోవడం లేదా ఆలోచించడం చేస్తుంటారు. సంపన్నుడైన వ్యక్తి ఆదాయం పన్నుల వార్తలపట్ల ఆసక్తి చూపించడానికి ఇదే కారణం. కాపీ కొడుతూ పట్టుబడిన విద్యార్థుల తాలూకు వార్తల పట్ల విద్యార్థి లోకం, ఉపాధ్యాయుల వర్గం ఆసక్తి చూపిస్తుంది. దేశాన్ని కుదిపేసిన రిజర్వేషన్ల గొడవకు సంబంధించిన వార్తలపట్ల ఆసక్తి చూపించడం వెనుకవున్న కారణం కూడా ఇదే. లాటరీలో ఒక వ్యక్తికి లక్ష రూపాయల బహుమతి రావడం ఎవరికో భూమిలో నిధి దొరకడం, పండుగలు, ప్రమాదాలు మొదలైన వార్తలలోని సంఘటనలతో పాఠకులు తమని తాము అన్వయించుకొంటారు. కాబట్టి ఆ వార్తలు ఎక్కువ ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటాయి. అందుకే ఈ 'అన్వయింపు' కూడా ముఖ్య వార్తా లక్షణమైంది.

**సంఘర్షణ** (Conflict)

మానవ జీవితం సంఘర్షణలమయం. ప్రకృతిలో సంఘర్షణ, తనలోని మనస్సుతో సంఘర్షణ, సంఘంతో సంఘర్షణ, శాస్త్రవిజ్ఞానంతో సంఘర్షణ. ఈ సంఘర్షణల పర్వమే మానవుడ్ని ఇంత ఉన్నతుడిని చేసింది. అందుకే సంఘర్షణ అనే భావంపట్ల పాఠకులు సులభంగా ఆకర్షితులవుతున్నారు. వ్యక్తులు, సంస్థలు, ఉద్యమాలు, మతాలు తదితరమైన సమాజ అంశాల మధ్య ఉండే భావభేదం, సంఘర్షణ పాఠకులకు ఆసక్తిని కలిగిస్తుంది. సిద్ధాంత విభేదాలపై జరిగే వాదోపవాదాలు, ఎన్నికల్లో పోటీ, వర్గాలు, జాతుల మధ్య జరిగే కొట్లాటలు మొదలైన వార్తల్లో మిళితమై ఉండే సంఘర్షణ అనే లక్షణం వల్లనే ఆ వార్తలపట్ల పాఠకులు ఆకర్షితులవుతున్నారు. కాబట్టి సంఘర్షణ మరొక వార్తా లక్షణం అయింది.

**సంచలన శీలత** (Sensationalisation)

మానవ బలహీనతలవల్ల సంభవించే రకరకాల వికృతచేష్టలు నేరాలు, ఘోరాలు, మానభంగ వార్తలు, ప్రముఖుల మధ్య ఉండే అక్రమసంబంధాలు, లోభం, మోసం, అదృష్టం, నమ్మకద్రోహం, ప్రేమ, ద్వేషం మొదలైన విషయాలన్నీ సంచలన శీలమైనవే.

ఇలాంటి వార్తలపట్ల సహజంగానే పాఠకులు ఆకర్షితులవుతారు. అందుకే సంచలన శీలత ఒక వార్తా లక్షణమైంది. మానవ బలహీనతవల్ల సంభవించే ఇలాంటి విషయాలకు సంబంధించిన వార్తలు పాఠకులను ఆకర్షిస్తాయనే ఈ లక్షణాలున్న వార్తలను తరచుగా రాయాల్సి వస్తోంది. ఇటీవల ఈ ధోరణి మరింత వికృతరూపాన్ని సంతరించుకుంది. సంచలన వార్తలు రాసేవారే పాత్రికేయులు అన్న ధోరణి బాగా ప్రబలింది. ఈ తరహా వార్తలు రాయడం కోసం విలువలను సైతం పక్కన పెడుతున్న సందర్భాలు కనిపిస్తున్నాయి. ఇలాంటి వార్తలను రాస్తున్నప్పుడు ఆ బలహీనతలను నిరుత్సాహపర్చే విధంగా రాయాలి కాని పత్రికల వారు తరచు ఈ విషయాన్ని విమర్శిస్తుంటారు. ఆ కారణంగానే ఇలాంటి వార్తలను చదివిన స్ఫూర్తితోనే మండల్ కమిషన్ రిజర్వేషన్ గొడవల్లో అన్నెం పున్నెం ఎరుగని యువత తమని తాము కాల్చుకొని చనిపోయింది. అందుకే పోలీసులు, మానసిక శాస్త్రజ్ఞులు ఇలాంటి వార్తలను ప్రముఖంగా ప్రచురించవద్దని అప్పుడప్పుడు పాత్రికేయులకు విజ్ఞప్తి చేస్తుంటారు.

**మానవాసక్తి** (Human interest)

ఆశ్చర్యాన్ని కలిగించే సంఘటనలు, అసాధారణమైన విషయాలు, సాహసం, శృంగారం, సౌందర్యం, ప్రతిభ, కాకతాళీయంగా జరిగే కొన్ని సంఘటనలు ఎంతో ఆసక్తిని కలిగిస్తుంటాయి. ఇలాంటి విషయాలపట్ల మానవులందరూ సహజంగానే ఆసక్తి చూపిస్తారు. అందుకే మానవాసక్తి కూడా వార్త లక్షణాల్లో ఒకటైంది. బతికున్న పామును తినే వ్యక్తి, వంద పెళ్ళిళ్ళు చేసుకొన్న వనిత, 12 అడుగుల జుట్టు పెంచుకున్న మనిషి, కారును నడిపిన మూడేళ్ళ బాబు, హుస్సేన్‌సాగర్‌లో బుద్ధవిగ్రహం మునక మొదలైన వార్తలు మానవాసక్తిని కలిగిస్తాయి. మారుమూల గ్రామీణ ప్రాంతాలవారి మూఢనమ్మకాలు, గిరిజనుల ఆచార వ్యవహారాలు, జంతుబలి, నరబలి లాంటి సంఘటనలన్నీ పూర్తిగా 'మానవాసక్తి' అనే అంశం కారణంగానే వార్తలుగా పత్రికల్లో చోటు సంపాదించుకుంటున్నాయి.

**వేగం – సమయానుకూలత** (Timeliness)

సమాచారం ఎంత త్వరగా అందితే ఆ సమాచారానికి అంతటి ప్రాముఖ్యం ఉంటుంది. ఏ వార్తయినా తాజాగా అందించగలిగినప్పుడే దానికి పాఠకుల్లో ప్రాధాన్యం ఉండేది. మాజీ ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ హత్య వార్తను మొదటగా బి.బి.సి వారు ప్రసారం చేశారు.

అప్పుడు ఆ వార్తకు విపరీతమైన ప్రాధాన్యం వచ్చింది. ఆధికారిక లాంఛనాలు అన్నీ పూర్తి అయ్యాక తీరిగ్గా ఆల్ ఇండియా రేడియో వారు ప్రసారం చేస్తే అప్పటికే పాతబడిపోయిన ఆ వార్తను ఎవరూ పట్టించుకోలేదు. వేగం అన్నది వార్త చేరవేయడంలో చాలా ముఖ్యమైన అంశం. అందుకే వేగం, సమయానుకూలత అన్నవి వార్తా లక్షణాల్లో ఒకటిగా పరిగణలోకి వచ్చింది. దీన్ని దృష్టిలో పెట్టుకునే ప్రముఖ పత్రికా సంపాదకుడు నార్ల వేంకటేశ్వరరావు 'వేగం జర్నలిస్టుల వేదం' అన్నారని అనిపిస్తుంది.

**ప్రమాదం–అభివృద్ధి** (Disaster - development)

భూకంపం, వరదలు, అగ్ని ప్రమాదాలు, కరువు కాటకాలు, పేలుడు సంఘటనలు, ప్రమాదాల వార్తలను పాఠకులు ఎంతో ఆసక్తితో చదువుతుంటారు. అలాగే ప్రాజెక్టుల నిర్మాణం, వంతెనల నిర్మాణం, వైద్యశాల ఏర్పాటు, రక్షిత మంచినీటి సౌకర్యం కల్పించడం లాంటి అభివృద్ధికరమైన సంఘటనల సమాచారాన్ని తెలుసుకోడానికి కూడా పాఠకులు ఆసక్తి చూపిస్తారు. కాబట్టి ప్రమాదం అభివృద్ధి అనే అంశాలు కూడా వార్తా లక్షణాల్లో ఇమిడిపోయాయి. వార్తా లక్షణాలను బట్టి అందిన సమాచారం వార్త అవునో కాదో ముందుగా నిర్ధారించుకోవాలి. నిర్ధారించుకొన్న తర్వాత అది ఎంత ప్రధానమైన వార్తో పరిశీలించాలి. వార్తా ప్రాధాన్యతను సరిగా అంచనా వేసి ప్రచురణలో కూడా ఆ వార్తక ఎంత ప్రాముఖ్యం ఇవ్వాలో నిర్ణయించవచ్చు. ఒక విషయానికి వార్త రూపం కల్పించడానికి మూడు దశలు ఉంటాయి. ఘటన, దానికి సంబంధించిన వివరాల సేకరణ, ఆ వివరాల వ్యాప్తి. ఈ మూడు దశలు పూర్తయిన తర్వాత వార్త తయారవుతుంది.

## 1.5 భారతదేశంలో పత్రికా వ్యవస్థ – చారిత్రిక నేపథ్యం

యాంత్రిక సాధనాలు వాడి వార్తలను ప్రజలందరూ తెలుసుకునే విధానం అందుబాటులోకి రాని ప్రాచీనకాలానికే భారతదేశంలో వార్తావ్యవస్థ ఉండేదని ఆనాటి రచనల ద్వారా మనకు తెలుస్తోంది. పురాణ, ప్రబంధ, ఇతిహాసాది వాఙ్మయాన్ని పరిశీలించినట్లయితే ఈవిషయం మనకు అర్థమవుతుంది. వార్తాహరుల ద్వారా రాజులు ఇతర రాజ్యాలతో సంబంధాలు నెరపిన తీరు, యుద్ధసందర్భాల్లో వార్తాహరుల ప్రాముఖ్యం మొదలైన విషయాలన్నీ ఆయా కవుల రచనల్లో స్పష్టంగా ఉన్నాయి.

శ్రీకృష్ణుణ్ణి వివాహం చేసుకోవాలని కోరుకున్న రుక్మిణి తన తండ్రి వేరే ప్రయత్నాలు చేస్తున్నారనే విషయాన్ని తన పురోహితుడైన అగ్నిద్యోతనుని ద్వారా కృష్ణునికి వర్తమానం పంపుతుంది. పోతన భాగవతంలో ఎంతో హృద్యంగా ఈ సందర్భం వర్ణితమై ఉంది. తర్వాతి కాలంలో పావురాల ద్వారా వార్తలు చేరవేసే పద్ధతి వాడుకలోకి వచ్చింది. రాజకుమారుల ప్రణయానికి పావురాలు వారధులుగా నిలచిన అనేక ఘట్టాలు ప్రాచీన రచనల్లో కనిపిస్తాయి.

నలదమయంతుల ప్రణయానికి హంస దూతగా వ్యవహరించిన సంగతి కూడా ప్రబంధాల్లో వర్ణితమై ఉంది. ఇలా ఒకరి నుంచి మరొకరికి వార్తలు చేరవేయడం అనే పద్ధతి పురాణ, ఇతిహాసాల కాలం నాటికే మనకు కనిపిస్తుంది. కొన్నాళ్ళకు ప్రత్యేక రాజభటుల ద్వారా రహదారి కూడళ్ళలో రాజప్రకటనలు టముకువేసి వినిపించడం ప్రారంభమైంది.

ఈవిధంగా రాజుల స్థాయిలో వార్తలు ప్రసారమయ్యే పద్ధతి నుంచి క్రమంగా ప్రజలందరికీ వార్తలు చేరవేసే పద్ధతి వాడుకలోకి వచ్చింది. తర్వాత అశోకుని కాలానికి గోడలు, రాతిస్తంభాలు, పలకల మీద ప్రకటనలు వేయడం కనిపిస్తుంది. శిలాశాసనాలుగా ఇవి చరిత్ర ప్రసిద్ధి పొందాయి.

భారతదేశంలో మొగలాయిల పాలన వచ్చేసరికి వార్తాప్రసారంలో నూతన వ్యవస్థ అంకురించింది. ప్రతిమండల కేంద్రంలో వార్తాకేంద్రాలు ఏర్పాటుచేసి, విలేకరులను నియమించేవారు. తాము సేకరించిన వార్తలను లేఖల ద్వారా వారు రాజధానికి పంపించేవారు. రాత్రి వేళల్లో ఈ లేఖలను అంత:పురకాంతలు చదివి వినిపించేవారు. లండన్‌లోని రాయల్ ఏషియాటిక్ సొసైటీలో ఈ లేఖల ప్రతులు ఇప్పటికీ భద్రంగా ఉన్నాయి (లక్ష్మణరెడ్డి,వి. *తెలుగు జర్నలిజం అవతరణ వికాసం*, 2002, పుట 9-10).

ఈ పద్ధతి క్రమంగా లిఖిత వార్తాపత్రికలు ప్రచురించేందుకు ఆలంబనగా నిలిచింది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామకాలంలో ఈ తరహా పత్రికలు ప్రధాన పాత్ర పోషించాయి. క్రమంగా ముద్రణకళ, కాగిత పరిశ్రమ అభివృద్ధి చెందడంతో వార్తాప్రసారవ్యవస్థలో పెనుమార్పులు చోటుచేసుకున్నాయి. దీంతో నాటి సామాజిక వ్యవస్థలో కూడా ఎన్నో మార్పులు వచ్చాయి.

## 1.6 భారతదేశంలో ముద్రణారంగం - చారిత్రిక నేపథ్యం

ప్రపంచ చరిత్రలో సనాతన భారతీయ సాహిత్యానికి ఉన్న అగ్రస్థానం తెలియంది కాదు. ఈ విజ్ఞానమంతా తాళపత్రాల మీద రాసినదనే విషయమూ విదితమే. అంటే చైనా దేశీయులు కాగితాన్ని కనుగోనడం, ఆ తర్వాత జాన్‌గూటెన్‌బర్గ్ (క్రీ.శ.1400–క్రీ.శ.1468) ముద్రణాయంత్రాన్ని అభివృద్ధి చేయడానికి పూర్వమే ఇక్కడ అక్షరలిపిలో రాసే పద్ధతి వాడుకలో ఉన్నట్లు తెలుస్తోంది. తాళపత్రాలతో పాటు మృగచర్మాలు, రాతి పలకలు, లోహపురేకులు తదితరాలపై రాసే అలవాటు ఉండేది. వీటితోపాటు 'కడితం' (జిగురు పదార్థంతో మసిని కలిపి ఎండబెట్టిన వస్త్రం) మీద సుద్దబలపంతో రాసేవారు. క్రమంగా పదమూడో శతాబ్దంలో అంటే మహమ్మదీయుల కాలంలో కాగితం, సిరా వాడుకలోకి వచ్చినట్లు చారిత్రిక ఆధారాలు ఉన్నాయి. అలాగే, రెడ్డి రాజుల కాలంలో కూడా కాగితం వాడుకలో ఉన్నట్లు శ్రీనాథ మహాకవి రచించిన 'భీమేశ్వర పురాణం' ద్వారా తెలుస్తోంది. అయితే కాగితం తయారీ అవసరానికి తగినంత వేగంగా జరగకపోవడంతో కాగితం వాడుకలో ఉన్నప్పటకీ చాలాకాలం పాటు తాటాకులే ఎక్కువగా వాడుకలో ఉండేవి.

## 1.6.1 భారతదేశంలో ముద్రణారంగం - ఆవిర్భావ వికాసాలు

వ్యాపారం నెపంతో క్రైస్తవమత ప్రచారం కోసం భారతదేశంలో అడుగుపెట్టిన ఆంగ్లేయులకు భారతీయ భాషల అధ్యయనం తప్పనిసరైంది. ఈ క్రమంలో భారతీయ గ్రంథాల అనువాదం, నిఘంటువుల తయారీ, దీంతోపాటు భారతీయులకు క్రైస్తవగ్రంథాలు అందించడం అనివార్యంగా మారింది. అలాగే, ఇక్కడి రాజ్యాధికారాన్ని కాపాడుకోవడం కోసం తమదేశం నుంచి తెప్పించిన అధికారులు కూడా భారతీయభాషల అధ్యయనం తప్పక చేయవలసి వచ్చింది. ఈ అవసరాలన్నింటినీ దృష్టిలో ఉంచుకుని క్రైస్తవ మతప్రచారకులు, వారికి అవసరమైన వారికి సహకారాన్ని అందిస్తూ ఆంగ్లప్రభుత్వం భారతదేశంలో తొలిగా ముద్రాక్షరశాలను స్థాపించడమే కాకుండా ముద్రణకళను ఎంతగానో ప్రోత్సహించడం ప్రారంభించారు.

జెసూట్ మిషనరీ (Jesuit Missionary) 1556లో గోవాలో ముద్రణాలయాన్ని నెలకొల్పి అక్కడ నుంచి డౌట్రినా క్రిష్టా (Doutrina Crista) అనే గ్రంథాన్ని ముద్రించింది. భారతదేశంలో అచ్చయిన తొలిపుస్తకంగా ఇది చరిత్రలో నిలిచిపోయింది. క్రమంగా 1578 నాటికి తిరునల్వేలి జిల్లాలోని పునికయెల్ గ్రామంలో, 1579 నాటికి కొచ్చిన్‌లో ముద్రణాలయాలు ఏర్పాటయ్యాయి.

క్రీ.శ.1602లో పోప్ నుంచి ఒక యంత్రం మిషనరీ అవసరాల కోసం పశ్చిమతీరంలోని వై.పి.కోట (Y.P.Kota)కు వచ్చింది. ఇక్కడ తమిళ, మళయాళ, కొంకణి భాషల్లో క్రైస్తవ ప్రార్థన పుస్తకాలు ప్రచురితమయ్యేవి. క్రీ.శ.1616, 1649, 1654 సంవత్సరాల్లో ఇక్కడ నుంచే క్రైస్తవ గ్రంథాలు మళయాళ భాషలో వెలువడ్డాయి. ఇవన్నీ పోర్చుగీసు భాషలో రచించిన గ్రంథాలకు అనువాదాలు. ఆ తర్వాత 1679లో తిరుచూరుకు సమీపంలోని అంబల్‌కాడ్ (Ambalkad) గ్రామంలో స్థాపించిన ముద్రణాలయంలో మొట్టమొదటి తమిళ–పోర్చుగీసు నిఘంటువు అచ్చయింది.

క్రమంగా 1712లో తంజావూరు జిల్లా ట్రాంక్‌బార్‌లో, 1761లో చెన్నపురిలో, 1778లో కలకత్తాకు సమీపంలోని హుగ్లీలో ముద్రణాలయాలు ఏర్పాటయ్యాయి. ఇంతగా భారతదేశంలో ముద్రణ జరుగుతున్నా తెలుగులో ముద్రణ మాత్రం 1808 ప్రాంతానికి గాని ప్రారంభం కాలేదు. అది కూడా 1830 తర్వాతనే మరింతగా వ్యాప్తిలోకి వచ్చింది.

### 1.6.2 తెలుగులో ముద్రణ వ్యవస్థ – ఆవిర్భావ వికాసాలు

జర్మనీకి చెందిన ప్రొటెస్టెంట్ మతాచార్యుడైన బెంజిమిన్ షూల్జ్ తెలుగులో ముద్రణకు తొలిగా శ్రీకారం చుట్టాడు. అయితే, ఇది భారతదేశంలో కాకుండా జర్మనీలోని హాలే పట్టణంలో జరిగింది. క్రీ.శ.1746లో ఇక్కడ మూడు, 1747లో మూడు – మొత్తం ఆరు తెలుగు పుస్తకాలు అచ్చయ్యాయి. ఈవిధంగా తొలి తెలుగు పుస్తక ప్రచురణ క్రైస్తవ మతగ్రంథాలతో జర్మనీలో ప్రారంభమైంది. ఆ తర్వాత దాదాపు 65 సంవత్సరాల తర్వాత అంటే 1812లో భారతదేశంలోని సిరాంపూర్ ముద్రణాలయంలో తెలుగుపుస్తకాలు ముద్రితమయ్యాయి. ఇవి కూడా క్రైస్తవ సువార్తలే.

ఆ తర్వాత 1814లో విలియం కేరీ రచించిన *తెలుగు వ్యాకరణం* (Grammar of the Telinga language) ఇక్కడ ముద్రించారు. తర్వాత కొంతకాలానికి కలకత్తాలో కూడా తెలుగు పుస్తకాల ముద్రణ జరిగినట్లు ఆధారాలు లభిస్తున్నాయి. సిరాంపూర్ తర్వాత మద్రాసులో 1816లో ఎ.డి.క్యాంప్‌బెల్ (Alexander Duncan Campbell) రచించిన *తెలుగు వ్యాకరణం* (Grammar of the Teloogoo language) ముద్రితమైంది. తర్వాతి సంవత్సరం అంటే 1817లో విలియంబ్రౌన్ (Willium Brown) రచించిన *తెలుగువ్యాకరణం* (A Grammar of Gentoo Language), 1818లో బ్రౌన్ రచన *తెలుగు శబ్దావళి* కూడా మద్రాసు నుంచే వెలువడ్డాయి.

తెలుగువారిచే రచితమై, ముద్రణ జరుపుకున్న తొలిగ్రంథం రావిపాటి గురుమూర్తిశాస్త్రి రచించిన *విక్రమార్క కథలు*. ఇది 1819లో మద్రాసు కళాశాల నుంచి వెలువడింది. తర్వాత 1821లో క్యాంప్‌బెల్ (Alexander Duncan Campbell) రచించిన *తెలుగు నిఘంటువు* (Telugu Dictionary), 1823లో జె.సి.మోరిస్ (J.C.Moris) రాసిన తెలుగు వాచకం, 1827లో బ్రౌన్ రాసిన సంస్కృతాంధ్ర భాషల *ఛందోగ్రంథం*, 1829లో జాన్‌గార్డన్ రచించిన కొత్త *నిబంధన*, అదేఏడాది బ్రౌన్ రచించిన వేమన పద్యాల ఇంగ్లిషు అనువాదం ముద్రితరూపంలో వెలుగులోకి వచ్చాయి.

ఈ మధ్యకాలంలో లక్షలాది క్రైస్తవ ప్రార్థనా పుస్తకాలు, సువార్తలు ప్రచురితమయ్యాయి. ఇలా మద్రాసు నగరంలో వేగంగా పుస్తక ముద్రణ జరుగుతున్న కాలంలో 1825లో బళ్ళారి ట్రాక్ట్ సొసైటీ (Ballari Tract Society) బళ్ళారిలో ఓ ముద్రణాలయాన్ని ప్రారంభించింది. అనేక క్రైస్తవ గ్రంథాలు ఇక్కడ నుంచి ముద్రితమయ్యేవి.

తొలి తెలుగు పత్రిక *సత్యదూత* ఇక్కడనుంచే వెలువడిందనే వాదన ఉంది. కానీ ఇందుకు తగిన ఆధారాలు మాత్రం లభించడం లేదు. బళ్ళారి తర్వాత విశాఖపట్టణంలో తెలుగుముద్రణ ఎక్కువగా జరిగేది. దాదాపు 80 వరకు క్రైస్తవ గ్రంథాలతోపాటు అనేకానేక కరపత్రాల వంటి చిన్నచిన్న క్రైస్తవగ్రంథాలు ఇక్కడ నుంచి వెలువడ్డాయి. క్రమంగా మచిలీపట్టణం, కాకినాడ ప్రాంతాల్లో ముద్రణాలయాలు ప్రారంభమయ్యాయి. ఈవిధంగా తెలుగుభాషలో ముద్రణరంగం క్రైస్తవ మతాచార్యుల చొరవతో ఊపిరిపోసుకుని, కాలక్రమంలో తెలుగు భాషాసాహిత్యాల అభివృద్ధిలో తనకంటూ ఓ ప్రత్యేకస్థానాన్ని చరిత్రలో ఏర్పాటుచేసుకుంది.

## 1.7 భారతదేశంలో పత్రికారంగం

భారతదేశ రాజ్యవ్యవస్థను పూర్తిగా తమ అధీనంలోకి తెచ్చుకున్న బ్రిటీష్‌పాలకులు 18వ శతాబ్దినాటికి కలకత్తాను తమ కార్యస్థానంగా మార్చుకుని కార్యకలాపాలు సాగించేవారు. ఈ కారణంగా తొలి భారతీయ పత్రిక కూడా కలకత్తా నుంచే వెలువడింది. దీనిపేరు *బెంగాల్ గెజిట్*. క్రీ.శ.1780 జనవరి 29వ తేదీ శనివారం నాడు ఈ పత్రిక బయటకు వచ్చింది. జేమ్స్ ఆగస్టస్ హికీ (James Agustus Hieke) అనే ఆంగ్లేయుడు దీనికి సంపాదకుడు, ముద్రాపకుడు కూడా.

వారపత్రికగా వెలువడిన *బెంగాల్ గెజిట్* తొలిరోజుల్లో కేవలం రెండు పేజీలతో వెలువడేది. *కలకత్తా జర్నల్ అడ్వయిజర్; హికీస్ గెజిట్* అనే పేర్లు కూడా దీనికి వ్యవహారంలో ఉండేవి. బ్రిటీష్ కంపెనీలో జరుగుతున్న అన్యాయాలు, ఫలితంగా దేశం నష్టపోతున్న తీరు, అధికారుల అక్రమాలు, అవినీతి కార్యకలాపాలను హికీ తన పత్రికలో నిస్సంకోచంగా ప్రకటించేవాడు. ఈ కారణంగా ప్రభుత్వం నుంచి అనేకవిధాలుగా ఆయన కష్టాలు ఎదుర్కొన్నాడు. జైలుశిక్ష కూడా అనుభవించాడు. పత్రికాపరంగా ఎన్ని కష్టాలు ఎదురైనా వాటన్నింటినీ తుదకంటూ ధైర్యంగా ఎదుర్కొన్నాడు.

హికీ మరణం తర్వాత ఆ పత్రికను ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకుంది. ఈవిధంగా తొలి భారతీయ పత్రిక తీవ్ర అణచివేతకు గురైంది. బెంగాల్ గెజిట్ ప్రారంభమైన కొద్దికాలానికే బెర్నాల్డ్ మిస్సినిక్ (Bernald Missinik), పీటర్ రీడ్ (Peter Ried) అనే ఇద్దరు ఆంగ్లేయులు కలకత్తా నుంచి *ఇండియా గెజిట్* అనే పత్రికను ప్రారంభించారు. ఇదికూడా ఆంగ్లభాషా వారపత్రికే. దీని నిర్వాహకులు ప్రభుత్వాన్ని సమర్థిస్తూ, వారినుంచి ఎన్నో రాయితీలు, లాభాలు అందుకున్నారు.

తర్వాత నాలుగేళ్ళకు అంటే 1784 ఫిబ్రవరిలో *కలకత్తా గెజిట్* అనే మరొక ఆంగ్లభాషా వారపత్రిక ప్రారంభమైంది. అయితే వ్యాపార ప్రకటనలు మాత్రం వంగ, పారశీక భాషల్లో ముద్రితమయ్యేవి. అనంతరకాలంలో ఇది ప్రభుత్వ అధికార గెజిట్‌గా మారింది. మరో ఏడాది గడిచేసరికి అంటే 1785 ఫిబ్రవరిలో *బెంగాల్ జర్నల్* అనే పత్రిక థామస్ జోన్స్ (Thomas Jones) సంపాదకత్వంలో వెలువడింది. ఇదికూడా ఆంగ్లభాషా వారపత్రికే. *బెంగాల్‌జర్నల్* ప్రారంభమైన రెండు నెలల వ్యవధిలో *ఓరియంటల్ మ్యాగజైన్* అనే పత్రిక వెలువడింది. దీన్నే *కలకత్తా ఎమ్యూజ్‌మెంట్* అని కూడా వ్యవహరించేవారు.

ఇదే సమయంలో మద్రాసు నగరంలో *మద్రాసు కొరియర్* అనే పత్రిక ఆవిర్భవించింది. నాలుగు పేజీలతో ఆంగ్లభాషా వారపత్రికగా వెలువడిన మద్రాసుకొరియర్‌కు ప్రభుత్వ గుర్తింపు లభించింది. రిచర్డ్ జాన్సన్ (Richard Jhonson) దీని ముద్రాపకుడు. క్రీ.శ1786 జనవరిలో కలకత్తా నుంచి *కలకత్తా క్రానికల్* పత్రిక మొదలైంది. తర్వాతి నాలుగైదేళ్ళ కాలంలో కలకత్తా నుంచి *ఏషియాటిక్ మిర్రర్, ఇండియన్ వరల్డ్, ఇండియన్ డైలీ న్యూస్, టెలిగ్రాఫ్, కలకత్తా మార్నింగ్ పోస్ట్, ఓరియంటల్ స్టార్, రిలేటర్* తదితర పత్రికలు ఆవిర్భవించాయి. వీటిలో చాలావరకు ప్రజాదరణ పొందాయి.

కలకత్తా నుంచి పత్రికలు ఉద్ధృతంగా వెలువడుతున్న సమయంలో బొంబాయి నుంచి 1789లో తొలిసారిగా *బాంబే హెరాల్డ్* అనే పత్రిక వెలువడింది. ఏడాది గడిచేసరికి అంటే 1790లో లూకాస్‌బర్నర్ (Lukas Burner) *బాంబే కొరియర్* పత్రికను ప్రారంభించాడు. ఇదే అనంతర కాలంలో టైమ్స్ ఆఫ్ ఇండియాకు ప్రాతిపదికగా నిలిచింది. *బాంబేగెజిట్* అనే పేరుతో 1791లో మరో పత్రిక వెలువడింది. ఇదిజరిగిన ఏడాదికే అంటే 1792లో *బాంబేహెరాల్డ్, బాంబేగెజిట్* పత్రికలు విలీనమయ్యాయి. ఇదిలా ఉండగా, మద్రాసు నుంచి 1791లో హరకారు అనే పత్రిక ప్రారంభమైంది. మద్రాసు కొరియర్‌కు సంపాదకుడిగా పనిచేసిన బోల్డ్ (Bold) ఈ పత్రికను ప్రారంభించాడు. పత్రిక ప్రారంభించిన రెండేళ్ళ కాలానికే బోల్డ్ మరణించడంతో హరకారు ప్రస్థానం ఆగింది. ఇదేఏడాది విలియం డుయేన్ (William Duyen) అనే బ్రిటీష్ జాతీయుడు బెంగాల్ నుంచి *బెంగాల్ జర్నల్* అనే పత్రికను నడిపాడు. వదంతులు ప్రచురించిన కారణంగా ప్రభుత్వ ఒత్తిడి ఎక్కువ కావడంతో పత్రికను కొనసాగించలేక ఇండియన్ వరల్డ్ అనే పేరుతో మరో కొత్త పత్రికను ప్రారంభించాడు.

బెంగాల్‌లో పరిస్థితి ఇలా ఉండగా, 1795లో రాబర్ట్ విలియమ్స్ (Williams) మద్రాసు నగరం నుంచి *వీక్లీ మద్రాసు గెజిట్* పత్రికను ప్రారంభించాడు. దీనితర్వాత కొన్ని నెలలకే హంఫ్రీస్ (Humpries) నేతృత్వంలో *ఇండియా హెరాల్డ్* పత్రిక వెలువడింది. అయితే ప్రభుత్వ అనుమతులు లేనికారణంగా ఈయన ప్రవాసశిక్షకు గురికావలసి వచ్చింది. ఈ సంఘటన తర్వాత నాటి ప్రభుత్వం పత్రికలపై ఆంక్షలు విధించింది. క్రమంగా 1799 నాటికి ఇవి మరింత జటిలమయ్యాయి. ఈవిధంగా 18వ శతాబ్దకాలంలో దేశీయ పత్రికారంగం ఊపిరిపోసుకుని మనుగడ సాగించడానికి ఎన్నో కష్టాలు పడింది. ఈ పత్రికలన్నీ ఆంగ్లేయుల సారథ్యంలో..పైగా కంపెనీ ఉద్యోగులు, అధికారుల నేతృత్వంలో వెలువడినవే కావడం విశేషం.

## 1.7.1 భారతీయ పత్రికల ఆవిర్భావం

భారతదేశంలో తొలి భారతీయ పత్రిక *బెంగాల్ గెజిట్* బెంగాల్ నుంచి వెలువడింది. గంగాధర భట్టాచార్య 1816లో వంగభాషలో ఈ పత్రికను ప్రారంభించాడు. భారతీయులు స్థాపించిన తొలిపత్రికగా ఇది చరిత్రలో స్థానం సంపాదించుకుంది. ఆ తర్వాత 1818లో సిరాంపూర్ మిషనరీ ఆధ్వర్యంలో *దిగ్దర్శన్* అనే మాసపత్రిక వెలువడింది. రాజనీతి, చరిత్ర, మత విషయాలు ఇందులో ప్రచురితమయ్యేవి.

ఆ తర్వాత రెండు నెలల వ్యవధిలోనే సమాచార్‌దర్పణ్ అనే బెంగాలీ వార పత్రిక మిషనరీ ఆధ్వర్యంలోనే ప్రారంభమైంది. ఈపత్రికలో భారతీయవేదాంతం, తత్త్వశాస్త్రం, మత విషయాలపై తీవ్ర విమర్శలు ప్రచురించేవారు. దీన్ని నిరసిస్తూ రాజా రామమోహనరాయ్ ఆ పత్రికకు ఎన్నో ఉత్తరాలు రాశారు. వీటిలో ఏ ఒక్కదాన్ని పత్రిక ప్రచురించకపోవడంతో ఆగ్రహించిన రామమోహనరాయ్ తానే స్వయంగా *బ్రాహ్మిణికల్ మ్యాగజైన్* అనే పత్రికను ప్రారంభించారు. తన మిత్రుడైన శివప్రసాదశర్మకు సంపాదకత్వ బాధ్యతలు అప్పగించారు. మిషనరీల విమర్శలకు తగిన సమాధానాన్ని ఇందులో ప్రచురించేవారు. అయితే 12 సంచికలు వెలువడిన తర్వాత ఈ పత్రిక ఆగిపోయింది.

తర్వాత వంగ, ఆంగ్ల భాషల్లో *బ్రాహ్మిణికల్ సేవాధీ* అనే పత్రికను నడిపారు. ఇందులో కూడా మిషనరీల దుష్ప్రచారాన్ని తిప్పికొడుతూ వ్యాసాలు ప్రచురించేవారు. కొంతకాలానికి అంటే 1821లో తానే నిర్వహణ బాధ్యతలు వహిస్తూ రామమోహనరాయ్ సంవాదకౌముది అనే పత్రికను ప్రారంభించారు. ప్రతి మంగళవారం ఈ పత్రికద్వారా హైందవజాతిని జాగృతం చేసే ఎన్నో వ్యాసాలను ప్రచురించేవారు.

మరో పారశీక వారపత్రిక *మిరాత్ ఉల్ అఖ్ బార్* (Mirat-Ul-Akh-Bar)ను కూడా రామమోహనరాయ్ 1822లో ప్రారంభించారు. ప్రతి శుక్రవారం వెలువడే ఈ పత్రిక సంచలనాత్మక సంపాదకీయాలకు పెట్టిందిపేరుగా నిలిచింది. ఇదే ఏడాది ఫర్దున్‌జీ మర్జబాన్ (Furthunji-arja-bab) *ముంబయి సమాచార్* అనే పేరుతో గుజరాతీ వారపత్రిక స్థాపించారు. (ఇదే 1832లో దినపత్రికగా మారింది.) రామమోహనరాయ్ సంపాదకీయాలకు భయపడిన ఆంగ్లప్రభుత్వం 1823లో పత్రికా స్వాతంత్ర్యాన్ని నియంత్రిస్తూ ఆజ్ఞలు జారీచేసింది. యుగల్‌కిషోర్‌శుక్లా (Yugal Kishore Sukla) 1826లో హిందీలో *ఉదయ్ మార్తాండ్* అనే వారపత్రికను కలకత్తా నుంచి వెలువరించారు. ఆర్థిక ఇబ్బందులు కారణంగా ప్రారంభించిన ఏడాదికే ఈ పత్రిక ఆగిపోయింది. తర్వాతికాలంలో అనేక పారశీక, గుజరాతీ పత్రికలు వెలువడ్డాయి. ఇవన్నీ ఆయా కాలాల్లో జరిగిన వివాదాల కారణంగా ప్రాణం పోసుకున్నవే. 1835లో నాటి గవర్నర్ జనరల్ సర్ చార్లెస్ మెట్‌కాఫ్ (Charles Metcaff) పత్రికానిర్బంధ శాసనాన్ని రద్దుచేశాడు. దీంతో దేశీయపత్రికలు తిరిగి స్వేచ్ఛావాయువు తీసుకున్నాయి. పరతంత్ర భారతావనిలో స్వతంత్ర భావాలతో జాతిని జాగృతం చేయడానికి పత్రికలు ప్రధానసాధనంగా ఎంచుకుని కృషిచేసిన వారిగా రామమోహనరాయ్ చరిత్రలో నిలిచిపోయారు.

మద్రాసు నుంచి 1844, అక్టోబరు 2న క్రెసెంట్ అనే ఆంగ్లపత్రిక వెలువడింది. వృత్తిరీత్యా వ్యాపారి అయిన గాజుల లక్ష్మీనర్సుసెట్టి ఈ పత్రిక వ్యవస్థాపకుడు. దేశప్రజల హృదయాల్లో చైతన్యాన్ని రగల్చాలనే ఉద్దేశంతో చెన్నపట్టణంలో నారాయణస్వామి అనే ఆయన నడుపుతున్న నేటివ్ సర్క్యులేటర్ పత్రికను, దాని ముద్రణాలయాన్ని తన యావదాస్తిని వెచ్చించి, కొని దానిపేరును క్రెసెంట్‌గా మార్చాడు. దేశీయుల పట్ల ఆంగ్లేయులు చేస్తున్న దౌర్జన్యాలను ఈ పత్రికలో ఈయన విమర్శించేవాడు. అలాగే, మిషనరీల దుశ్చర్యలు కూడా ఈయనను ఎంతో కదిలించాయి. ప్రభుత్వోద్యోగుల అనైతిక చర్యలు, అకృత్యాలు, ప్రభుత్వం చేస్తున్న అమానుష వసూళ్ళు మొదలైన విషయాలను ఆయన తన పత్రికలో ఎండగట్టేవాడు. కానీ, ప్రభుత్వాన్ని వ్యతిరేకించిన ఫలితంగా నిర్బంధాన్ని ఎదుర్కోక తప్పలేదు.

## 1.8 తొలితరం తెలుగు పత్రికలు

తెలుగునాట పత్రికల చరిత్రను గ్రంథస్థం చేయడంలో జరిగిన లోపాల కారణంగా తొట్టతొలి తెలుగు పత్రిక ఏదనే విషయంలో నేటికీ సందిగ్ధత తొలగలేదు. మొదటి తెలుగుపత్రిక సత్యదూత అని అనేకమంది అభిప్రాయం. నిడదవోలు వెంకటరావు, నార్ల వెంకటేశ్వరరావు దీన్ని సమర్థించారు. బళ్ళారి క్రైస్తవ సంఘం నిర్వహణలో ఇది మద్రాసు నుంచి ప్రచురితమయ్యేదనే అభిప్రాయం వాడుకలో ఉంది. అయితే ఇందుకు నిర్దుష్టమైన ఆధారాలేవీ లభించలేదు. సత్యదూత ప్రతులు కూడా ఎక్కడా లభించడం లేదు. మిషనరీల రికార్డుల ప్రకారం ట్రూత్‌ఫుల్ మెసెంజర్ అనే తమిళ పత్రిక ఉన్నట్లు తెలుస్తోంది. ఈ పేరుకు తెలుగు అనువాదం సత్యదూత కాబట్టి అటువంటి పత్రిక ఒకటి ఉండేదని పాత్రికేయ / పత్రికారంగ చరిత్రకారుల్లో కొందరి అభిప్రాయం. తొలితరం తెలుగు పత్రికలు కొన్నింటిని ఇక్కడ గమనిద్దాం.

### 1.8.1 మద్రాస్ క్రానికల్ (Madras Chronicle)

తమిళనాడులో లభిస్తున్న ఆర్కైవ్‌ల ప్రకారం 1832లో కాన్‌స్టెంటైన్‌శాంపి, ఆదిశైవ, విశాఖ పెరుమాళ్ అయ్యర్, శరవణ పెరుమాళ్ అయ్యర్ మద్రాసు నుంచి తెలుగు, తమిళ భాషల్లో తాము ఒక పత్రిక ప్రారంభించదలచినట్లు, ఇందుకు అనుమతి ఇవ్వలసిందిగా ప్రభుత్వానికి అర్జీ పెట్టుకున్నారు. ఇదే మద్రాస్ క్రానికల్ అని చరిత్రకారుల అభిప్రాయం.

అలాగే 1853లో రెవరెండ్ జె.లాంగ్ ప్రభుత్వానికి ఇచ్చిన నివేదికలో తొలి తెలుగు, తమిళ పత్రికలు 1833 నాటికి వెలువడినట్లు ఉంది. దీనిబట్టి ఆ తెలుగు పత్రిక *మద్రాస్ క్రానికల్* అయ్యే అవకాశం ఉంది. ఈ పత్రిక, బుధవారం తెలుగులో; శనివారం తమిళంలో వచ్చేది. ఇంతకుమించి ఈ పత్రిక ప్రస్థానం గురించి ఇతర ఆధారాలేవీ లభించలేదు. అయితే, మద్రాస్ విశ్వవిద్యాలయం ప్రచురించిన *'ఏ సర్వే ఆఫ్ తమిళ్ ప్రెస్'* అనే గ్రంథంలో 1835లో *మద్రాస్‌క్రానికల్* పేరుతో తమిళ, తెలుగు పత్రికలు వెలువడినట్లు ఉంది.

## 1.8.2 కర్నాటిక్ క్రానికల్ (Karnatic Chronicle)

ఏషియాటిక్ జర్నల్ 1833, నవంబరు సంచికలో ఇంగ్లిషు, తమిళ, తెలుగు భాషల్లో ముద్రితమైన పత్రికల ప్రస్తావన ఉంది. ఇదే *కర్నాటిక్ క్రానికల్*. ఈ పత్రిక ప్రతులు తమకు అందినట్లు జర్నల్ అధికారులు పేర్కొన్నారు. ఇంగ్లిషు నుంచి తెలుగు, తమిళ భాషల్లోకి వార్తలను అనువాదం చేసి ప్రచురించేవారు.

## 1.8.3 ఫోర్ట్‌సెంట్ జార్జ్‌గెజిట్ (Fortcent George Gazitte)

క్రీ.శ.1832, జనవరి 4వ తేదీన *ఫోర్ట్‌సెంట్ జార్జి గెజిట్* పత్రిక వెలువడింది. కేవలం వ్యాపార ప్రకటనలు ఇందులో ప్రచురితమయ్యేవి. మొదట ఇంగ్లిషులో వెలువడినా, క్రమంగా తెలుగు పాఠకుల ఆదరణ పెరగడంతో 1834 నుంచి తెలుగులో కూడా ప్రచురణ మొదలైంది.

## 1.8.4 వృత్తాంతి

మండిగల వెంకటరాయశాస్త్రి సంపాదకత్వంలో 1833 నుంచి 1838 వరకు మద్రాసు కేంద్రంగా వృత్తాంతి పత్రిక వెలువడింది. ఇంగ్లిషు పత్రికల్లో వచ్చిన వార్తలను తెలుగు, తమిళ భాషల్లోకి తర్జుమా చేసి ఇందులో ప్రచురించేవారు. ఈ పత్రిక ప్రతులు ప్రస్తుతం ఎక్కడా లభించడం లేదు. గిడుగు రామ్మూర్తి పంతులుగారు రచించిన *గద్యచింతామణి*లో ఈ పత్రిక ప్రస్తావన ఉంది.

## 1.8.5 వర్తమాన తరంగిణి

మద్రాసు కేంద్రంగా వెలువడిన మరోతెలుగు వర్తమాన తరంగిణి. సయ్యద్ రహమతుల్లా ముద్రాపకుడిగా, పువ్వాడ వెంకట్రావు సంపాదకత్వంలో ఈ పత్రిక తొలిసంచిక 1842 జూన్ 8వ తేదీన వెలువడింది. కొంతకాలానికి వేంకట్రావు ఈ పత్రికకు పూర్తిగా యాజమాన్య బాధ్యతలు తీసుకున్నట్లు తెలుస్తోంది. డెమ్మీ పరిమాణంలో వచ్చే ఈ పత్రిక నెల చందా ఒక రూపాయి కాగా సంవత్సరచందా పది రూపాయలు. పన్నెండు పేజీలతో ప్రతి బుధవారం ఈ పత్రిక వెలువడేది. అయితే కొంతకాలానికి దీన్ని గురువారం వెలువడేలా మార్పు చేశారు. ప్రత్యేక సందర్భాల్లో ఉపపత్రికల పేరుతో సప్లిమెంట్లను ఈ పత్రిక ప్రచురించేది. వివాదాస్పద వార్తలకు దూరంగా ఉండడాన్ని పత్రిక నియమంగా పెట్టుకుంది. జాతీయ, అంతర్జాతీయ వార్తలు ఇందులో ప్రధానంగా ప్రచురించేవారు. దీంతోపాటు రాజకీయం, భూగోళం, గణితం, ధర్మ, నీతిశాస్త్రాలు తదితర విషయాలు కూడా ఇందులో ప్రచురిస్తుండడంతో పాఠకుల ఆదరణ ఉండేది. పరవస్తు చిన్నయసూరి వంటి పండితులు కూడా ఈ పత్రికకు లేఖలు రాసేవారు.

## 1.8.6 హితవాది

తెల్లదొరల్లో తెలుగు పండితుడిగా పేరుపొందిన ఎడ్మండ్ జె.షార్కీ (Edmand J Sharki) 1848లో హితవాది పత్రికను ప్రారంభించాడు. మద్రాసులోని అమెరికన్ మిషన్ ముద్రణాలయంలో దీన్ని ముద్రించి, కృష్ణాజిల్లా మచిలీపట్టణం నుంచి ప్రకటించేవారు. ఈ పత్రిక ప్రతులు కొన్ని (1862 నాటివి) లండన్‌లోని బ్రిటీష్ మ్యూజియం లైబ్రరీలో ఉన్నట్లు డాక్టర్ వి.లక్ష్మణరెడ్డి తన *తెలుగు జర్నలిజం అవతరణ, వికాసం*లో రాశారు. క్రైస్తవ మతప్రచారం ధ్యేయంగా ఈ పత్రిక పనిచేసేది.

ప్రభుత్వ నియామకాలు, సార్వజనీన ప్రకటనలు, దేశవిదేశీ వార్తలు ఇందులో ఉండేవి. పత్రికలో సామినేని ముద్దునరసింహం రచించిన వ్యాసాలే అనంతర కాలంలో హితసూచని పేరుతో పుస్తకంగా వెలువడ్డాయి. హితవాది ప్రారంభకాలం గురించి ఒకటిరెండు అభిప్రాయభేదాలు వ్యక్తమయ్యాయి. నార్ల వేంకటేశ్వరరావు, నిడుదవోలు వెంకట్రావుల అభిప్రాయం ప్రకారం హితవాది ప్రారంభకాలం 1862. ఈ పత్రిక 1848లో ప్రారంభమై 1862 వరకు నడిచినట్లు ఆరుద్ర తన నార్ల షష్ట్యబ్దిపూర్తి ప్రచురణలో రాశారు.

ఈ పత్రిక 1848లో ప్రారంభమై, కొంతకాలానికి ఆగి, తిరిగి 1862లో ప్రారంభమై ఉంటుందని బంగోరె (బండి గోపాలరెడ్డి) తన *బ్రౌన్ జాబులు – తెలుగు జర్నలిజం చరిత్రలో* పేర్కొన్నారు. ఏదిఏమైనా హితవాది ప్రారంభకాలం 1848 అని ఎక్కువమంది అంగీకరించారు.

## 1.8.7 దినవర్తమాని

ప్రతి శనివారం మద్రాసు నుంచి వెలువడిన ఈ పత్రిక 1855లో వెలువడింది. మొదట తమిళంలో, ఆ తర్వాత 1856లో తెలుగులో ఈ పత్రిక వచ్చింది. వారం రోజుల పాటు జరిగిన వార్తలు, విశేషాలను ఈ పత్రిక ప్రకటించేది. వారపత్రిక అయినా పేరుమాత్రం దినపత్రిక అని భ్రమ కలిగించేట్లుగా ఉండేది. రాజధాని కళాశాలలో భాషోపన్యాసకుడిగా పనిచేస్తున్న రెవరెండ్ పీటర్ పెర్సివల్ ఈ పత్రిక సంపాదకుడి పనిచేశారు.

క్రైస్తవ మతప్రచారానికి అధిక ప్రాధాన్యత ఇస్తూనే సైన్సు, విమర్శనా వ్యాసాలను ఈ పత్రిక ప్రచురించేది. ప్రభుత్వ చర్యలను కూడా అవి ఎటువంటివైనా సమర్థించేది. ఈకారణంగా పత్రిక కార్యాలయానికి ఉచిత భవన వసతి, నెలకు రూ.200 సహాయం ప్రభుత్వం నుంచి క్రమం తప్పకుండా అందేది. దాదాపు 700 వరకు ప్రతులు అమ్ముడయ్యేవి. ఈ పత్రిక ప్రతి ఒకటి (1861 నాటిది) బ్రిటీష్ మ్యూజియంలో ఉంది.

తర్వాతి కాలంలో *గోదావరి ఎడ్యుకేషనిస్ట్* (రాజమండ్రి); *శ్రీయక్షిణి* (బళ్ళారి, 1863); *సుజనరంజని* (మద్రాసు, 1864); *తత్త్వబోధిని* (మద్రాసు, 1864); *నేటివ్ పబ్లిక్ ఒపీనియన్* (మద్రాసు, 1865); *ఆంధ్రభాషా సంజీవని* ( మద్రాసు 1871); *వ్యవహార తరంగిణి* (మద్రాసు, 1872) తదితర పత్రికలెన్నో వెలువడ్డాయి.

ఆయా పత్రికలన్నీ తమ లక్ష్యాన్ని తొలి సంచికలోనే ప్రకటిస్తూ పాఠకుల ఆదరాన్ని పొందాయి. ముఖ్యంగా స్వాతంత్ర్యోద్యమ కాలంలో దేశపౌరుల్లో స్వేచ్ఛాభావాలను పెంపొందించి, స్వాతంత్రోద్యమ స్ఫూర్తిలో ఉద్దీపింపజేసి, వారిని కర్తవ్యోన్ముఖులను చేయడానికి అనేక పత్రికలు కృషి చేశాయి. చాలా వరకు పత్రికలు ఈ విషయంలో విజయం సాధించాయి.

## అధ్యాయం 2

# కృష్ణా జిల్లా నుంచి వెలువడిన పత్రికలు

చారిత్రకంగా, భౌగోళికంగా కృష్ణాజిల్లా ఎంతో ప్రాధాన్యత కలిగి ఉంది. విస్తారమైన పంట భూములు ఇక్కడ ఉన్నాయి. భారతదేశపు గొప్ప నదుల్లో ఒకటైన కృష్ణానది ఇక్కడ ప్రవహిస్తోంది. పౌరాణిక, ఆధ్యాత్మిక పరంగాను కృష్ణాజిల్లాకు గొప్పస్థానం ఉంది. శక్తి పీఠాల్లో ఒకటైన ఇంద్రకీలాద్రి ఇక్కడ ఉంది. ఆంధ్రదేశానికి ఈ జిల్లాలోని శ్రీకాకుళం కొంత కాలం రాజధానిగా ఉంది. ప్రాచీన కాలం నుంచి ఇది వర్తక, వ్యాపారాలకు కేంద్రంగా ఉంది. తెలుగు సాహిత్యంలో ప్రఖ్యాతిగాంచిన మహామహులెందరో కృష్ణాతీరంలో పుట్టి, ఈ ప్రాంత ఖ్యాతిని దశదిశలా వ్యాపింపజేశారు. తెలుగు పంచకావ్యాల్లో ఒకటైన ఆముక్తమాల్యదను శ్రీకృష్ణదేవరాయలు కృష్ణాజిల్లాలోని శ్రీకాకుళంలో రచించాడు.

స్వాతంత్రోద్యమంలోను కృష్ణాజిల్లా చిరస్మరణీయమైన పాత్ర పోషించింది. అల్లూరి సీతారామరాజు వంటి దేశభక్తులు బ్రిటీషు పాలకులను తారెత్తించారు. భారత జాతీయ పతాకాన్ని కృష్ణాజిల్లాకు చెందిన పింగళి వెంకయ్య తయారుచేశారు. ఇలా ఎన్నో చిరస్మరణీయమైన ఘట్టాలకు కృష్ణాజిల్లా వేదికగా నిలిచింది. స్వాతంత్ర్యానంతరం కూడా కృష్ణాజిల్లా ఆంధ్రరాష్ట్రం, దేశ అభివృద్ధిలో చురుకైన పాత్ర పోషిస్తోంది. హైదరాబాదు ప్రాంతం నేటి స్థాయిలో అభివృద్ధిచెందడానికి పూర్వం అనేక రంగాలకు కృష్ణాజిల్లాలోని విజయవాడ రాజధానిగా ఉండేది. ఇప్పటికీ వర్తకవ్యాపారాలకు, రాజకీయాలకు, రవాణా, ముద్రణ రంగాలకు విజయవాడే కీలకంగా ఉంటోంది.

ఇంతటి ఘన చరిత్ర ఉన్న కృష్ణాజిల్లా పత్రికారంగానికి కూడా కొంతకాలం రాజధానిగా నిలిచింది. మొట్టమొదటి తెలుగు దినపత్రిక దేశాభిమాని కృష్ణాజిల్లా విజయవాడ నుంచే వెలువడింది. ఇక, సాంకేతికంగా తొలి తెలుగు దినపత్రిక కాకపోయినప్పటికీ, తెలుగు పత్రికారంగం అనగానే గుర్తుకువచ్చే కృష్ణాపత్రిక ఈ జిల్లా ముఖ్యపట్టణం మచిలీపట్నం కేంద్రంగా నడిచింది. ఈవిధంగా పత్రికారంగంలోను కృష్ణాజిల్లా ప్రముఖ స్థానం కలిగిఉంది. ఇన్ని విశేషాలు, ప్రత్యేకతలు కలిగి ఉండడంతో, కృష్ణాజిల్లా చారిత్రక నేపథ్యాన్ని, ఇక్కడ జరిగిన గ్రంథాలయోద్యమ విశేషాలను ఈ అధ్యాయంలో చర్చించడం జరిగింది.

## 2.1 కృష్ణాజిల్లా చారిత్రిక నేపథ్యం

భౌగోళికపరంగా కృష్ణాజిల్లా ఎంతో ప్రాముఖ్యత కలిగి ఉంది. ఇక్కడి నేల కూడా ఎంతో సారవంతమైంది. పవిత్ర కృష్ణానది ఈ జిల్లాగుండా ప్రవహిస్తోంది. ఈ నది పేరుమీదే జిల్లాకు కృష్ణాజిల్లాగా పేరువచ్చింది. అనేక సహజ సంపదలు ఉండడం వల్ల అతిప్రాచీన కాలం నుంచే ఇక్కడ మానవసంచారం ఉండేదని చరిత్రకారుల ఊహ.

ప్రఖ్యాత చరిత్రకారుడు హిప్పాలస్ (Hippalus) రచించిన 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ' (Periplus of Arithrian Sea), గ్రీకు చరిత్రకారుడు టాలమి (Ptolemy) రాత ప్రకారం కృష్ణానది ముఖద్వారం ఖండాంతర వాణిజ్యానికి అనుకూలంగా ఉండేది. మొదటి శతాబ్దం నుంచి మచిలీపట్నం రేవులో గ్రీకు తదితర దేశాలకు వ్యాపారలావాదేవీలు జరిగేవి. మరోచరిత్రకారుడు మార్కోపోలో (Marcopolo) తన రచనల్లో మచిలీపట్నంలోని చాపకన్ను దర్వాజాను వర్ణించాడు. ప్రఖ్యాత చరిత్రకారుడు యార్లగడ్డ బాలగంగాధరరావు తన కృష్ణాజిల్లా చరిత్ర వ్యాసంలో (కృష్ణాతరంగం, కృష్ణామహోత్సవాల ప్రత్యేక సంచిక, 2003, పుట 41) '... క్రీస్తుకు పూర్వమే ఇక్కడ మానవసంచారం ఉండేది. తెన్నేరు ప్రాంతంలో నూతన శిలాయుగం నాటి అవశేషాలు, హైదరాబాదు రైలుమార్గం వెంట ప్రాచీన మానవసమాధులు (రాక్షసగుళ్ళు) బయటపడ్డాయి. చరిత్రకు అందినంత వరకు క్రీ.పూ.3, 4 శతాబ్దాల్లో ఉత్తరాది నుంచి దక్షిణాదికి ఆంధ్రుల వలస ప్రారంభమైంది..' అని రాశారు. వీటన్నిటి ఆధారంగా అతి ప్రాచీనకాలం నుంచే ఇక్కడ జనసంచారం ఉన్నట్లు తెలుస్తోంది.

అశోకుని మరణం తర్వాత క్రీ.పూ.3వ శతాబ్దం చివరిభాగంలో శాతవాహనులు మౌర్య సామ్రాజ్యాన్ని ధిక్కరించి, స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించారు. శ్రీముఖుడు ఈ వంశానికి మూలపురుషుడు. కృష్ణానదీ తీరంలో శ్రీకాకుళం రాజధానిగా వీరిపరిపాలన సాగింది. అత్యంత వైభవ సంపదలతో విలసిల్లిన ఈ నగరం కాలక్రమంలో కుగ్రామంగా మారిపోయింది. కానీ, శాతవాహనులు ఇక్కడ నిర్మించిన ఆంధ్రమహావిష్ణు దేవాలయం నేటికీ నిలిచిఉండడమే కాకుండా, నాటి చరిత్రకు సజీవ సాక్ష్యాన్నిస్తోంది. తర్వాత కొంతకాలానికి శాతవాహనులు తమ రాజధానిని ధాన్యకటాకానికి మార్చారు. క్రీ.పూ.230 నుంచి క్రీ.శ.227 వరకు వీరి పరిపాలన సాగింది. ఈ రాజుల్లో గౌతమీపుత్ర శాతకర్ణి చారిత్రకంగా ప్రసిద్ధి పొందాడు. ఇతని పరిపాలన కాలంలో విదేశీ వ్యాపారం ఎక్కువగా సాగేది. మొత్తమ్మీద శాతవాహనుల పరిపాలన కాలంలో ప్రజలు అత్యంత సుఖ సంతోషాలతో జీవించారు.

క్రీ.శ. 3వ శతాబ్దం మొదటిభాగంలో శాతవాహనుల రాజ్యం పతనమైంది. శాతవాహనుల తర్వాత దివి తాలూకాలోని కోడూరు గ్రామం రాజధానిగా దాదాపు 20 సంవత్సరాల పాటు కృష్ణాప్రాంతాన్ని బృహత్పలాయనులు పాలించారు. జయవర్మ ఈ రాజ్యానికి స్థాపకుడు. తర్వాతి కాలంలో సుమారుగా క్రీ.శ. 4వ శతాబ్దం నాటికి శాలంకాయన రాజులు కృష్ణానది ఉత్తరభాగాన్ని ఆక్రమించారు. క్రమంగా వీరు కృష్ణ, గోదావరి ప్రాంతాన్నంతటినీ జయించి, పెదవేగి రాజధానిగా దాదాపు ఒక శతాబ్దం పాటు రాజ్యాన్ని పరిపాలించారు.

క్రీ.శ. 5వ శతాబ్దం మొదటి అర్ధభాగం వచ్చేసరికి విష్ణుకుండినులు శాలంకాయనుల నుంచి రాజ్యాన్ని హస్తగతం చేసుకున్నారు. విజయవాడ రాజధానిగా క్రీ.శ. 7వ శతాబ్దం వరకు వీరి రాజ్యాన్ని పాలించినట్లు చారిత్రక ఆధారాలు లభిస్తున్నాయి. చారిత్రక ప్రసిద్ధి పొందిన విజయవాడ మొఘల్‌రాజపురం గుహలు, ఉండవల్లి గుహలు వీరికాలం నాటివే. క్రీ.శ. 618లో జరిగిన యుద్ధంలో ఈ వంశపు రాజైన మాధవవర్మ చాళుక్యచక్రవర్తి అయిన రెండవ పులకేశి చేతిలో పరాజయం పాలయ్యాడు. దీంతో కృష్ణాజిల్లాలో వేంగీ చాళుక్యుల పాలన ప్రారంభమైంది.

మాధవవర్మ తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుడు రాజుగా పీఠం ఎక్కాడు. ఈ వంశస్థుడైన రెండవ విజయాదిత్యుడు విజయవాడలో సమస్త భువనాశ్రయ శైవ దేవాలయాన్ని నిర్మించాడు. ఇది ఎంతో ప్రసిద్ధి పొందింది. క్రీ.శ. 12వ శతాబ్దం వచ్చేనాటికి కృష్ణా జిల్లాలో తూర్పు చాళుక్యుల పరిపాలన అంతమై వెలనాటి చోళుల పరిపాలన ప్రారంభమైంది. రాజమహేంద్రవరం రాజధానిగా వీరు పరిపాలన సాగించారు. ఈ వంశస్థుడైన రాజరాజ నరేంద్రుడి కాలంలోనే నన్నయభట్టారకుడు వ్యాసమహాభారతాన్ని తెలుగులోకి అనువాదం చేశాడు.

తదనంతర పరిణామాల నేపథ్యంలో రాజ్యంలో అరాచకాలు బాగా ప్రబలాయి. దీన్ని అవకాశంగా తీసుకుని చాగి వంశస్థులు జిల్లాలోని మరికొంతభాగాన్ని వశపరుచుకుని రాజ్యాన్ని పాలించారు. ఇది క్రీ.శ. 12వ శతాబ్దం చివరినాటికి కాకతీయుల వశమైంది. క్రీ.శ. 1323లో ఢిల్లీ సుల్తానులతో జరిగిన యుద్ధంలో కాకతీయుల రాజ్యం పతనమైంది. తర్వాతికాలంలో రెడ్డిరాజులు ఢిల్లీ సుల్తానులను పారద్రోలి స్వతంత్రరాజ్యాలను స్థాపించారు. దీంతో కృష్ణా జిల్లాలో రెడ్డిరాజుల పరిపాలన ప్రారంభమైంది. ఈ రాజ్యస్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి కొండపల్లిలో ఒక దుర్గాన్ని కట్టించాడు. ఈ రాజుల పరిపాలన కాలంలో తెలుగు భాషా సాహిత్యాలు బాగా ఆదరణ పొందాయి.

కవిసార్వభౌమ బిరుదాంకితుడైన శ్రీనాథుడు, సహజకవి బమ్మెర పోతనామాత్యుడు ఈ రాజుల కాలం నాటివారే. అనంతర కాలంలో గజపతులు కొండపల్లి దుర్గాన్ని ఆక్రమించారు. క్రీ.శ. 16వ శతాబ్దం వచ్చేసరికి శ్రీకృష్ణదేవరాయలు గజపతులను ఓడించి విజయవాడ, కొండపల్లి, శ్రీకాకుళం ప్రాంతాలను వశపరచుకున్నాడు. క్రీ.శ. 1565లో జరిగిన చారిత్రక తళ్ళికోట యుద్ధంలో విజయనగర సామ్రాజ్యం పతనమైంది. గోల్కొండ నవాబు కులీకుతుబ్‌షాకు, కొండపల్లి పాలకుడైన రామచంద్రగజపతికి పెనుగంచిప్రోలు వద్ద జరిగిన యుద్ధంలో కొండపల్లి దుర్గం కుతుబ్‌షా వశమైంది.

గోల్కొండ నవాబులు పరిపాలిస్తున్న కాలంలో ఇంగ్లిషువారు ఆంధ్రదేశంలో వ్యాపారం ప్రారంభించారు. తూర్పుఇండియా కంపెనీ 1611లో ప్రథమంగా మచిలీపట్నంలో ఫ్యాక్టరీని ప్రారంభించింది. తర్వాత 1614లో డచ్చివారు, 1669లో ఫ్రెంచివారు మచిలీపట్నంలో వ్యాపారాలు ప్రారంభించారు. ఔరంగజేబు గోల్కొండరాజ్యాన్ని ఆక్రమించినప్పుడు మచిలీపట్నంలోని ఇంగ్లిషువారి ఫ్యాక్టరీని ఆక్రమించుకున్నాడు. తర్వాత వారితో సంధి చేసుకుని వదిలేశాడు. దక్కన్ ప్రాంతాన్ని పరిపాలించడం కోసం ఔరంగజేబు నిజాం ఉల్ ముల్క్‌ను నియమించాడు. అయితే, అతడు 1748లో తనను తాను స్వతంత్రుడిగా ప్రకటించుకుని అసఫ్‌జా వంశాన్ని స్థాపించాడు.

ముల్క్ మరణానంతరం ముజఫర్‌జంగ్, నాజర్‌జంగ్‌ల మధ్య జరిగిన తగాదాల్లో నాజర్‌జంగ్ మచిలీపట్నంలోని ఫ్రెంచి ఫ్యాక్టరీని, ఉద్యోగులను బందీలుగా పట్టుకున్నాడు. ఇదేసమయంలో పాండిచ్చేరి నుంచి డూప్లే తన సైన్యాలను పంపించి ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకున్నాడు. దీంతో 1759లో మచిలీపట్నం కల్నల్‌ఫోర్డ్ చేతిలోకి వెళ్ళింది. సర్కారు పూర్తిగా ఇంగ్లిషు వారి వశం కావడంతో 1766లో తూర్పుఇండియా కంపెనీ సలహాసంఘం తన ప్రధాన కార్యాలయాన్ని మచిలీపట్నంలో ఏర్పాటుచేసింది. అనంతర పరిణామాల నేపథ్యంలో 1794లో మచిలీపట్నం కౌన్సిల్ రద్దుకావడంతో జిల్లాల పాలన కలెక్టర్ల చేతిలోకి వెళ్ళింది. క్రమంగా 1859 వచ్చేనాటికి రాజమండ్రి, మచిలీపట్నం, గుంటూరు జిల్లాలు కలిసి కృష్ణ, గోదావరి జిల్లాలు ఏర్పడ్డాయి. కృష్ణాజిల్లాకు మచిలీపట్నం కేంద్రస్థానంగా నిలిచింది. తిరిగి 1904లో కృష్ణాజిల్లా నుంచి గుంటూరు జిల్లాను విడదీసి పశ్చిమగోదావరి ప్రాంతాన్ని కృష్ణాజిల్లాలో కలిపారు. మళ్ళీ 1925లో కృష్ణాజిల్లాను కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలుగా విభజించారు. అప్పటినుంచి ఒకటి రెండు మార్పులు మినహా జిల్లా భౌగోళిక స్వరూపంలో ఎలాంటి మార్పు రాలేదు.

## 2.1.1 కృష్ణాజిల్లా సరిహద్దులు

జిల్లా అధికారిక వెబ్‌సైటు (http://krishna.ap.nic.in/zp-chairmam.html) ప్రకారం కృష్ణా జిల్లా భౌగోళిక సరిహద్దులు ఈవిధంగా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| అక్షాంశాలు | : ఉత్తరాన 150043' మరియు దక్షిణాన 170010' | |
| రేఖాంశాలు | : తూర్పున 80000' మరియు పశ్చిమాన 810033' | |
| విస్తీర్ణం | : 8,727 చ.కిమీ. | |
| తీరప్రాంతం | : 88 కి.మీ. | |
| సరిహద్దులు | : | |
| | తూర్పు | : పశ్చిమగోదావరి జిల్లా |
| | పశ్చిమం | : గుంటూరు, నల్గొండ జిల్లాలు |
| | ఉత్తరం | : ఖమ్మం జిల్లా |
| | దక్షిణం | : బంగాళాఖాతం |
| | జిల్లా ప్రధానకేంద్రం | : మచిలీపట్నం |
| | వ్యాపారకేంద్రం | : విజయవాడ (రాష్ట్రంలో మూడో పెద్దనగరం) |

ఈ హద్దులతో ఉన్న కృష్ణాజిల్లా భౌగోళిక ప్రాంతాన్ని సూచించే చిత్రపటాలను పుట సంఖ్య 40, 41, 42 మరియు 43లలో ఇవ్వడమైనది.

## పటం 1 : ఆంధ్రప్రదేశ్‌పటంలో కృష్ణాజిల్లా



# పటం 2 : కృష్ణాజిల్లా భౌగోళిక స్వరూపం



## పటం 3 : కృష్ణాజిల్లా భౌగోళిక స్వరూపం–అసెంబ్లీ నియోజక వర్గాల వారీగా



## పటం 4 : కృష్ణాజిల్లా భౌగోళిక స్వరూపం - మండలాల వారీగా

District Map



1. JAGGAYYAPETA
2. VATSAVAI
3. PENUGANCHIPROLU
4. NANDIGAMA
5. CHANDARLAPADU
6. KANCHIKA CHERLA
7. VEERULLAPADU
8. IBRAHIMPATNAM
9. G KONDURU
10. MYLAVARAM
11. A KONDURU
12. GAMPALAGUDEM
13. TIRUVURU
14. VISSANNAPET
15. REDDIGUDEM
16. VIJAYAWADA RURAL
17. VIJAYAWADA URBAN
18. PENAMALURU
19. THOTLAVALLURU
20. KANKIPADU
21. GANNAVARAM
22. AGIRIPALLE
23. NUZVID
24. CHATRAI
25. MUSUNURU
26. BAPULAPADU
27. UNGUTURU
28. VUYYURU
29. PAMIDIMUKKALA
30. MOVVA
31. GHANTASALA
32. CHALLAPALLI
33. MOPIDEVI
34. AVANIGADDA
35. NAGAYALANKA
36. KODURU
37. MACHILIPATNAM
38. GUDUR
39. PAMARRU
40. PEDAPARUPUDI
41. NANDIVADA
42. GUDIVADA
43. GUDLAVALLERU
44. PEDANA
45. BANTUMILLI
46. MUDINAPALLI
47. MANDAVALLI
48. KAIKALUR
49. KALIDINDI
50. KRUTHIVENNU

## 2.2 కృష్ణాజిల్లాలో గ్రంథాలయోద్యమం

పూర్తిగా ప్రజల భాగస్వామ్యంతో, వారి సామూహికశక్తిని సమీకరించి వ్యవస్థాగతమైన మార్పుకోసం దీర్ఘకాలం సాగిన ఉద్యమాల్లో ప్రముఖమైనదిగా రాష్ట్రంలో సాగిన గ్రంథాలయోద్యమం చరిత్ర ప్రసిద్ధి పొందింది. గ్రంథాలయ పితామహుడు అయ్యంకి వేంకటరమణయ్య చెప్పినట్లు ప్రజాహృదయాల నుంచి ఈ ఉద్యమం 'స్వయంభువు'గా వెలుగులోకి వచ్చింది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో తెలుగుజాతి జీవితాన్ని ప్రభావితం చేయడంతో పాటు ఓ మహత్తరశక్తిగా ఆది అవతరించింది. తెలుగునాట వెలసిన అనేక ఉద్యమాలు కాలగర్భంలో కలిసిపోగా నేటికీ నిలిచి ఉండి, ప్రజాహితమే పరమావధిగా పనిచేస్తున్న ఏకైక ఉద్యమం ఇది.

పంతొమ్మిదో శతాబ్దం చివరిభాగం నాటికి ఆంధ్రరాష్ట్రంలో గ్రంథాలయాలు ఏర్పడినట్లు తెలుస్తోంది. అయితే ఏయే ప్రాంతాల్లో ఇవి ఏర్పడ్డాయో తెలుసుకునేందుకు ఖచ్చితమైన ఆధారాలు మాత్రం లభించలేదు. ప్రభుత్వాలకు చిత్తశుద్ధి కొరవడిన కారణంగా ప్రజలే తమకు తాముగా ముందుకువచ్చి గ్రంథాలయాలు ఏర్పాటుచేసుకున్నారు. ఈకారణంగా ఏవిధమైన రికార్డులు దొరకడంలేదు.

అందుబాటులో ఉన్న సమాచారం ఆధారంగా 1886లో విశాఖపట్నం వాస్తవ్యుడైన మంతెన ఆదినారాయణమూర్తి స్థాపించిన సరస్వతీగ్రంథాలయం ఆంధ్రరాష్ట్రంలోనే మొదటి పౌరగ్రంథాలయంగా చరిత్రకారులు నిర్ణయించారు. అయితే దీనికన్నా ముందుగా 1839లో బ్రిటీషు న్యాయమూర్తి జేమ్స్‌థామస్ (James Thomas) రాజమండ్రిలో ఒక పఠనమందిరాన్ని (Reading Room) నిర్మించాడని, ఇక్కడకు రోజుకు సుమారు 100 మంది పాఠకులు వచ్చేవారని పాతూరి నాగభూషణం తన *ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం (1839-1950)* వ్యాసంలో (*ఆంధ్రప్రదేశ్ దర్శిని*, సెప్టెంబరు 2007, పుట 253) రాశారు. ఈ రెండిటి ఆధారంగా తెలుగువారు స్థాపించిన తొలి గ్రంథాలయంగా సరస్వతీగ్రంథాలయాన్ని చెప్పుకోవచ్చు. ఈ రెండు గ్రంథాలయాల తర్వాత 19వ శతాబ్దకాలంలోనే పులివెందుల (కడప జిల్లా), ఒంగోలు, విజయనగరం, ఉండి, కుముదపల్లి (పశ్చిమగోదావరిజిల్లా), రాజమండ్రి తదితర ప్రాంతాల్లో గ్రంథాలయాలు ఏర్పాటయ్యాయి. ఇవన్నీ ఆయా వ్యవస్థాపకులు లేదా ప్రజల ప్రోత్సాహం, సహకారంతో నడిచినవే. ప్రభుత్వం నుంచి ఏవిధమైన సహకారమూ వీటికి లభించలేదు.

క్రీ.శ. 20వ శతాబ్దం ప్రారంభకాలం నాటికి హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం (1901); ఏలూరులో హిందూ యువజన సమాజ గ్రంథాలయం (1904); హనుమకొండలో రాజరాజనరేంద్ర ఆంధ్రభాషా నిలయం; వరంగల్లులో శబ్దశాసన ఆంధ్ర గ్రంథాలయం; తెనాలి తాలూకా పెదపాలెం గ్రామంలో ఆర్యబాల సమాజం ఏర్పడ్డాయి. పాతూరి నాగభూషణం *ఆంధ్రప్రదేశ్‌దర్శిని* (2007:253)లో రాసిన *ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం (1839–1950)* వ్యాసం ప్రకారం 20వ శతాబ్దం తొలిరోజుల్లో రాష్ట్రంలో 21 గ్రంథాలయాలు (అధికారిక లెక్కల ప్రకారం) మాత్రమే ఉన్నాయి.

ఇదే సమయంలో కందుకూరి వీరేశలింగంపంతులు నాయకత్వంలో సంఘ సంస్కరణ ఉద్యమం ప్రారంభమైంది. బెంగాల్ విభజనతో విజృంభించిన వందేమాతరోద్యమం ఆంధ్రదేశంలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. ప్రజల్లో మాతృభాషపై మమకారం పెరుగుతుండడంతో తెలుగులో పుస్తకాలు, పత్రికల ముద్రణ విరివిగా జరగడం మొదలైంది. పుస్తక ప్రచురణ ఊపందుకోవడంతో గ్రంథాలయాల సంఖ్య కూడా పెరిగింది. ఈ క్రమంలో రాష్ట్రంలోనే పేరుపొందిన శ్రీరామమోహన ధర్మపుస్తక భాండాగారం 1910లో విజయవాడలో మొదలైంది. ఇలా 1913 వచ్చేసరికి సుమారు 123 గ్రంథాలయాలు రాష్ట్రంలో ఏర్పాటయ్యాయి.

గ్రంథాలయోద్యమంలో ప్రముఖపాత్ర పోషిస్తున్న అయ్యంకి వేంకటరమణయ్య, సూరి వేంకట నరసింహశాస్త్రి 1914లో ఆంధ్రరాష్ట్రంలోని గ్రంథాలయ నిర్వాహకులందరితో సమావేశం ఏర్పాటుచేయాలని సంకల్పించి, ఇందుకు ప్రయత్నాలు ప్రారంభించారు. ఫలితంగా 10.04.1914న విజయవాడలో తొలిసారిగా గ్రంథాలయ నిర్వాహకుల సమావేశం జరిగింది. గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలు, హైదరాబాదు సంస్థానాల్లోని 60 గ్రంథాలయాల నుంచి 200 మంది ప్రతినిధులు ఈ సమావేశానికి హాజరయ్యారు. 'కవిశేఖర' చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు ఈ సభకు అధ్యక్షత వహించారు. వీరంతా కలిసి 'ఆంధ్రదేశ గ్రంథ భాండాగార సంఘం' పేరుతో ఒక సంస్థను ఏర్పాటుచేశారు. దీనికి మోచర్ల రామచంద్రరావు అధ్యక్షుడిగా, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు, సూరి వెంకట నరసింహశాస్త్రి ఉపాధ్యక్షుడుగా, అయ్యంకి వేంకటరమణయ్య, నాళం కృష్ణారావు కార్యదర్శులుగా ఎన్నికయ్యారు. ఈసంఘాన్ని స్థాపించడంతో రాష్ట్రంలో గ్రంథాలయోద్యమానికి చక్కని చేయూత లభించింది.

అనంతరకాలంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు ఈ ఉద్యమ వ్యాప్తికి క్రియాశీలకంగా పనిచేశారు. తాను స్వయంగా ఆంధ్ర గ్రంథమాలను స్థాపించి ఎన్నో ఉత్తమ గ్రంథాలను ప్రచురించారు. భారతి పత్రికను ప్రచురించడంతోపాటు తన పత్రికలు, పుస్తకాలను తగ్గింపు ధరలకు, ఒక్కోసారి ఉచితంగా కూడా గ్రంథాలయాలకు సరఫరా చేసేవారు. దీంతోపాటు స్వయంగా ఎన్నో గ్రంథాలయాలను సందర్శించి, అక్కడ వివిధ కార్యక్రమాలు నిర్వహించేవారు. గిడుగు వెంకట రామ్మూర్తి పంతులు ప్రారంభించిన వ్యావహారిక భాషోద్యమం కూడా గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ఎంతగానో దోహదం చేసింది.

పుస్తకాలు, పత్రికల ప్రచురణ ఎక్కువగా జరుగుతుండడంతో గ్రంథాలయాలు కూడా ఎక్కువ సంఖ్యలో ఏర్పడడం ప్రారంభమైంది. తిరిగి ఈ గ్రంథాలయాలు ఎన్నో ఉద్యమాలకు బాసటగా నిలవడం కూడా గ్రంథాలయోద్యమంలో ఓ విశిష్ఠతగా నిలిచింది. హోం రూల్ ఉద్యమం, సహాయనిరాకరణ, సత్యాగ్రహం, సాంఘికసేవా దృక్పథం గ్రంథాలయాల ద్వారా ప్రజల్లో పెరిగాయి.

## 2.2.1 తెలంగాణలో గ్రంథాలయోద్యమం

కృష్ణాజిల్లా విజయవాడలో 1914లో జరిగిన ప్రథమ గ్రంథాలయ మహాసభకు హైదరాబాదు సంస్థానం నుంచి ప్రతినిధులు హాజరయ్యారు. ఈవిధంగా తెలంగాణ ప్రాంతం ఆదినుంచి గ్రంథాలయోద్యమంలో భాగం పంచుకుంటూనే ఉంది. మాడపాటి హనుమంతరావు తెలంగాణ ప్రాంతంలో ఈ ఉద్యమానికి మూలపురుషుడిగా నిలిచారు. ఇదిలా ఉండగా, 1901లో రావిచెట్టు రంగారావు దంపతుల కృషితో హైదరాబాదులో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం పేరుతో గ్రంథాలయం ఏర్పాటైంది. క్రమంగా వరంగల్లు, సికింద్రాబాదు, ఖమ్మం, ఎర్రుపాలెం, నల్గొండ, సూర్యాపేట ప్రాంతాల్లో గ్రంథాలయాలు వెలిశాయి.

ఇవన్నీ నాటి తెలంగాణ యువకుల్లో భాషాభిమానాన్ని, దేశాభిమానాన్ని రేకెత్తించడమే కాకుండా వారిలో నూతన ఆలోచనా దృక్పథం ఏర్పడడానికి బీజం వేశాయి. తొలుత ప్రభుత్వోద్యోగులు, న్యాయవాదులు, ఉపాధ్యాయలను మాత్రమే ఆకర్షించిన ఈ ఉద్యమ స్వరూపంలో 1917 వచ్చేసరికి కొన్ని మార్పులు చోటుచేసుకున్నాయి. ఫలితంగా వర్తకులు కూడా ఈ ఉద్యమంవైపు దృష్టి సారించడం ప్రారంభించారు.

క్రమంగా 1925 నాటికి తెలంగాణ ప్రాంతంలో దాదాపు 100 వరకు గ్రంథాలయాలు ఏర్పడ్డాయి. ఇదిలా ఉండగా, నాటి నిజాం ప్రభుత్వం దమననీతి ప్రయోగించి ఉద్యమాన్ని అణగదొక్కాలని ప్రయత్నించింది. ఎన్నో నిర్బంధాల నడుమ కార్యకర్తలు ఉద్యమాన్నిసాగించారు. తదనంతర రాజకీయ పరిణామాల ఫలితంగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాయల సంఘం ఏర్పాటై, నేటికీ కార్యక్రమాలు కొనసాగిస్తోంది.

### 2.2.2 గ్రంథాలయ సంఘం - కార్యకలాపాలు

విజయవాడలో 1914లో ఏర్పాటైన ఆంధ్రప్రదేశ్ గ్రంథ భాండాగార సంఘం తన కార్యక్రమాలను విస్తృతపరచుకుంటూ ఉద్యమవ్యాప్తికి విశేషంగా కృషి చేసింది. కొంతకాలానికి దీనిపేరు 'ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం'గా మార్చారు. పేరు మారినప్పటికీ ఉద్యమస్ఫూర్తిలో ఏమాత్రం మార్పురాలేదు. సంఘం ఆధ్వర్యంలో సుమారుగా 35కు పైగా మహాసభలు జరిగాయి. సంఘం ఆధ్వర్యంలో 1915లో *గ్రంథాలయ సర్వస్వం* అనే త్రైమాసిక పత్రిక వెలువడింది. 1939-1941 మధ్యకాలంలో ప్రచురణ నిలిచినప్పటికీ, తిరిగి మాసపత్రికగా రూపుమార్చుకుని నేటికీ వెలువడుతోంది. ఈ పత్రికతోపాటు మహాసభల ప్రత్యేక సంచికలు, పలువురు ప్రముఖ రచయితల పుస్తకాలను సంఘం ప్రచురించింది. కేవలం పుస్తక ప్రచురణతో సరిపెట్టుకోకుండా 1920లో తొలిసారిగా 20మంది గ్రంథాలయ సేవకులకు శిక్షణ కార్యక్రమాలు నిర్వహించింది. నేటికీ నిర్ణీతకాలాల్లో ఈ శిక్షణ జరుగుతూనే ఉంది. ఇదిలా ఉండగా, గ్రంథాలయ ఉద్యమాన్ని ప్రచారం చేయడానికి అయ్యంకి వేంకటరమణయ్య గ్రంథాలయ ప్రచారయాత్రలకు శ్రీకారం చుట్టారు. ఇందులోభాగంగా ఎంచుకున్న గ్రామాల్లో ప్రసంగాలు, చైతన్యకార్యక్రమాలు నిర్వహించారు. కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాల్లో ఈ యాత్రలు చక్కటి ఫలితాలనిచ్చాయి.

## 2.3 కృష్ణాజిల్లాలో ప్రముఖ పత్రికా సంపాదకులు

తెలుగు పత్రికారంగానికి దశ, దిశ నిర్దేశం చేసిన కృష్ణాజిల్లాలో ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు వంటి ఉత్తమశ్రేణి పత్రికా సంపాదకులెందరో జన్మించారు. ఇక్కడ జన్మించకపోయినా వృత్తిరీత్యా ఇక్కడ పనిచేసి పత్రికా సంపాదకులుగా ఖ్యాతి గడించినవారూ ఉన్నారు. నార్ల వెంకటేశ్వరరావు, సి.రాఘవాచారి వంటి ఉద్దండులు ఈ కోవకు చెందుతారు. వీరిలో కొందరి జీవిత విశేషాలను రేఖామాత్రంగా ఈ అధ్యాయంలో చర్చించడం జరిగింది.

## 2.3.1 కాశీనాథుని నాగేశ్వరరావు

దినపత్రికకు కావ్యగౌరవాన్ని సాధించిపెట్టిన మహోన్నత వ్యక్తిగా కాశీనాథుని నాగేశ్వరరావు జీవితం జగత్ప్రసిద్ధి పొందింది. పారిశ్రామికవేత్తగా, పత్రికా సంపాదకుడిగా, కళాపోషకుడిగా విభిన్నమైన ప్రవృత్తులను ఏకకాలంలో సమన్వయపరుచుకుంటూ, ఒకరంగం ద్వారా మరొక రంగాన్ని సుస్థిరం చేసిన అసమాన ప్రతిభాశాలి ఆయన. యావదాస్తిని దేశప్రజల సుఖసంతోషాల కోసం, వారిలో చైతన్యాన్ని ఉద్దీపనం చేయడం కోసం వెచ్చించి, 'విశ్వదాత'గా, 'దేశోద్ధారకుడి'గా చరిత్రలో నిలిచిపోయారు.

కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామంలో 1867, మే ఒకటో తేదీన నాగేశ్వరరావు జన్మించారు. సనాతన సంప్రదాయ పరాయణులైన కాశీనాథుని బుచ్చయ్య, శ్యామలాంబ వీరి తల్లిదండ్రులు. స్వగ్రామంలో ప్రాథమిక విద్యాభ్యాసం, తర్వాత బందరు హిందూ హైస్కూల్, మద్రాసు క్రైస్తవ కళాశాలల్లో ఉన్నత విద్యాభ్యాసం చేశారు. బి.ఎ. చదువుతున్న రోజుల్లోనే (1890) ప్రఖ్యాత వ్యాపారవేత్త రెంటాల సుబ్బారావుగారి మేనకోడలు రమాబాయితో వివాహం చేశారు. పాఠశాల చదివే రోజుల నుంచే నాగేశ్వరరావుకు నాటకాలంటే తగనిమోజు ఉండేది. బందరులో ఏర్పడిన నాటక సంఘాల్లో చేరి, నాటకాలు వేస్తుండేవారు.

వివాహమై, సుబ్బారావుగారితో పరిచయం పెరిగిన తర్వాత నాగేశ్వరరావులో వ్యాపారంపై మక్కువ పెరిగింది. ఆయనతోపాటే మద్రాసులో కొంతకాలం వ్యాపారం చేశారు. అయితే స్వతంత్రంగా ఎదగాలనే కోరికతో స్వగ్రామమైన ఎలకుర్రుకు తిరిగివచ్చారు. తండ్రి గతించడంతో కుటుంబ బాధ్యతలు నాగేశ్వరరావుపై పడ్డాయి. ఈ క్రమంలో పిత్రార్జితం తరిగి, ఆస్తులు తాకట్టు పెట్టాల్సివచ్చింది.

ఈ పరిస్థితుల్లో సంపాదన కోసం నాగేశ్వరరావుగారు కలకత్తాలోని 'బౌమెన్ అండ్ కంపెనీ'లో మేనేజరుగా కొంతకాలం పనిచేసి, అక్కడ నుంచి బొంబాయిలోని 'విలియం అండ్ కో'కు మారారు. నాగేశ్వరరావుగారి నిజాయితీ నచ్చడంతో కంపెనీ యజమాని ఆయన్ను ఎంతో ఆదరించాడు. తాను స్వదేశానికి తిరిగివెళ్ళే సమయంలో కంపెనీని పూర్తిగా నాగేశ్వరరావుకి అప్పగించి వెళ్ళాడు.

చిన్ననాటి నుంచి ఉన్న వ్యాపారాభిలాషను నేర్పుతో తీర్చిదిద్దుకునేందుకు ఈ అవకాశం ఎంతగానో ఆయనకు ఉపయోగపడింది. నిజాయితీగా వ్యాపారం చేస్తూనే ఔషధాలు తయారుచేసే సిద్ధాంతాలపై ఆయన పరిశోధన చేశారు. ఫలితంగా 'అమృతాంజనం' తయారైంది.

ఆ తర్వాత 1899లో వ్యాపారాన్ని యజమానికి తిరిగి ఇచ్చి, తాను స్వయంగా అమృతాంజనం వ్యాపారం ప్రారంభించారు. భార్యాభర్తలు ఇద్దరే వ్యాపారానికి కావలసిన అన్నిపనులు చేసుకునేవారు. ఈ సమయంలోనే బొంబాయిలో ఉండే ఆంధ్రులతో నాగేశ్వరరావు సన్నిహితంగా మెలుగుతూ వారిలో ఐకమత్యాన్ని ప్రోదిచేశారు. తనకున్నంతలోనే ఆపన్నులను ఆదుకుంటూ అందరికీ తలలో నాలుకలా నిలిచారు. దీంతో ఆయన ప్రతిభావైశిష్ట్యాలు క్రమంగా విస్తరించసాగాయి.

### 2.3.1.1 ఆంధ్రపత్రిక ఆవిర్భావం

సూరత్‌లో 1907లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశంలో నాగేశ్వరరావు పాల్గొన్నారు. తెలుగువారి కోసం తెలుగులో పత్రికలు నడపాల్సిన అవసరాన్ని ఈ సమావేశాల్లో ఆయన గుర్తించారు. వెంటనే ఇందుకు తగిన ప్రణాళికలు రూపొందించడం ప్రారంభించారు. కానీ, నాటి బ్రిటీష్ ప్రభుత్వం అప్పటికే దేశంలో విస్తరిస్తున్న ప్రాంతీయ పత్రికలపై ఎంతో కఠినంగా వ్యవహరించేది. అకుంఠిత దీక్ష, మొక్కవోని పట్టుదల ఉన్న నాగేశ్వరరావు వీటిని లెక్కచేయలేదు.

బొంబాయి నుంచి 1908లో *ఆంధ్రపత్రిక* పేరుతో వారపత్రికను ప్రారంభించారు. రావడంతోనే ఈ పత్రిక ప్రజల్లో కొత్త ఉత్సాహాన్ని తీసుకువచ్చింది. ఇందులో నాగేశ్వరరావు రాసిన వ్యాసాలు ఆయనకు సమకాలీన చరిత్రపై ఉన్న అవగాహనను, సామాజిక చేతనా దృక్పథాన్ని తేటతెల్లం చేసేవి.

మొదటి ప్రపంచయుద్ధం (1914) ప్రారంభమైనప్పుడు దేశంలో మారుతున్న రాజకీయ, సామాజిక పరిస్థితులను తెలుగువారికి అందించాలనే సంకల్పంతో ఆంధ్రపత్రికను దినపత్రికగా మార్పుచేశారు. ఈ పత్రిక తొలి సంచిక 1914 ఏప్రిల్ ఒకటోతేదీన మద్రాసు నుంచి విడుదలైంది. అచిరకాలంలోనే ఈ పత్రిక తెలుగు ప్రజాహృదయాలతో విడదీయరాని బంధాన్ని ఏర్పరచుకుంది.

ఆంధ్రపత్రిక చేస్తున్న విజయవిహారం అందించిన స్ఫూర్తితో 1924లో *భారతి* పేరుతో సాహిత్య మాసపత్రికను నాగేశ్వరరావు ప్రారంభించారు. తెలుగు భాషా సాహిత్య చరిత్రలో భారతి ఓ సువర్ణాధ్యాయంగా ఓ ప్రభంజనాన్ని సృష్టించింది. అంతేకాదు, ఉగాది ప్రత్యేక సంచికల పేరుతో భారతి పత్రికా రంగంలో నూతన ఒరవడికి శ్రీకారం చుట్టింది. వెలుగులోకి రాని ఎన్నో విలువైన గ్రంథాలను తన పత్రికల ద్వారా నాగేశ్వరరావు వెలుగులోకి తీసుకువచ్చారు. ఈవిధంగా పత్రికల ద్వారా తెలుగు సాహిత్యానికి ఆయన చేసిన సేవ మాటల్లో వర్ణించలేనిది. అలాగే, 1926లో ఆంధ్రగ్రంథమాల పేరుతో పుస్తక ప్రచురణ సంస్థ నెలకొల్పారు. దీనిపక్షాన అమూల్య రత్నాలనదగిన ఎన్నో పుస్తకాలను ప్రచురించడంతో పాటు వాటిని తక్కువ ధరకు గ్రంథాలయాలకు ఇచ్చేవారు. ఒక్కోసారి ఉచితంగా ఇచ్చిన సందర్భాలూ ఉన్నాయి.

### 2.3.1.2 ఉద్యమాల బాట

ఆంధ్రపత్రిక, భారతి పత్రికల ప్రారంభమే తెలుగునాట ఓ సరికొత్త ఉద్యమానికి ఊపిరిపోసింది. దీంతోపాటు ప్రత్యక్షంగా ఎన్నో ఉద్యమాల్లో నాగేశ్వరరావు పాల్గొన్నారు. ఉప్పుసత్యాగ్రహం, తెలుగునాట గ్రంథాలయోద్యమం, ఖద్దరు ఉద్యమం, ఆంధ్రోద్యమం... ఇలా ఎన్నో ఉద్యమాల్లో ఆయన క్రియాశీలకపాత్ర పోషించారు. మద్రాసు ప్రెసిడెన్సీ నుంచి ఆంధ్రరాష్ట్రాన్ని విభజించాలనే ఉద్యమానికి ఆదినుంచీ నాగేశ్వరరావు నాయకులుగా ఉన్నారు. ఉప్పు సత్యాగ్రమం సందర్భంలో ఏడాదిపాటు ప్రభుత్వం ఆయన్ను జైలులో ఉంచింది. ఈకాలంలో *భగవద్గీత*కు ఆయన రాసిన వ్యాఖ్యానం సార్వకాలిక సందేశం ఇచ్చిందంటూ విమర్శకుల ప్రశంసలు పొందింది. అంతేకాదు 1924–34 మధ్యకాలంలో నాలుగుసార్లు ప్రాంతీయ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడిగా కూడా ఆయన పనిచేశారు. మద్రాసులో నాగేశ్వరరావు నివాసమైన 'శ్రీబాగ్'లోనే చారిత్రాత్మక 'శ్రీబాగ్ ఒప్పందం' కుదిరింది. ఆయన మాటంటే ప్రజల్లో విపరీతమైన నమ్మకం ఉండేది.

### 2.3.1.3 దేశోద్ధారకుడు, విశ్వదాత

పత్రికలు, అమృతాంజనం సంస్థల ద్వారా తాను సంపాదించిన యావదాస్తిని నాగేశ్వరరావు తిరిగి ప్రజాసేవకే వెచ్చించారు. ఆయన ఇల్లు నిత్యం కళకళలాడుతూ ఉండేది. ఎంతోమంది బీదలు ఆయన చల్లనిచేతుల మీదుగా సహాయం అందుకునేవారు.

కళాకారులు, సాహితీవేత్తలు, దేశభక్తులు... ఒకరేమిటి ఆయన ఇంటికి వచ్చినవారెవరూ వట్టి చేతులతో తిరిగి వెళ్ళేవారుకారు. విజయవాడలో 1921లో జరిగిన కాంగ్రెస్ సభలకు వచ్చిన ప్రజలు సరైన వసతుల్లేక అల్లాడుతుంటే ఆయన చలించిపోయారు. జీర్ణావస్థలో ఉన్న చల్లపల్లిరాజావారి మేడను కొనుగోలు చేసి, అక్కడ 'దుర్గావిలాస'మనే పేరుతో చక్కటి వసతిగృహాన్ని నిర్మించారు.

అలాగే, చిన్ననాటి నుంచి ఆయన అమితంగా అభిమానించిన నాటకరంగం కోసం విజయవాడలో 'దుర్గాకళామందిరం' పేరుతో నాటకశాల నిర్మించారు. ఇందుకోసం 1929లో ఆయన లక్షా ఇరవైవేల రూపాయలు ఖర్చు చేశారంటే ఆశ్చర్యం కలుగకమానదు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో జరిగిన వందలాది సభలకు వచ్చిన అశేష ప్రజానీకం ఆయన ఆతిథ్యం తీసుకున్నవారే.

దానం అనే పదానికి అర్థాన్ని తన ఆచరణ ద్వారా ప్రపంచానికి చాటిచెప్పిన నాగేశ్వరరావు దాతృత్వానికి అబ్బురపడిన మహాత్మాగాంధీ ఆయన్ను 'విశ్వదాత'గా అభివర్ణించారు. అశేష ప్రజానీకం 'దేశోద్ధారకుడి'గా బ్రహ్మరథం పట్టారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' పట్టం ఇచ్చి తన స్థాయిని పెంచుకుంది. కర్ణ, శిబి చక్రవర్తులతో పోల్చదగిన ఏకైకవ్యక్తిగా నీరాజనాలందుకున్న నాగేశ్వరరావు 1938, ఏప్రిల్ 11న శివైక్యం చెందారు.

### 2.3.2 ముట్నూరి కృష్ణారావు

మేటి వచన రచనకు ఒరవడి దిద్దిన మహనీయుడిగా, అకుంఠిత దేశభక్తుడిగా, అసమాన ప్రతిభా సమన్వితుడైన పత్రికా సంపాదకుడిగా ముట్నూరి కృష్ణారావు గడించిన గౌరవమర్యాదలు అనన్యసామాన్యమైనవి. తెలుగు పత్రికా రంగంలో ఆయనది పరమపూజ్యస్థానం. ఆంధ్రుల ప్రథమ రాజధానిగా ప్రసిద్ధి పొందిన శ్రీకాకుళం సమీపంలోని 'ముట్నూరు' కృష్ణారావు స్వగ్రామం. కాలక్రమంలో ఆ ఊరిపేరే వారిఇంటిపేరుగా మారింది. కృష్ణారావుగారి తండ్రి నాగభూషణం కృష్ణాజిల్లా మునసబుగా చేసేవారు. మచిలీపట్నంలోని గొడుగుపేటలో నివసించేవారు. కృష్ణారావు అక్కడే 1879లో జన్మించారు. పుట్టగానే తల్లిని, ఆరేళ్ళ వయసులో తండ్రిన కోల్పోయారు. పినతండ్రి రామస్వామి, ముత్తమ్మ కొండూరి సుబ్బమ్మ ఆయన్ను పెంచి పెద్దచేశారు. అందరిలాగా ఆయన బాల్యం గడవలేదు. అందం, అతిశయం, తెలుగుదనం, నాయకత్వం, భావుకత్వం.. వీటన్నిటినీ తనతోపాటు పెంచుకుంటూ పెరిగారు.

బందరు హిందూ హైస్కూల్, ఆ తర్వాత నోబుల్ కళాశాలల్లో విద్యాభ్యాసం గడిచింది. కళాశాలలో రఘుపతి వేంకటరత్నం నాయుడు శిష్యరికం కృష్ణారావు జీవితంలో ఓ మలుపు తీసుకువచ్చింది. భోగరాజు పట్టాభిసీతారామయ్య ఇక్కడ ఆయనకు సహాధ్యాయి. తర్వాత మద్రాసు క్రిస్టియన్ కళాశాల నుంచి బి.ఎ. పూర్తిచేశారు. తర్వాత 1903లో బందరుకు తిరిగి రావడంతోనే కృష్ణాక్లబ్‌లో సభ్యులుగా చేరారు. ఆ వెంటనే కృష్ణాపత్రికలో సహాయ సంపాదకుడిగా బాధ్యతలు చేపట్టారు.

కొంతకాలానికి దేశమంతటా స్వదేశీ ఉద్యమం ఊపందుకుంది. ఈ దశలో 1905లో జరిగిన వంగరాష్ట్ర విభజన ఫలితంగా ఉద్భూతమైన జాతీయోద్యమం, వందేమాతర నినాదాలతో కృష్ణారావు స్ఫూర్తిపొందారు. వెంటనే ఉపసంపాదకుడి పదవి వదలి, వంగరాష్ట్రానికి చేరుకుని, బిపిన్‌చంద్రపాల్ శిష్యరికం చేశారు. ఆయనతో కలిసి వంగరాష్ట్రమంతటా పర్యటించి స్వదేశీ ఉద్యమాన్ని తీవ్రతరం చేశారు. కొంతకాలానికి ఇనుమడించిన జాతీయభావం, రెట్టించిన స్వాతంత్ర్యదీక్ష తన వెంట తీసుకుని బందరు చేరుకున్నారు. తిరిగి 1906లో కృష్ణాపత్రిక సంపాదకత్వ బాధ్యతలు చేపట్టారు.

నాటినుంచి స్వదేశీ ఉద్యమానికి అక్షరరూపంగా తన పత్రికను తీర్చిదిద్దారు కృష్ణారావు. సంపాదకుడిగా బాధ్యతలు స్వీకరించగానే తన పత్రికను ముద్రించే యంత్రశాలకు 'కృష్ణా స్వదేశీ ముద్రాక్షరశాల'గా నామకరణం చేశారు. తన భార్య అచ్చాయమ్మ పేరును రుక్మిణిగా మార్చారు. ఇలా ఆయన పేరు కృష్ణారావు, పత్రిక – కృష్ణాపత్రిక, ప్రదేశం – కృష్ణాతీరం, మొదటగా చేరింది – కృష్ణాక్లబ్‌లో, ప్రెస్ పేరు – కృష్ణా స్వదేశీ ముద్రాక్షరశాల. ఇవన్నీ ఆయనకు 'కృష్ణ' శబ్దంతో ఉన్న అనుబంధాన్ని తెలియజేస్తున్నాయి.

అంతేకాదు... కృష్ణాపత్రిక విషయం వచ్చినప్పుడల్లా 'పత్రికకు పేరు పెట్టే సమయంలో నేనుంటే కృష్ణవేణి అని పెట్టేవాడిని' అంటుండేవారు. కృష్ణారావు సంపాదకత్వంలో కృష్ణాపత్రిక ప్రత్యేక ప్రాభవాన్ని సంతరించుకుంది. కొత్తసొగసులు దిద్దుకుంది. పత్రికకు సంబంధించిన ప్రతి అంశంలోనూ పరుచుకున్న నిండుదనం ప్రజాహృదయాల్లో కృష్ణాపత్రికకు విశిష్టస్థానం తెచ్చిపెట్టింది. కలాన్ని ఆయుధంగా చేసుకుని కాలాన్ని తీర్చిదిద్దిన ఘనత ఆయనకు దక్కింది. అందుకే విమర్శకులు సైతం ఆయన కలాన్ని వెండికలంగా అభివర్ణించారు.

## 2.3.2.1 ఉన్నత వ్యక్తిత్వం, నిరాడంబరత

రూపంతోపాటు వచ్చిన హుందాతనం, దానివెంట నిరాడంబరత కృష్ణారావులో ఎక్కువగా కనిపించేవి. ఒక ఉత్తమ పత్రికకు సంపాదకుడనన్న అహంకారం కానీ, కనీసం ఆ ఛాయలుగానీ ఆయనలో కనిపించేవి కావు. అతి సామాన్యమైన వ్యక్తిగా కనిపించేవారు. ఎక్కువగా మౌనంగా ఉండేవారు. అందుకే ఆయన్ను అందరూ మౌనమూర్తిగా 'మౌనముద్రాలంకారుల'నే బిరుదుపేరుతో పిలిచేవారు. ఈ మౌనాన్ని అహంకారం అనుకుని పొరపాటున విపరీత వ్యాఖ్యానాలు చేసినవాళ్ళూ ఉన్నారు. కృష్ణారావు రెండుపూటలా నియమం తప్పకుండా కార్యాలయానికి వచ్చేవారు. తన కార్యాలయంలో, ప్రింటింగ్ ప్రెస్‌లో పనిచేసే ఉద్యోగులందరితో ఎల్లప్పుడూ ఓ సహోద్యోగిగానే ప్రవర్తించేవారు. ఏ ఒక్క ఉద్యోగినీ మందలించడం గానీ, ఫలానా పని చేయమని ఆదేశించడం గానీ జరిగేది కాదు. అక్కడివారు కూడా ఓ దేవాలయంలో ఉన్నట్లు భావించి, తమ ధర్మాలను తెలుసుకుని ఆచరించేవారు. *ది హిందూ* పత్రికను క్రమం తప్పకుండా రోజూ ఆసాంతం చదివేవారు. ఆఫీసు వదిలి ఇంటికి వెళ్ళేటప్పుడు కూడా ఆ పత్రికను వెంట తీసుకువెళ్ళేవారు.

రాజకీయాలపై కృష్ణారావుకి ఆసక్తి తక్కువనే చెప్పాలి. వ్యక్తిగతంగా కాంగ్రెస్ పార్టీలో చేరడానికి ఇష్టత చూపలేదు. పైగా '*రాజకీయ రంగంలోకి ఉరకడం దేనికి. నా పత్రిక నాకు యుద్ధరంగం. ఈ నాలుగు గోడల మధ్య నుంచే పోరాటం సాగిస్తాను. మీరందరూ రాజకీయాల్లో ఉన్నారుగా. పత్రిక కూడా బలమైన ఆయుధమే...*' అనేవారు. అయితే గాంధీజీ సిద్ధాంతాలను తన పత్రిక ద్వారా ఎంతగానో వ్యాపింపజేశారు. ఆయన రాసిన సంపాదకీయాలకు ఎందరో ఉత్తేజితులై స్వాతంత్ర్య సంగ్రామంలోకి సైనికులై ఉరికిన ఉదాహరణలు ఉన్నాయి.

గాంధీజీనే స్వయంగా కృష్ణాపత్రిక తెప్పించుకుని సంపాదకీయాలను అనువాదం చేయించుకుని మరీ చదివేవారట. కృష్ణారావు ప్రతిభకు ఇంతకన్నా వేరే ఉదాహరణ అవసరం లేదు. సంపాదకీయాలతో పాటు కృష్ణారావు పత్రికలో నిర్వహించిన శీర్షికలు ఎంతగానో జనాదరణ పొందాయి. 'లో వెలుగులు', 'వెలుగు జిలుగులు', 'వడగళ్ళు, 'చాటువులు', 'శిల్పము – చిత్రకళ', 'సాహిత్యము–విమర్శ', 'పాడిపంటలు', 'ఆరోగ్యం–విద్య', 'నాట్యము – రూపకములు', 'రసమంజరి' ఇలా ఎన్నో శీర్షికలు ఆ రోజుల్లో కృష్ణాపత్రిక కీర్తికిరీటంలో కలికితురాళ్ళుగా ఆ పత్రిక వైభవాన్ని దశదిశలా వ్యాపితం చేశాయి.

అఖిలాంధ్ర దేశాన్ని తన పత్రిక ద్వారా ఓ విశిష్ట సమాజంగా తీర్చిదిద్దిన ఆ మహనీయుడు 1945లో మద్రాసు నగరంలోని తన కుమార్తె ఇంట్లో కన్నుమూశారు. శాశ్వత విశ్రాంతి ఆయన భౌతికదేహానికే గానీ ఆయన తెలుగు గుండెల్లో ప్రజ్వరిల్లజేసిన చైతన్యానికి కాదు.

## 2.3.3 కోలవెన్ను రామకోటీశ్వరరావు

కృష్ణాపత్రిక అనగానే ముట్నూరి కృష్ణారావుగారు గుర్తుకువచ్చినట్లుగా త్రివేణి పత్రిక అనగానే గుర్తుకువచ్చే పేరు 'కోలవెన్ను రామకోటీశ్వరరావు'. పత్రిక అభివృద్ధే ఊపిరిగా జీవించిన ఆయన 40 సంవత్సరాలపాటు నిర్విరామంగా సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు.

త్రివేణి పత్రిక కృష్ణాజిల్లాలో ప్రారంభమైనదికానప్పటికీ రామకోటీశ్వరరావుకు కృష్ణా జిల్లాతో అనుబంధం ఎక్కువగా ఉంది. ఇక్కడ నుంచి వెలువడిన ప్రసిద్ధ కృష్ణాపత్రిక, జయంతి పత్రికలకు కొంతకాలంపాటు ఆయన సంపాదకుడిగా పనిచేశారు. మచిలీపట్నంలోని జాతీయకళాశాలలో అధ్యాపకుడిగా, ప్రిన్సిపాల్‌గా పనిచేశారు.

త్రివేణి రామకోటీశ్వరరావుగా ప్రసిద్ధిపొందిన కోలవెన్ను రామకోటీశ్వరరావు 1894, అక్టోబరు 22న గుంటూరు జిల్లా నరసరావుపేటలో జన్మించారు. తల్లిదండ్రులు వియన్న పంతులు, రుక్మిణమ్మ. నరసరావుపేటలో ప్రాథమిక విద్యాభ్యాసం అనంతరం గుంటూరు టౌన్ హైస్కూల్‌లో మెట్రిక్యులేషన్ పూర్తిచేశారు. మచిలీపట్నం నోబుల్ కళాశాలలో ఇంటర్మీడియట్ కోర్సు చేరడంతో ఆయనకు కృష్ణాజిల్లాతో అనుబంధం ఏర్పడింది. ఈ కాలంలోనే మచిలీపట్నంలోని ముట్నూరు కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య మొదలైన మహామహులతో పరిచయం ఏర్పడింది. తర్వాతికాలంలో మద్రాసు నుంచి డిగ్రీ, బి.ఎల్ డిగ్రీలు పూర్తిచేసి, నరసరావుపేటలో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించారు.

న్యాయవాదిగా ప్రాక్టీసు చేస్తున్న కాలంలోనే గుంటూరులో జరుగుతున్న గ్రంథాలయోద్యమంలో ఆయన చురుకుగా పాల్గొన్నారు. తర్వాత 1921 డిసెంబరులో ప్రకాశం పంతులు ప్రారంభించిన స్వరాజ్య పత్రికలో ఉప సంపాదకుడిగా చేరారు. ఈ సమయంలో ఆయనకు ప్రసిద్ధ పాత్రికేయులు ఖాసా సుబ్బారావు, కోటంరాజు రామారావు, జి.వి.కృపానిధి మొదలైనవారితో పరిచయాలు ఏర్పడ్డాయి.

పట్టాభి సీతారామయ్య ప్రేరణతో 1923లో 'స్వరాజ్య'ను విడిచి మచిలీపట్నంలోని జాతీయకళాశాలలో అధ్యాపకుడిగా చేరారు. అప్పటికే 'ముట్నూరు'తో ఉన్న పరిచయం కారణంగా సాయంత్రం వేళ ఆయన నిర్వహించే 'దర్బారు'లో పాల్గొనేవారు. ఈ సమయంలోనే విశ్వనాథ సత్యనారాయణ ప్రారంభించిన *జయంతి* పత్రికకు ఆయనతో కలిసి సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు.

## 2.3.3.1 త్రివేణి ఆవిర్భావం

తనలో అంతర్లీనంగా దాగిఉన్న పత్రికా ప్రియత్వానికి రూపుదిద్దుతూ 1927, డిసెంబరు 25న 'త్రివేణి' ఆంగ్ల మాసపత్రికను ఆయన ప్రారంభించారు. తొలుత మద్రాసు నగరం నుంచి ఈ పత్రిక వెలువడేది. నలభై సంవత్సరాలపాటు అప్రతిహతంగా ఈ పత్రికను రామకోటీశ్వరరావు తన సంపాదకత్వంలో నడిపారు. పత్రికా బాధ్యతల నిర్వహణకు ఇబ్బందిగా ఉందని భావించి, జాతీయకళాశాల ప్రాచార్య పదవికి రాజీనామా చేశారు.

త్రివేణి పత్రిక 1928 నుంచి 1936 వరకు ద్వైమాసిక పత్రికగాను, 1936 నుంచి 1940 వరకు మాసపత్రికగాను వెలువడింది. ఆ తర్వాత త్రైమాసిక పత్రికగా ఇప్పటికీ ఐ.వి.చలపతిరావు సంపాదకత్వంలో వెలువడుతోందని రాపాక ఏకాంబరాచార్యులు మన ప్రముఖ పత్రికా సంపాదకులులో రాశారు. ఆయన ప్రకారం త్రివేణి పత్రిక కార్యస్థానాలు చాలాసార్లు మారుతూ వచ్చాయి. 1927 నుంచి 1942 వరకు మద్రాసు నుంచి, 1942 నుంచి 1948 వరకు బెంగళూరు నుంచి, 1948 నుంచి 1950 వరకు, 1957 నుంచి 1961 వరకు హైదరాబాదు నుంచి, 1961 నుంచి 1988 వరకు మచిలీపట్నం నుంచి, 1989 నుంచి 1993 వరకు గుంటూరు నుంచి ఈ పత్రిక నడిచింది. ఆ తర్వాత అంటే 1994 నుంచి ఇప్పటికీ హైదరాబాదు నుంచి వెలువడుతోంది.

భారతీయభాషల్లో రూపుదిద్దుకున్న నవ్యసాహిత్య రీతులన్నీ త్రివేణిలో ప్రాతినిధ్యం వహించేవి. కథ, ఖండకావ్యం, సాహిత్యవిమర్శ, సంగీతం, నాట్యరీతులు, చిత్రకళ, శిల్పం, సారస్వత పునరుజ్జీవం తదితర విషయాలన్నీ ఇందులో ప్రచురితమయ్యేవి. ఆరోజుల్లో సాహిత్యకారులుగా ప్రసిద్ధికెక్కిన రచయితలు, కవులు తమ రచనలను త్రివేణికి పంపేవారు.

కన్నడ రాష్ట్రం నుంచి డి.వి.గుండప్ప, మాస్తి వెంకటేశయ్య, తమిళదేశం నుంచి చంద్రశేఖరన్, కె.ఎస్.వేంకటరమణి, మళయాళ పండితులైన కె.ఎస్.ఫణిక్కర్, కున్హన్‌రాజా, పొట్టెకాట్, తెలుగు నుంచి శ్రీశ్రీ, ఖండవల్లి లక్ష్మీరంజనం, రాయప్రోలు సుబ్బారావు, తనికెళ్ళ వీరభద్రుడు మొదలైనవారంతా ఈ కోవకు చెందినవారే. కోలవెన్ను అనంతరం త్రివేణికి సంపాదకులెందరో మారినప్పటికీ పత్రిక స్థాపించిన నాటి ప్రమాణాలు నేటికీ మనకు కనిపిస్తాయి. ఇరవయ్యవ శతాబ్దంలో వచ్చిన ఆంగ్లపత్రికలన్నింటిలో భారతీయ సాహిత్యానికి, సంస్కృతికి సేవచేసిన ఏకైక పత్రికగా త్రివేణి గుర్తింపు పొందింది.

## 2.3.4 జి.వి.కృపానిధి

స్వాతంత్రోద్యమకాలంలో జాతీయతాభావాన్ని సమాజంలో వ్యాప్తిచేయడానికి పత్రికాముఖంగా ఉద్యమించి భారతదేశంలోని అగ్రశ్రేణి పత్రికాసంపాదకుల్లో ఒకరిగా ఎదిగిన ప్రముఖుల్లో జి.వి.కృపానిధి ఒకరు. టంగుటూరి ప్రకాశం పంతులు ద్వారా పత్రికాలోకానికి పరిచయమై, ఆతర్వాత అనేక పత్రికలకు సంపాదకత్వం వహించారాయన. తాను సంపాదకుడిగా బాధ్యతలు నిర్వహించిన పత్రికలను ఉన్నత విలువలతో నడిపిన కృపానిధి విమర్శకుల ప్రశంసలు అందుకున్నారు.

కృష్ణాజిల్లా మచిలీపట్నంలో 1898, జూన్ 24న కృపానిధి జన్మించారు. స్వగ్రామంలోనే ప్రాథమిక విద్య పూర్తిచేసిన అనంతరం మద్రాసు నుంచి బి.ఎ.ఆనర్సు, బి.ఎల్. డిగ్రీ పట్టాలు అందుకున్నారు. న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించాలన్న కోరికతో ఆ రోజుల్లో ప్రముఖ న్యాయవాదిగా ఉన్న టంగుటూరి ప్రకాశం పంతులుగారి వద్ద సహాయకుడిగా చేరారు. అదే సమయంలో దేశమంతటా స్వాతంత్ర్యోద్యమం తీవ్రస్థాయికి చేరుకోవడం, గాంధీజీ సహాయనిరాకరణ ఉద్యమం ఊపందుకోవడం, అందులో భాగంగా ప్రకాశం పంతులు న్యాయవాద వృత్తిని విడిచిపెట్టడం, స్వరాజ్య పత్రికను ప్రారంభించడం జరిగాయి.

'తానొకటి తలిస్తే దైవం మరొకటి తలిచింది అన్నట్లు' జరిగిన ఈ సంఘటనతో కృపానిధి స్వరాజ్య పత్రికలో సహాయ సంపాదకుడిగా మారారు. పత్రిక ప్రారంభంలో కార్యాలయ నిర్వహణ బాధ్యతలు కూడా ఆయన నిర్వహించేవారు. మొత్తం 12 సంవత్సరాలపాటు ఆయన స్వరాజ్యలో పనిచేశారు.

ఆతర్వాత కొంతమంది మిత్రులతో కలిసి ఇండియన్ న్యూస్ క్రానికల్ పత్రికను స్థాపించి, ఆ పత్రికకు అసోసియేట్ ఎడిటర్‌గా పనిచేశారు. కారణాంతరాలవల్ల ఆపత్రిక అతికొద్దికాలం మాత్రమే నడిచింది. అక్కడి నుంచి హిందుస్థాన్‌టైమ్స్ పత్రికలో ప్రత్యేక విలేకరిగా పనిచేశారు. ఆ హోదాలో పనిచేసిన తర్వాత పార్లమెంటరీ వ్యవహారాల విలేకరిగా కృపానిధి రాసిన వ్యాసాలు ఎంతో ప్రాచుర్యం పొందాయి. రాజ్యాంగ పరిషత్తు వ్యవహారాల నిపుణుడిగా కూడా ఆయన రాసిన వ్యాఖ్యానాలు, విశ్లేషణలు, వీటికితోడు శంకర్ కార్టూన్లతో ఆరోజుల్లో హిందుస్థాన్ టైమ్స్ పత్రిక సర్వాంగ సుందరంగా వెలువడేదని రాపాక ఏకాంబరాచార్యులు తన మన ప్రముఖ పత్రికా సంపాదకులులో రాశారు. స్వాతంత్ర్యానంతరం కూడా హిందుస్థాన్‌టైమ్స్‌తో కృపానిధి అనుబంధం కొనసాగింది. తన సంపాదకీయాల ద్వారా కేంద్ర, రాష్ట్ర మంత్రులకు ఆయన సలహాలిచ్చేవారు. మొత్తం 15 సంవత్సరాలపాటు ఆ పత్రికలో వివిధ హోదాల్లో పనిచేశారు. ఆతర్వాత సౌత్ఇండియన్ బుక్‌ట్రస్ట్ ఛైర్మన్‌గా, డెక్కన్ హెరాల్డ్ పత్రిక సంపాదకులుగా పనిచేశారు.

సంపాదకీయాలు రాయడంలో కృపానిధిది ప్రత్యేకశైలి. చక్కని పలుకుబడి, రమ్యమైనశైలి, సూక్ష్మబుద్ధి, రాజకీయ విశ్లేషణలతో ఆయన సంపాదకీయాలు రాసేవారు. సమతూకంతో ఉండే హాస్యం ఆయన వ్యాసాలకు కీర్తి తెచ్చిపెట్టింది. ఆయన తొలిగా వాడిన పలుకుబడిని ఇప్పటికీ పత్రికా విలేకరులు వాడుతుండడమే ఇందుకు నిదర్శనం. ఏవిధమైన శిక్షణ లేకుండానే పత్రికకు సంబంధించిన అన్ని విషయాలను స్వయంగా నేర్చుకోవడంతో పాటు కృపానిధి తాను నమ్మిన సిద్ధాంతాలు, సత్యాలు, విశ్వాసాలను తన పత్రికల ద్వారా వ్యాప్తిచేసి, ఎన్నో సత్సాంప్రదాయాలను విలువల రూపంలో పత్రికాలోకానికి అందించారు. డెబ్భైనాలుగు సంవత్సరాల తన జీవితకాలంలో దాదాపు అర్ధశతాబ్దం పాటు పత్రికా వ్యాసంగానికే పరిమితమైన కృపానిధి 1970, మే 25న బెంగళూరులోని తన స్వగృహంలో తుదిశ్వాస విడిచారు.

## 2.3.5 నార్ల వెంకటేశ్వరరావు

కుల, మత తత్వాలు, మత మౌఢ్యాలు, సాంఘికదురాచారాలను నిర్భయంగా తన రచనలు, సంపాదకీయాల ద్వారా ఖండించి సమాజ రుగ్మతలపై సాహిత్యపోరాటం జరిపిన కలంయోధుడు నార్ల వేంకటేశ్వరరావు. ఆంతరాత్మ ప్రబోధించిన సత్యాన్ని నిర్భయంగా చాటిచెప్పడంలో మరో ఆలోచనకు తావివ్వని ధీశాలి ఆయన.

అంతేకాదు.. ఆయన ఓ భావుకుడు. సత్యాన్వేషి. కవి. నాటక కర్త. స్వాతంత్ర్య సమరయోధుడు. మానవతావాది. సంస్కరణాభిలాషి. మీమాసంకుడు. దేశవిదేశ తత్త్వరహస్యాలు, రాజకీయ, సామాజిక, ఆర్థికశాస్త్రాలను ఆపోసన పట్టిన అగస్త్యుడు. ఒక్కమాటలో చెప్పాలంటే బహుముఖ ప్రజ్ఞావంతుడనే పదానికి సిసలైన ఉదాహరణ.

కృష్ణా జిల్లాలో నార్ల జన్మించనప్పటికీ ఎక్కువకాలంలో ఇక్కడే గడిపారు. అంతేకాదు... నార్ల జీవితంలో ప్రముఖ ఘట్టమైన ఆంధ్రజ్యోతి పత్రికను జిల్లాలోని విజయవాడలో స్థాపించి, ఆధునిక పత్రికారంగంలో సంచలానలకు తెరతీయడంతో ఇక్కడి ప్రముఖుడిగానే గుర్తింపుపొందారు.

మధ్యప్రదేశ్‌లోని జబల్‌పూర్ ప్రాంతంలో శ్రీమతి మహాలక్ష్మమ్మ, శ్రీలక్ష్మణరావు దంపతులకు నార్ల 1908, డిసెంబరు ఒకటోతేదీన జన్మించారు. నార్లవారి పూర్వీకులు కృష్ణాజిల్లాలోని కాటూరు గ్రామానికి చెందినవారు. తల్లి కూడా ఇక్కడి కౌతరం గ్రామం ఆడపడుచు. ఈకారణంగా నార్ల ప్రాథమిక విద్యాభ్యాసం ఈ గ్రామంలోనే జరిగింది. తర్వాత గుంటూరు, గుడివాడ, కాకినాడల్లో చదువు కొనసాగింది.

కాకినాడలో చదువుతున్న రోజుల్లో బ్రహ్మసమాజ సిద్ధాంతాల పట్ల ఆకర్షితులయ్యారు. ఆ పుస్తకాలను విపరీతంగా చదివేవారు. 1928లో కలకత్తాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారు. ఆ సభలో శ్రీనివాస అయ్యంగార్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని ఖండిస్తూ 'యువమిత్రుడి ఆవేదన' పేరుతో ఓ వ్యాసాన్ని కాంగ్రెస్ పత్రికకు పంపించారు. ఇదే నార్లవారి తొలి ప్రకటిత వ్యాసం. తర్వాత 'ఉపేంద్ర', 'రవీంద్ర' పేర్లతో అనేక వ్యాసాలు రాశారు. కాకినాడలో చదువు ముగించుకుని కౌతరం తిరిగివచ్చిన తర్వాత భారతి, కృష్ణాపత్రిక, ప్రజామిత్ర, జన్మభూమి పత్రికల్లో అనేక వ్యాసాలు రాశారు.

జన్మభూమిలో ఈయన రాసిన వ్యాసాలకు ఆగ్రహించిన తెల్లదొరలు తప్పుడు కేసులు బనాయించితో బెజవాడ న్యాయస్థానం ఆయనకు ఏడునెలల కఠిన కారాగారశిక్ష విధించింది. తర్వాత గాంధి–ఇర్విన్ ఒడంబడిక ప్రకారం ప్రభుత్వం నార్లపై కేసు ఉపసంహరించుకుంది. ఈ సమయంలోనే అతివాద కార్యక్రమాల్లో ఎక్కువగా పాల్గొన్నారు. ఆ తర్వాత మచిలీపట్నం నోబుల్ కళాశాల నుంచి బి.ఎ. డిగ్రీ పూర్తిచేశారు. తర్వాత బెనారస్ నుంచి ఎం.ఎ. చదవాలనుకున్నారు గానీ ఆర్థిక పరిస్థితి అనుకూలించకపోవడంతో ఆ ప్రయత్నం మానుకున్నారు.

మచిలీపట్నంలో ఉన్న సమయంలో 'స్వదేశీ సంస్థానాలు', 'నేటి రష్యా' అనే రెండు పుస్తకాలను నార్ల రచించారు. కొంతకాలానికి గద్దె లింగయ్య నడిపిన *'ప్రభ'* పత్రిక, తర్వాత 'జ్యోతి', 'కృష్ణాపత్రిక'ల్లో పనిచేశారు. వీటన్నిటిని వదులుకుని 1935లో మద్రాసు చేరుకున్నారు. ఇక్కడ ఉంటూనే *ప్రజాబంధు, భారతి, సమదర్శిని, వినోదిని* తదితర పత్రికల్లో విరివిగా వ్యాసాలు రాసేవారు.

మద్రాసులో ఉన్నకాలంలో *సమదర్శిని, స్వరాజ్య, జనవాణి, ప్రజామిత్ర* పత్రికల్లో పనిచేశారు. క్రీ.శ. 1938, ఆగస్టు ఒకటోతేదీన *ఆంధ్రప్రభ*లో సహాయసంపాదకుడిగా చేరడంతో నార్ల జీవితంలో నూతన అధ్యాయం ప్రారంభమైంది. ఇక్కడ పనిచేస్తున్న కాలంలో నార్ల సృష్టించిన పదాలు 'తిరోగమనం, శిఖరాగ్రం, ఐక్యరాజ్యసమితి, కాందిశీకులు, అలీనవిధానం' బహుళప్రచారం పొందాయి. *ఆంధ్రప్రభ* యాజమాన్యంతో వచ్చిన విభేదాల కారణంగా 1958లో సంపాదక బాధ్యతల నుంచి నార్ల స్వచ్ఛందంగా తప్పుకున్నారు.

## 2.3.5.1 ఆంధ్రజ్యోతికి అంకురార్పణ

*ఆంధ్రప్రభ* నుంచి బయటకు వచ్చిన తర్వాత 1960లో నార్ల విజయవాడ నుంచి *ఆంధ్రజ్యోతి* పత్రికను నడిపారు. ఆధునిక పత్రికారంగంలో ఇదొక సంచలనం. పోటీని తట్టుకునేందుకు నార్ల ఎన్నో ప్రయోగాలు చేశారు. రాష్ట్రంలోని వివిధ నగరాలకు సప్లిమెంట్లు ప్రచురించి, స్థానిక ప్రకటనలు అందులో వచ్చేలా చేశారు.

వ్యవసాయదారులు, మహిళలకోసం ప్రత్యేకంగా నిపుణులచే వ్యాసాలు రాయించేవారు. ఏదైనా సమస్య వచ్చినప్పుడు ఆ విషయంపై ధారావాహికంగా సంపాదకీయాలు రాయడం ఆయన ప్రత్యేకత. ఈ కోవలో 'సంస్కృతి' గురించి ఆయన రాసిన సంపాదకీయం ఎంతో ప్రసిద్ధి పొందింది. పుస్తక సమీక్షల పద్ధతి కూడా తొలిగా నార్ల ప్రవేశపెట్టినదే. బాగా నచ్చిన పుస్తకాన్ని సమీక్షిస్తూ నార్ల వెంకటేశ్వరరావు రాసిన సంపాదకీయాల వల్ల ఆ పుస్తకాలు బాగా అమ్ముడైన సందర్భాలెన్నో ఉన్నాయి. వార్తాపత్రికల తీరుతెన్నులను తన విప్లవాత్మకమైన పద్ధతుల ద్వారా మార్చివేసిన ఘనత నార్లకే దక్కుతుంది. వార్తాపత్రికలకు కొత్త ఒరవడి, శైలి సాధించిపెట్టారు. వార్తలకు కొత్త పేర్లు పెట్టడం ఇందులో ఒకటి. నార్ల సంపాదకీయాల్లో విషయవివేచనాశక్తి, ఆధునిక దృక్పథం, లోకజ్ఞత, సాహితీపరిజ్ఞానం, హాస్యచతురత కనిపిస్తాయి.

తన మనసుకు నచ్చని విషయంలో ఎవరితో విభేదించడానికైనా వెనుకాడేవారు కాదు. చివరకు తన ఉద్యోగాన్ని కూడా ఈ కారణంగానే వదులుకున్నారు. జర్నలిజం ద్వారా తెలుగు సాహితీలోకానికి విశేష సేవలందించిన నవీన సాహితీ ప్రతిభామూర్తి నార్ల.

సుమారు 40 వరకు గ్రంథాలు రచించారు. *'నవయుగాల బాట నార్లవారి మాట'*, *'వాస్తవమ్ము నార్లవారి మాట'* మకుటాలతో రాసిన పద్యాలు శతకకర్తగా ఆయన స్థానాన్ని సుస్థిరం చేశాయి. కేంద్ర సాహిత్య అకాడెమి నార్ల రచనలు ప్రచురించింది. ఎన్నో విశ్వవిద్యాలయాల్లో ఆయన గౌరవోపన్యాసాలు ఇచ్చారు. ఆజన్మాంతం తాను నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడిన అరుదైన వ్యక్తుల్లో ఒకడిగా తన ముద్రను నార్ల వేంకటేశ్వరరావు శాశ్వతం చేశారు.

## 2.3.6 శివలెంక శంభుప్రసాద్

గతానుగతికంగా కాకుండా స్వయంప్రతిభతో తెలుగు జాతిరత్నాలనదగిన *ఆంధ్రపత్రిక (దినపత్రిక), ఆంధ్రపత్రిక (సచిత్ర వారపత్రిక), భారతి (మాస పత్రిక)* పత్రికలకు సంపాదకత్వ బాధ్యతలను మూడున్నర దశాబ్దాలపాటు వహించి, పత్రికారంగంలో ధ్రువతారగా నిలిచిన మహోన్నతమూర్తి శివలెంక శంభుప్రసాద్.

కేవలం 27 సంవత్సరాల వయస్సులోనే అగ్రశ్రేణి పత్రికలకు సంపాదకుడు కావడమే విశేషమైతే, లక్షలాది రూపాయల అప్పులపాలైన పత్రికలను లాభాల బాట పట్టించడంతోపాటు తాను జీవించి ఉన్నంతకాలం పత్రికా విలువలను కాపాడిన దీక్షాదక్షుడుగా తెలుగు పత్రికా రంగంలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు.

శంభుప్రసాద్ 1911, జనవరి 26న కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామంలో శ్రీమతి భ్రమరాంబ, శ్రీ శివసుబ్రహ్మణ్యం దంపతులకు జన్మించారు. అక్కడే ప్రాథమిక విద్య పూర్తిచేసుకుని, మచిలీపట్నం, మద్రాసు నగరాల నుంచి ఉన్నతవిద్య పూర్తిచేశారు. తర్వాత కలకత్తాలోని శాంతినికేతనంలో 'విశ్వకవి' రవీంద్రనాథ్ ఠాగూర్ స్వీయశిక్షణలో పట్టభద్రులయ్యారు. తన మేనమామ కాశీనాథుని నాగేశ్వరరావు కుమార్తె కామాక్షమ్మను 1929లో విజయవాడలో వివాహం చేసుకున్నారు.

## 2.3.6.1 ఆంధ్రపత్రికలో ప్రవేశం

ప్రసాద్‌కు విద్యార్థి దశనుంచే పత్రికారంగంపై ఆసక్తి ఎక్కువగా ఉండేది. ఈకారణంగానే విద్యాభ్యాసం పూర్తికాగానే తన మేనమామ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు నడుపుతున్న ఆంధ్రపత్రిక నిర్వహణలో ఆసక్తిగా పాల్గొన్నారు. ప్రత్యేకించి వారపత్రిక నిర్వహణలో ఆయనకు ఎంతో ఆసక్తి ఉండేది. ఈ కారణంగానే నాగేశ్వరరావు పంతులు హయాంలోకూడా వారపత్రికను తానే నిర్వహించేవారు. నూతనాంశాలతో, కొత్తపోకడలతో వారపత్రికను తీర్చిదిద్ది పాఠకుల హృదయాలకు మరింత చేరువచేసిన ఘనత శంభుప్రసాద్‌కే దక్కుతుంది.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు మరణం తర్వాత 1938 నుంచి శివలెంక శంభుప్రసాద్ *ఆంధ్రపత్రిక దిన, వార పత్రికలు, భారతి మాసపత్రిక*లకు పూర్తిస్థాయి యజమానిగా, సంపాదకుడిగా ఉండి వాటిని విజయపథంలో నడిపారు. దాదాపు 34 సంవత్సరాల పాటు ఆ పత్రికలను అవిచ్ఛిన్నంగా నడపడంతో పాటు ఏటేటా *ఆంధ్రపత్రిక ఉగాది సంచిక* క్రమం తప్పకుండా వెలువరించారు. ఆమధ్యలోనే *ఆంధ్రపత్రిక (వారపత్రిక) స్వర్ణోత్సవ సంచిక, నాగేశ్వరరావు శతజయంతి ఉత్సవ ప్రత్యేక సంచిక* కూడా వెలువరించారు. ఇదంతా నల్లేరు మీద నడకలాగా సాగలేదు. నాగేశ్వరరావు పంతులు దానధర్మాల కారణంగా ప్రసాద్ యాజమాన్యానికి వచ్చేసరికి పత్రికలు లక్షలాది రూపాయల నష్టాల్లో కూరుకుపోయాయి. సంస్థల ఆధిపత్యం ఒకపక్క, సంపాదకత్వం మరోపక్క సమతూకంతో నిర్వహిస్తూ పత్రికలను అతికొద్దికాలంలోనే లాభాలబాట పట్టించారు.

శంభుప్రసాద్ సంపాదకత్వంలో ఆంధ్రపత్రిక కాంగ్రెస్‌పార్టీ ఆశయాలు, సిద్ధాంతాలను ప్రతిబింబించే పత్రికగా పేరుపొందింది. స్వరాజ్య సమరం సాగుతున్న రోజుల్లో ప్రజలను ఆదిశగా కర్తవ్యోన్ముఖులను చేసింది. స్వతంత్రం వచ్చిన తర్వాత ఉన్నతాశయాలతో, ప్రమాణాలతో స్వతంత్ర దృక్పథాన్ని ఏర్పాటుచేసుకుని పాలకపక్షంలోని లోపాలను సైతం ఎత్తిచూపి, నిష్పక్షపాతంగా విమర్శించే పత్రికగా భాసించింది. వీటన్నిటికి కారణం ప్రసాద్ సంపాదకీయాలు. మంచి భావనా పటిమతో పాఠకుల్లో ఆలోచనలు రేకెత్తించేలా ఆయన రాసిన సంపాదకీయాలు పత్రికారంగంలో నూతన ఒరవడికి నాంది పలికాయి. ఏవిషయాన్నైనా నిశితంగా పరిశీలించి, తాను చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా తన సంపాదకీయాల ద్వారా ప్రకటించడం శంభుప్రసాద్ ప్రత్యేకత.

నాగేశ్వరరావు పంతులు కోరిక ప్రకారం 1965లో ఆంధ్రపత్రిక ప్రధాన కార్యాలయాన్ని విజయవాడకు మార్చారు. అంతేకాదు... ఆయన ఆదేశించినట్లుగా ఆంధ్రుల సమైక్యత కోసం తన పత్రికల ద్వారా ఎంతో కృషిచేశారు. శాసనమండలి సభ్యులుగా ఉంటూనే అక్కడివారి ప్రవర్తనలను ప్రసాద్ తన పత్రికల ద్వార తీవ్రంగా విమర్శించేవారు. రైతు సమస్యలు, గ్రామీణ ప్రజాజీవనం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపేవారు. ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు తన పత్రికల ద్వారా చందాలు సేకరించి, ప్రభుత్వ సంస్థల ద్వారా బాధితులకు అందించిన ఉదారగుణం ఆయనది. ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియాకు డైరెక్టర్‌గా పనిచేసిన కాలంలో పాత్రికేయుల సమస్యల పరిష్కారానికి, వారి అభ్యున్నతికూడా ఎంతో కృషి చేశారు. ప్రజల హృదయాల్లో తన పత్రికలకు చిరంజీవత్వాన్ని సంపాదించిపెట్టి, తాను మాత్రం 1972, జూన్ 8వ తేదీన శివసాయుజ్యం పొందారు.

### 2.3.7 నండూరి రామ్మోహనరావు

ఆధునిక సాహిత్యంలో వైవిధ్యభరితమైన వ్యాసరచనకు ప్రతిభావంతమైన ఒరవడి దిద్దిన అక్షరయాత్రికుడు నండూరి రామ్మోహనరావు. సృజనాత్మకేతర సాహిత్యాన్ని సృజన సాహిత్యంగా మలిచి, ప్రతిభావంతుడైన రచయితగా ఆధునిక సాహిత్యచరిత్రలో తనకంటూ ప్రత్యేక అధ్యాయాన్ని సృష్టించుకున్నారు. సుమారు అర్ధశతాబ్దం పాటు తన అసమాన రచనావిన్యాసాలతో, తేట తెలుగు పదాల వరదతో తెలుగునాట నవీన రచనాశకాన్ని స్థాపించారాయన. ఆంధ్రదేశంలో రెండోతరం పాత్రికేయుల్లో నండూరివారిదే అగ్రస్థానం. ఆయన స్వయంగా కవి, భావుకుడు, తత్త్వవేత్త, వాఙ్మి, లలితకళావేత్త, సంగీతజ్ఞుడు...అన్నిటికన్నా ‘మంచిమనిషి’గా తోటివారి ప్రశంసలు అందుకున్న మహామనీషి.

కృష్ణాజిల్లా ఆరుగొలను గ్రామంలో 1927, ఏప్రిల్ 24న నండూరి జన్మించారు. నూజివీడు, మచిలీపట్నం, రాజమండ్రిల్లో విద్యాభ్యాసం చేశారు. 1947లో ట్యూటర్‌గా కొద్దికాలం పనిచేసి, తర్వాత *జన్మభూమి*, *ఆంధ్రప్రభ* పత్రికల్లో సహాయ సంపాదకుడిగా పనిచేశారు. *ఆంధ్రప్రభ*కు ఇన్‌ఛార్జి ఎడిటర్‌గా 1958లో నియమితులై రెండేళ్ళపాటు ఆ బాధ్యతలు నిర్వహించారు. ఆ తర్వాత 1960లో *ఆంధ్రజ్యోతి*లో ఉపసంపాదకుడిగా ఉద్యోగంలో చేరారు. అనంతరం అక్కడే.. అంటే 1976లో ఇదే పత్రికకు సంపాదకులుగా నియమితులై, 1993లో పదవీ విరమణ చేసేవరకు అక్కడే కొనసాగారు. ఈ సమయంలోనే *‘జ్యోతిచిత్ర’* (సినీ వారపత్రిక), *వనితాజ్యోతి*, *బాలజ్యోతి* పత్రికలకు సంపాదకుడిగా అదనపు బాధ్యతలు నిర్వహించారు.

## 2.3.7.1 అసామాన్య రచనావిన్యాసం

సంపాదకుడిగా ఎంతగా ప్రఖ్యాతి పొందారో ఉత్తమశ్రేణి రచయితగా అంతే పేరుప్రఖ్యాతులు నండూరి సంపాదించారు. నార్లవారి ప్రోత్సాహంతో ఆయన రాసిన నరావతారం, విశ్వరూపం, విశ్వదర్శనం తెలుగు సాహిత్యచరిత్రలో సంచలనం సృష్టించాయనడంలో సందేహం లేదు. ఈ మూడు రచనలు ఆంధ్రజ్యోతి వారపత్రికలో ధారావాహికలుగా వచ్చాయి. ఇవికాకుండా ఆయన రాసిన *అక్షరయాత్ర, అనుపల్లవి, టాయ్‌సాయర్ సాహసకృత్యాలు, మయూరకన్య, కాంచనద్వీపం, రాజు పేద, చిలకచెప్పిన కథలు*... ఇంకా మరెన్నో రచనలు ఆయనలోని బహుముఖీనమైన రచనాపాటవానికి నిదర్శనాలుగా నిలుస్తాయి.

వ్యాసరచయితగా పేరుపొందిన నండూరికి పద్యరచనలోనూ సాధికారత ఉంది. దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల స్ఫూర్తితో ఆయన రాసిన పద్య, గేయ కవిత్వాలు ఉషస్విని పేరుతో ప్రచురితమయ్యాయి. బాలల కోసం రాసిన గేయాలు బాపు చిత్రాలతో హరివిల్లు పేరుతో పుస్తకంగా వచ్చాయి. విజయవాడ ఆకాశవాణికేంద్రం ద్వారా ప్రముఖ సాహితీవేత్తల జీవన విశేషాలతో వందలాదిగా ఉపన్యాసాలిచ్చారు.

*ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి* దినపత్రికల్లో పనిచేసినంతకాలం కాటిలో ప్రచురించేందుకు తగిన కథలు, వ్యాసాలను ఎంపికచేయడంలో నండూరిదే తుదినిర్ణయంగా ఉండేది. పాఠకుల మనస్సులు మెప్పించే రచనలు ఎంపికచేయడంలో ఆయన సిద్ధహస్తుడు.

నండూరిలో ఉన్న విలక్షణ లక్షణాల్లో ఒకటి.. 'యువకవులను ప్రోత్సహించడం'. ఎనభయ్యోదశకంలో ఆంధ్రజ్యోతిలో ఆయన నిర్వహించిన శీర్షికలు సాహిత్యంలో నూతన కవిత్వ మార్గాలకు దారితీశాయి. 'అనుభూతివాద కవిత్వం', 'మినీకవిత్వం' ఊపిరిపోసుకోవడానికి ఒకరకంగా నండూరి నడిపిన శీర్షికలే కారణంగా చెప్పుకోవచ్చు.

నండూరిలో ఉన్న అత్యంత విశిష్ట లక్షణం.. 'తాను ఏనాడూ ఉన్నతశ్రేణి రచయితననిగాని, పెద్దపేరున్న పత్రికకు సంపాదకుడననే భేషజంగానీ ప్రదర్శించకపోవడం'. పత్రికలో పనిచేసే అతిచిన్న ఉద్యోగి కూడా ప్రధాన సంపాదకుడిని నేరుగా కలిసే అవకాశం నండూరివారి దగ్గర ఉండేది. ఏనాడూ తనకంటూ ప్రత్యేకతను ఆపాదించుకోవడానికి ఆయన అర్రులు చాచలేదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 391 | శ్రీగురుపాదుక | మాస | ఎం.బుద్ధేశ్వరరావు | మచిలీపట్నం | 2004 |
| 392 | గం(డగొడ్డలి | దిన | పిహెచ్‌వి నారాయణశాస్త్రి | విజయవాడ | 2004 |
| 393 | మనయుగం | మాస | మహమ్మద్ కరీముల్లా | విజయవాడ | 2004 |
| 394 | రక్షణ | దిన | తుర్లపాటి రాజేష్ | విజయవాడ | 2004 |
| 395 | నగరభేరి | మాస | ఏనుగుల కృష్ణ, ముత్యాలరావు | విజయవాడ | 2004 |
| 396 | న్యూస్‌బూమ్ (ఆంగ్లం) | దిన | బిఎస్ఎన్ మూర్తి | విజయవాడ | 2004 |
| 397 | సినిమా వరల్డ్ | మాస | కె.బాపిరాజు | విజయవాడ | 2005 |
| 398 | ష్రింప్‌కేర్ (ద్విభాష) | మాస | షేక్ బాబావలి | విజయవాడ | 2005 |
| 399 | చినుకు | మాస | నండూరి రాజగోపాలరావు | విజయవాడ | 2005 |
| 400 | సమత (హిందీ) | మాస | ఎస్.చంద్రశేఖర్ | విజయవాడ | 2005 |
| 401 | ఫ్రైడే మెయిల్ | మాస | దేవిరాజు | విజయవాడ | 2005 |
| 402 | భక్తిసుధ | మాస | ఎ.హెచ్.ఎస్.వి ప్రసాద్ | విజయవాడ | 2005 |
| 403 | ఫ్రాడ్ | పక్ష | ఎం సుబ్బారావు | విజయవాడ | 2005 |
| 404 | ఉదయభారతం | దిన | డిఎస్ఎన్‌మూర్తి | విజయవాడ | 2006 |
| 405 | కంప్లీట్ మెడికల్ జర్నల్ (ద్విభాష) | మాస | ఎస్.వెంకటరమణ | విజయవాడ | 2006 |
| 406 | ధ్యానమాలిక | మాస | భిక్షమయ్య | విజయవాడ | 2006 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 407 | సిసింద్రీలు | మాస | కృత్తివెంటి బాపిరాజు | విజయవాడ | 2006 |
| 408 | ఇస్లాం కాంతి | మాస | మహమ్మద్ ఉదయదూర్ రహ్మాన్ | విజయవాడ | 2006 |
| 409 | మన ఆరోగ్యం | మాస | వివిల్ నరసారెడ్డి | విజయవాడ | 2006 |
| 410 | స్తపకవాణి | మాస | ఎస్‌వి సుధాకరరావు | విజయవాడ | 2006 |
| 411 | ఆల్‌ట్రూత్‌వే | మాస | ఆబ్రహాం వేల్పుల | విజయవాడ | 2006 |
| 412 | ఇమ్మాన్యుయేల్ స్వరం | మాస | సుదర్శన్ మోసెస్ కనగాల | కృష్ణాజిల్లా | 2006 |
| 413 | వెన్నెల | దిన | అంబడిపూడి సత్యనారాయణమూర్తి | విజయవాడ | 2006 |
| 414 | ఎడిటర్ వాయిస్ | వార | సి. హెచ్. రమణారెడ్డి | విజయవాడ | 2006 |
| 415 | సెల్ ఐటి (ఇంగ్లిషు) | మాస | దినేష్ శ్యామ్ | విజయవాడ | 2006 |
| 416 | ద ఫోర్త్ వాయిస్ (ఇంగ్లిషు) | దిన | ఆర్ మురళీధర్ | విజయవాడ | 2006 |
| 417 | శ్రీకంఠవాణి | మాస | పిఎస్‌పి కుమార్ | విజయవాడ | 2006 |
| 418 | కలం శక్తి | మాస | షేక్ ఇస్మాయిల్ ఒ మేరి | విజయవాడ | 2006 |
| 419 | ప్రాఫిట్ టుడే (ఇంగ్లిషు) | మాస | నితిన్ కె పరేఖ్ | విజయవాడ | 2006 |
| 420 | గిరిజన గూడు | మాస | సి. హెచ్ జానకీరామారావు | విజయవాడ | 2006 |
| 421 | సేన | దిన | అద్దంకి వెంకట శ్రీనివాసరావు | కృష్ణాజిల్లా | 2006 |
| 422 | బేతెస్థ క్రీస్తు ద్వారా స్వస్థత | మాస | సబ్బితి రత్న అబ్రహాం | విజయవాడ | 2006 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 423 | రత్నగర్భ | దిన | పివిఎ ప్రసాద్ | విజయవాడ | 2006 |
| 424 | ఎంప్లాయిమెంట్ క్రానికల్ (ఆంగ్లం) | మాస | వి.పట్టాభి సీతారామయ్య | విజయవాడ | 2007 |
| 425 | వసుధ | మాస | వాసిరాజు రంగారావు | విజయవాడ | 2007 |
| 426 | ఢమరుకం | మాస | ఆర్.పవన్ కిశోర్ | కృష్ణాజిల్లా | 2007 |
| 427 | ఎంప్లాయింట్ క్రానికల్ (తెలుగు) | మాస | వి.పట్టాభిసీతారామయ్య | విజయవాడ | 2007 |
| 428 | పల్లీ వార్త | వార | చొప్పరపు సాంబశివరావు | విజయవాడ | 2007 |
| 429 | ఆంధ్రవాయిస్ | దిన | బి.గిరిబాబు | విజయవాడ | 2007 |
| 430 | సివిల్స్ హెరాల్డ్ (ఇంగ్లిషు) | మాస | వి.పట్టాభి సీతారామయ్య | విజయవాడ | 2007 |
| 431 | వార్తా మండలి | దిన | ఎ.ప్రతాప్‌చంద్ | విజయవాడ | 2007 |
| 432 | మంచి స్నేహితుడు | మాస | బండి ఐజాక్ | విజయవాడ | 2007 |
| 433 | వర్షిత | మాస | ఉడత స్వాతికరుణ | విజయవాడ | 2007 |
| 434 | బ్లాక్ అండ్ వైట్ | దిన | బి.శ్రీనివాసులు | విజయవాడ | 2007 |
| 435 | దైవజ్ఞప్రభ | మాస | జివిఎన్ ధనలక్ష్మి | విజయవాడ | 2007 |
| 436 | ఒక క్షణం | పక్ష | మువ్వల లక్ష్మీనారాయణ | విజయవాడ | 2007 |
| 437 | సూర్య | దిన | ఎన్.సూర్యప్రకాశరావు | విజయవాడ | 2007 |
| 438 | సినిమా రౌండప్ | మాస | ఎ.నీలకంఠేశ్వరరెడ్డి | విజయవాడ | 2008 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 439 | లోకల్ న్యూస్ 5 పిఎం (తెలుగు) | దిన | కె.విజయ్‌కుమార్ | విజయవాడ | 2008 |
| 440 | తెలుగుతేజం | వార | పులివర్తి బాబూరావు | విజయవాడ | 2008 |
| 441 | శ్రీన్‌ఫ్లవర్‌న్యూస్ | దిన | ఎండివిఎస్ఆర్ పున్నంరాజు | చల్లపల్లి | 2008 |
| 442 | సాక్షి | దిన | ఎస్.రామకృష్ణారెడ్డి | విజయవాడ | 2008 |
| 443 | వ్యూస్ అబ్జర్వర్స్ (ఇంగ్లిషు) | దిన | యువిఎస్ సూర్యకుమార్ | విజయవాడ | 2008 |
| 444 | మంచి విత్తనం | మాస | పాల యెహోసువా | విజయవాడ | 2008 |
| 445 | పీపుల్ వాయిస్ | వార | షేక్ నాగూర్ | విజయవాడ | 2008 |
| 446 | ప్రజాభీష్టం | దిన | ఎం.వి.సుబ్బారావు | విజయవాడ | 2008 |
| 447 | విజయభాను | దిన | బి.చంద్రశేఖర్ | విజయవాడ | 2008 |
| 448 | జనవాహినిలో నేడు | దిన | పులిపాక సత్యమూర్తి | విజయవాడ | 2008 |
| 449 | చిత్ర సకుటుంబం | మాస | ఎ.హెచ్.ఎస్.వి.ప్రసాద్ | విజయవాడ | 2009 |
| 450 | సువార్త వెలుగు | పక్ష | జి.శ్యాంబాబు | విజయవాడ | 2009 |
| 451 | ఉదయాంధ్ర | వార | కూన అజయ్‌బాబు | విజయవాడ | 2009 |
| 452 | తెలుగువారం | దిన | టి.ప్రియంవద | విజయవాడ | 2009 |
| 453 | అంతిమతీర్పు | దిన | వల్లూరు ప్రసాద్‌కుమార్ | విజయవాడ | 2009 |
| 454 | ఆంధ్ర ఛాంబర్ ఆఫ్ కామర్స్ (ద్విభాష) | వార | ఎన్.రాజారావు | విజయవాడ | 2009 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 455 | అబ్లిగేషన్ (ఇంగ్లిషు) | దిన | కె.సత్యనారాయణ | విజయవాడ | 2009 |
| 456 | మైత్రి ఉషస్సు | వార | పులిపాక హరికృష్ణ | విజయవాడ | 2009 |
| 457 | ప్రగతిబాట | దిన | పీరం శ్రీనివాసరావు | కృష్ణాజిల్లా | 2009 |
| 458 | మల్లెతీగ | మాస | కలిమికొండ రాజేశ్వరి | విజయవాడ | 2009 |
| 459 | సన్‌ఫ్లవర్ స్టూడెంట్ పవర్ (ద్విభాష) | మాస | ఎండివిఎస్ఆర్ పున్నంరాజు | చల్లపల్లి | 2009 |
| 460 | కాపు ప్రభ | మాస | మాతి శ్రీకాంత్ | కృష్ణాజిల్లా | 2009 |
| 461 | ఆకాశరామన్న | మాస | ఎస్.రవీంద్రనాథ్ | విజయవాడ | 2009 |
| 462 | స్వచ్ఛందవాణి | మాస | పాటిబండ్ల సుధీర్‌బాబు | విజయవాడ | 2009 |
| 463 | మై ఓన్ సిటీ గైడ్ డాట్ కాం (ద్విభాష) | వార | బెజవాడ పాల్ కమల్‌కుమార్ | విజయవాడ | 2009 |
| 464 | నేటి ప్రతిరోజు | దిన | పులిపాక శ్రీలక్ష్మి | విజయవాడ | 2009 |
| 465 | సన్‌ఫ్లవర్ సంపూర్ణవార పత్రిక | వార | ఎండివిఎస్ఆర్ పున్నంరాజు | చల్లపల్లి | 2009 |
| 466 | ఢీ | వార | పోతుల బాలకోటయ్య | విజయవాడ | 2009 |
| 467 | లక్ష్మీప్రతిరోజు | దిన | పి.శ్రీలక్ష్మి | విజయవాడ | 2009 |
| 468 | క్షేత్రవైభవం | మాస | వివెల్ నరసింహారావు | కృష్ణాజిల్లా | 2009 |
| 469 | రీజినల్ రియల్ న్యూస్ | దిన | దుక్కిపాటి వెంకటకృష్ణారావు | కృష్ణాజిల్లా | 2009 |
| 470 | గ్రేటర్ వాయిస్ | దిన | సి.హెచ్.రమణారెడ్డి | విజయవాడ | 2009 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 471 | ఉపాధ్యాయ ఆలోచన | మాస | గొరిపర్తి సత్యనారాయణ | కృష్ణాజిల్లా | 2009 |
| 472 | ద వాయిస్ ఆఫ్ డౌన్ ట్రోడెన్ | | ఎపిఎస్‌పిడిసిఎల్ ఎస్ఎస్‌టి | | |
| | ఎలక్ట్రిసిటీ ఎంప్లాయర్స్ | మాస | డిసి ఎంప్లాయిస్ అసోసియేషన్ | కృష్ణాజిల్లా | 2009 |
| 473 | యాదవ వార్త | మాస | బి.శ్రీరామ్ యాదవ్ | కృష్ణాజిల్లా | 2009 |
| 474 | హోమియోపతిక్ మెడికల్ అబ్జర్వర్ (ఇం) | త్రైమాసిక | కెఆర్‌కె ప్రభాకరమూర్తి | విజయవాడ | 2009 |
| 475 | కృష్ణా ఎక్స్‌ప్రెస్ | దిన | దేవరపల్లి ఏసుబాబు | విజయవాడ | 2009 |
| 476 | పొలిటికల్ ఎన్‌కౌంటర్ | మాస | తోట రాము | విజయవాడ | 2009 |
| 477 | రైస్ ఇంటర్నేషనల్ (ఇంగ్లిషు) | మాస | ఎస్‌కె బాజీ | విజయవాడ | 2009 |
| 478 | డిజైన్ మాస్టర్స్ (ద్విభాష) | మాస | డి.రాజశేఖర్ | విజయవాడ | 2009 |
| 479 | ట్రస్ట్ న్యూస్ (ఇంగ్లిషు) | దిన | కొమ్మరాజు రవి | విజయవాడ | 2010 |
| 480 | ఆంధ్ర సాక్షి | దిన | జగతి పబ్లికేషన్స్ | కృష్ణాజిల్లా | 2010 |
| 481 | మార్కండేయ | దిన | పద్మశాలి ఇంటర్నేషనల్ | కృష్ణాజిల్లా | 2010 |
| 482 | ఉత్తరాంధ్ర సాక్షి | దిన | జగతి పబ్లికేషన్స్ | కృష్ణాజిల్లా | 2010 |
| 483 | ఆంధ్రశక్తి | | ఎం.అబ్బుల్ రవూఫ్ | విజయవాడ | 2010 |
| 484 | పల్లెక్రాంతి | దిన | దాసరి నాగరాజు | విజయవాడ | 2010 |
| 485 | సీతారామప్రభ | మాస | ఎం.శ్రీనివాసమూర్తి | విజయవాడ | 2010 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 486 | గ్రంథాలయవాణి | మాస | కె.మధుసూదనరాజు | విజయవాడ | 2010 |
| 487 | నది వారం వారం | వార | విఆర్ రావు అవ్వాస్ | విజయవాడ | 2010 |
| 488 | వందే గోమాతరమ్ | మాస | ఎల్ కె శర్మ | విజయవాడ | 2010 |
| 489 | ది సదరన్ న్యూస్ (ఇంగ్లిషు) | మాస | వి.వి. సుబ్బారావు | విజయవాడ | 2010 |
| 490 | స్పెషల్ న్యూస్ | దిన | వి.నాగేశ్వరరావు | విజయవాడ | 2010 |
| 491 | హంసలేఖ | పక్ష | తాడంకి కోటీశ్వరరావు | కృష్ణాజిల్లా | 2010 |
| 492 | హోలిక | దిన | పాటిబండ్ల శివశర్మ | విజయవాడ | 2010 |
| 493 | నీలిమేఘం | దిన | విన్నకోట శ్రీనివాస్ | విజయవాడ | 2010 |
| 494 | బ్యూరోక్రాట్ వాయిస్ | వార | అన్నంగి శ్రీనివాసరావు | విజయవాడ | 2010 |
| 495 | నిప్పు | దిన | కొంగర బ్రహ్మయ్య | విజయవాడ | 2010 |
| 496 | భారత శక్తి | దిన | కె.పెంటారెడ్డి | విజయవాడ | 2010 |
| 497 | అరచేతిలో ఆయుర్వేదం | మాస | ఎస్.గజేంద్రరావు | విజయవాడ | 2010 |
| 498 | ఫిల్మ్ సినీ సరదాలు | మాస | శ్రావణం మహేష్ | విజయవాడ | 2010 |
| 499 | మహిత | వార | బద్దె ప్రభాకరన్ | కృష్ణాజిల్లా | 2010 |
| 500 | మేఘాలలో ఏసు | మాస | గుంజ ఏబెల్ | కృష్ణాజిల్లా | 2010 |
| 501 | వాచకం | పక్ష | చీకటి త్రినాథులు | విజయవాడ | 2010 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 502 | ధర్మ విజ్ఞానం | మాస | చామర్తి వెంకట సుబ్బయ్య | విజయవాడ | 2010 |
| 503 | సేవ్ ఎన్ షాపింగ్ (ద్విభాష) | మాస | బొబ్బా సాయిలక్ష్మి | విజయవాడ | 2010 |
| 504 | శ్రీ విశ్వనాథ సుధ | మాస | చింతాడ సూర్యప్రకాష్ | విజయవాడ | 2010 |
| 505 | నవ్యవిజ్ఞానం | దిన | గొట్టిపాటి పద్మజ | కృష్ణాజిల్లా | 2010 |
| 506 | కేసరి | దిన | కె.సత్యనారాయణ | విజయవాడ | 2010 |
| 507 | బెజవాడ టైమ్స్ | మాస | ఎం.వేణుగోపాల్ | విజయవాడ | 2011 |
| 508 | విజయవాడ ఎక్స్‌ప్రెస్ | వార | టివిజి ఎంటర్ ప్రైజెస్ | కృష్ణాజిల్లా | 2011 |
| 509 | కృష్ణాతీరం | దిన | మద్దినేని భాస్కరరావు | విజయవాడ | 2011 |
| 510 | ఆత్మ | పక్ష | బేతపూడి రమేష్ | కృష్ణాజిల్లా | 2011 |
| 511 | విజయవాడ మార్కెట్ మిర్రర్ | మాస | వి.వెంకట శరత్‌బాబు | విజయవాడ | 2011 |
| 512 | లీడర్ టుడే | మాస | సి. హెచ్.శ్రీనివాసరావు | కృష్ణాజిల్లా | 2011 |
| 513 | మచిలీపట్టణం టైమ్స్ | దిన | మెట్టా నాగరాజు | మచిలీపట్నం | 2011 |
| 514 | అక్షర స్పందన | దిన | కన్నెకంటి సజ్జనరావు | విజయవాడ | 2011 |
| 515 | ఉయ్యూరు న్యూస్ | పక్ష | గబ్బిట దుర్గాప్రసాద్ | ఉయ్యూరు | 2011 |
| 516 | సిటీ మెయిల్ | వార | ఎం. హెచ్.ప్రభాకరరావు | విజయవాడ | 2011 |

అధ్యాయం 3

# కృష్ణా జిల్లా నుంచి వెలువడిన దినపత్రికలు – విషయ విశ్లేషణ

వర్తమాన సమాజంలో దినపత్రికల పాత్ర ఎనలేనిది. సమాజంలోని ప్రతి రంగాన్ని దినపత్రికలు స్పృశించడమే ఇందుకు కారణం. ముఖ్యంగా రాజకీయ విషయాల్లో దినపత్రికలు అటు ప్రభుత్వంపైనా ఇటు సమాజంపైనా అత్యధిక ప్రభావాన్ని చూపిస్తున్నాయి. ఇతర వార్తలకన్నా రాజకీయ వార్తలకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తూ దినపత్రికలు ప్రధాన శీర్షికలతో వ్యాసాలు రాస్తున్నాయి. సందర్భాన్ని బట్టి ఆయా అంశాలకు ప్రాధాన్యతనిస్తూనే తమదైన ఓ విలక్షణతను ప్రకటించుకునేందుకు నేటి దినపత్రికలు ప్రయత్నిస్తున్నాయి. అనేకానేక నూతన శీర్షికలు, అనుబంధాలతో తమ ప్రత్యేకతను ప్రకటించే ప్రయత్నం చేస్తున్నాయి.

## 3.1 ఉపోద్ఘాతం

ప్రజలను చైతన్యవంతులను చేయడంలో పత్రికలు ప్రముఖమైన పాత్ర పోషిస్తాయి. నిజానికి పత్రికలంటే కేవలం దినపత్రికలు మాత్రమే కాదు. వార, పక్ష, మాస, ద్వైమాసిక...ఇలా అనేక రకాల ఆవర్తన వ్యవధుల్లో వెలువడేవన్నీ పత్రికలే.  అయితే సమాజంలోని ప్రతి సభ్యుడి ఆలోచనలకు దర్పణంగా నిలిచిన కారణమో, నిత్యనూతనత్వాన్ని అందించడమో గానీ పత్రిక అంటే దినపత్రిక అనే అర్థమే వర్తమానంలో రూఢి అయింది. ఆంధ్రాంగ్ల మిశ్రమ వ్యవహారంలో కూడా పేపర్ (Paper) అంటే Daily News Paper (దినపత్రిక) అనే అర్థమే శ్రోతకు / పాఠకుడికి స్ఫురిస్తోంది.

ఇంతగా, దినపత్రికలు మనిషి జీవితంతో గాఢానుబంధాన్ని పెనవేసుకున్నాయి. ఇంత జరగడానికి వెనుక పెద్ద చరిత్రే ఉంది. దాదాపు 150 సంవత్సరాలకు పైబడిన పత్రికారంగ చరిత్ర, అందులోను 100 సంవత్సరాలకు పైబడిన తెలుగు పత్రికారంగ చరిత్ర...తక్కువ వ్యవధేమీ కాదు. ప్రజల ఆశయాలు, ఆకాంక్షలకు దర్పణంగా నిలిచిన కారణంగా దినపత్రికలే నేటి సమాజాన్ని అత్యంత వేగంగా, అత్యధికంగా ప్రభావితం చేసే స్థితికి చేరుకున్నాయి. ఇంకా చెప్పాలంటే..ఓరకంగా ఆంధ్ర రాష్ట్ర రాజకీయాలకు తెలుగు దినపత్రికలు దిశానిర్దేశం చేస్తున్నాయి.

అయితే, కేవలం రాజకీయ వార్తలకు మాత్రమే దినపత్రికలు ప్రాధాన్యత ఇవ్వలేదు. సినిమా, విద్యావైజ్ఞానిక, వ్యాపార, మహిళ, బాల, క్రీడా వార్తలన్నింటినీ దినపత్రికలు అందిస్తున్నాయి. గృహిణులు, ఉద్యోగార్థులు, విద్యార్థుల కోసం ప్రత్యేక పేజీలు కేటాయిస్తున్నాయి. వీటన్నిటి కారణంగా దినపత్రికల పఠనం దాదాపుగా ప్రతి పౌరుడికి దైనందిన జీవన క్రియలో భాగంగా మారింది. ఇంతటి ఉన్నత స్థానం ఉన్న దినపత్రికల తీరుతెన్నులు, వాటిలోని విశేషాలను ఈ అధ్యాయంలో చర్చించడం జరుగుతుంది.

## 3.2 దేశాభిమాని

తెలుగులో తొలిపత్రిక ఏదనే విషయంలో అనేక వాదోపవాదాలు నడుస్తున్నప్పటికీ తొలి తెలుగు దినపత్రిక మాత్రం *దేశాభిమాని* అనే విషయంలో ఎటువంటి సందేహం లేదు. ఇప్పటివరకు లభించిన ఆధారాలన్నీ ఈ విషయాన్ని రూఢి చేస్తున్నాయి. దేవగుప్తం శేషాచలపతిరావు దీనికి వ్యవస్థాపకుడు. బెజవాడ నుంచి *కృష్ణావృత్తాంతిని*, *కృష్ణాన్యూస్* పేర్లతో కొంతకాలం వెలువడిన ఈ పత్రిక అనంతర కాలంలో దినపత్రికగా మారినట్లు తెలుస్తోంది. *కృష్ణాపత్రిక* 1906, మార్చి సంచికలో చెన్నాప్రగడ వేంకట కృష్ణరాయశర్మ తెలుగు పత్రికలు అనే వ్యాసంలో 'దేశాభిమాని యొక్కసారిగనే దినపత్రికగా మారినది' అని రాశారు. దీన్నిబట్టి 1906కు పూర్వమే *దేశాభిమాని* దినపత్రికగా వెలువడిందని తెలుస్తోంది. అలాగే, 1910 నాటి *ఆంధ్రపత్రిక* ఉగాది సంచికలో అప్పటికి దేశంలో వెలువడిన / నడుస్తున్న పత్రికల వివరాలు ఇచ్చారు. ఇందులో *దేశాభిమాని*ని మాత్రమే దినపత్రికగా పేర్కొన్నారు. ఈ అధారం కూడా *దేశాభిమానే* తొలి తెలుగు దినపత్రిక అనడానికి ఉపకరిస్తుంది.

మరోఆధారం..*తెలుగు జనానా* పత్రిక 1901 సెప్టెంబరు సంచికలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తి శాస్త్రి నడుపుతున్న *గౌతమి* పత్రిక గురించి రాసిన వ్యాసంలో "ఆంధ్రలోకమున గౌతమియే మొదటి దినపత్రిక కాదు. అట్టి భాగ్యము కృష్ణకే లభించినది. కానీ అది కృష్ణవెల్లువల వలెనే మూడునాళ్ళ మురిపమేయై సింధు గతమైనది. ఇది వరకు బెజవాడలో నుండి, ఈ మధ్య కృష్ణ దాటి గుంటూరు జొచ్చిన దేశాభిమాని కొంతకాలం క్రిందట దినదినమును దలచూపుచు వచ్చెను. ఇప్పుడు ప్రచురమగుచున్న గౌతమి పత్రిక యొక్క మొదటిపుటలో..." అని ఉంది జె.చెన్నయ్య తన *తెలుగు దినపత్రికలు: భాషా సాహిత్య స్వరూపం* (1998, పుట 128, 129)లో రాశారు.

వి.లక్ష్మణరెడ్డి తన *తెలుగు జర్నలిజం : అవతరణ వికాసంలో* (2002, పుట52, 53) “శేషాచలపతిరావు కృష్ణావృత్తాంతిని అని, కృష్ణాన్యూస్ అని కొంతకాలం బెజవాడలో ప్రచురించి, దాన్నే దేశాభిమానిగా మార్చారు. ఇది కొంతకాలం ఆంధ్రాంగ్ల భాషల్లో ప్రచురితమైంది. ఈ శతాబ్ది ప్రారంభంలో ఇది దినపత్రికగా కొంతకాలం ప్రచురితమైంది. తెలుగులో వెలువడ్డ మొదటి దినపత్రిక ఇదే. ఈ పత్రిక 30 సంవత్సరాలు నడిచింది. దినపత్రికలకు నేడు కాణాచిగా ఉంటున్న విజయవాడలో ఈ మొదటి దినపత్రిక అవతరించడం పేర్కొనదగ్గ విశేషం” అని రాశారు.

ఈ అధారాలన్నీ దేశాభిమానినే తొలి తెలుగు దినపత్రికగా ప్రకటిస్తున్నాయి. దీంతో తెలుగులో తొలిగా దినపత్రికను వెలువరించిన ఖ్యాతి కృష్ణాజిల్లాలోని విజయవాడకు దక్కుతోంది. పట్టుదలకు శేషాచలపతిరావు పెట్టింది పేరు. మూడుపైసల (0-0-3) చొప్పున ఈ పత్రికను అమ్మేవారు. ఈయన నేతృత్వంలో దేశాభిమాని మధ్యాంధ్రదేశ ప్రజల్లో పత్రికా పఠనాసక్తిని ఎంతగానో పెంచింది. నిర్మొహమాటమైన విమర్శలు ఇందులో ప్రచురించేందుకు శేషాచలపతిరావు వెనుకంజ వేసేవారు కాదు. స్థానిక అధికారుల చర్యలను సైతం ఈ పత్రిక విమర్శించేంది. దాదాపు 30 సంవత్సరాలు ఈ పత్రిక నడిచింది.

## 3.3 కృష్ణాపత్రిక

బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ వారు 1611లో  మచిలీపట్నం ఓడరేవు దగ్గర ఫ్యాక్టరీ స్థాపన చేయడం ద్వారా ఆంధ్రదేశంలో కాలుమోపారు.ఈరకంగా విదేశీయుల పరిపాలన కాలంలోనే మచిలీపట్నం ప్రధానవ్యాపార కేంద్రంగా రూపుదిద్దుకుంది. ఆకాలంలో కృష్ణా జిల్లాను కృష్ణా మండలంగా వ్యవహరించేవారు. ఇప్పటి కృష్ణా జిల్లా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలు కలిసి కృష్ణామండలంగా ఉండేవి. ఈవిధంగా విదేశీ వ్యాపారాలు తదితర కారణాలతో కృష్ణామండలం అన్నిరకాల చైతన్యాలకు నిలయంగా ఉండేది.

క్రమంగా 1902 నాటికి ఇక్కడి ఉత్సాహవంతులైన యువకులు, సంఘసంస్కరణ శీలురు కలిసి కృష్ణాజిల్లా సంఘంగా ఏర్పడ్డారు. సంఘం ఆశయాల్లో భాగంగా పత్రికను ఏర్పాటుచేయాలని నిర్ణయించారు. అదే ఏడాది అంటే 1902లో జరిగిన సంఘం సభకు రెంటాల వెంకట సుబ్బారావు అధ్యక్షత వహించి మాట్లాడుతూ సంఘం తరఫున పత్రికను ప్రారంభించాల్సిన అవసరం గురించి ప్రసంగించారు.

ప్రతిపాదనతో పాటుగా తొలిగా వంద రూపాయల విరాళాన్ని కూడా పత్రిక నిర్వహణకు అందించారు. అవెంటనే సంఘ సభ్యులైన పురాణం వెంకటప్పయ్య, జంధ్యాల గౌరీనాథశాస్త్రి, వేమూరి వేంకట సుబ్బారావు, శెడింబి హనుమంతరావు, వల్లూరి సూర్యనారాయణరావు, పెద్దిభొట్ల వీరయ్య మొదలైనవారు కూడా విరాళాలు అందించారు. క్రీ.శ.1902, ఫిబ్రవరి 1వ తేదీన కొండా వెంకటప్పయ్య పంతులు, దాసు నారాయణరావు సంయుక్త సంపాదకత్వంలో కృష్ణాపత్రిక తొలి సంచిక విడుదలైంది.

ఆ పత్రికలోనే 'స్వవిషయం' అనే శీర్షికతో పత్రిక ప్రకటనావశ్యకత, తమ ఆశయాలు ప్రస్తావన చేస్తూ ప్రచురణకర్తలు ఇలా రాశారు... "రాజ్య పద్ధతులను, వాని లోపములను నివృత్త చేయు మార్గములను, సంఘ సంస్కరణ రీతులను, రసవాద, ప్రకృతిశాస్త్ర విశేషములను, వ్యవసాయము, చేతిపనులు మొదలుగా గల నుపయుక్త విషయముల నిందు వ్రాయుచుంటిమి. ఆ విషయములందు కూడ జనసామాన్యమునకు కొంతపాటి పరిచయము కలిగిన కాని దేశమభివృద్ధి గానేరదు. స్వలాభము గోరక దేశాభివృద్ధి కొరకై అభిమాన బుద్ధితో బూనిన యీ ప్రయత్నమునకు కృష్ణామండలము నందలి చదువరులందరు తోడ్పడి దీనికి చందాదారులుగా జేరి దీనినభివృద్ధికి దెచ్చెదరని నమ్ముచున్నాము.." (వేంకట స్వామి నాయుడు, సాదనాల. కృష్ణాపత్రిక సాహిత్య సేవ – ఒక పరిశీలన, 1994, పుట 14)

ప్రారంభం నుంచి 1905వ సంవత్సరం వరకు పక్షపత్రికగా నడిచిన కృష్ణాపత్రిక 1906–07 మధ్యకాలంలో వారపత్రికగా మారింది. పత్రిక సహసంపాదకుడైన దాసు నారాయణరావు 02.09.1905న మరణించడంతో ఆయన స్థానంలో ముట్నూరి కృష్ణారావు సహాయ సంపాదకుడిగా కృష్ణాపత్రికలో చేరారు. ఇదిలాఉండగా, పరిపాలన సౌలభ్యం కోసం 1905లో నాటి బ్రిటీష్ ప్రభుత్వం కృష్ణాజిల్లాను రెండుగా విభజించి గుంటూరు జిల్లాను ప్రత్యేకంగా ఏర్పాటుచేసింది. ఈకారణంగా అప్పటివరకు శెడింబి హనుమంతరావుతో కలసి ప్లీడర్‌గా ప్రాక్టీసు చేస్తున్న కొండా వెంకటప్పయ్య తమ స్వస్థానమైన గుంటూరుకు మకాం మార్చారు. దీంతో కృష్ణాపత్రిక నిర్వహణ, సంపాదకత్వ బాధ్యతలు పూర్తిగా ముట్నూరి కృష్ణారావు చేపట్టవలసి వచ్చింది. అదే ఏడాది అంటే 1905లో జరిగిన వంగరాష్ట్ర విభజనకు అసమ్మతి ప్రకటిస్తూ తిలక్, అరవిందఘోష్, బిపిన్‌చంద్రపాల్ నాయకత్వంలో విదేశీవస్తు బహిష్కార ఉద్యమం దేశమంతటా జరిగింది. ఆ సమయంలో బిపిన్‌చంద్రపాల్ నిర్వహిస్తున్న న్యూ ఇండియా పత్రిక ముట్నూరి కృష్ణారావును అధికంగా ప్రభావితం చేసింది.

ఈ పరిస్థితుల్లో 1905-07 మధ్యకాలంలో కృష్ణారావు బిపిన్‌చంద్రపాల్‌తో కలిసి వంగదేశమంతటా పర్యటించారు. ఈ సమయంలో అవటవల్లి నారాయణరావు కృష్ణాపత్రిక బాధ్యతలు నిర్వహించారు. బెంగాల్ పర్యటన అనంతరం ముట్నూరి తిరిగి కృష్ణాపత్రిక సంపాదకత్వ బాధ్యతలు తీసుకున్నారు. స్వదేశీయోద్యమ ప్రభావంతో 'కృష్ణా స్వదేశీ ముద్రాక్షర శాల' పేరుతో సొంత ముద్రణాలయాన్ని ఏర్పాటుచేసుకుని, పత్రికకు తానే సంపూర్ణ ఆధిపత్యం వహించారు.

వంగరాష్ట్ర విభజన, వందేమాతరం ఉద్యమం ముట్నూరిలో నూతన చైతన్యం తీసుకురావడంతో పాటు జాతీయ స్ఫూర్తి కలిగించాయి. దీంతో అప్పటిదాకా మితవాద ధోరణితో నడిచిన కృష్ణాపత్రిక కొంత తీవ్రవాద ధోరణి అలవరుచుకుంది. ఈ క్రమంలో 1908లో కృష్ణాపత్రికలో ముట్నూరి రాసిన 'తెల్లవారిని తుపాకులతో కాల్చుట' అనే సంపాదకీయం పత్రికను కష్టాల్లో పడేసింది. బ్రిటీష్ ప్రభుత్వ ఆగ్రహానికి గురికావలసి రావడంతో 18.07.1908న ముట్నూరి కృష్ణాపత్రిక బాధ్యతల నుంచి తప్పుకున్నారు. అదేసమయంలో డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య దాదాపు మూడు సంవత్సరాలు పత్రిక బాధ్యతలు వహించడంతో పాటు పత్రికను లాభాల బాట పట్టించి 1912లో ముట్నూరికి తిరిగి అప్పగించారు.

గత అనుభవాల నుంచి నేర్చుకున్న పాఠాలతో కృష్ణాపత్రిక ఒకవిధమైన గడుసుదనపు రీతికి మారింది. "చట్ట నిబంధనలకు లొంగని చక్కని వ్యంగ్య స్ఫూర్తితో బ్రిటీషు పరిపాలకుల నపహాస్యమొనరిస్తూ, తోటి దేశీయుల్లో జాతీయతా ప్రబోధం గావించిన వాక్చాతుర్యమది. ఈ రచనా ధోరణి పాఠకలోకాన్ని ఉద్రూతలూగించేది. విస్మయచకితుల్ని చేసేది. కర్తవ్య దీక్షాబద్ధులుగా మలచేది." (ముట్నూరి కృష్ణారావు సంపాదకీయాలు, దత్తాత్రేయశర్మ, ఎం. 1992, పుట 42).

అప్పటినుంచి ఆంధ్రజాతి పునరుజ్జీవనానికి, అభ్యుదయ కళాకవిత్వ వికాసానికి కృష్ణాపత్రిక వేదికగా మారింది. సాంఘిక, రాజకీయ, ఆర్థిక, శిల్ప, సాహిత్య, కళారంగాలపై ఎన్నో విలువైన వ్యాసాలు ఇందులో ప్రచురితమయ్యాయి. వీటికి తోడుగా కృష్ణారావు సంపాదకీయాలు పత్రికకు మరింత శోభ తెచ్చేవి.

కేవలం ఆయన సంపాదకీయాల కోసమే పత్రిక చదివేవారనడం అతిశయోక్తి కాదు. మొత్తం ఆంధ్రదేశం కృష్ణాపత్రికను ఆదర్శంగా తీసుకుంది. పత్రిక రాక కోసం గ్రామాల్లో ఎదురుచూసేవారు. రచ్చబండపై సమావేశమై పత్రికను చదివించుకునేవారు.

సమాజంలోని వివిధ రంగాల్లో ఆయా సందర్భాల్లో జరుగుతున్న పరిణామాలను విశ్లేషించడంతో పాటు సమాజంలోని దురాగతాలను ఎండగట్టడంలో కృష్ణాపత్రిక ముందుండేది. ప్రభుత్వ దుశ్చేష్టలు నిరసిస్తూ వార్తలు వచ్చేవి. ఆర్థిక, సాంఘిక సమస్యలకు చక్కని పరిష్కారాలు సూచిస్తూ వార్తలు ప్రకటితమయ్యేవి. పత్రికలో ఏ వార్త వచ్చినా అందులో పరిపూర్ణత కనిపించేది.

## 3.3.1 ముట్నూరి సంపాదకీయాలు

కృష్ణాపత్రిక అనగానే ముట్నూరి సంపాదకీయాలు గుర్తుకువస్తాయి. వీటితోపాటు ఆసక్తిదాయకమైన రచనలెన్నో ఇందులో ఉండేవి. హాస్యానికి, హర్షానికి ఆలంబనగా ఎన్నో శీర్షికలు ఇందులో నడిచేవి. ఇందులో ప్రచురించిన ధారవాహికల్లో *'అభినయాలు–రూపకాలు'*, *'కావ్యమీమాంస–శాస్త్ర విచారము'*, *'కల్పనాకథలు'*, *'రసమంజరి'* ఎంతగానో ప్రజాదరణ పొందాయి. ఇక, రచయితలపరంగా చూస్తే పింగళి నాగేంద్రరావు, కాటూరి వేంకటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి ఆంజనేయులు, విశ్వనాథ వేంకటేశ్వర్లు, సర్వా వెంకట శేషయ్య, సబ్నివీసు రామారావు, సబ్నివీసు గురునాథరావు, శేషాద్రి రమణ కవులు, వేమూరి వేంకట రామనాథం, వేమూరి రామకృష్ణ, కొడాలి వేంకట సుబ్బారావు, కామరాజుగడ్డ శివయోగానందరావు మొదలైన ప్రముఖుల రచనలు ఇందులో ఉండేవి.

అలాగే *'బాలానందం'* శీర్షికలో బాలసాహిత్యం, *'గ్రంథ సమీక్షలు'* శీర్షికలో గ్రంథ విమర్శ, 'వార్తావళి'లో క్లుప్తంగా జాతీయ, అంతర్జాతీయ వార్తలు, *'ఆకాశవాణి'* పేరుతో రేడియో ప్రసంగ వ్యాసాలు, *'వెండితెర'* పేరుతో సినిమా విశేషాలు ప్రచురించేవారు. ఇంకా, *'కాలవాహిని'; 'గ్రామ సమాచారములు'; 'చరిత్ర చణుకులు'* శీర్షికలో సంక్షిప్త సమాచారాన్ని అందించేవారు. *'విచిత్ర చిత్రావళి'* శీర్షికలో కార్టూన్ సంభాషణలు, *'ఆంధ్రవాణి'; 'తపాలాపెట్టె'* శీర్షికలు ప్రచురించేవారు. రావూరి సత్యనారాయణ నిర్వహించిన *'వడగళ్ళు'* శీర్షిక పూర్తిగా హాస్యంతో నిండిఉంది పాఠకులను ఎంతగానో ఆకట్టుకునేది.

మారుపేర్లతో కృష్ణాపత్రికలో రచనలు చేసినవారున్నారు. మల్లాది రామకృష్ణశాస్త్రి 'పరమానందయ్య శిష్యుడు' పేరుతో రాసిన 'చలువ మిరియాలు'; 'దర్బారు శాయరు' పేరుతో కాటూరి వేంకటేశ్వరరావు రాసిన 'పన్నీటి జల్లులు' పాఠకుల మన్ననలు అందుకున్నాయి.

వీటితో పాటు 'సూర్యం చెప్పిన కథలు' శీర్షికతో అబ్బూరి రామకృష్ణారావు చేసిన రచన కూడ పత్రిక కీర్తికిరీటంలో చేరింది. కృష్ణాపత్రికలో ప్రచురితమైన నాటకాల పరంగా చూస్తే పింగళి నాగేంద్రరావు రాసిన 'పాషాణి'; 'జేబున్నీసా'; 'శ్రీకృత్తివాసతీర్థుల 'దయ్యాలు', సబ్నివీసు రామారావు 'రైతుబిడ్డ', వేలూరి చంద్రశేఖరం 'కాంచనమాల' పత్రికా ప్రచురణలో ఓ నవ్యపథానికి నాందిపలికాయి.

'నల్లకలువ' పేరుతో అలెగ్జాండర్ డ్యూమస్ నవలకు కాటూరి వేంకటేశ్వరరావు చేసిన అనువాదం, మునిమాణిక్యం నరసింహారావు 'తిరుమాళిగ' నవల చరిత్ర సృష్టించాయి. రవీంద్రనాథ్ ఠాగూర్, ప్రేమ్‌చంద్, శరచ్చంద్రఛటోపాధ్యాయ తదితరుల వంగసాహిత్యానికి తెలుగు అనువాదం కృష్ణాపత్రికకు వన్నెతెచ్చిన అంశాల్లో ఒకటిగా నిలిచింది. ఈవిధంగా ఇతర భాషా సాహిత్య పరిమళాలను అందిస్తూనే తెలుగు సాహ్యిత సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడడంలో కృష్ణాపత్రిక తన కర్తవ్యాన్ని దిగ్విజయంగా పూర్తి చేసింది. (వేంకట స్వామి నాయుడు, సాదనాల. కృష్ణాపత్రిక సాహిత్య సేవ – ఒక పరిశీలన, 1994, పుట 21–23)

"దేశ చరిత్రలోని వివిధ ఘట్టాల్లో వివిధోద్యమాలకు కృష్ణారావు చేసిన వ్యాఖ్యానాలు వెలుగుబాటలయ్యాయి. ముఖ్యంగా సహాయనిరాకరణోద్యమ కాలంలో గాంధీజీ నవీన సిద్ధాంతాలను విశదపరచడంలో కృష్ణాపత్రిక ప్రముఖ స్థానం వహించింది. ఖాదీ, హరిజనోద్ధరణ, హిందూ–ముస్లిం సమైక్యత మొదలైన సాంఘిక సమస్యలను విపులంగా వ్యాఖ్యానించి నిర్మాణ కార్యక్రమాలకు దోహదం చేసింది.". (గోపాలరెడ్డి, బెజవాడ. నేనెరిగిన కృష్ణాపత్రిక, పుట 8,9. 1964)

### 3.4 ప్రజాశక్తి

క్రీ.శ. 1942లో సోవియట్ రష్యాపై దండయాత్ర చేయడం, అనంతర పరిణామాల నేపథ్యంలో భారతదేశంలో కమ్యూనిస్ట్ పార్టీపై ప్రభుత్వ నిషేధం తొలగింది. దీంతో అప్పటిదాకా రహస్య జీవితం గడుపుతున్న వామపక్ష పత్రిక సంపాదకులు వెలుగులోకి వచ్చారు. దీంతో 1942, జూన్ 17వ తేదీన విజయవాడ నుంచి ప్రజాశక్తి వారపత్రిక వెలువడింది. దాదాపు మూడు సంవత్సరాల తర్వాత, అంటే 1965, డిసెంబరు 3వ తేదీన విజయవాడ నుంచే ప్రజాశక్తి దినపత్రికగా వెలువడింది. ప్రసిద్ధ చిత్రకారుడు అడవి బాపిరాజు ప్రజాశక్తి ముఖపత్రానికి అక్షరాలు దిద్దారు. ప్రధానంగా కమ్యూనిజం భావజాలాన్ని వ్యాప్తిలోకి తీసుకువచ్చేందుకు ఈ పత్రిక ప్రయత్నించింది.

అయితే సాంఘిక, భాషా సాహిత్యాలకు సైతం తగిన ప్రాధాన్యత ఇస్తూ ఇందులో వార్తలు ప్రచురితమయ్యేవి. పీడిత ప్రజల వాణిగా ప్రజాశక్తి ఎదిగింది. "భారత జాతీయోద్యమ వెల్లువను ప్రతిబింబిస్తూ వివిధ ప్రజా ఉద్యమాలు, అభ్యుదయోద్యమాలు విస్తరిల్లిన ఆ రోజుల్లో ఆ ఉద్యమాల నిర్మాతగా ప్రజాశక్తి పనిచేసింది. యుద్ధానంతరం ఆజాద్ హింద్ సైనికుల విడుదల కోసం ప్రజ్వరిల్లిన ప్రజావెల్లువకు, నావికుల తిరుగుబాటుకు ప్రజాశక్తి అండగా నిలిచింది" అని లక్ష్మణరెడ్డి, వి. తన *తెలుగు జర్నలిజం అవతరణ వికాసం* (2002:పుట 145)లో రాశారు.

నిజాం పాలనకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు సాగించిన పోరాటానికి ప్రజాశక్తి అండగా నిలిచింది. ఇందులో నిర్వహించిన 'కంచుకాగడా' శీర్షిక నిశిత విమర్శలకు, పదునైన భాషకు, వ్యంగ్యానికి పేరు పొందింది. కమ్యూనిస్ట్ ఉద్యమాలపై జరిగిన నిర్బంధ కాండలో భాగంగా 1948 ప్రాంతాల్లో పత్రికా కార్యాలయంపై అనేక దాడులు జరిగాయి. ఫలితంగా 1948, ఏప్రిల్ 22న ప్రజాశక్తి ప్రచురణ ఆగింది. 1951లో నిర్బంధం కొంత సడలడంతో ఆదే ఏడాది నవంబరు 21న ప్రజాశక్తి వారపత్రికగా తిరిగి ప్రారంభమైంది. 1952లో కొంతకాలం ద్వైవారపత్రికగా కూడా నడిచింది. తర్వాత 1968, జులై 28 నుంచి తిరిగి వారపత్రికగా మారి 13 సంవత్సరాల పాటు వెలువడింది. 1981 ఆగష్టు 1 నుంచి దినపత్రికగా మారి సి.పి.ఐ.(ఎం) అధికార పత్రికగా, విజయవాడ ప్రధాన కేంద్రంగా ఇప్పటికీ నడుస్తోంది.

వారపత్రికగా వెలువడిన తొలిసంచికలో ప్రజాశక్తి తన లక్ష్యప్రస్తావన ఇలా చేసింది. "అభివృద్ధి నిరోధకత్వాన్ని, విధానాలను, గుత్తాధిపత్యాన్ని ప్రతిఘటించడానికి జరిగే పోరాటానికి ప్రజాశక్తి ప్రోద్బలమిచ్చి బలపరుస్తుంది.అందుకు అభ్యుదయకాముక ప్రజాశక్తులన్నీ కలిసి పనిచేయాలని ప్రజాశక్తి కోరుకుంటుంది. కార్మికవర్గ నాయకత్వాన కార్మిక, కర్షక ఐక్యతకు పునాదిరాయి వేసుకుని ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించడానికి ప్రజాశక్తి కృషిచేస్తుంది." (చంద్రశేఖర్, పగడాల. *తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం*; 2011, పుట 138). పత్రిక ప్రారంభ సంచికలో ప్రచురించిన లక్ష్యప్రస్తావనలో చెప్పినట్లుగా అట్టడుగు వర్గాల పత్రికగా ప్రజాశక్తి పేరుపొందింది. ప్రస్తుతం ఇతర పత్రికలతో పాటు కాలానుగుణమైన మార్పులు చేసుకుంటూ వినూత్న శీర్షికలు ప్రవేశపెడుతోంది. వార్తా సేకరణ నుంచి పత్రిక ప్రచురణ వరకు అన్ని విభాగాల్లో అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందిపుచ్చుకుని, సంస్థాగత మార్పులు చేసుకుంటూ పాఠకుల మన్ననలు అందుకునేందుకు కృషి చేస్తోంది. అయితే వామపక్ష పార్టీల కొమ్ముకాచే పత్రికగా ఈ పత్రిక మీద ఉన్న అపవాదు ఇప్పటికీ తొలగలేదు.

## 3.5 ఆంధ్రపత్రిక

తెలుగు జాతి సర్వతోముఖాభివృద్ధి సాధించడానికి కంకణం కట్టుకుని పనిచేసిన ఏకైక పత్రిక ఆంధ్రపత్రిక. రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, కళా, విద్యా, విజ్ఞాన, వ్యాపార, క్రీడ తదితర రంగాల్లో తెలుగువారిని విషయ నిష్ణాతులుగా చేసిన ఘనత *ఆంధ్రపత్రిక*కే దక్కుతుంది. మొత్తంగా తెలుగుజాతి చైతన్యదీప్తిగా ఈ పత్రిక పనిచేసిందని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

'విశ్వదాత' కాశీనాథుని నాగేశ్వరరావు నేతృత్వంలో తొలిగా *ఆంధ్రపత్రిక* ది. 09. 09. 1908న వారపత్రికగా వెలువడింది. బొంబాయి నుంచి వెలువడిన ఈ పత్రిక అచిరకాలంలోనే పాఠకుల మెప్పు పొందింది. అనంతర పరిణామాల నేపథ్యంలో 1914లో పత్రిక కార్యాలయం మద్రాసుకు మారింది. ఇదే సమయంలో జరిగిన హోమ్‌రూల్ ఉద్యమం, మొదటి ప్రపంచ సంగ్రామం.. తదితర అంశాలపై ప్రజలకు మక్కువ పెరిగింది. ఈ వార్తలను అందించే దినపత్రికల కొరత ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువగా ఉండేది. ఇది గమనించిన కాశీనాథుని నాగేశ్వరరావు 1914, ఏప్రిల్ ఒకటో తేదీన ఆంధ్రపత్రిక దినపత్రికను ప్రారంభించారు. తొలి సంచికలో రాసిన సంపాదకీయంలో పత్రిక ఆశయాలను ఈవిధంగా ప్రకటించారు.

"విచారణీయంబులైన విషయంబులనేకములు గలవు. జనాభిప్రాయముల కనుకూలముగ విషయ విమర్శనము జేయుచు ననుదినమును నాంధ్ర దేశ వృత్తాంతాదులను ప్రచురించుటకు దినపత్రికను ప్రచురించుటకేర్పాటులు చేయబడినవి. కాని యనివార్యంబులైన యాటంకముల వలన విలంబనమేర్పడినందులకు జింతిచుచున్నాము. దేశీయ మహాసభాదర్శములును, రాష్ట్రీయ మహాసభాదర్శములును నాంధ్రపత్రికాదర్శములు. హైందవ జాతీయాభ్యుదయములకు నాంధ్ర జాతీయాభ్యుదయమును ప్రసాదించుట పత్రికా నిర్వాహకుల ముఖ్యోద్దేశము. ఆంధ్ర జాతీయాభ్యుదయము సహకారి గాని ప్రతికూలముగాదని పత్రికా నిర్వాహకుల మతము. ఉభయభావములకు విరుద్ధభావమేర్పడినప్పుడు హైందవ జాతీయతకు బ్రతికూలముగ బ్రవర్తింప జూడము. నిమిత్తము ఆంధ్రాభ్యుదయము గాని యితర జాతి ద్వేషము గాదు. అవసరమైనపుడెల్ల యాంధ్రుల వృద్ధికి తగిన సదుపాయములను విసుగు విరామము లేకను ప్రజలకును పాలకులకును నివేదించెదము. శాఖాభేదములను, కులభేదములను, మత భేదములను, జాతిభేదములను గమనింపక మిత్రభావమును వ్యాపింపజేయుటకై ప్రయత్నించెదము. ఆంధ్రోద్యమము పట్ల సంపూర్ణ సానుభూతినుపయోగించెదము.

ఆంధ్రభాష, ఆంధ్ర విశ్వవిద్యాలయ నిర్మాణము, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకత మొదలగు విషయములను సమదృష్టితో సమర్థించుటయే దినపత్రికను ప్రచురించుటకు గల ముఖ్యకారణము. భేదాభిప్రాయములు గలవారు మా యుద్దేశములను వేరుగా గ్రహింపకుండుటకు బ్రార్థితులు. పత్రికల యందు విదేశ స్వదేశ తంతి వార్తలు ఎప్పటికప్పుడు తెలుగు నందును నాంగ్ల భాష నందును బ్రచురించుటకు సాహసించితిమి.

దైవానుగ్రహము వలను దినపత్రిక యించుకేనియు దేశాభ్యుదయమునకు దోడ్పడిన పత్రికా నిర్వాహకులు కృతకృత్యులు. ఇంతవరకును సహాయము జేసినవారలకును, చందాదారులుగా జేరినవారలకును వందనములు. ఆంధ్రమహాజనులు సదభిమానమును బూని పత్రికను పోషించి దేశోపయోగకరముగ జేయుటకు బ్రార్థితులు.”

ఈ సంపాదకీయం ఆధారంగా ఆంధ్రపత్రిక ఆవిర్భావ కారణాలు, పత్రిక ఎంచుకున్న మార్గం బోధపడుతుంది. పత్రిక ప్రారంభం నాటికి యుద్ధం జరుగుతున్న కారణంగా పత్రికలో తెలుగు వార్తలతో పాటు ఇంగ్లిషులో రాయ్‌టర్స్ వార్తలు, టెలిగ్రాము వార్తలు ప్రచురించేవారు. వీటివల్ల పత్రికా నిర్వహణ వ్యయం పెరిగినా ప్రజల్లో ఆసక్తి ఉన్న కారణంగా యాజమాన్యం పత్రికను భారంగా పరిగణించలేదు. యుద్ధం తర్వాతి కాలంలో తెలుగు జాతి హృదయాన్ని ప్రతిబింబించే వార్తలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తూ వార్తలు ప్రకటించేది.

తెలుగు జాతి సుసంపన్నం కావడానికి, ఆంధ్రుల్లో ఐక్యత పెంపొందింపజేయడానికి అంకితమైన ఆంధ్రపత్రిక పత్రికారచనలో నూతన పోకడలకు తెరతీసింది. తెలుగువారిలో పత్రికా పఠనాభిలాష పెరిగింది. గ్రంథాలయాలకు ఆంధ్రపత్రిక ప్రతులను ఉచితంగా పంపిణీ చేసేవారు. దినపత్రికకు అనుబంధంగా సారస్వతానుబంధం వెలువడేది.

తర్వాతికాలంలో ఆంధ్రపత్రిక విజయవాడకు మారింది. కొంతకాలానికి హైదరాబాదుకు విస్తరించి, ఏకకాలంలో రెండు నగరాల నుండి వెలువడింది. కొంతకాలం పత్రిక సాయంకాలం ఎడిషన్ కూడా వెలువడింది. పత్రికారంగంలో వచ్చిన అధునాతన పోకడలు, ఆర్థిక కారణాల వల్ల 1990లో *ఆంధ్రపత్రిక* ప్రచురణ నిలిపివేశారు.

## 3.6 ఆంధ్రప్రభ

తెలుగుజాతి ఔన్నత్యాన్ని కాపాడడంతో పాటు తెలుగు పత్రికా రంగంలో వినూత్న పోకడలకు శ్రీకారం చుట్టిన ఘనత ఆంధ్రప్రభకు దక్కుతుంది. మారుతున్న సమాజావసరాలను గ్రహించి, వార్త ప్రచురణలో విప్లవానికి ఈ పత్రిక నాందీవాచకం పలికింది. 1938, ఆగష్టు 15వ తేదీన ఇండియన్ ఎక్స్‌ప్రెస్ గ్రూపు సంస్థల అధినేత రామనాథ్‌గోయంకా *ఆంధ్రప్రభ* దినపత్రికను మద్రాసు నుంచి ప్రారంభించారు. ఖాసా సుబ్బారావు ఈ పత్రికకు మొదటి సంపాదకుడు. తర్వాత న్యాపతి నారాయణమూర్తి 1942 వరకు సంపాదకుడుగా పనిచేశారు. అప్పటినుంచి 1959 వరకు నార్ల వెంకటేశ్వరరావు సంపాదకుడిగా పనిచేశారు. నార్ల పనిచేసిన కాలంలోనే *ఆంధ్రప్రభ* 'ప్రభ' తెలుగునేల నాలుగుచెరగులా విస్తరించింది. నిజానికి, *ఆంధ్రప్రభ* అంటేనే నార్ల, నార్ల అంటేనే *ఆంధ్రప్రభ* అన్నంతగా పత్రికను ప్రజల అక్కునజేర్చిన ఘనతను నార్ల సాధించారు.

తెలుగు పత్రికా రంగంలోనే ఎన్నో సంచనాలకు మారుపేరుగా, ఎన్నో నూతన విధానాలను తొలిగా ప్రవేశపెట్టిన పత్రికగా *ఆంధ్రప్రభ* నిలిచింది. ఇందులో ముఖ్యమైనది వార్తలను పేజీలో అందంగా తీర్చిదిద్దడం. దీంతోపాటు పత్రిక మొదటి పేజీలో వ్యాపార ప్రకటనలు ప్రచురించడాన్ని *ఆంధ్రప్రభ* ఒప్పుకోలేదు. ఏ వార్తకు ఎంత ప్రాధాన్యత ఇవ్వాలో ఆలోచించి, అందుకు అనుగుణంగా వార్తలు తీర్చిదిద్దేవారు నార్ల. పత్రిక మొదటి పేజీలో వార్తలు తొలిగా ప్రచురించిన ఘనతను కూడా నార్ల సొంతం చేసుకున్నారు. పత్రిక మొదటి పేజీలో పతాక శీర్షికలు పెట్టడం, కార్టూన్లు వేయడంలో ఆంధ్రప్రభ ఇతర పత్రికలకు మార్గదర్శిగా నిలిచింది.

క్విట్ఇండియా ఉద్యమ పరిణామాల నేపథ్యంలో పత్రిక ప్రచురణ కొంతకాలం ఆగింది. ఇది యాజమాన్యం స్వచ్ఛందంగా తీసుకున్న నిర్ణయం. 1959 ప్రారంభంలో నార్ల వెంకటేశ్వరరావు *ఆంధ్రప్రభ*కు రాజీనామా చేశారు. తర్వాత సుమారు మూడు నెలల పాటు వి.డి. ప్రసాదరావు సంపాదకత్వం వహించారు. తర్వాత కొంతకాలం మూతబడిన ప్రభ సుమారు ఏడు నెలల తర్వాత విజయవాడలో ప్రారంభమైంది. నీలంరాజు వేంకటశేషయ్య, పండితారాధ్యుల నాగేశ్వరరావు, కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం, ఎబికె ప్రసాద్, పొత్తూరి వెంకటేశ్వరరావు, వాసుదేవ దీక్షితులు వంటి ఉద్దండులు తర్వాతి కాలంలో సంపాదకులుగా పనిచేశారు. ప్రస్తుతం హైదరాబాదు, విజయవాడ, బెంగళూరు, విశాఖపట్నం, చెన్నైల నుంచి ఏకకాలంలో పత్రిక వస్తోంది. ఒకటి కన్నా ఎక్కువ కేంద్రాల నుంచి విడుదలైన తొలి పత్రిక కూడా *ఆంధ్రప్రభ* కావడం విశేషం.

### 3.6.1 నార్ల సంపాదకీయాలు

ఆంధ్రప్రభను ప్రస్తావించి నార్ల సంపాదకీయాలను ప్రస్తావించకపోవడం దోషమే అవుతుంది. తాను చెప్పదలచుకున్న విషయాన్ని సుస్పష్టంగా చెప్పడంలో ఆయన దిట్ట. భాషకు, జర్నలిజానికి ఏదో గతానుబంధం ఉందనిపించేలా భావస్ఫోరకంగా, ఉత్తేజకరంగా ఆయన సంపాదకీయాలు సాగేవి. తాత్కాలిక సన్నివేశాలు, సామాజిక సమస్యలు, నిత్యజీవిత సంఘటనలపైనే సంపాదకీయాలు సాగినా వాటిలో ఎన్నో సాహిత్య విషయాలు దాగుండేవి. అందుకే నార్ల సంపాదకీయాలకు శాశ్వతమైన విలువ వచ్చింది. "ఆయన సంపాదకీయాలలో ఉద్రేకం, ఉద్వేగం ఉండవు. నిప్పులు గుప్పించడు. నీళ్ళు నమలడు. అవి వివేచనా పటిమను వృద్ధి పొందించడంతో పాటు హృదయవైశాల్యాన్ని వృద్ధి చేసేవి" అని లక్ష్మణరెడ్డి, వి. తన *తెలుగు జర్నలిజం అవతరణ వికాసం* (2002, పుట 1550)లో రాశారు. ఆంగ్ల పదాలకు తగిన నూతన పదాలు సృష్టించడంలోను నార్లది అందెవేసిన చెయ్యి. యునైటెడ్ నేషన్స్‌కు ఐక్యరాజ్యసమితి, యునెస్కోకు ప్రపంచ విజ్ఞాన సమితి, నాన్‌ఎలైన్డ్‌కు అలీన అనే పదాన్ని నార్ల సృష్టించారు. ఆయనదొక అపూర్వ శైలి. అది తర్వాతి పత్రికలకు, పత్రికా సంపాదకులకు మార్గదర్శకతారగా నిలిచింది.

## 3.7 విశాలాంధ్ర

సరిగ్గా అరవయ్యేళ్ళ క్రితం *విశాలాంధ్ర* తెలుగు నేలపై దినపత్రికగా తన ప్రస్థానం ప్రారంభించింది. ఈ పత్రిక ఆరంభం కావడానికి ఒక చారిత్రక నేపథ్యం, లక్ష్యం ఉన్నాయి. స్వదేశీ సంస్థానాల పాలనలో, బ్రిటీష్ వారి పాలనలో చెల్లాచెదురైన తెలుగువారందరూ భౌగోళికంగా, పరిపాలనా పరంగా ఒక్కటి కావాలన్న ఆకాంక్ష బలంగా ఉన్న రోజులవి. భాషాప్రయుక్త రాష్ట్రోద్యమం పెల్లుబికిన రోజులవి. వీర తెలంగాణ ప్రజలు రైతాంగ సాయుధ పోరాటం పర్యవసానంగా 'తరతరాల బూజు' నిజాం నిరంకుశ పాలనను వదిలించుకుని హైదరాబాదు రాష్ట్రంగా స్వతంత్ర భారతావనిలో భాగస్వాములయ్యారు. మద్రాసు రాష్ట్రంలో ఉన్న తెలుగు భాషా ప్రాంతవాసులు ఆంధ్రరాష్ట్రం కోసం ఉవ్వెత్తున ఉద్యమిస్తున్నారు. తెలుగు ప్రజలు తమ సర్వతోముఖాభివృద్ధికి, సాంస్కృతికాభివృద్ధికి ఒకే ఆచ్ఛాదన కిందకు రావాలన్న ప్రబలమైన ఆకాంక్షతో విశాలాంధ్ర ఉద్యమం ఉరకలెత్తుతోంది. తెలుగు ప్రజల జాతీయోద్యమ వెల్లువకు ప్రతిబింబంగా విశాలాంధ్ర పేరుతో దినపత్రికను ప్రారంభించాలని ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ నిర్ణయించిన చారిత్రక నేపథ్యం అది.

అంతకుమునుపే కమ్యూనిస్టు పార్టీ విశాలాంధ్రలో ప్రజారాజ్యం పిలుపునిచ్చింది. కార్మిక కర్షక ఐక్యతతో శ్రమజీవులందరి సౌఖ్యం కోరే పరిపాలనను నెలకొల్పటం చారిత్రిక లక్ష్యంగా నిర్ణయించుకుంది. ఈ నేపథ్యంలోనే తెలుగు ప్రజల సమైక్యత, సర్వతోముఖాభివృద్ధి ఆకాంక్షలకు, ప్రజారాజ్య నిర్మాణ లక్ష్యానికి ప్రతీకగా విశాలాంధ్ర జాతీయ దినపత్రిక తన ప్రస్థానం ప్రారంభించింది.

### 3.7.1 తెలుగు గడ్డపై కమ్యూనిస్టు పత్రికలు

తెలుగు గడ్డపై కమ్యూనిస్టు ఉద్యమం 1933లో ప్రారంభం కాగా, 1937 నాటికి నవశక్తి అక్షరబద్ధమై సామాన్యుడికి చేరువ అయింది. 1937 డిసెంబరు 15వ తేదీన రాజమండ్రిలో ప్రారంభమైన నవశక్తి తెలుగు గడ్డపై వెలువడిన తొలి కమ్యూనిస్టు పత్రిక. నిర్బంధ రాజకీయ ఒత్తిడుల మధ్య చాలా సంవత్సరాల పాటు, కొన్నాళ్ళు రాజమండ్రి నుంచి, మరికొన్నాళ్ళు విజయవాడ నుంచి వెలువడిన నవశక్తి రెండో ప్రపంచయుద్ధ కాలంలో పాలకుల దుర్నీతికి మూతపడాల్సి వచ్చింది.

ఆ తర్వాత స్వతంత్ర భారత్ పత్రిక రహస్యంగా ముద్రితమై, ప్రజలకు చేరేది. అది అభ్యుదయవాదులకు ఆయుధంగా మారింది. ఇది గిట్టని పాలకులు పోలీసులతో దాడులు చేయించడంతో పత్రిక నిర్వహణ కష్టసాధ్యంగా మారింది. అనంతర కాలంలో ప్రజాశక్తి వార పత్రికగా 1924లో ప్రారంభమై శ్రామిక ప్రజల పక్షాన నిలబడి, నిజమైన ప్రతినిధిగా కర్తవ్యాన్ని నెరవేర్చింది.

పార్టీ నిర్మాణ ఉద్యమంలో తనదైన పాత్రను పోషించిన ప్రజాశక్తికి ఆరంభం నుంచీ అన్నీ ఆటుపోట్లే. అణచిపెట్టే కొద్దీ రెట్టించిన ఉత్సాహంతో ప్రజాశక్తి ప్రజల పత్రికగా రూపుదిద్దుకుని 1945 నుంచి దినపత్రికగా వెలువడింది. పీడిత ప్రజల హక్కుల కోసం ప్రజాఉద్యమ నిర్మాణంలో పాలు పంచుకుంటున్న ప్రజాశక్తి నడక పాలకుల గుండెల్లో గుబులు పుట్టించడంతో 1948లో ఆ పత్రికను నిషేధిస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు వెలువడ్డాయి.

ఈ నేపథ్యంలో పత్రిక ముద్రణాలయం పూర్తిగా ధ్వంసం అయింది. ఆ నిర్బంధకాలంలోనే విజయవాడ నుంచి జనత, మద్రాసు నుంచి సందేశం పత్రికలను కమ్యూనిస్టు పార్టీ నడిపింది. అలాగే తెనాలి నుంచి నగారా, మద్రాసు నుంచి జనవాణి పత్రికలు వెలువడ్డాయి.

## 3.7.2 విశాలాంధ్రకు అంకురార్పణ

ప్రజా పత్రికలపై ఉక్కుపాదం మోపి, పాలకులు నిర్బంధ పాలన కొనసాగిస్తున్న ఈ కాలంలోనే సెట్టి ఈశ్వరరావు సంపాదకత్వంలో మద్రాసు నుంచి విశాలాంధ్ర పక్షపత్రిక ఒకటి వెలువడుతుండేది. అదే సమయంలో ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ విశాలాంధ్ర పేరుతో సైక్లోస్టయిల్ పత్రికను ప్రజలకు అందించింది. జాతీయోద్యమం విజయవంతమై, భాషా ప్రయుక్త రాష్ట్రాలకు ప్రజలు ఉద్యమిస్తున్న ఆ చారిత్రిక దశలో విశాలాంధ్ర నినాదం ప్రజాభిమానం పొందింది.

మూతబడిన *ప్రజాశక్తి* 1951లో వారపత్రికగా వెలువడింది. ఆ తర్వాత కొన్నాళ్ళు ద్వైవారపత్రికగా నడిచింది. ఈ సమయంలోనే హైదరాబాదు నుంచి *ప్రజాయుగం* ప్రారంభమై కొద్దికాలం నడిచింది. సరిగ్గా ఈ నేపథ్యంలోనే తెలుగు ప్రజల జాతీయాభిమానాన్ని, ఆకాంక్షలను ప్రతిబింబిస్తూ ప్రజాభిమానాన్ని విశేషంగా పొందిన *విశాలాంధ్ర* పేరుతో ఒక దినపత్రికను నిర్వహించాలని కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించింది. ఫలితంగా రూపుదిద్దుకున్న *విశాలాంధ్ర* దినపత్రిక 1952, జూన్ 22న విజయవాడ నుంచి ప్రారంభమైంది.

మొదట్లో ఈ పత్రికకు మద్దుకూరి చంద్రశేఖరరావు, కంభంపాటి సత్యనారాయణ, కాట్రగడ్డ రాజగోపాలరావు సంపాదకవర్గంగా ఉండేవారు. 1965-68 మధ్య కాలంలో ఏటుకూరి బలరామ్మూర్తి సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. ఆయన తర్వాత 1968-72 కాలంలో వేములపల్లి శ్రీకృష్ణ సంపాదకులుగా ఉన్నారు.

అదే ఏడాది అంటే 1972లో సి.రాఘవాచారి *విశాలాంధ్ర* సంపాదకత్వం స్వీకరించి, మూడు దశాబ్దాల పాటు పత్రికను అప్రతిహతంగా నడిపారు. 2002లో *విశాలాంధ్ర* స్వర్ణోత్సవం జరుపుకుంది. నాటి నుంచి 2011 వరకు ఈడ్పుగంటి నాగేశ్వరరావు సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. ఆయన నుంచి కె.శ్రీనివాసరెడ్డి బాధ్యతలు తీసుకున్నారు. ఈడ్పుగంటి నాగేశ్వరరావు ఎడిటోరియల్ బోర్డు చైర్మన్‌గా వ్యవహరిస్తున్నారు. గతేడాది అంటే 2012లో *విశాలాంధ్ర* వజ్రోత్సవాలు అట్టహాసంగా జరిగాయి. అన్ని ఇతర పత్రికల తీరులోనే విశాలాంధ్ర కూడా సమాజంలోని వివిధ వర్గాలను ఆకర్షించేలా శీర్షికలు నిర్వహిస్తోంది. అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అందిపుచ్చుకుని, ఎప్పటికప్పుడు పాఠకులకు కొత్తదనాన్ని అందించేందుకు తనను తాను తీర్చిదిద్దుకుంటోంది.

## 3.8 ఆంధ్రభూమి

*ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ప్రజాశక్తి* తదితర పత్రికలు అప్పటికే తెలుగుదేశంలో నిలదొక్కుకున్న కాలంలో వెలువడిన దినపత్రిక *ఆంధ్రభూమి.* అరవయ్యో దశకం తొలినాళ్లలో వచ్చిన ఈ దిన పత్రిక ప్రారంభంలో కొద్దిగా ఒడిదుడుకులు ఎదుర్కొన్నప్పటికీ క్రమంగా పాఠకుల ఆదరణ పొందింది. దక్కన్ క్రానికల్ గ్రూపు నుంచి వెలువడిన తెలుగు దినపత్రిక *ఆంధ్రభూమి.* 1960లో తొలిగా సికింద్రాబాదు నుంచి ఈ పత్రిక వెలువడింది. పండితారాధ్యుల నాగేశ్వరరావు దీనికి తొలి సంపాదకుడు. తర్వాతికాలంలో గోరా శాస్త్రి, గజ్జెల మల్లారెడ్డి, ఎబికె ప్రసాద్ సంపాదకులుగా పనిచేశారు. గోరా శాస్త్రి క్రీ.శ. 1962లో సంపాదక బాధ్యతలు చేపట్టిన కాలంలోనే జి.ఎస్.వరదాచారి, బెల్లంకొండ రామదాసు వంటి హేమాహేమీలు ఇక్కడ పనిచేశారు. వీరందరి సమష్టి కృషి ఆంధ్రభూమిని పాఠకులు అక్కున చేర్చుకునేలా చేసింది. తెలంగాణ ఉద్యమ కాలంలో గోరా శాస్త్రి వేర్పాటు వాదాన్ని వ్యతిరేకిస్తూ రాసిన సంపాదకీయాలు అప్పట్లో చర్చకు దారితీశాయి.

దాదాపు 20 సంవత్సరాల పాటు ఆయన సంపాదకత్వంలో వెలువడిన ఈ పత్రిక ప్రజాభిమానాన్ని పొందింది. ప్రస్తుతం హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం, రాజమండ్రి కేంద్రాల నుంచి ప్రచురితమవుతున్న ఈ పత్రికకు ఎంవిఆర్ శాస్త్రి ప్రధాన సంపాదకుడుగా వ్యవహరిస్తున్నారు. సినిమా, బాలలు, మహిళలు, క్రీడలు, కళ, సాహిత్యం తదితర రంగాల పాఠకులను ఆకట్టుకునేందుకు ప్రత్యేక పేజీలు కేటాయిస్తూ మరింతగా పాఠకాదరణ పొందేందుకు ప్రస్తుతం ఈ పత్రిక వడిగా అడుగులు వేస్తోంది.

## 3.9 ఆంధ్రజ్యోతి

ఆంధ్రప్రభ సంపాదకత్వానికి 1959లో రాజీనామా చేసిన నార్ల వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో 1960లో విజయవాడ కేంద్రంగా కెఎల్ఎన్ ప్రసాద్ ఆంధ్రజ్యోతి పత్రికను ప్రారంభించారు. ఆంధ్రప్రభ మాదిరిగానే జ్యోతిలో కూడా నార్లదే అగ్రస్థానం. అయితే, ప్రభలో అనుసరించిన పద్ధతులనే ఇక్కడ కూడా అనుసరించకుండా నూతనత్వానికి పాదులుతొక్కారు నార్ల. నిరంతర అన్వేషణ, నిత్యనూతనత్వం పరమావధిగా ఆయన చేసిన కృషి ఫలించి, అచిరకాలంలో ఆంధ్రజ్యోతి ఆంధ్రుల వార్తాజ్యోతిగా వెలుగొందింది. వాడుకభాషతో పాటు మాండలిక ప్రయోగాలను కూడా పత్రికా రచనకు నార్ల ఎన్నుకోవడం ఓ కీలక నిర్ణయం.

నార్ల తర్వాత 1977లో నండూరి రామ్మోహనరావు సంపాదకుడిగా బాధ్యతలు తీసుకున్నారు. కొంతకాలానికి హైదరాబాదు ఎడిషన్ ప్రారంభం కావడంతో దానికి ఎబికె ప్రసాద్ రెసిడెంట్ ఎడిటర్‌గా పనిచేశారు. తర్వాత విశాఖపట్నం, తిరుపతి తదితర కేంద్రాల నుంచి జ్యోతి ప్రచురణ సాగింది. నార్ల, ఎబికె ప్రసాద్ తర్వాత ఐ.వెంకట్రావు సంపాదకుడిగా పనిచేశారు.

అనంతర పరిణామాల నేపథ్యంలో పత్రిక యాజమాన్యం మారింది. 2002, అక్టోబరు 15 నుంచి వేమూరి రాధాకృష్ణ మేనేజింగ్ డైరెక్టర్‌గా, కె.రామచంద్రమూర్తి సంపాదకుడిగా తిరిగి ఆంధ్రజ్యోతి వెలువడింది. ప్రస్తుతం రాష్ట్రంలోని అన్ని ముఖ్యపట్టణాల నుంచి వెలువడుతున్న ఈ పత్రిక సంచలనాలకు మారుపేరుగా మారింది. ప్రధానంగా రాష్ట్ర రాజకీయాలకు సంబంధించి అనేక సంచలనాత్మక వార్తలు, కథనాలు ప్రచురిస్తూ పాఠకుల్లో ఉత్కంఠత పెంచుతోంది. ప్రస్తుతం తెలుగు దినపత్రికల్లో అత్యధిక ఆదరణ కలిగిన పత్రికల్లో మూడవస్థానంలో కొనసాగుతోంది.

### 3.10 ఈనాడు

తెలుగు దినపత్రికల చరిత్రను తిరగరాసిన ఘనత సాధించిన పత్రిక ఈనాడు. ఆధునిక జర్నలిజానికి అర్థం చెప్పి, దినపత్రిక పఠనాన్ని ప్రజలకు ఓ వ్యవసనంగా తయారుచేసింది కూడా ఈనాడే అనడంలో అతిశయోక్తి లేదు. ఎప్పటికప్పుడు పాఠకుల నాడి పట్టుకుంటూ, వారు ఏది కోరుకుంటారో ఆ వార్తలకు అధిక ప్రాధాన్యం ఇస్తూనే నాణ్యత విషయంలో పట్టువిడవని ధోరణితో ఈ పత్రిక ఎన్నో సంచలనాలకు నిలయంగా మారింది.

దినపత్రికల రంగంలో అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని నింపిన ఘనత కూడా ఈనాడుకే నిస్సందేహంగా దక్కుతుంది. తమ పత్రికను అన్ని ఇతర పత్రికల కన్నా ఉన్నత స్థాయిలో నిలపాలన్న పత్రికాధినేత పట్టుదలో, మరే ఇతర కారణమో కానీ ఈనాడు రాసింది వార్తగా పాఠకులు చదివారు. అలాగని, ఏనాడు పత్రికా ప్రమాణాలు దిగజార్చుకోవడానికి ఈనాడు ఇష్టపడలేదు.

చెరుకూరి రామోజీరావు 1974, ఆగష్టు 11వ తేదీన ఎబికె ప్రసాద్ చీఫ్ ఎడిటర్‌గా విశాఖపట్నం నుంచి ఈనాడు పత్రికను ప్రారంభించారు. పత్రికా నిర్వహణలో రామోజీరావు చూపిన తెగువ, దీక్ష కారణంగా మరే ఇతర పత్రిక అప్పటివరకు సాధించని పాఠకాదరణతో పాటు పాఠకుల నమ్మకాన్ని కూడా ఈనాడు సొంతం చేసుకుంది.

పత్రికలో శీర్షికలు ఒకటి కంటె ఎక్కువ పంక్తిలో ఉండకుండా చూడడం, అతి తేలికగా ప్రజలకు అర్థమయ్యే సామాన్య భాషలో శీర్షికలు పెట్టడం, స్థానిక వార్తలకు ప్రాధాన్యత ఇవ్వడం, ప్రాంతీయ ఎడిషన్లు తీసుకురావడం, అత్యంత వేగవంతమైన సమాచార వ్యవస్థ, ఆధునిక ముద్రణ యంత్రాల వాడకం, తెల్లవారకమునుపే పాఠకుల లోగిళ్లలో పత్రిక ఉండేలా చూడడం... ఇలా ఎన్నో మేటి గుణాలు ఈనాడును అగ్రశ్రేణి పత్రికగా తీర్చిదిద్దాయి. వీటన్నిటినీ మించి నమ్మకస్తులైన అధికారులు, ఉద్యోగులు ఈనాడును మరే ఇతర పత్రిక అందుకోలేని ఎత్తుకు పెంచారు.

వార్తాంశాలపరంగా చూస్తే వాడుక భాషకు..ఇంకా చెప్పాలంటే అతిసామాన్య భాషకు ఈనాడు పట్టం కట్టింది. భూభ్రమణము, రైతేరాజు, టూకీగా, పుణ్యభూమి మొదలైన శీర్షికలు చదువరులను ఎంతగానో ఆకట్టుకున్నాయి. ప్రాంతీయ వార్తలకు అధికప్రాధాన్యత ఇచ్చినప్పటికీ అదేస్థాయిలో జాతీయ, అంతర్జాతీయ వార్తలు, కంప్యూటర్ సహా అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రచురించడంలో ఈనాడు ఎంతో జాగ్రత్త తీసుకుంది. అందుకనే సమాజంలోని అన్నివర్గాల పత్రికగా నిలదొక్కుకుంది.

*ఈనాడు ఆదివారం అనుబంధం* కోసం అర్రులు చాచే పాఠకులే ఇందుకు ఉదాహరణగా నిలుస్తారు. ఈవిధంగా పాఠకులకు చేరువ కాగానే 1975, డిసెంబరులో హైదరాబాదు నుంచి 1978 మే నెలలో విజయవాడ నుంచి, 1982 జూన్‌లో తిరుపతి నుంచి ఎడిషన్లు ప్రచురించడం ప్రారంభించారు. ప్రస్తుతం రాష్ట్రంలోని అన్ని జిల్లాల ముఖ్యకేంద్రాలతో సహా ముంబయి, ఢిల్లీ, చెన్నై, బెంగళూరు తదితర రాష్ట్రేతర ప్రాంతాల నుంచి ఈనాడు ఎడిషన్లు ప్రచురితమవుతున్నాయి. ఈవిధంగా చేయడానికి మరే ఇతర భారతీయ భాషా పత్రిక సాహసించలేదు.

## 3.11 ఉదయం

ప్రారంభంలోనే రెండు లక్షలకు పైగా సర్క్యులేషన్ చేరుకున్న ఘనతను సాధించిన పత్రిక ఉదయం. ప్రఖ్యాత సినీ దర్శకుడు దాసరి నారాయణరావు తారకప్రభు పబ్లికేషన్స్ పేరుతో ఎబికె ప్రసాద్ సంపాదకుడిగా 1984లో ఉదయం పత్రికను ప్రారంభించారు. అంతవరకు ఎవ్వరూ సాహసించని కథనాలు ప్రచురించడంతో ప్రారంభంలోనే పత్రికకు చక్కటి ప్రజాదరణ వచ్చింది. పత్రికాభాషను మరింతగా సరళీకరించి, మాండలిక ప్రయోగాలకు పట్టం కట్టింది. విద్య, ఉద్యోగ రంగాల వారి కోసం అనుబంధంగా ప్రవేశపెట్టిన దిక్సూచి పత్రిక డిమాండ్ పెంచేలా చేసింది.

తర్వాతి కాలంలో ఎన్నో పత్రికలు ఈ తరహా అనుబంధాలను ప్రారంభించడమే ఇందుకు తార్కాణం. ప్రగతిశీల భావుకత, వామపక్ష భావ సానుభూతి ధోరణి ఈ పత్రికలో కనిపిస్తాయి. పత్రికా రచనలో ఔత్సాహికులను ఈ పత్రిక ఎంతగానో ప్రోత్సహించింది.

సుమారు 1987 ప్రాంతాల్లో ఎబికె ప్రసాద్ ఉదయం బాధ్యతల నుంచి తప్పుకోవడంతో చీఫ్ ఎడిటర్‌గా దాసరి నారాయణరావు పేరు ప్రకటించారు. ఈ సమయంలో విజయవాడ ఎడిషన్‌కు కె.రామచంద్రమూర్తి, హైదరాబాదు ఎడిషన్‌కు కెఎన్‌వై పతంజలి నిర్వాహక సంపాదకులుగా వ్యవహరించారు. 1991లో పత్రికను మాగుంట సుబ్బరామిరెడ్డి కొన్నారు. అయితే కార్మిక సమస్యల కారణంగా కొంతకాలానికే పత్రిక మూతబడింది.

## 3.12 వార్త

పత్రికారంగంలో అపార అనుభవం ఉన్న ఎబికె ప్రసాద్ స్వీయ సారథ్యంలో వార్త పత్రికను నడపాలని నిశ్చయించుకుని ఇందుకోసం కొంత మూలధనాన్ని కూడా సేకరించారు. అయితే, పూర్తిస్థాయి ఆర్థిక వనరులు అందకపోవడంతో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు. ఈ సమయంలో సంఘీ గ్రూపు సంస్థల అధినేత గిరీష్ సంఘీ ముందుకు వచ్చి వార్త యాజమాన్యం స్వీకరించారు. ఈ విధంగా 1997లో వార్త దినపత్రిక తెలుగు పాఠకుల చేతిలోకి వచ్చింది. ఎబికె ప్రసాద్ దీనికి తొలి సంపాదకుడు.

అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం, రాజమండ్రి, కడప, అనంతపురం, ఒంగోలు, నిజామాబాదు, వరంగల్, తిరుపతి కేంద్రాల నుంచి పత్రిక వెలువడింది. దీంతో ఏకకాలంలో పది కేంద్రాల నుంచి వెలువడిన తొలి దినపత్రికగా వార్త గుర్తింపు పొందింది. ఇతర దినపత్రికల మాదిరిగానే వార్త కూడా అన్నిరకాల విషయాలకు తగిన ప్రాధాన్యత ఇచ్చి, వార్తలు ప్రచురిస్తోంది. ఎబికె ప్రసాద్ తర్వాత కె.రామచంద్రమూర్తి కొంతకాలం సంపాదకుడిగా పనిచేశారు. 2002లో ఆయన ఆంధ్రజ్యోతికి సంపాదకుడిగా వెళ్లడంతో టంకశాల అశోక్ సంపాదకుడిగా బాధ్యతలు స్వీకరించారు. కారణాలేవైనప్పటికీ, వెలువడిన తొలిరోజుల్లో కనిపించిన ఉత్సాహం వార్తలో ఇప్పుడు కనిపించడంలేదు. ఒక దశలో పత్రిక మూతపడుతుందన్న ఊహాగానాలు వెలువడ్డాయి. వీటికి తట్టుకుని ప్రస్తుతానికి పత్రిక నిలబడుతున్నా, పత్రిక భవిష్యత్తుపై ఏర్పడిన సందేహాలకు ఇప్పటికీ సమాధానం దొరకడం లేదు.

## 3.13 సాక్షి

జగతి పబ్లికేషన్స్ పేరుతో వైఎస్ జగన్మోహనరెడ్డి ఛైర్మన్‌గా కెఎన్‌వై పతంజలి ప్రధాన సంపాదకుడిగా సాక్షి దినపత్రిక ప్రారంభమైంది. ప్రారంభ సంచిక నుంచి అన్ని పేజీలను రంగుల్లో ముద్రించడం ఈ పత్రిక ప్రత్యేకత. మరే ఇతర పత్రిక సాక్షికి ముందుకానీ, తర్వాత కానీ ఈ ప్రయోగం చేయడానికి సాహసించలేదు.

ప్రారంభించిన అనతికాలంలో లక్షలాది పాఠకులకు ఇది చేరువ అయింది. ముద్రణ,వార్తల సేకరణ, పంపిణీ తదితర అంశాల్లో ఎప్పటికప్పుడు ముందుండాలనే కోరికతో పనిచేస్తున్న యాజమాన్యం కారణంగా ప్రారంభించిన తొలి ఏడాదే సర్క్యులేషన్ పరంగా రెండో స్థానానికి పత్రిక చేరుకుంది. పతంజలి అనంతరం ప్రస్తుతం ఎన్.రామకృష్ణారెడ్డి సంపాదకుడిగా కొనసాగుతున్నారు.

అన్ని ఇతర ప్రధాన పత్రికల తీరులోనే అన్నివర్గాల ప్రజలను ఆకట్టుకునేలా ఈ పత్రిక వివిధరకాల శీర్షికలు నిర్వహిస్తోంది. అనుబంధాలు అందిస్తోంది. అయితే పత్రికాధినేత స్థాపించిన రాజకీయ పార్టీకి కొమ్ముకాస్తూ, ఆ పార్టీకి అత్యంత అనుకూలంగా రాస్తున్న పత్రికగా సాక్షి పేరుతెచ్చుకుంది. పోటీ పత్రిక యాజమాన్యాన్ని నిందిస్తూ, తాను రాసిందే నిజంగా పేర్కొంటూ ప్రత్యేక వ్యాసాలు రాయడం ఈ పత్రికలో కనిపిస్తుంది. 'ఫ్యామిలీ' పేరుతో ఈ పత్రిక రోజూ ఇస్తున్న శీర్షిక పాఠకులను ఎంతగానో ఆకట్టుకుంది. పత్రిక ప్రారంభంలో దీన్ని ప్రత్యేక అనుబంధంగా ఇచ్చేవారు. ప్రారంభించిన అనతికాలంలో పత్రిక రాష్ట్రంలో రెండో స్థానానికి ఎదగడంలో ఈ అనుబంధం ప్రధానభూమిక వహించిందని చెప్పుకోవచ్చు. ప్రారంభమైన తొలినాళ్ళలో కేవలం రెండు రూపాయాలకే అన్ని పేజీలను రంగుల్లో ముద్రించి ఇచ్చిన సాక్షి తర్వాతి కాలంలో ధరను అనేక సార్లు పెంచింది.

ఇదిలా ఉండగా, భాష విషయంలో సాక్షి అనుసరిస్తున్న తీరు పత్రికారంగంలో ఒకసారి చర్చనీయాంశంగా మారింది. మన మాతృభాష అయిన తెలుగుకు ఏమాత్రం ప్రాధాన్యత ఇవ్వకపోవడం, అనుబంధ సంచికల నుంచి ప్రధాన శీర్షికల వరకు ఇంగ్లిషులో పేర్లు పెట్టడం, వార్తల్లోను ఇంగ్లిషు పదాలు ఎక్కువ వాడడం కొద్దిగా చర్చనీయాంశమయ్యాయి. ఏదిఏమైనప్పటికీ తెలుగు పత్రికా రంగంలో నూతన శకాన్ని సృష్టించిన ఘనత సాక్షికి దక్కుతుందనడంలో ఏమాత్రం సందేహం లేదు.

## 3.14 మరికొన్ని దినపత్రికలు

ఇప్పటికి వరకు చర్చించుకున్న పత్రికలు కృష్ణాజిల్లాలో అధికసంఖ్యలో పాఠకులను కలిగి ఉన్నాయి. ఇవికాకుండా మరికొన్ని దినపత్రికలు కూడా కృష్ణాజిల్లా నుంచి వెలువడినవి ఉన్నాయి. వాటిలో ఒకటి.. నూకారపు సూర్యప్రకాశరావు నేతృత్వంలో ప్రారంభమైన సూర్య పత్రిక. ప్రారంభించిన తొలినాళ్ళలో సూర్య పాఠకులను ఆకట్టుకుంది. అయితే, అంతర్గత కారణాలతో ప్రస్తుతం కొద్దిగా వెనుకంజ వేసింది. సాక్షి మాత్రం ద్వితీయస్థానంలో కొనసాగుతోంది.

ఈ పత్రికలతో పాటు కృష్ణాజిల్లాలో వెలువడిన పత్రికలు...మాతృభూమి (1949, అన్నె అంజయ్య); *జనశక్తి* (1966, ఎబికె ప్రసాద్); *విజయం* (1988, ముక్కాముల వేంకటేశ్వరరావు); ఫ్లాష్‌టైమ్స్ (ఇంగ్లిషు, ఆర్ఎన్ మూర్తి), *ది న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్* (1967, ఎన్‌వి స్వామి); *బెజవాడ కమర్షియల్ డైలీ రిపోర్టు* (ఇంగ్లిషు, 1967, ఎం. ఆదినారాయణమూర్తి); *విజయవాడ డైలీ మార్కెట్ రిపోర్టు* (ఇంగ్లిషు, 1967, సుఖదేవ్‌రాఠి); *జనమిత్ర* (1969, డి.కృష్ణమూర్తి); *ఓం ఆంధ్రవాణి* (1981, జివి సత్యనారాయణ); కృష్ణా హెరాల్డ్ (1988, కెఐ కిషోర్); *దక్కన్ క్రానికల్* (1988, కె.ప్రభాకర్); *అదృష్టం* (1993, ఎన్ మణిమరన్); *ఈ రోజు రేపు* (1994, టి.వెంకటస్వామి); *ఇవాళ రేపు* (1994, టి.వెంకటస్వామి); *సిటీ ఇమేజ్* (1998, తాడంకి రవి); *స్వర్ణాంధ్ర* (1998, కెజిబి తిలక్); *టుడే ఫ్రీడం* (ఇంగ్లిషు, 1998, బి దేవదాసు); పొద్దు (1999, బి.రామదాసు); *పల్లెబాట* (1999, కె.నాగేశ్వరరావు); సిక్స్ ఒ క్లాక్ (ఇంగ్లిషు, 1999, ఇవిఎన్ రాయుడు); *భాగ్యనగర్ సాయంకాలం దినపత్రిక* (1999, వివిఎన్ రాయుడు); *వార్తాప్రభ* (2002, వీర్ల శ్రీరామయాదవ్); *నేటి మనదేశం* (2002, కెఎన్ రంగసాయి); స్కైలైన్ (ఇంగ్లిషు, 2002, కెఎన్ఆర్ సాయి), *విజయాంధ్ర* (2003, బి.గోపాలరావు); నమస్తే (2003, ముత్యాల సిద్ధేశ్వరరావు); కృష్ణజ్యోతి (2004, మాంతి చిన్నారి); *గంధ్ర గొడ్డలి* (2004, పి.హెచ్.వి.నారాయణశాస్త్రి); *రక్షణ* (2004, తుర్లపాటి రాజేష్); న్యూస్ బూమ్ (ఇంగ్లిషు, 2004, డిఎస్ ఎన్ మూర్తి); *ఉదయ భారతం* (2006, డిఎస్ఎన్ మూర్తి); వెన్నెల (2006, అంబడిపూడి సత్యనారాయణమూర్తి); *ద ఫోర్త్ వాయిస్* (ఇంగ్లిషు, 2006, ఆర్.మురళీధరరావు); సేన (2006, అద్దంకి వేంకట శ్రీనివాసరావు); *రత్నగర్భ* (2006, పివిఎ ప్రసాద్); *ఆంధ్ర వాయిస్* (2007, బి.గిరిబాబు); *వార్తామండలి* (2007, ఎ.ప్రతాప్‌చంద్); *లోకల్ న్యూస్ 5 పిఎం* (2008, కె.విజయ్‌కుమార్).

శ్రీ సన్‌ఫ్లవర్‌న్యూస్ (2008, ఎండివిఎస్‌ఆర్ పున్నంరాజు); వ్యూస్ అబ్జర్వర్ (ఇంగ్లిషు, 2008, యువిఎస్ సూర్యకుమార్); *ప్రజాభీష్టం* (2008, ఎంవి సుబ్బారావు); *విజయభాను* (2008, బి.చంద్రశేఖర్), *జనవాహినిలో నేడు* (2008, పులిపాక సత్యమూర్తి); *తెలుగువారం* (2009, టి.ప్రియంవద); *అంతిమ తీర్పు* (2009, బి.ప్రసాదకుమార్); ఆబ్లిగేషన్ (ఇంగ్లిషు, 2009, కె.సత్యనారాయణ), *ప్రగతిబాట* (2009, పి.శ్రీనివాసరావు); నేటి ప్రతిరోజు (2009, పులిపాక శ్రీలక్ష్మి). లక్ష్మి ప్రతిరోజు (2009, పి.శ్రీలక్ష్మి); *రీజినల్ రియల్ న్యూస్* (2009, డి.వెంకట కృష్ణారావు); *గ్రేటర్ వాయిస్* (2009, సిహెచ్ రమణారెడ్డి), కృష్ణాఎక్స్‌ప్రెస్ (2009, డి.ఏసుబాబు); *ట్రస్ట్* న్యూస్ (2010, కొమ్మరాజు రవి); *ఆంధ్ర సాక్షి* (2010), *మార్కండేయ* (2010); *ఉత్తరాంధ్ర* సాక్షి (2010), *ఆంధ్రశక్తి* (2010, ఎం.అబ్దుల్ రవూఫ్); స్పెషల్ న్యూస్ (2010, వి.నాగేశ్వరరావు); *హోలిక* (2010, పాటిబండ్ల శివశర్మ); *నీలిమేఘం* (2010, విన్నకోట శ్రీనివాస్); నిప్పు (2010, కొంగర బ్రహ్మయ్య); *భారతశక్తి* (2010, కె.పెంటారెడ్డి), నవ్యవిజ్ఞానం (2010, కొట్టిపాటి పద్మజ); కేసరి (2010, కె.సత్యనారాయణ), *కృష్ణాతీరం* (2011, మద్దినేని భాస్కరరావు),మచిలీపట్నం టైమ్స్ (2011, ఎం.నాగరాజు); అక్షర స్పందన (2011, కన్నెకంటి సజ్జనరావు)

దాదాపు 50కి పైగా దినపత్రికలు కృష్ణాజిల్లాలో వెలువడినట్లు తెలుస్తోంది. వీటిలో చాలావరకు ఆయా కాలవ్యవధుల్లో సమాజంపై ఎంతో కొంత ముద్ర వేసినవే కావడం గమనార్హం. ఫలితంగా అటు సంఖ్యాపరంగాను, ఇటు నాణ్యత పరంగాను ఆంధ్ర రాష్ట్రానికి పత్రికా కేంద్రంగా నిలవడం కృష్ణాజిల్లాకు సాధ్యమైంది. ప్రస్తుతం అన్ని దినపత్రికల ప్రధాన కేంద్రాలు హైదరాబాదుకు తరలివెళ్ళాయి. అయినప్పటికీ, కృష్ణాజిల్లా.. అందులోను విజయవాడ నేటికీ పత్రికలకు కేంద్రంగా నిలుస్తోంది. ప్రధానంగా కృష్ణాజిల్లాలో రాజకీయ చైతన్యం ఎక్కువ కావడం, వర్తక వాణిజ్యాలు, ఇతర అనుబంధ పరిశ్రమలు, ప్రచురణ రంగం తదితరాలన్నీ ఇక్కడే వేళ్ళూనుకోవడంతో ప్రధాన పత్రికల యాజమాన్యాలన్నీ తమ దృష్టిని విజయవాడపై ఎక్కువగా కేంద్రీకరిస్తాయి. ఈవిధంగా నాటికీ, నేటికీ కృష్ణాజిల్లా పత్రికారంగంపై తనదైన ప్రభావాన్ని చూపిస్తూనే ఉంది.

# అధ్యాయం - 4

# కృష్ణా జిల్లా నుంచి వెలువడిన ఇతర పత్రికలు - విషయ విశ్లేషణ

సమాజ గమనానికి కారకమైన అంశాలను ప్రస్తావించాల్సివస్తే నేటితరంలో పత్రికలను కూడా చెప్పాల్సివస్తుంది. సమాజ సభ్యుల్లో ఆలోచనా ధోరణి కొత్తపుంతలు తొక్కడానికి, సమకాలీన అంశాల పట్ల అవగాహన పెరగడానికి పత్రికలు చేస్తున్న కృషి అనిర్వచనీయం. సమాజ జీవితంతో ఇంతగా పత్రికలు తమ అనుబంధాన్ని పెనవేసుకున్నాయి. పత్రికలనగానే దినపత్రికలు గుర్తుకురావడం కద్దు. అయితే, దినపత్రికలతో పాటు సమాజంపై చెరగని ముద్రవేస్తున్న / వేసిన ఇతర పత్రికలు ఎన్నో ఉన్నాయి.

ఆయా పత్రికాధినేతల అభిప్రాయాలకు అనుగుణంగా వార, పక్ష, మాస, ద్వైమాసిక, త్రైమాసిక, అర్ధవార్షిక, వార్షిక పత్రికలుగా వెలువడిన పత్రికలు కృష్ణాజిల్లాలో అనేకం ఉన్నాయి. ఇది ఆవర్తన వ్యవధికి సంబంధించిన వర్గీకరణ. ఇక, విషయ పరంగా చూస్తే పత్రికల్లో రాజకీయ పత్రికలు, సినీ పత్రికలు, విద్యాపత్రికలు, ఉద్యోగ పత్రికలు, ఆధ్యాత్మిక పత్రికలు, వైజ్ఞానిక పత్రికలు, హాస్య పత్రికలు, వ్యవసాయ విజ్ఞాన పత్రికలు..ఇలా ఎన్నో రకాలు ఉన్నాయి.

## 4.1 ఉపోద్ఘాతం

పత్రికలను అవి వెలువడుతున్న ఆవర్తన వ్యవధులను బట్టి వార, పక్ష, మాస, ద్వైమాసిక, త్రైమాసిక, అర్ధవార్షిక, వార్షిక, ప్రత్యేక సంచికలుగా వర్గీకరించవచ్చు. వీటిలో దాదాపుగా ప్రతిపత్రిక ఏదో ఒక విషయం / అంశం ప్రధానంగా చేసుకుని సాగుతుంటుంది. అంటే వ్యవసాయం, విజ్ఞానం, కళలు, చరిత్ర, భాష... ఇలా ఏదో ఒక అంశాన్ని ప్రధానాంశంగా తీసుకుని వెలువడుతున్న పత్రికలే అధికంగా ఉన్నాయి. దీంతోపాటు సమాజంలోని అన్ని వర్గాల ప్రజలను ఆకట్టుకునేందుకు ప్రత్యేక శీర్షికలను కూడా ఇవి నిర్వహిస్తుంటాయి. కృష్ణాజిల్లాను ప్రధానంగా చేసుకుని పరిశీలన చేస్తే దాదాపు 500 పైచిలుకు పత్రికలు ఇక్కడ నుంచి వెలువడినట్లు తెలుస్తోంది. (పత్రికల వివరాలు రెండో అధ్యాయంలో ఉన్నాయి) ఆయా సమయాల్లో సమాజంపై అత్యధిక ప్రభావం చూపిన పత్రికలు వీటిలో ఎన్నో ఉన్నాయి.

ఆవర్తన వ్యవధుల ఆధారంగా వార, పక్ష, మాస, ద్వైమాసిక, త్రైమాసిక, అర్ధవార్షిక, వార్షిక పత్రికలు, ప్రత్యేక సంచికలుగా వీటిలోని అంశాలను ఈ అధ్యాయంలో విశ్లేషించడం జరిగింది.

## 4.2 వార పత్రికలు

పూర్వకాలంలో పత్రిక స్థాపన ఒక లక్ష్యాన్ని ఆధారంగా చేసుకుని ప్రారంభమయ్యేది. దాదాపుగా పత్రిక నడిచినంతకాలం లక్ష్యప్రస్తావనలో చెప్పిన అంశాలకు పత్రికలు కట్టుబడి ఉండేవి. ఈ క్రమంలో పత్రిక ఆవర్తన వ్యవధి నిర్ణయం ప్రధానాంశంగా ఉండేది. అప్పటి సాంకేతికాంశాల అందుబాటో, ముద్రణ, కాగితం తదితర అంశాల ఉపయోగ సౌలభ్యమో... మరే ఇతర కారణమో తెలియదు కానీ తొలినాటి పత్రికలు దాదాపుగా వారపత్రికలుగానే వెలువడ్డాయి. విదేశీ పత్రికల నుంచి అందుకున్న స్ఫూర్తి లేదా వాటి ప్రభావం మన తెలుగు పత్రికల మీద ప్రారంభం నుంచి కనిపిస్తోంది. విదేశీ పత్రికల తీరులో తమ పత్రికలు నడపాలన్న ఆలోచన, లేదా వాటిలోని అంశాలను తర్జుమా చేసేందుకు అవసరమైన కాలవ్యవధి... ఇవన్నీ పత్రిక ఆవర్తన వ్యవధిని 'వారం'గా నిర్ణయించేందుకు కారణమై ఉండవచ్చు.

తెలుగులో తొలిపత్రిక వృత్తాంతి, ఆ తర్వాతికాలంలో మద్రాసు నుంచి కుంఫిణీ ప్రభుత్వం ఆధ్వర్యంలో వచ్చిన *ఫోర్ట్ సెంట్ జార్జి గెజిట్*లోని అంశాలను తెలుగులో అందించిన *వర్తమాన తరంగిణి*, ప్రతి శనివారం వెలువడిన *దినవర్తమాని* వారపత్రికలుగా వెలువడ్డాయి. కృష్ణాజిల్లా నుంచి వెలువడిన పత్రికలను పరిశీలిస్తే... తొలి తెలుగు దినపత్రికగా పేరొందిన దేశాభిమాని కూడా కృష్ణాజిల్లా నుంచి తొలుత వారపత్రికగానే వెలువడింది.

ఆ తర్వాత పత్రికారంగ దిశ, దశ మార్చిన కృష్ణాపత్రిక కూడా వారపత్రికగానే ప్రారంభమైంది. మరోప్రముఖ పత్రిక *ఆంధ్రపత్రిక* కూడా వారపత్రికగానే తన ప్రస్థానాన్ని ప్రారంభించింది. ఇవి కాకుండా దినపత్రికలుగా విఖ్యాతిపొందిన *ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి* దినపత్రికలుగానే మొదలైనప్పటికీ కొంతకాలం తర్వాత వారపత్రికలు ప్రచురించడం ప్రారంభించాయి. ఇవి ఇప్పటికీ వెలువడుతున్నాయి. ఇప్పుడు దినపత్రికగా వెలువడుతూ ముఖ్యపత్రికల్లో ఒకటిగా పేరుపొందిన *ప్రజాశక్తి* అనేకసార్లు తన ఆవర్తనవ్యవధిని మార్చుకుంది. ఈ క్రమంలో ఇది వారపత్రికగా కూడా ఇది వెలువడడం గమనించదగిన అంశం.

ఇరవయ్యో శతాబ్దం తొలిరోజుల్లో విజయవాడ నుంచి *శ్రీవేంకటేశ్వర పత్రిక* పేరుతో శ్రీనివాసాచార్యులు హైందవ ఆధ్యాత్మిక విషయాలు ప్రకటిస్తూ ఓ వారపత్రికను నడిపారు. 1907లో గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఇక్కడ నుంచే నడిపిన వారపత్రిక స్వరాజ్య ఆకాలంలో పెద్ద సంచలనమే సృష్టించింది. దేశభక్తి ప్రేరితమైన విషయాలు ఇందులో ఎక్కువగా వచ్చేవి.

ఈ పేరుతోనే దుగ్గిరాల రాఘవచంద్రయ్య విజయవాడ నుంచే 1921లో మరో వారపత్రిక ప్రారంభించారు. రెండో స్వరాజ్యగా ఇది పేరుపొందింది. విజయవాడ నుంచి వచ్చిన నవశక్తి (1921) వారపత్రిక రాజకీయ ప్రాధాన్యం కలిగిన వార్తలను ఎక్కువగా ప్రచురించేది. రాజా కోటగిరి వెంకట కృష్ణారావు దీనికి సంపాదకుడు.

కులప్రధాన వార్తలు ప్రకటిస్తూ మనుగడ సాగించిన పత్రికలు కూడా కృష్ణాజిల్లా నుంచి వెలువడ్డాయి. *కమ్మ పత్రిక (1923), కమ్మ కులపత్రిక (1923)* – రెండూ వారపత్రికలుగానే వెలువడ్డాయి. పేరులోనే ఇవి తమ లక్ష్యాన్ని ప్రకటిస్తున్నాయి. కమ్మ కులానికి సంబంధించిన వార్తలు, ఆ కులాన్ని అభివృద్ధిలోకి తీసుకువచ్చేందుకు అవసరమైన విషయాలను ఇవి ప్రచురించేవి. ఏడాది గడిచేసరికి అంటే 1924లో ఇక్కుర్తి తిరుపతి నాయుడు కాపు పేరుతో కాపు కులస్తుల వార్తలకు ప్రాధాన్యత ఇస్తూ మండవల్లి నుంచి ఓ వారపత్రిక ప్రారంభించారు.

సూర్యదేవర సంజీవరావు సంపాదకత్వంలో 1923లో విజయవాడ నుంచి వెలువడిన వారపత్రిక ఐకమత్యం. బందరు నుంచి ఎం.శేషాచలం సంపాదకత్వంలో వచ్చిన వారపత్రిక *సత్సంగ*. హిందూ మత సంబంధమైన వార్తలు వీటిలో ఎక్కువగా ప్రకటితమయ్యేవి. ఇదేఏడాది దీనబంధు పేరుతో ఓ వారపత్రికను వేమూరి రాంజీరావు మచిలీపట్నం నుంచి ప్రకటించారు. నిమ్నజాతుల ఉద్ధరణ ప్రధానంగా ఈ పత్రిక వ్యాసాలు ప్రచురించేది.

రెవరెండ్ డానియేల్ సంపాదకత్వంలో 1925లో మచిలీపట్నం నుంచి వచ్చిన *ఆంధ్రక్రైస్తవ పత్రిక* వారపత్రిక పేరుకు తగినట్లుగా క్రైస్తవ మత విషయాలు ప్రచురించేది. ఇదేఏడాది విజయవాడ నుంచి ధన్వాడ రామచంద్రరావు *విజయవాడ* పేరుతో వారపత్రిక నడిపారు. శీలం జగన్నాథరావు నాయుడు నేతృత్వంలో 1928లో మచిలీపట్నం నుంచి వచ్చిన సత్యసాధని కూడా వారపత్రికగా పాఠకాదరణకు నోచుకుంది.

ఇరవయ్యో శతాబ్దం నాలుగో దశకంలో విజయవాడ నుంచి వచ్చిన వారపత్రికలు *భాగవతసేవ* (భక్త సుబ్రహ్మణ్యం), *వేదభూమి* (జె.నరసింహశాస్త్రి) పూర్తిగా హిందూ మత సంబంధ విషయాలు ప్రచురించేవి. ఈ దశాబ్దంలోనే అన్నవరపు రామస్వామి వైశ్యకుల ప్రధానంగా *భారతీయవైశ్య* పేరుతో వారపత్రికను విజయవాడ నుంచి నడిపారు.

పి.లక్ష్మీనారాయణ 1974లో విజయవాడ నుంచి *లాటరీ సమాచార్* పేరుతో ఓ వారపత్రికను నడిపినట్లు రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్స్ వద్ద నమోదైంది. పేరును బట్టి ఇది లాటరీ వ్యాపారానికి సంబంధించిన వార్తలకు పరిమితమైన పత్రికగా భావించవచ్చు. అప్పట్లో ఆంధ్రరాష్ట్రంలో లాటరీ వ్యాపారం జోరుగా సాగడం కూడా ఈ పత్రిక వెలువడడానికి కారణమై ఉండవచ్చు. విజయవాడ నుంచి 1976లో కె.జగదీష్‌ప్రసాద్ సంపాదకత్వంలో వచ్చిన *జ్యోతిచిత్ర* వారపత్రిక యువతరంలో సంచలనమే కలిగించింది. సినీవార్తలకు ప్రాధాన్యత ఇస్తూనే యువతరాన్ని ఆకట్టుకునే శీర్షికలు ఈ పత్రిక ప్రచురించేది.

యు.సత్యవాణి సంపాదకత్వంలో 1991లో వచ్చిన *షేర్‌కాలం*, ఎం.రామ్మోహనరావు సంపాదకత్వంలో 1993లో వచ్చిన *మనీ బిజినెస్* వర్తకవ్యాపార వార్తలు ప్రధానంగా నడిచేవి. ఈ రెండూ విజయవాడ నుంచే వెలువడ్డాయి. 1999లో విజయవాడ నుంచి *లీగల్ మెయిల్* (కె.ఎస్.ఎన్.సుబ్రహ్మణ్యం), *లా టుడే* (?) న్యాయవార్తలు ప్రధానంగా ప్రచురిస్తూ వారపత్రికలుగా వెలువడ్డాయి. తెలుగుతో పాటు ఆంగ్లంలోనూ ఎన్నో వారపత్రికలు విజయవాడ నుంచి వెలువడ్డాయి. ఎస్.వి.స్వామి సంపాదకత్వంలో 1967లో *సండే స్టాండర్డ్*, 1968లో ఎం.ఎ.ఖాదర్ సంపాదకుడిగా *ప్లెడ్జ్*, 1999లో ఎస్.వి.స్వామి సంపాదకత్వంలో *స్క్రీన్*, 2000లో ఆర్.కె.ఝున్‌ఝున్‌వాలా సంపాదకుడిగా *ద న్యూ సండే ఎక్స్‌ప్రెస్* వారపత్రికలు వెలువడ్డాయి. 2009 నుంచి ఎన్.రాజారావు నేతృత్వంలో *ఆంధ్ర ఛాంబర్ ఆఫ్ కామర్స్*, అదే ఏడాది నుంచి బెజవాడ పాల్ కమల్‌కుమార్ సంపాదకత్వంలో *మై ఓన్ సిటీ గైడ్ డాట్ కాం* ఆంధ్రాంగ్ల భాషల్లో వారపత్రికలుగా వెలువడుతున్నాయి. స్థానిక సమాచారం ప్రధానంగా చేసుకుని వెలువడిన వారపత్రికలు కూడా కృష్ణాజిల్లాలో ఉన్నాయి. వీటిలో 1979లో ఎం.జనార్దనరావు సంపాదకత్వంలో వచ్చిన *మచిలీపట్నం సమాచార్‌*ను ప్రముఖంగా చెప్పుకోవచ్చు. ఇదేపేరుతో 2011లో ఎం.నాగరాజు సంపాదకుడిగా మచిలీపట్నం నుంచి దినపత్రిక వెలువడుతున్నట్లు ఆర్.ఎన్.ఐ.సమాచారం. వారపత్రికే దినపత్రికగా మారిందా లేక ఇది నూతన పత్రికా అనే విషయాన్ని నిర్ధారించుకోవాల్సి ఉంది.

## 4.2.1 స్వాతి

ఆధునికతరంలో వారపత్రికల గతిని మార్చిన ఘనత స్వాతి కే దక్కుతుందనడంలో సందేహం లేదు. వేమూరి బలరామ్ సంపాదకుడిగా 1965లో విజయవాడ నుంచి ఈ పత్రిక ప్రారంభమైంది. తొలుత కొద్దిసంఖ్యలోనే పాఠకులకు ఆకట్టుకున్నప్పటికీ, పాఠకుల నాడి తెలిసిన సంపాదకుడు కావడంతో బలరామ్ అచిరకాలంలోనే వినూత్న శీర్షికలతో తన పత్రికకు పాఠకాభిమానాన్ని సంపాదించుకోగలిగారు.

వారంవారం ఇందులో ప్రచురించే ప్రత్యేక కథలు పత్రిక విజయప్రస్థానంలో ప్రముఖ పాత్ర పోషించాయి. ముఖ్యంగా ఇంటిపట్టున ఉండే మహిళలను ఈ పత్రిక తొందరగా ఆకర్షించగలిగింది. చిన్నాపెద్దా, ఆడామగా... ఇలా సమాజంలోని ప్రతివర్గానికీ అవసరమైన శీర్షికలు స్వాతి ప్రవేశపెట్టింది. వీటితోపాటు జాతీయ, అంతర్జాతీయ సంఘటనల విశ్లేషణలు, బడికి వెళ్ళే చిన్నపిల్లల కోసం ప్రత్యేక శీర్షికలు, ధారావాహికలు పత్రికకు అదనపు ఆకర్షణగా నిలిచాయి. మల్లిక్ వంటి కార్టూనిస్టలతో ముఖాముఖి, కొంటెప్రశ్నలకు చిలిపి జవాబులు మొదలైన శీర్షికలు యువతను ఎంతగానో ఆకట్టుకున్నాయి.

ఇతర విషయాలు ఎలా ఉన్నప్పటికీ, శృంగార సంబంధమైన అంశాలకు ఈ పత్రిక అధికప్రాధాన్యత ఇస్తుందనే ప్రచారం బాగా జరిగింది. దీంతో యువతరం ఈ పత్రికపై ఎక్కువగా మోజు పెంచుకున్నారు. అయితే ఇతరపత్రికలు ఇవ్వని ఆధ్యాత్మిక అంశాలను కూడా స్వాతి ప్రచురించిందన్న విషయం మరువరానిది. ఏదిఏమైనప్పటికీ తెలుగు వారపత్రికల చరిత్రలో వారానికి రెండులక్షలకు పైగా సర్క్యులేషన్ సాధించిన ఘనత మాత్రం నిస్సందేహంగా స్వాతిదే.

స్వాతి సాధించిన అపూర్వ పాఠకాదరణ ప్రేరణగా ఎన్నో వారపత్రికలు వెలువడ్డాయి. సన్‌ఫ్లవర్ (ఎం.డి.వి.ఎస్.ఆర్.పున్నంరాజు, 2009), నది (వి.ఆర్.రావు అవ్వాస్, 2010) ఈ కోవలోనివే. వీటిలో సన్‌ఫ్లవర్ వారపత్రిక సంస్థాగత కారణాల రీత్యా 2012లో ఆగిపోయింది. టి.వి.జి.ఎంటర్‌ప్రైజెస్ ఆధ్వర్యంలో 2011లో విజయవాడ ఎక్స్‌ప్రెస్, ఎం.హెచ్.ప్రభాకరరావు సంపాదకత్వంలో సిటీ మెయిల్ వారపత్రికలుగా ఆర్.ఎన్.ఐ. వద్ద నమోదయ్యాయి.

కృష్ణాజిల్లాలో పత్రికా ప్రస్థానం ప్రారంభమైన కాలంనుంచి నేటికి ఆర్.ఎన్.ఐ. అధికారిక సమాచారం ప్రకారం సుమారు 90 వరకు వారపత్రికలు వెలువడ్డాయి. వీటిలో ఆర్.ఎన్.ఐ. వద్ద నమోదై, తర్వాతికాలంలో ప్రచురణకు నోచుకోని పత్రికలు, ఒకటి రెండు సంచికలు వెలువడి ఆ తర్వాత కారణాంతరాలతో మూతబడిన పత్రికలు ఉన్నాయి. ఇవికాకుండా (ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదు కానివి) సుమారు 20వరకు వారపత్రికలు జిల్లాలో వెలువడినట్లు అనధికార సమాచారం.

## 4.3 పక్ష పత్రికలు

వారపత్రికల తర్వాత ప్రముఖస్థానం పక్ష పత్రికలదేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. వీటిలో ఎక్కువగా విద్యావిషయక, వైజ్ఞానిక పత్రికలు ఉండడం విశేషం. వారపత్రికలు నడపడం ఇతర పత్రికల కన్నా (దినపత్రికలు మినహాయిస్తే) చాలా శ్రమతో కూడుకున్న విషయం. కాలగమనంలో పత్రిక తయారుకావడానికి వారం రోజులు చాలా తక్కువ సమయమే అవుతుంది. నిర్వహణపరంగా ఇది ఎన్నో సమస్యలు తీసుకువస్తుంది. ఈకారణంగా పక్ష పత్రికలు నడపడానికి ఎక్కువమంది సంపాదకులు / నిర్వాహకులు ఆసక్తి చూపించడం కద్దు. సంఖ్యాపరంగా కొద్దిగా తక్కువగానే పక్షపత్రికలు జిల్లాలో తక్కువగా వెలువడ్డాయి. అయితే వీటిలో చాలావరకు పాఠకుల మనసును ఆకట్టుకున్నవి కావడం విశేషం.

చిల్లరిగె శ్రీనివాసరాజు సంపాదకత్వంలో 1908లో *నవయుగ* పేరుతో పక్ష పత్రిక వచ్చింది. మచిలీపట్నం నుంచి వెలువడిన ఈ పత్రిక సమాకాలీన అంశాలను ప్రచురిస్తూ పాఠకులను తొందరలోనే ఆకట్టుకుంది. ఆతర్వాతవచ్చిన పత్రికల్లో శివపురపు వీరభద్రపాకయాజి విజయవాడ నుంచి నడిపిన *శృతిధర్మ సంజీవని* (1917), బి.వి.కృష్ణారావు వెంట్రప్రగడ నుంచి వెలువరించిన *ఆంధ్రజనని* (1919) పక్షపత్రికలుగా చెప్పుకోదగిన ప్రగతి సాధించాయి. 1923లో మచిలీపట్నం నుంచి కె.ఆర్.జి.రాయ్‌చౌదరి వెలువరించిన *కమ్మపత్రిక*, ఆనాటికే కులప్రధాన పత్రికల పట్ల ప్రజలు చూపిన ఆదరణకు తార్కాణంగా నిలుస్తుంది.

దేవాలయాల సమాచారంతో అగ్నిహోత్రం విజయసారథి నడిపిన *దేవాలయ సమాచార పత్రిక* (1927), గూడూరు రామచంద్రుడు గుడివాడ నుంచి నడిపిన *అహింస* (1928), మచిలీపట్నం నుంచి గద్దె లింగయ్య వెలువరించిన *ప్రభ* (1935) కూడా పాఠకాదరణ పొందాయి.

నవ్వులరాణి (1957) పేరుతో మచిలీపట్నం నుంచి ఓ పక్ష పత్రిక వెలువడినట్లు ఆర్.ఎన్.ఐ. వెబ్‌సైట్ (http://rni.nic.in/) లో ఉంది. అయితే దీనికి సంపాదకుడు ఎవరన్న వివరాలు ఇందులో లేవు. పేరును బట్టి హాస్యప్రధాన పత్రికగా ఊహించుకోవచ్చు.

దాసరి వేంకట సుబ్బారావు సంపాదకత్వంలో 1967లో విజయవాడ నుంచి సహకారి, భాగవతుల రామారావు సంపాదకుడిగా 1968లో మచిలీపట్నం నుంచి న్యాయప్రచార్, టి.దుర్గాపార్వతీశం సంపాదకత్వంలో చట్టప్రచారిణి (1969), ఎస్. శ్రీవాత్సవ సంపాదకత్వంలో నూజివీడు నుంచి నూజివీడు రిపోర్టర్ (1975), సి.హెచ్.వి.సుబ్బారావు సంపాదకత్వంలో విజయవాడ నుంచి *శ్రామిక జనత* (1981), ఇక్కడినుంచే ఎం.వెంకట్రావు సంపాదకుడిగా ఐతే న్యూస్ (1984), సైకం భాస్కరరావు సంపాదకుడిగా మచిలీపట్నం నుంచి వినియోగదీపిక (1997), పి.విజయకృష్ణ సంపాదకుడిగా విజయవాడ నుంచి ఆధ్యాత్మిక వికాసం (1998) ద్విభాషా పత్రికలుగా (ఆంధ్రాంగ్లభాషలు) వెలువడ్డాయి.

దళితుల అభ్యున్నతికి ఆలంబనగా నిలవాలనే సంకల్పంతో పి.కోటేశ్వరరావు విజయవాడ నుంచి 1978లో వెలువరించిన *దళితమార్గ్* ఆదిశగా కొంతవరకు సఫలమైంది. సినీవార్తలతో రూపొందించిన *తార సితార* 1983లో విడుదలై ఎక్కువసంఖ్యలో పాఠకులను ఆకట్టుకుంది. తాజా సినీవార్తలతో పాటు హీరోహీరోయిన్లతో పరిచయాలు, వారి వ్యక్తిగత వివరాలు, ఇతర ప్రత్యేక కథనాలతో తీర్చిదిద్దిన ఈ పత్రిక మరెన్నో సినీ పక్ష పత్రికలు వెలువడడానికి కారణంగా నిలిచింది. ఎ.పి.హెచ్.ఎన్.కుమార్ ఎంతో అట్టహాసంగా 1995లో విజయవాడ నుంచి ప్రారంభించిన పత్రిక *విద్య*. ఈ పత్రిక పతాకశీర్షిక కింద 'ఉద్యోగ విజయాల పక్ష పత్రిక' అని రాసిఉంది. ఉన్నతవిద్యావంతుడైన సంపాదకుడి నేతృత్వంలో వెలువడినప్పటికీ ఇతర వ్యావహారిక కారణాలతో కొద్దికాలంలోనే ప్రచురణ ఆగిపోయింది. తర్వాత కొంతకాలానికి హైదరాబాదు నుంచి మాసపత్రికగా వెలువడినప్పటికీ కేవలం పేరుకు మాత్రమే పత్రికగా మిగిలిపోయింది.

ఇలా సుమారు 20 వరకు పక్షపత్రికలు కృష్ణా జిల్లాలో వెలువడినప్పటికీ ఒకటిరెండు పత్రికలు మినహా మరేవీ పాఠకులను చేరుకోలేకపోయాయి. వారపత్రికల ప్రభంజనం ఇందుకు కొంత కారణం కావచ్చు. మారుతున్న కాలంతో పాటు వేగాన్ని అందిపుచ్చుకుని, వారం రోజుల వ్యవధిలోనే అన్ని విషయాలను సమగ్రంగా వారపత్రికలు అందించడం వల్ల పక్షం రోజుల తర్వాత వచ్చే పత్రికలు పాఠకాదరణ ఎక్కువగా పొందలేకపోయాయి.

ప్రస్తుతం పక్ష పత్రికల ప్రభావం ఎక్కువగా కనిపించడం లేదు. అయితే విద్య, ఉద్యోగ సమాచారంతో వచ్చే పత్రికలు మునపటి కన్నా ఓ మోస్తరు ఎక్కువగానే పేరు తెచ్చుకుని, ఆర్థికంగా నిలదొక్కుకున్నాయి.

## 4.4 మాస పత్రికలు

మాసపత్రికల విషయంలో అటు సంఖ్యాపరంగాను, ఇటు ప్రమాణాలపరంగాను కృష్ణాజిల్లా పత్రికారంగానికి మహోపకారమే చేసింది. తెలుగు సాహిత్యంలో వచ్చిన ఉత్తమోత్తమమైన రచనలెన్నో ఇక్కడి మాసపత్రికల్లో ముద్రితమయ్యాయి. ఇరవయ్యో శతాబ్ది ప్రారంభంనాటి కాకలుతీరిన సాహితీవేత్తలందరూ ఇక్కడి పత్రికలతో ఏదోఒకరకంగా అనుబంధం కలిగిఉండడం కూడా ఇందుకు కొంత దోహదం చేసింది. విద్యావైజ్ఞానిక, ఆధ్యాత్మిక, వ్యాపార వాణిజ్య, సాంస్కృతిక, వినోద, హాస్య, శృంగార, మహిళా, ఉద్యోగ తదితర రంగాలకు సంబంధించిన పత్రికలెన్నో జిల్లా నుంచి వెలువడ్డాయి. తెలుగుతో పాటు ఇంగ్లిషు, ఉర్దు భాషల్లోను ఇక్కడ మాసపత్రికలు వెలువడడం ఇక్కడి ప్రత్యేకత. ఆవర్తన వ్యవధి ఎక్కువగా ఉండడం, విభిన్న శీర్షికలు ప్రవేశపెట్టడం, పాఠకులతో నేరుగా సంబంధాలు కలిగి వారిచ్చిన లేఖలు ప్రచురించడం, ప్రచురణలో తగిన జాగ్రత్తలు తీసుకునేందుకు తగిన వెసులుబాటు దొరకడం... తదితరాలన్నీ మాసపత్రికలను పాఠకులు అక్కున చేర్చుకునేలా చేశాయి. వీటిలో కొన్ని పత్రికల వివరాలను ఈ అధ్యాయంలో చర్చించడం జరిగింది.

### 4.4.1 ఆంధ్రభారతి

అయ్యంకి వెంకట రమణయ్య సంపాదకత్వంలో మచిలీపట్నం నుంచి 1910లో *ఆంధ్రభారతి* మాసపత్రిక వెలువడింది. పత్రిక ప్రారంభసంచికలో గురజాడ అప్పారావు దిద్దుబాటును ప్రచురించారు. కథలు, కథానికలు, వ్యాసాలు, లేఖలు, కవితలు, పద్యాలు, నాటికలు, గేయకవితలు, విమర్శలు తదితర సాహిత్యప్రక్రియలన్నీ విస్తృతంగా ఇందులో వచ్చేవి. రాయప్రోలు సుబ్బారావు, ముట్నూరి కృష్ణారావు, భోగరాజు సీతారామయ్య, దువ్వూరి రామిరెడ్డి తదితరుల రచనలు ఇందులో ప్రచురించారు. నూతన రచయితలకు ఈ పత్రికలో ఎంతగానో ప్రోత్సాహం లభించేది. గురజాడవారి 'లవణరాజు కల', 'తోకచుక్క', 'కాసులు', 'కన్యక', విశ్వనాథవారి 'గిరికుమారుని ప్రేమగీతాలు' ఇందులో ప్రచురించారు. మాడపాటి హనుమంతరావు ఉర్దూ నుంచి తెలుగులోకి అనువదించిన కథలు కూడా ఇందులో ప్రచురితమయ్యాయి.

## 4.4.2 శారద

తెలుగులో తొలిగా వర్ణచిత్రాలతో వెలువడిన సాహిత్యమాస పత్రిక శారద. బందరు నుంచి 1923లో కౌతా శ్రీరామశాస్త్రి సంపాదకత్వంలో ఈ పత్రిక ప్రారంభమైంది. ప్రతినెలా 20వ తేదీన 160 పేజీలతో పత్రిక వెలువడేది. తెలుగులో వచ్చిన ఉత్తమ సాహిత్యాన్ని ఇందులో ప్రధానంగా ప్రచురించేవారు. ఈ పత్రిక ప్రతి సంచికనూ ఓ విజ్ఞానసర్వస్వంగా సంపాదకులు తీర్చిదిద్దేవారని చెన్నయ్య, జె. తన *తెలుగు దినపత్రికలు-భాషా సాహిత్య స్వరూపం*లో (1998, పుట 80)లో రాశారు. అడవి బాపిరాజు నవల హిమబిందు ఈ పత్రికలో తొలిగా ధారావాహికగా వచ్చింది. సాహిత్యంతో పాటు చరిత్ర, పరిశోధన, విమర్శ తదితర ప్రక్రియలు ఇందులో ప్రచురించేవారు.

ఆతర్వాత వెలువడిన పత్రికల్లో చెప్పుకోదగినది జ్వాల. విజయవాడ నుంచి 1932లో ముద్దుకృష్ణ సంపాదకత్వంలో ఇది వెలువడింది. నారాయణబాబు, కొడాలి ఆంజనేయులు వంటి సుప్రసిద్ధుల రచనలు ఇందులో ప్రచురించేవారు. శ్రీశ్రీ మహాప్రస్థానగేయం తొలిగా ఇందులో ప్రచురితమైంది. ఇవికాకుండా మచిలీపట్నం నుంచే 1928లో ప్రేమరాజు సత్యనారాయణరావు నేతృత్వంలో స్వవృద్ధి, 1929లో విజయవాడ నుంచి మోపిదేవి వేణుగోపాలరావు సంపాదకత్వంలో వర్ణాశ్రమ మాసపత్రికలు వెలువడ్డాయి.

## 4.4.3 వీణ

సాహిత్య సంబంధ విషయాలతో పాటు లలితకళా విషయాలను ప్రచురించడం ఒక ఎత్తయితే, విశ్వనాథ, శ్రీశ్రీ, దేవులపల్లి, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, ప్రేమ్‌చంద్, నోరి నరసింహశాస్త్రి తదితర ఉద్దండుల విఖ్యాత రచనలను తొలిగా ప్రచురించిన ఘనత వీణ సొంతం చేసుకుంది. ఇది 1936లో విజయవాడ సమీపంలోని తేలప్రోలు నుంచి పాటిబండ్ల మాధవశర్మ సంపాదకుడిగా వెలువడింది. సంపాదకవర్గంలో శ్రీశ్రీ, గుడిపాటి రాజగోపాల్, మద్దాలి సూర్యప్రకాశరావు, చందరాల రమమోహనరావు, మందలపర్తి ఉపేంద్రశర్మ సభ్యులుగా, మల్లాది రామకృష్ణశాస్త్రి, సోమంచి యజ్ఞన్నశాస్త్రి, కె.వి.పున్నయ్య, శ్రీపాద గణపతిరావు సభ్యులుగా ఉన్నారు. తెలుగు సంఖ్యలు ప్రచురిస్తూ, వ్యావహారిక భాషోద్యమానికి ఈ పత్రిక ఎనలేని సేవ చేసింది.

ఈ పత్రిక సంవత్సర చందా రెండు రూపాయలు కాగా విడిసంచిక నాలుగు అణాలకు అమ్మేవారు. విశ్వనాథ సత్యనారాయణ రచించిన హాహాహూహూ నవల వీణలోనే ధారావాహికగా వచ్చింది. శ్రీశ్రీ మహాప్రస్థానంలో 'ఔను నిజం, ఔను నిజం, ఔను నిజం నీవన్నది..' అంటూ సాగే గేయం తొలిగా ఇందులోనే అచ్చయింది. ప్రేమ్‌చంద్ అనువాద కథ రసిక సంపాదకుడు, దేవులపల్లి రాసిన 'రారమ్మ, రారమ్మ మందారమా' గీతం, టాల్‌స్టాయ్ అనువాదాలు, శరత్ నవలానువాదాలు ఇందులో వచ్చేవి. ఎంతగా జనాదరణ పొందినా ఆర్థిక కారణాల దృష్ట్యా రెండేళ్ళకే (1937లో) ఈ పత్రిక కనుమరగవడం విషాదకరం అని నామాల విశ్వేశ్వరరావు తన తెలుగు జర్నలిజం చరిత్ర (పుట 143)లో రాశారు.

### 4.4.4 నవభారతి

సాహిత్య సాంస్కృతికాంశాలకు పట్టుకొమ్మగా విరాజిల్లిన మాసపత్రిక నవభారతి. 1958లో చదలవాడ పిచ్చయ్య ఈ పత్రికను విజయవాడ నుంచి ప్రారంభించారు. నాట్యం, శృంగారం, సంస్కృతం, వ్యాకరణం.. తదితర అంశాలన్నీ ఇందులో ప్రచురించేవారు. అప్పట్లో ఉద్దండులైన కవులు, న్యాయాధిపతులు ఈ పత్రిక సంపాదకమండలిలో ఉండేవారని, ప్రారంభించిన కొద్దికాలంలోనే పుంజుకున్నప్పటికీ ఎందుకనో ఈ పత్రిక స్వల్పవ్యవధిలోనే మూతపడిందని బాలశౌరిరెడ్డి (తెలుగు పత్రికల చరిత్ర, 2010, పుట20) రాశారు.

### 4.4.5 కమ్యూనిస్ట్ పత్రికలు

ఇరవయ్యో శతాబ్దం రెండో అర్ధభాగంలో కె.రాజగోపాలరావు సంపాదకత్వంలో కమ్యూనిస్ట్ పేరుతో ఓ మాసపత్రిక వెలువడినట్లు ఆర్.ఎన్.ఐ. అధికారిక వెబ్‌సైట్ (http://rni.nic.in/)లో ఉంది. ఇదేపేరుతో మాకినేని బసవపున్నయ్య సంపాదకుడిగా 1974లో మరో మాసపత్రిక వెలువడినట్లు కూడా ఇందులో ఉంది. ఆ తర్వాత మార్క్సిస్ట్ సిద్ధాంతాల పునాదుల మీద 1975లో విజయవాడ నుంచి కమ్యూనిస్ట్ పేరుతో మాసపత్రిక వెలువడినట్లు బాలశౌరిరెడ్డి తన తెలుగుపత్రికల చరిత్ర (2010, పుట 31)లో రాశారు. కమ్యూనిస్ట్‌పార్టీలో పేరొందిన ప్రముఖనేతలంతా దాదాపుగా ఈ పత్రిక సంపాదకమండలిలో పనిచేశారు. సమకాలీన సమస్యలు, గ్రామీణాభ్యుదయం, పీడిత ప్రజల అభ్యున్నతి ప్రధానలక్ష్యం ఇందులో వార్తలు ప్రకటితమయ్యేవి.

నోబుల్ బహుమతి విజేత అమర్త్యసేన్ వ్యాసాల అనువాదాలు కూడా ఇందులో ప్రచురించేవారు. పత్రిక పక్షాన చర్చాగోష్ఠులు నిర్వహించేవారు. వామపక్ష భావజాలంతో ముప్పాళ్ళ రంగనాయకమ్మ ప్రారంభించిన పత్రిక ప్రజాసాహితి. 1977లో విజయవాడలో ప్రారంభమైన ఈ పత్రిక ప్రస్తుతం కొత్తపల్లి రవిబాబు సంపాదకత్వంలో వెలువడుతోంది. కవితలు, వ్యాసాలు, విమర్శలకు సమానప్రాధాన్యత ఇవ్వడం ఈ పత్రిక ప్రత్యేకత. ఇతర భారతీయ భాషల నుంచి విదేశీ భాషల దాకా వెలువడుతున్న ఉత్తమ సాహిత్యాన్ని అనువాదం చేసి ఇందులో ప్రచురిస్తుంటారు. తెలుగు సాహిత్యంలో వస్తున్న ఆధునిక సాహిత్యప్రక్రియలన్నిటినీ ఈ పత్రిక ఆదరిస్తుంది. కమ్యూనిస్ట్ భావాలతో వెలువడినప్పటికీ ఇవి తెలుగు భాషా సాహిత్యాలపరంగా గొప్పసేవ చేశాయనే చెప్పుకోవాలి. సమకాలీన రచనలను ఆదరించి ముద్రించడమే ఇందుకు తార్కాణం.

### 4.4.6 మహిళా పత్రికలు

మహిళా విషయాలతో జిల్లానుంచి వెలువడిన మాసపత్రికల్లో ఎక్కువభాగం పాఠకుల ఆదరణ అందుకున్నాయి. వీటిలో రంగమ్మరెడ్డి సంపాదకత్వంలో విజయవాడ నుంచి వచ్చిన నారీలోకం (1957), మచిలీపట్నం నుంచి ఎం.రత్నారెడ్డి నేతృత్వంలో వెలువడిన గృహజ్యోతి (1961) తొలి తరానికి చెందినవి. ఆర్.మనోహరం సంపాదకుడిగా విజయవాడ నుంచి వెలువడిన మహిళోదయ (1967), విజయవాడ నుంచే కె.ఎల్.ఎన్.ప్రసాద్ సంపాదకత్వంలో వెలువడిన వనితాజ్యోతి (1976)లను ప్రముఖంగా చెప్పుకోవచ్చు. మాంటిస్సోరి విద్యాసంస్థల అధినేత డాక్టర్ వి.కోటీశ్వరమ్మ సంపాదకురాలిగా వచ్చిన పత్రిక ఇల్లు ఇల్లాలు ఇరవై అయిదు సంవత్సరాలకు పైగా ఈ పత్రిక వెలువడుతోంది. మహిళాస్వావలంబన, మహిళా సాధికారత ప్రధాన లక్ష్యాలుగా ఈ పత్రిక వ్యాసాలు ప్రచురిస్తుంది. ఇంకా మహిళా పత్రికలు మరెన్నో కృష్ణాజిల్లా నుంచి వెలువడ్డాయి. ఇవన్నీ మహిళలు మెచ్చే అనేకాంశాలను ప్రచురిస్తూనే సమకాలీన అంశాలకు ప్రాధాన్యతనిచ్చాయి.

### 4.4.7 ఆధ్యాత్మిక పత్రికలు

ఇతర విభాగాల కన్నా మాసపత్రికల్లో ఆధ్యాత్మిక పత్రికలు ఎక్కువ సంఖ్యలో వెలువడడంతో పాటు అత్యంత విశేషంగా పాఠకాదరణ పొందాయనడంలో సందేహం లేదు. వీటిలో ఏఒక్క పత్రికనూ ప్రత్యేకించి వివరించాల్సిన పరిస్థితి లేదు. ఇక్కడ నుంచి వచ్చిన ప్రతి పత్రిక భారతీయ ఆధ్యాత్మిక వారసత్వాన్ని సమాజానికి అందించడంలో సఫలమైందనే చెప్పుకోవాలి.

అవతార్ మెహర్ (ఎస్.ప్రభాకర్, నూజివీడు, 1957), *బైబిల్‌జ్యోతి* (కె.ఇజ్రాయెల్, విజయవాడ, 1967), *శైవవాణి* (కె.సుబ్బారావు, విజయవాడ, 1968), *బైబిల్‌మహిమ* (పి.భూషణం, విజయవాడ, 1968), కామకోటివాణి (ఆర్.డి.ఎల్.నరసింహమూర్తి, మచిలీపట్నం, 1968), హనుమత్సేవ (ఎస్.ఎస్.లక్ష్మణరావు, విజయవాడ, 1976), సువార్తసునాదం (కె.ఎల్.పీటర్, 1976), వసుధ (వాసిరాజు రంగారావు, విజయవాడ, 2007) వీటిలో కొన్ని మాత్రమే.

రాష్ట్రంలో ప్రముఖ పుణ్యక్షేత్రమైన శ్రీదుర్గామల్లేశ్వరస్వామివార్ల దేవస్థానం (ఇంద్రకీలాద్రి, విజయవాడ) 2003 నుంచి *శ్రీకనకదుర్గప్రభ* పేరుతో మాసపత్రిక నిర్వహిస్తోంది. దేవస్థానం కార్యనిర్వహణాధికారే దీనికి సంపాదకుడిగా వ్యవహరిస్తారు. ప్రస్తుతం జె.ప్రభాకరశ్రీనివాస్ కార్యనిర్వహణాధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. దేవస్థానానికి, అమ్మవారికి సంబంధించిన వార్తలకు ప్రాధాన్యత ఇస్తూనే, ఇతర ఆధ్యాత్మికాంశాలకు ఇందులో చోటుకల్పిస్తున్నారు.

### 4.4.8 విద్య / ఉద్యోగ పత్రికలు

విద్యాఉద్యోగ రంగానికి సంబంధించి విజయవాడ నుంచి ఆలూరి సుభాష్‌బాబు సంపాదకత్వంలో వచ్చిన ఉద్యోగవిజయాలు (1990) వేలాది నిరుద్యోగుల పాలిట వరంగా నిలిచింది. (1989 నుంచి ఈ పత్రిక వెలువడుతున్నట్లు డాక్టర్ బాలశౌరిరెడ్డి తన *తెలుగు పత్రికల చరిత్ర* (పుట 41)లో రాశారు. అయితే ఆర్.ఎన్.ఐ. సమాచారం ప్రకారం ఈ పత్రిక 1990లో విడుదలైంది) ఎక్కడెక్కడి ఉద్యోగావకాశాలను సేకరించి ప్రచురించడంతో పాటు, ఆయా ఉద్యోగాలకు సంబంధించిన పరీక్షలు / ప్రవేశ పరీక్షల్లో ఉత్తీర్ణులయ్యేందుకు అవసరమైన సమాచారాన్ని ఇందులో ఇచ్చేవారు. దాదాపుగా రాష్ట్రంలోని నిరుద్యోగులందరూ ఈ పత్రిక అభిమానులయ్యారు.

విజయవాడ నుంచి 1991లో వచ్చిన ఉద్యోగపర్వం, 2000లో ఇక్కడ నుంచే ఎన్.నాగేశ్వరరావు సంపాదకత్వంలో వచ్చిన ఉద్యోగకిరణాలు ఈ కోవలోనివే. ఇంకా ఇలాంటి పత్రికలెన్నో ఇదే మార్గాన్ని అనుసరిస్తూ వెలువడడం ఉద్యోగవిజయాలు సాధించిన విజయంగా చెప్పుకోవచ్చు. దినపత్రికలు కూడా విద్య, ఉపాధిరంగాలకు సంబంధించిన శీర్షికలు ప్రవేశపెట్టడం, వాటికి ప్రాధాన్యత ఇవ్వడం దీని తర్వాతనే అధికమైంది.

దీనికన్నా ఎంతో ముందుగానే ఉపాధ్యాయవాణి (1957) పేరుతో ఎ.పూర్ణచంద్రరావు సంపాదకత్వంలో ఓ పత్రిక విడుదలైనట్లు ఆర్.ఎన్.ఐ. రికార్డుల్లో ఉంది. ఉపాధ్యాయరంగానికొస్తే ఐక్యఉపాధ్యాయ (ఎం.వెంకటరత్నం, విజయవాడ, 1999) బాగా ప్రసిద్ధి పొందింది. ఉపాధ్యాయులకు సంబంధించిన ప్రభుత్వ ఉత్తర్వులతో సహా అనేక విషయాలు, వారి సర్వీసుకు సంబంధించిన అనేక సూచనలు, సలహాలు ఇందులో వచ్చేవి.

## 4.4.9 కుల పత్రికలు / తెలుగు భాషా పత్రికలు

కులప్రధానమైన అంశాలకు మాత్రమే ప్రాధాన్యం ఇస్తూ 2009లో మాతి శ్రీకాంత్ కాపుప్రభ, యాదవవార్త పేరుతో బి.శ్రీరామ్‌యాదవ్ 2009లో కృష్ణాజిల్లా నుంచి పత్రికలు నడిపారు. తెలుగు సాహిత్యరంగానికి పెద్దపీట వేస్తూ 1993 నుంచి విజయవాడ కేంద్రంగా వెలువడుతున్న పత్రిక నడుస్తున్న చరిత్ర. సామల రమేష్‌బాబు దీనికి సంపాదకుడు, ప్రచురణకర్త కూడా. స్వదేశ, స్వభాషా సంస్కృతులను వికసింపజేసుకుంటూ, అనంత విజ్ఞానాన్ని ఆవాహనజేస్తూ, సంపూర్ణచైతన్యంతో విలసిల్లే సమాజం కోసం ఈ పత్రిక అంకితమైంది (డాక్టర్ బాలశౌరిరెడ్డి, తెలుగుపత్రికల చరిత్ర, పుట 40).

సమాజంలోని అన్నివర్గాల ప్రజలను తెలుగు భాషా పరిరక్షణ దిశగా చైతన్యవంతులను చేయాలనే సంకల్పంతో ఈ పత్రిక నడుస్తోంది. ఇందులో వచ్చిన స్పందన, రవ్వలు పువ్వులు శీర్షికలు చదువరులను ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఇదేతీరు అనుసరిస్తూ 2005 నుంచి నండూరి రాజగోపాల్ విజయవాడ కేంద్రంగా నడుపుతున్న చినుకు పత్రిక కూడా తెలుగు భాషా ప్రియుల మన్ననలు అందుకుంటోంది.

## 4.4.10 హాస్యపత్రికలు

హాస్యరసం ప్రధానంగా వెలువడిన పత్రికల్లో అందిన సమాచారం మేరకు 1922, ఆగస్టు ఒకటోతేదీన మచిలీపట్నం నుంచి వెలువడిన నవ్వులతోట ఎక్కువ ప్రాచుర్యం పొందిన పత్రికగా తెలుస్తోంది. కోసూరు గురునాథమూర్తి దీనికి సంపాదకుడు. ఈ పత్రికలో వచ్చిన శీర్షికల్లో 'సంపాదకీయ వ్యాఖ్యానాలు, విలేఖరులకు బ్రత్యుత్తరములు, కబుర్లు, పిట్టకథలు..' మొదలైనవి ఎంతో ప్రాచుర్యం పొందాయి. ఇందులో వచ్చిన వ్యంగ్య రచనలు పాఠకాదరణ పొందాయి.

ఇందులోనే 'విదూషకోపన్యాసము' శీర్షికలో వచ్చిన 'స్త్రీల ప్రత్యేక సభ' వ్యాసం... "పీతవర్ణపు పింగళాక్షులును, రక్తవర్ణపు రమణీమణులును, కృష్ణవర్ణపు కేశినులును, శుక్లవర్ణపు సుదతులు సభనలంకరించి యుండిరి. నేను చతికిలబడి యైదారు నిముసములైనదో లేదో! జారుముళ్ళవారును, ముచ్చటముళ్ళవారును, ముందుకత్తిరింపులవారును, వలపలి పాపటలవారును, డాపలి పాపటలవారును, జారుముళ్ళవారును, జంట జడలవారును, కండ్లజోళ్ళవారును, కాళ్ళజోళ్ళవారును, మేజోళ్ళవారును, మెడపట్టీల వారును, పైట లంగాలవారును, పట్కాలవారును, గూడకట్లవారును, కుచ్చెళ్ళవారును, జాకెట్లవారును, జారుపైటల వారును..." అంటూ సాగుతూ పాఠకులను ఎంతగానో నవ్విస్తుంది. ఈ వ్యాసం రాసిన రచయిత పేరు ఇందులో లేదు. ఈ పత్రికలో మారుపేర్లతోనే రచనలు ఎక్కువగా వచ్చేవని *తెలుగు జర్నలిజం చరిత్ర*లో (పుట 112) నామాల విశ్వేశ్వరరావు రాశారు.

సునిశితమైన హాస్యానికి వ్యంగ్యాన్ని జోడిస్తూ విజయవాడ నుంచి 2003లో వెలువడిన హాస్యానందం ఆధునిక కాలంలో ఓ చక్కని ప్రయత్నంగా కొనసాగింది. రాము పండా దీనికి సంపాదకుడు, ప్రచురణకర్త కూడా. సినీ, రాజకీయ వార్తలకు మాత్రమే ప్రాధాన్యతనిస్తూ పత్రికలు నడుపుతున్న ఈకాలంలో కేవలం హాస్యాన్ని నమ్ముకుని పత్రికను ప్రారంభించడం పెద్ద సాహసమే అవుతుంది. ప్రారంభంలో ఎన్నోఒడిదుడుకులను ఎదుర్కొన్న ఈ పత్రికను కొన్ని కారణాల వల్ల 2008, 2009 సంవత్సరాల్లో ప్రచురించలేదు. 2010 నుంచి తిరిగి ప్రారంభమైన ఈ పత్రిక ప్రస్తుతం గుంటూరు నుంచి క్రమం తప్పకుండా వెలువడుతోంది. రాష్ట్రంలోని ప్రముఖ హాస్యరచయితలందరి రచనలు ఇందులో ప్రచురిస్తున్నారు. వ్యాసాలతో పాటు వ్యంగ్య శీర్షికలు నిర్వహించడం దీని ప్రత్యేకత. ఇందులో వచ్చే కార్టూన్లు పాఠకులను కడుపు నొప్పి పుట్టేలా నవ్విస్తాయి. సినీ కథానాయికల చిత్రాలను ముఖచిత్రాలుగా ప్రచురించడం ఓ అలవాటుగా పెట్టుకుంది.

## 4.4.11 కంప్యూటర్ విజ్ఞాన పత్రికలు

ఆధునిక అవసరాలకు తగినట్లు కంప్యూటర్ విజ్ఞానాన్ని పాఠకులకు అందించాలనే సంకల్పంతో ప్రారంభించిన పత్రిక *కంప్యూటర్ విజ్ఞానం*. కె.రామారావు సంపాదకత్వంలో విజయవాడ నుంచి 1990లో ఇది వెలువడింది. కంప్యూటర్ సమాచారాన్ని తెలుగులో అందించిన తొలి తెలుగు పత్రికగా ఇది పేరుపొందింది. కంప్యూటర్ కోర్సులు తదితర వివరాలతో వచ్చిన ఈ పత్రిక అచిరకాలంలో ఎక్కువసంఖ్యలో పాఠకులకు చేరువ అయింది.

## 4.4.12 కళాసాంస్కృతిక పత్రికలు

ఇ.నారాయణరావు సంపాదకుడిగా *కళ* (1966) పేరుతో విజయవాడ నుంచి మాసపత్రిక విడుదలైనట్లు ఆర్.ఎన్.ఐ.వద్ద ఉంది. పేరునుబట్టి దీన్ని కళారంగానికి చెందిన పత్రికగా గుర్తించవచ్చు. కళాసాంస్కృతిక రంగాల్లోని సమస్యలు, ప్రముఖుల వివరాలు, వర్తమానంలో జరుగుతున్న కార్యక్రమాల వివరాలను అందిస్తూ 2001లో విజయవాడ నుంచి వెలువడిన పత్రిక *కళాదర్శిని*. సీతాల శివాజీ దీనికి ప్రచురణకర్త, సంపాదకుడు కూడా. సంగీతం, సాహిత్యం, నాటకం, నృత్యం అంశాలకు ప్రాధాన్యం ఇస్తూ వెలువడిన పత్రిక తొందరగానే అభిమానులను ఏర్పరచుకుంది. అయితే కారణాంతరాల వల్ల ప్రారంభమైన నాలుగేళ్ళకే ఇది మూతపడింది.

## 4.4.13 భక్తి పత్రికలు

భక్తిపత్రికల విషయంలో కృష్ణాజిల్లా పోషించిన పాత్ర ఎనలేనిది. ఇక్కడ నుంచి పదుల సంఖ్యలో భక్తిపత్రికలు వెలువడి, ప్రజల్లో ఆధ్యాత్మిక భావాలను పెంపొందిచడంలో సఫలమాయ్యాయి. విజయవాడ నుంచి 1907లో శ్రీనివాసాచార్యులు *శ్రీవేంకటేశ్వరపత్రిక* నడిపారు. తర్వాతికాలంలో వచ్చిన *శ్రీవైష్ణవ* (1920, తి.న.చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యులు) పత్రిక కూడా ఆ కాలంలో ప్రముఖ భక్తి పత్రికగా పాఠకుల మన్ననలు అందుకుంది. క్రైస్తవమతపరంగా 1925లో మచిలీపట్నం నుంచి రెవరెండ్ నెథానియేల్ నడిపిన *ఆంధ్రక్రైస్తవ పత్రిక* ప్రాచీనమైనదిగా తెలుస్తోంది. అయితే ఇది వారపత్రికగా వెలువడింది.

ధ్యానమండలి నిర్వహణలో 2001 నుంచి విజయవాడ కేంద్రంగా వెలువడుతున్న పత్రిక *ధ్యానమాలిక*. భిక్షమయ్య గురూజీ దీనికి వ్యవస్థాపకుడు కాగా సత్యనారాయణ సంపాదకులు. యోగ, వైద్య విజ్ఞానాంశాలకు ఇది ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది. ధ్యానమండలి సభ్యులకు దీన్ని ఉచితంగా పంపిణీ చేస్తున్నారు. బహిరంగ మార్కెట్‌లో దొరకదు. ఆమంచి బాలసుధాకరశాస్త్రి సంపాదకత్వంలో విజయవాడ నుంచి 2002లో వచ్చిన *మహర్షికాలజ్ఞానం* కూడా మంచి పత్రికగా పేరుపొందింది. ఇక్కడనుంచే వెలువడుతున్న *భక్తిసుధ* కూడా పాఠకాదరణ పొందింది. అవ్వా హేమ సుందర వరప్రసాద్ దీనికి వ్యవస్థాపక సంపాదకుడు కాగా మైలవరపు శ్రీనివాసరావు సంపాదకుడుగా వ్యవహరిస్తున్నారు. ఆధ్యాత్మిక వ్యవహారాల్లో లోకప్రసిద్ధి పొందిన వ్యక్తులు ఈ పత్రిక సంపాదకమండలిలో సభ్యులుగా ఉన్నారు.

పి.ఎస్.పి.కుమార్ సంపాదకత్వంలో 2006 నుంచి వెలువడుతున్న *శ్రీకంఠవాణి* కూడా ఆధ్యాత్మిక విషయాలను ప్రచురిస్తోంది. అయితే ఇందులో వివాహ సంబంధ విషయాలను ఎక్కువగా ప్రచురిస్తున్నారు. ఇవికాకుండా కృష్ణాజిల్లా నుంచే *సాయిపథం* (ఎస్.వి.ఎల్.నారాయణరావు), *భాగవతసేవ* (భక్త సుబ్రహ్మణ్యం), *వేదభూమి* (జి.నరసింహశాస్త్రి) పత్రికలు వెలువడినట్లు తెలుస్తోంది. అయితే ఈ పత్రికల పూర్తి వివరాలు మృగ్యం.

### 4.4.14 బాలల పత్రికలు

తెలుగులో తొలిగా బాలల పత్రికను వెలువరించిన ఘనత కూడా కృష్ణాజిల్లాకే దక్కుతుంది. 1940లో మేడిచెర్ల ఆంజనేయమూర్తి విజయవాడ నుంచి ప్రారంభించిన బాలల పత్రిక *బాలకేసరి*. 'ఇందు బాలురు బాలికలకు సంబంధించిన ప్రత్యేక సబ్జెక్ట్‌ల పైన, క్రీడలపైనను, కట్టుకథల పైనను, పండగల పైనను, మృదుమధురమైన వ్యాసములు ప్రకటింపబడును' అని ఈ పత్రికలో రాసిఉన్నట్లు డాక్టర్ జె.చెన్నయ్య తన *తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం* (పుట 107)లో రాశారు. దీన్నిబట్టి బాలల కోసం ఈ పత్రిక అధిక ప్రాధాన్యం ఇచ్చినట్లు తెలుస్తోంది. తర్వాతి కాలంలో కృష్ణాజిల్లా చాగల్లు నుంచి కె.హెచ్.ఒస్‌బరోస్, సి.జె.కిల్స్‌లే నేతృత్వంలో *బాలపత్రిక* పేరుతో ఓ మాసపత్రిక విడుదలైనట్లు ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదైంది. పేరును బట్టి ఇది కూడా బాలలకు సంబంధించిన పత్రికగా భావించవచ్చు.

### 4.4.15 ఇతర పత్రికలు

ఇతర రంగాల పత్రికలను పరిశీలిస్తే వింతలు, విశేషాలకు ప్రాధాన్యాన్ని ఇస్తూ వట్లూరి నారాయణరావు వ్యవస్థాపక సంపాదకుడిగా విజయవాడ నుంచి వచ్చిన *వండర్ వరల్డ్* (1986) అప్పట్లో పెద్దసంచలనమే సృష్టించింది. దేశవిదేశాల్లోని ఆశ్చర్యకరమైన వింతలతో పాటు, అక్కడి ప్రత్యేకతలు ఇందులో ప్రముఖంగా ప్రచురించేవారు. మొదట్లో ఈ అంశాలకే పరిమితమైనప్పటికీ క్రమంగా విద్యార్థులకు ఉపయోగించే సమాచారం, ఇంగ్లిషు భాషకు సంబంధించిన విషయాలు కూడా ఇందులో ప్రచురించేవారు. ఈకోవలోనే మరెన్నో పత్రికలు ఆకాలంలో వెలువడడం ఈ పత్రిక పొందిన విశేషపాఠకాదరణకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు. సూరి వేంకట నరసింహశాస్త్రి, అయ్యంకి వేంకట రమణయ్య, గూడూరి రామచంద్రరావు విజయవాడ నుంచి వెలువరించిన పత్రిక సహకారము.

క్రీ.శ.1915లో వచ్చిన ఈ పత్రిక మొదట్లో *మదరాసు బులిటెన్ ఆఫ్ కో ఆపరేషన్* పేరుతో ప్రకటితమైంది. ఆంధ్రసహకార సమ్మేళనం ప్రారంభమైన తర్వాత మచిలీపట్నం నుంచి *సహకారి* పేరుతో విడుదలైంది. ఆ తర్వాత సమ్మేళనంతో పాటు గుడివాడకు మారింది. అక్కడి నుంచి విజయవాడకు చేరింది. గాడిచర్ల హరిసర్వోత్తమరావు కూడా కొంతకాలం ఈ పత్రిక నిర్వహణలో పాలుపంచుకున్నారు.

'ఆయుర్వేదభూషణ' డాక్టర్ వేటూరి శంకరశాస్త్రి సంపాదకత్వంలో ముక్త్యాల నుంచి వెలువడిన పత్రిక *ధన్వంతరి.* ఆయుర్వేదానికి సంబంధించిన విషయాల ప్రచురణతోపాటుగా వివిధ శాస్త్రాల్లో పరిశోధనలు చేయడానికి సైతం ఈ పత్రిక కృషిచేసింది. ప్రాచీన వైద్యగ్రంథాలను ఈ పత్రికలో ధారావాహికంగా ప్రకటించారు. విఖ్యాత వ్యాకరణ పండితుడు ఎలకూచి బాలసరస్వతి రచించిన 'శరీరం' పద్యానువాదాన్ని ఇందులో ప్రకటించారు.

పాఠకాదరణ పొందిన పత్రికల్లో మరికొన్ని... *ఆంధ్ర ఫిలింఛాంబర్ జర్నల్* (విజయవాడ, ఎం.ఎస్.రాజు), *శ్రీధన్వంతరి* (వి.శంకరశాస్త్రి, విజయవాడ, 1967), *ఆయుర్వేద* (కె.విష్ణువర్ధనరావు, విజయవాడ, 1967), *రజకజ్యోతి* (ఎల్.తాతయ్య, విజయవాడ, 1972), *ట్యాక్స్‌వార్తలు* (జి.నాగేశ్వరరావు, విజయవాడ, 1973), *టెలిఫోన్ ట్రాఫిక్ బులిటెన్* (ఆంగ్లం, ఎం.వెంకట్రావు, విజయవాడ, 1977), *కాన్సెప్ట్ ఆఫ్ ప్రింటింగ్* (ఎం.త్యాగరాజు, విజయవాడ, 1990), *ఫిషరీస్ వరల్డ్* (ఎస్.కె.బాజీ, విజయవాడ, 1993), *సినీరాణి* (డి.చంద్రశేఖర్, విజయవాడ, 1977), *జనరల్ ఎడ్యుకేషన్ ఫర్ ఆల్* (ఆంగ్లం, ఎస్.సుందరాచారి, విజయవాడ, 1985), *క్వశ్చన్‌బ్యాంక్* (ఎస్.ఎం.కొండయ్య, విజయవాడ, 1987), *హెల్త్‌టుడే* (ఎ.పి.ప్రసాదబాబు, విజయవాడ, 1994), *భావతరంగిణి* (జి.వి.రమణారావు, మచిలీపట్నం, 1998).

ఆర్.ఎన్.ఐ. వద్ద నమోదైన మరియు నమోదుకాని పత్రికలన్నింటినీ కలుపుకుంటే దాదాపు 200కు పైగా మాసపత్రికలు కృష్ణాజిల్లా నుంచి వెలువడినట్లు తెలుస్తోంది. సంఖ్యాపరంగా చూసినా ఇది విశేషమైన అంశమే. రాశితో పాటు వాసి కూడా ఇక్కడ పోషించబడింది. తెలుగు ప్రజలకు... ముఖ్యంగా గృహిణుల్లో పఠనాసక్తిని పెంపొందించి, వారికి లోకజ్ఞానం కలిగించడంలో ఈ పత్రికలు చేసిన / చేస్తున్న కృషి ఎన్నతగినదిగా ఉంటోంది.

## 4.5. ద్వైమాసిక పత్రికలు

మాసపత్రికల తర్వాత ఆవర్తన వ్యవధుల్లో ద్వైమాసిక, త్రైమాసిక, అర్ధవార్షిక, వార్షికపత్రికలు వస్తాయి. ద్వైమాసిక పత్రికల్లో ఎక్కువభాగం సాహిత్యపత్రికలే వెలువడడం చెప్పుకోదగిన విషయం. పాఠకులకు తక్షణమే విషయాలను ప్రచురించి అందిచాల్సిన పరిస్థితి లేకపోవడమే ఇందుకు కారణం కావచ్చు. ఆవర్తనవ్యవధి ఎక్కువగా ఉండడంతో ద్వైమాసిక పత్రికల్లో నిండుదనం ఎక్కువగా కనిపించేది. అంశాల ఎంపిక నుంచి, పత్రికను తీర్చిదిద్దే వరకు ప్రతిఅంశంలోను ఇది స్పష్టంగా కనిపిస్తుంది. ఒకటిరెండు పత్రికలు మినహాయిస్తే వీటికి మాసపత్రికలంతగా ప్రాచుర్యం వచ్చినట్లు కనిపించదు. అలాగని, వీటిలో విషయనిష్ఠత లోపించిందని కాదు. ఎక్కువ ఆవర్తనవ్యవధి కావడం, అప్పటికే ఇతర పత్రికల్లో దాదాపుగా ఇదేరీతిలో సమాచారం రావడం ఈ పత్రికలకు ఆదరణ తగ్గడానికి కారణమై ఉండవచ్చు. ఎంచుకున్న అంశంపై ఈ పత్రికలు వెలువరించిన వ్యాసాల నాణ్యత మాత్రం ఎన్నతగినది.

తెలుగులో 1920 వరకు ద్వైమాసిక, త్రైమాసిక పత్రికలు వెలువడినట్లు ఆధారాలు లభించడం లేదు. తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి 1919 ప్రాంతంలో ప్రారంభించిన సాహితి తొలి ద్వైమాసిక పత్రిక. ఆ తర్వాతనే తెలుగులో ద్వైమాసిక పత్రిక ప్రచురణ ప్రారంభమైంది. ఆనాటికి విఖ్యాతులైన వారితో శంకరశాస్త్రి తెనాలిలో 1919లో 'సాహితీ సమితి' నెలకొల్పారు. చింతా దీక్షితులు, నోరి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి, నండూరి సుబ్బారావు, నాయని సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి తదితరులంతా 'సమితి'లో సభ్యులుగా ఉండేవారు. వీరందరి కవిత్వంతో నిండిన 'సాహితి' నిజంగానే సాహితీలోకంలో నిండుకుండగా భాసించింది. వ్యావహారికవాదానికి ఇది ప్రాధాన్యం ఇవ్వడంతో పాఠకలోకంలో ఈ పత్రికకు ఆదరణ త్వరగా లభించింది.

### 4.5.1 జయంతి

'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ సంపాదకత్వంలో 1927లో *జయంతి* ద్వైమాసికపత్రికగా ప్రారంభమైంది. మచిలీపట్నం, మద్రాసు రెండు ప్రాంతాల నుంచి ఇది వెలువడేది. భర్తృహరి నీతిశతకంలోని 'జయన్తితే సుకృతినో రససిద్ధా: కవీశ్వరా:, నాస్తితేషాం యశ:కాయే జరామరణజం భయం॥' అనే శ్లోకం పత్రిక పతాక శీర్షిక కింద ఉండేది.

ప్రారంభసంచికలో విశ్వనాథ రాసిన 'అధునా' అనే సంపాదకీయం నాటి సాహిత్యప్రక్రియల పరిస్థితిని కళ్ళకు కడుతుంది. '...ఖండకావ్యాల స్థితి కథలంత వాసిగా లేదు. ఖండకావ్యాలకీ రూపం ఏర్పడ్డది అంటానికి యింతమంది దుయ్యబట్టడమే సాక్ష్యం. రసవంతంగా వ్రాసేవాళ్ళు, దేశంలో తగినంతమంది ఉన్నారనీ, ప్రతివాడూ ఒక్కొక్క వ్యక్తిత్వంతో భాసిస్తున్నారు అనీ తేలుతోంది' అని రాశారు. ఇంకా ఆయనే మితిమీరుతున్న ఇంగ్లిషు వాడకం గురించి ఇలా రాశారు. "భావం బ్రతుకు మీద ఆధారపడి వుంటోంది. ప్రతి ఆంధ్రుడి బ్రతులకు ఇంగ్లిషు ఆక్రమిస్తే 'ఆంధ్ర' భావం ఎక్కడ?... ఏ జగత్తుకైనా జీవితానికయ్యే భాష పరిగ్రాహ్యం. ఇక మనదేశం బాగుపడాలంటే తెలుగుభాషే జీవితానికయ్యే భాష కావాలి. తక్కినవన్నీ తరువాత."

జయంతిలో సాహిత్యధార, పాఠకుల ఉత్తరాలు, ఆకాశవాణి, పుస్తకసమీక్ష, చర్చావేదిక వంటి శీర్షికలతోపాటు వ్యాసాలు, కథానికలు, కవితలు, నాటకాలు, సమీక్షలు, అనువాదాలు ప్రచురించేవారు. ఈ పత్రికలోనే విశ్వనాథ 'గ్రామ్యమా? వాడుకభాషా?' అనే శీర్షికతో రాసిన వ్యాసంలో వ్యావహారికభాషను ఎంతగానో సమర్థించారు. ఆయన విశ్లేషణ ఇలా సాగింది... 'ఏ కవికి, ఏ వ్రాతగాడికి ఎప్పుడు ఏది రమ్యంగా వుందని తోస్తే అది వ్రాస్తాడు. అది రమ్యం కాదూ అని తోస్తే కాలం తోసేస్తుంది. ఒకప్పుడు రమ్యమైనదాన్ని రమ్యంగా లేదని కాలం అనుకుని వదిలేస్తే అదే మళ్ళీ కొన్నాళ్ళకు దాన్ని పునరుద్ధరిస్తుంది'. ఇందులోనే చింతా దీక్షితులు గ్రాంథికవాదుల మీద వ్యంగ్యధోరణిలో 'సరస్వతీ పూజ' అనే కథ రాశారు. 'గ్రాంథిక వాణీస్తోత్ర మహామంత్రం' అనే పద్యాలు రాసి గ్రాంథికవాదులైన పండితులను ఎత్తిపొడిచారు. ప్రారంభమైన కొద్దికాలానికే ఆగిపోయిన ఈ పత్రిక తిరిగి క్రీ.శ.1958లో విశ్వనాథ అధ్యక్షతన మల్లంపల్లి సోమశేఖరశర్మ, దివాకర్ల వేంకటావధాని, కేతవరపు రామకోటిశాస్త్రి, జువ్వాడి గౌతమరావు సంపాదక మండలిగా తిరిగి ప్రారంభమైంది. తర్వాత కొద్దికాలానికే అనేక కారణాలతో మళ్ళీ ఆగిపోయింది.

## 4.5.2 మాతృక

కె.రమ సంపాదకత్వంలో 1992 నుంచి మాతృక పేరుతో ద్వైమాసిక పత్రిక వెలువడుతోంది. దీనికి విజయవాడ ప్రచురణ కేంద్రం. ఈ పత్రిక శీర్షిక కింద 'ప్రగతిశీల మహిళా కరదీపిక మన మాతృక' అని రాసిఉన్నట్లు డాక్టర్ బాలశౌరిరెడ్డి తన తెలుగు పత్రికల చరిత్ర (పుట 39)లో రాశారు. మహిళా హక్కుల రక్షణ, ఇందుకోసం సాగే ఉద్యమాలను సమర్థిస్తూ ఈ పత్రిక వ్యాసాలు ప్రచురించేది. స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలు, వివక్షలను ఈ పత్రిక నిరసించేది.

వీటితో పాటు వి.దక్షిణామూర్తి సంపాదకత్వంలో జ్యోతిర్వేద (1968), టి.శామ్యూల్ సంపాదకుడిగా *క్రీస్తులో విమోచనం* (1992), సి.అబ్రహాంవెస్లీ (1996) సంపాదకుడిగా *నిప్పురవ్వలు* (1996), దోరోతి జయరావు సంపాదకుడిగా *పాలించు ద్రాక్షవల్లి* (2002), ఎ.శేషాద్రి సంపాదకత్వంలో 2003లో *శ్రీదత్తవాణి* (ఆంధ్రాంగ్ల భాషల్లో వెలువడింది), అదే ఏడాది చుక్కపల్లి కుశలవ సంపాదకుడిగా *ఆంధ్ర ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ సమాచార్* (ద్విభాషా పత్రిక), పి.థామస్ వర్గీస్ సంపాదకత్వంలో *ధ్వజం* (ఇంగ్లిషు) పత్రికలు విజయవాడ కేంద్రంగా వెలువడ్డాయి.

కృష్ణాజిల్లా అరవిందపురం నుంచి 2000లో *దివ్యదీపిక* పేరుతో మరో ద్వైమాసిక పత్రిక వెలువడినట్లు ఆర్.ఎన్.ఐ.సమాచారం. కె.భాస్కరరావు దీనికి సంపాదకుడు. పి.అబ్రహాం శామ్యూల్ సంపాదకుడిగా *బానర్ ఆఫ్ ట్రూత్* పేరుతో విజయవాడ నుంచి ఆంగ్ల ద్వైమాసిక పత్రిక వెలువడినట్లు కూడా ఆర్.ఎన్.ఐలో నమోదైంది. ఇంతకుమించి ఈ పత్రికకు సంబంధించిన వివరాలు మృగ్యం.

## 4.6 త్రైమాసిక పత్రికలు

త్రైమాసిక పత్రికల విషయంలోనూ ద్వైమాసిక పత్రికల తీరే కనిపిస్తుంది. ఇవి కూడా 1910 వరకు వెలువడినట్లు ఆధారాలు లభించడం లేదు. అయితే 1916లో రెండు త్రైమాసిక పత్రికలు వెలువడ్డాయని, అయితే అవి క్రైస్తవ మత ప్రచారం కోసమే పనిచేశాయని, ప్రారంభించిన కొంతకాలానికే మూతపడ్డాయని డాక్టర్ జె.చెన్నయ్య తన *తెలుగు దినపత్రికలు భాషాసాహిత్య స్వరూపం* (పుట 54)లో రాశారు. 1912లో వచ్చిన *ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక* ఆనాటి త్రైమాసిక పత్రికల్లో ఎంతో పేరు పొందింది. ఇది కృష్ణాజిల్లాకు చెందిన పత్రిక కానప్పటికీ త్రైమాసిక పత్రికల్లో చారిత్రాత్మక స్థానం పొందింది.

ఇక, కృష్ణాజిల్లాలో వెలువడిన త్రైమాసిక పత్రికలను పరిశీలిస్తే 1915లో అయ్యంకి వెంకటరమణయ్య విజయవాడ నుంచి ప్రారంభించిన *గ్రంథాలయ సర్వస్వం* కనిపిస్తుంది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ఆధ్వర్యంలో నడిచిన ఈ పత్రిక గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ఎంతగానో పాటుపడింది. ప్రారంభించిన రెండేళ్ళకు ద్వైమాసిక పత్రికగా మారి, ఆరవ సంపుటం నుంచి మాసపత్రికగా వెలువడింది.

విజయవాడ నుంచే 1946లో *అభ్యుదయ* పేరుతో త్రైమాసిక పత్రిక వెలువడింది. కొమర్రాజు వినాయకరావు దీనికి సంపాదకుడు. నాట్యకళకు సంబంధించిన విషయాలకు అత్యధిక ప్రాధాన్యం ఇస్తూ 1956లో *నాట్యకళ* పేరుతో మరో పత్రిక వచ్చింది. విజయవాడ నుంచి వెలువడిన ఈ పత్రికకు శ్రీనివాస చక్రవర్తి సంపాదకుడు. ఇక్కడి నుంచే 1999లో పి.ఎం.శామ్యూల్ సంపాదకుడిగా *గాస్పెల్ ఇల్యూమినేటర్*, కె.ఎస్.రావు సంపాదకుడిగా *కలంకారీ* అనే ఆంగ్ల త్రైమాసిక పత్రికలు వెలువడ్డాయి. కె.భాస్కరరావు సంపాదకత్వంలో గుడివాడ నుంచి 2001లో *దివ్యదీపిక*, కె.సి.హెచ్.పున్నయ్యచౌదరి సంపాదకుడిగా *బ్యాడ్మింటన్‌హౌస్* (2002) పత్రికలు వెలువడ్డాయి.

చలపాక ప్రకాష్ సంపాదకుడిగా 2003 నుంచి విజయవాడ కేంద్రంగా వెలువడుతున్న త్రైమాసిక పత్రిక *రమ్యభారతి*. తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు ఇందులో ఎక్కువగా వస్తుంటాయి. తెలుగు సాహిత్యంలోని విభిన్న ప్రక్రియలను కూడా ఈ పత్రిక ఆదరిస్తోంది. ఇక్కడి నుంచే కె.ఆర్.కె.ప్రభాకరమూర్తి సంపాదకుడిగా *హెూమియోపతిక్ మెడికల్ అబ్జర్వర్* (2009) ఆంగ్లభాషలో వెలువడుతోంది. విజయవాడ కేంద్రంగా వి.సుదర్శనం సంపాదకుడిగా *యువకృష్ణ* పేరుతో మరో పత్రిక వెలువడింది. ఇది ఆంధ్రాంగ్ల భాషల్లో వెలువడినట్లు ఆర్.ఎన్.ఐ. సమాచారం. అలాగే, కృష్ణాజిల్లా అంపాపురం నుంచి పాటిబండ్ల మాధవశర్మ సంపాదకత్వంలో *ఉదయభారతి* పేరుతో త్రైమాసిక పత్రిక వెలువడినట్లు తెలుస్తోంది. ఈ పత్రికలకు సంబంధించిన ఇతర వివరాలు లభ్యం కాలేదు.

### 4.6.1 గణితచంద్రిక

వ్యాపార ప్రకటనలు ఉంటే తప్ప పత్రికను నడపలేని నేటి పరిస్థితుల్లో ఏడాదికి ఒకటి రెండు ప్రకటనలు మినహా వ్యాపారప్రకటనల ఊసే లేకుండా 1992 నుంచి నడుస్తున్న పత్రిక *గణిత చంద్రిక*. అసోసియేషన్ ఫర్ ఇంప్రూవ్‌మెంట్ ఆఫ్ మ్యాథ్స్ ఎడ్యుకేషన్ ఆధ్వర్యంలో నడుస్తున్న ఈ పత్రికకు ప్రఖ్య సత్యనారాయణశర్మ వ్యవస్థాపకుడు, ప్రధాన సంపాదకుడు కూడా. గణిత విద్యా రంగంలో ప్రఖ్యాతి పొందిన పలువురు ఈ పత్రిక సంపాదమండలి సభ్యులుగా ఉన్నారు. పూర్వప్రాథమిక స్థాయి నుంచి స్నాతకోత్తరస్థాయి వరకు అవసరమైన గణితాంశాల్లోని ప్రాథమిక భావనలు, గణిత బోధనలో నూతన విధానాలు, గణితంలో బోధనోపకరణాల తయారీ, పోటీపరీక్షల్లో అడిగే గణితాంశాలకు సంబంధించిన వివరణలు తదితర అంశాలు ఇందులో ఉన్నాయి.

సర్వసాధారణంగా గణితానికి, సాహిత్యానికి పొసగదనే వాదన వినిపిస్తుంటుంది. కానీ, ఈ పత్రిక గణితానికి, తెలుగు సాహిత్యానికి చక్కని సమన్వయం చేస్తూ గణితంలో నాటికలు, కవితలు, పొడుపుకథలు ప్రచురించడం చెప్పుకోదగిన విషయం. గణితమేధావుల జయంతులు, వర్ధంతుల సందర్భంలో వారి జీవిత చరిత్రలను ముఖచిత్ర కథనాలుగా ఇవ్వడం మరో ప్రత్యేకత. రాష్ట్రవ్యాప్తంగా పాఠశాలలు, కళాశాలలో జరిగిన గణిత సంబంధ కార్యక్రమాల వివరాలను సంక్షిప్త కథనాలుగా అందిస్తోంది. జాతీయ, రాష్ట్రీయ స్థాయి సదస్సులు, సమావేశాల్లో పరిశోధకులు సమర్పించిన గణిత విద్యావిషయక గోష్ఠీపత్రాలను ప్రచురిస్తోంది. గణితంలో ప్రత్యేక ప్రతిభ కనబరుస్తున్న విద్యార్థులను ప్రోత్సహించే దిశగా వారి పరిచయ కథనాలు అందిస్తోంది. ప్రారంభించిన నాటి నుంచి నేటివరకు (20 సంవత్సరాల పాటు) ఓ విద్యావిషయిక గణిత పత్రికకు ఒకేవ్యక్తి సంపాదకుడిగా ఉండడమూ ఈ పత్రిక సాధించిన ఘనతల్లో ఒకటిగా చెప్పుకోవచ్చు.

## 4.7 లిఖిత పత్రికలు

పత్రికా ప్రపంచంలో ఎంచుకున్న అతిచిన్న సమాజానికి మాత్రమే పరిమితమైన పత్రికలు 'లిఖిత పత్రికలు'. వాస్తవానికి వీటిని చదివే పాఠకుల సంఖ్య పరిమితమైనప్పటికీ వీటిని తయారుచేసే వ్యక్తులు / సంపాదకుల తృష్ణ ప్రశంసనీయం. ముద్రణ వ్యయాన్ని కూడా భరించలేని స్వతంత్ర వ్యక్తి లేదా వ్యక్తులు లిఖిత పత్రిక వైపునకు మొగ్గుచూపిస్తారు. తమలో అంతర్లీనంగా దాగిఉన్న కళాసాంస్కృతిక పిపాసను ఈ తీరులో పత్రికా రూపంగా వీరు ప్రకటించడం జరుగుతోంది. జిల్లాలో ఇప్పటివరకు ఎన్ని లిఖితపత్రికలు వచ్చాయనే విషయంలో నిర్దుష్టమైన ఆధారాలు ఏవీ లభించలేదు. ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదు చేయాల్సిన అవసరం లేకపోవడం, అతి తక్కువ ఆర్థిక వనరులు, తక్కువ పరిధి... ఇలా అనేక కారణాలు లిఖితపత్రికల చరిత్రను దాచిపెట్టడానికి అవరోధంగా నిలిచాయి.

విజయవాడ నుంచి ప్రఖ్య సత్యనారాయణశర్మ సంపాదకుడిగా 1981లో కృష్ణవేణి, 1988లో *లీలావతి* లిఖిత పత్రికలు వెలువడ్డాయి. ఉన్నత పాఠశాల ఉపాధ్యాయుడిగా ఉన్న ఈ సంపాదకుడు తన విద్యార్థుల్లో దాగిఉన్న ప్రతిభను వెలికితీయాలనే ఉద్దేశంతో ఈ పత్రికను ప్రారంభించారు. ఇందులో విద్యార్థులే కార్టూన్లు, కవితలు, వ్యాసాలు రాయడం జరిగింది. అక్కడి చిత్రలేఖనోపాధ్యాయులు ఇందుకు సహకరించి వ్యాసాలకు తగిన చిత్రాలు గీయడం ప్రత్యేకత.

పత్రిక ప్రతి అణువులోను కొట్టొచ్చినట్లు కుదురుకున్న నిండుదనం పత్రిక నిర్వాహకులు దానిపట్ల చూపించిన ఆత్మీయతను ప్రకటిస్తోంది. *లీలావతి* కేవలం గణితశాస్త్ర సంబంధిత అంశాలతో మాత్రమే వెలువడేది. గణితంలోని అనేక సూక్ష్మప్రక్రియల వివరణలు, ప్రముఖుల జీవితచరిత్రలు, ప్రహేళికలు ఇందులో రాసేవారు. ఈ రెండు పత్రికలు మాసపత్రికలు గానే వెలువడ్డాయి. రెండేళ్లకాలంలోనే *లీలావతి* ముద్రిత పత్రికగా మారగా, వ్యవస్థాపరమైన కారణాలతో *కృష్ణవేణి* ప్రచురణ నిలిచిపోయింది. (లీలావతి, గణితచంద్రిక పత్రికల సంపాదకుడు ప్రఖ్య సత్యనారాయణశర్మతో పరిశోధకుడి ముఖాముఖి. పూర్తి పాఠం కోసం పుట 278-279 చూడవచ్చు)

కె.రామకృష్ణ (ప్రస్తుత పరిశోధకుడు) సంపాదకుడుగా వెలువడిన మరో లిఖిత పత్రిక *గణితకౌముది* ( 2007). ఉపాధ్యాయ శిక్షణ పొందుతున్న విద్యార్థులను గణితవిద్యా పరిశోధన దిశగా ప్రోత్సహించేందుకు ఈ పత్రిక సంకల్పించింది. ఆధునిక గణితవిద్యా బోధన పద్ధతులు, నూతన గణిత ఆవిష్కరణలు, గణితశాస్త్రవేత్తల జీవితచరిత్రల్లోని నూతన కోణాల ఆవిష్కరణ ప్రధానాంశాలుగా ఇందులో వ్యాసాలు రాసేవారు. అర్ధవార్షిక పత్రికగా వచ్చిన గణితకౌముది మూడు సంచికలతోనే ఆగిపోయింది. ఇంకా మరికొన్ని లిఖిల పత్రికలు కృష్ణాజిల్లాలో వెలువడి ఉండవచ్చు. విస్తృతమైన పంపిణీ వ్యవస్థ, ప్రచారం అవసరం లేకపోవడం తదితర కారణాలతో అనేక లిఖిత పత్రికలు జిల్లాలో వెలువడి ఉన్నప్పటికీ అవి ఆయా సంస్థల వరకే పరిమితమవడంతో, బాహ్యప్రపంచానికి తెలిసే అవకాశం లేకపోయింది.

## 4.8 అర్ధవార్షిక / వార్షిక పత్రికలు

ప్రత్యేక ఆశయాలు లేదా కారణాలతో వచ్చిన పత్రికలు ఇవి. కేవలం సంపాదకులు లేదా ముద్రాపకుల ఆశయాల ప్రకటనకు ఉద్దేశించినవి ఇవి ఉండేవి. వీటికి ఉన్న పాఠకాదరణ అతి తక్కువ. చేబ్రోలు సరస్వతీదేవి ముద్రాపకురాలు మరియు సంపాదకురాలిగా *శ్రీవైజయంతి*, *వార్షికపత్రిక* పేరుతో రెండు వార్షికపత్రికలు వెలువడ్డాయి. కృష్ణాజిల్లా నూజివీడు కేంద్రంగా 1933లో ఇవి వచ్చాయి. నూజివీడు సంస్థానానికి సంబంధించిన వార్తలే వీటిలో ఎక్కువగా ఉ ండేవి. జి.ఎ.ప్రకాశరావు సంపాదకత్వంలో 1999లో విజయవాడ నుంచి *పీపుల్ టీచర్* పేరుతో ఆంధ్రాంగ్ల భాషల్లో వార్షిక పత్రిక వెలువడింది. *సంక్రాంతి* పేరుతో ఎం.కృష్ణారావు సంపాదకుడిగా మచిలీపట్నం నుంచి వార్షిక పత్రిక విడుదలైనట్లు అనధికారిక సమాచారం.

## 4.9 కళాశాల పత్రికలు / ప్రత్యేక సంచికలు

ఆర్థికంగా కొద్దిపాటి బలం ఉన్న ప్రతి పాఠశాల/ కళాశాల తనకంటూ ఓ పత్ర్యేక పత్రికను ప్రచురించడం అలవాటుగా వస్తోంది. కళాశాల ప్రత్యేకతలు, సాధించిన విజయాలు, ఉపాధ్యాయుల నైపుణ్యాలు, విద్యార్థుల రచనలు ప్రధానాంశాలుగా ఉంటాయి. కళాశాల/పాఠశాల విద్యార్థులు, ఉపాధ్యాయులు, సంస్థతో సంబంధం ఉన్న కొద్దిమంది వ్యక్తులకే ఈ పత్రికలు సాధారణంగా పరిమితమై ఉంటాయి. ఈకారణంగా ఎన్నిపత్రికలు వెలువడ్డాయి? వాటి ప్రత్యేకతలు ఏమిటి? మొదలైన అంశాలకు నిర్దిష్టమైన సమాధానం లభించడం లేదు.

ఆర్.ఎన్.ఐ.వద్ద నమోదైన వివరాల ప్రకారం... ఎస్.ఆర్.ఆర్.అండ్ సి.వి.ఆర్. కళాశాల పత్రిక పేరుతో ఆర్.దయానిధి సంపాదకుడి అర్ధవార్షిక పత్రిక 1957లో విజయవాడ నుంచి విడుదలైనట్లు ఆర్.ఎన్.ఐ. వద్ద నమోదైంది. కళాశాల సాధించిన ప్రగతి, విద్యార్థుల వ్యాసాలు ఇందులో ప్రముఖంగా ఉండి ఉండవచ్చు. అన్నాథామస్ సంపాదకుడిగా బిషప్ అజరయ్య హైస్కూల్ పత్రిక (1967) వార్షిక పత్రికగా, పి.శరభరాజు సంపాదకుడిగా జైహింద్ హయ్యర్ సెకండరీ స్కూల్ మ్యాగజైన్ (1967) అర్ధవార్షిక పత్రికగా వచ్చాయి. రెండిటికీ విజయవాడే ప్రచురణ కేంద్రం.

ది ఆంధ్ర ప్రొవెన్షియల్ హోమియోపతిక్ ఎండీ కాలేజ్ మ్యాగజైన్ పేరుతో ఆంధ్రాంగ్ల భాషల్లో అర్ధవార్షికపత్రిక వచ్చింది. ఇ.రామగోపాలరావు సంపాదకుడిగా 1967లో వచ్చిన ఈ పత్రిక ప్రచురణ కేంద్రం వివరాలు తెలియలేదు. యడవిల్లి సన్యాసిరావు సంపాదకత్వంలో గుడివాడ నుంచి ఎ.ఎన్.ఆర్.కాలేజ్ మ్యాగజైన్ (1999) అర్ధవార్షిక పత్రికగా వచ్చింది.

ప్రత్యేక సంచికలు కూడా ఇదే తీరులో వెలువడుతున్నాయి. సాధారణంగా కళాశాలలు నిర్వహించిన జాతీయ సదస్సులు, ఇతర విద్యావిషయిక కార్యక్రమాల వివరాలతో ఇవి రూపొందుతాయి. ఇప్పటివరకు ఇలాంటి సంచికలు ఎన్ని వచ్చాయని కచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. ఒక్కోసారి కళాశాలలు తమ వార్షిక పత్రికలను ప్రత్యేక సంచికలుగా వెలువరించిన సందర్భాలు కూడా ఉన్నాయి. విజయవాడలోని ఎస్.ఆర్.ఎస్.వి.కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్ విద్యాభారతి పేరుతో 2007 నుంచి ప్రచురిస్తున్న వార్షిక పత్రికను 2012లో తాను నిర్వహించిన జాతీయ సదస్సు ప్రత్యేక సంచికగా వెలువరించడం ఇందుకు ఉదాహరణ.

## అధ్యాయం - 5

# కృష్ణా జిల్లా పత్రికలు - భాషా స్వరూపం

ఏ సమాజపు ప్రగతికైనా అక్కడి భాషాభివృద్ధి ముఖ్యసాధనంగా నిలుస్తుంది. ప్రధానంగా స్థానిక భాషలో జరుగుతున్న నిత్యనూతన ప్రయోగాలు, వాటికి అనుగుణంగా భాషలో వస్తున్న మార్పులు సమాజపు పోకడలపై తమ ప్రభావాన్ని తప్పక చూపిస్తాయి. ఇందుకు ఉదాహరణగా పత్రికా ప్రసార మాధ్యమాలను పేర్కొనవచ్చు. సమాజ ప్రతిబింబాలుగా ప్రసిద్ధిపొందిన ఈ రెండు రంగాలు తమ చర్యల ద్వారా సమాజంలో ఆర్థిక, రాజకీయ, సామాజిక అంశాలపై తమ ముద్రవేస్తున్నాయి. ఇంకా చెప్పాలంటే సమాజంలోని ప్రధాన సంఘటనలకు ఇవే బీజావాపం చేస్తున్నాయి. అంటే కేవలం భాష ఆధారంగా, సమాజ సమాచార సాధనంగా ఊపిరిపోసుకున్న ప్రసార మాధ్యమాలు ఈ రోజున సమాజపు స్థితిగతులను శాసించగలిగే స్థాయికి చేరుకున్నాయని చెప్పవచ్చు. ఇందుకు కారణాలేమిటనే విషయాన్ని పరిశీలించడం అవసరం.

ఇతర విషయాల సంగతి ఎలా ఉన్నా పత్రికారంగంలో వచ్చిన భాషావ్యవహార మార్పులు సమాజంలో కొత్తభాషాశైలిని ఏర్పరచడంలో కృతకృత్యులయ్యాయని చెప్పడంలో సందేహానికి తావులేదు. విస్తృతార్థంలో చెప్పాలంటే అన్ని ఇతర సాహిత్యప్రక్రియల తీరులో నూతనంగా పత్రికా సాహిత్యం ఏర్పడింది. పత్రికాభాష తనకంటూ ఓ ప్రత్యేకతను సంతరించుకుంది. ఇప్పటి వరకు వాడుకలో లేని సరికొత్త పదాలు సృష్టించి, అవి జనసామాన్య వ్యవహారంలో చెల్లుబడి అయ్యేలా చేయడంలో పత్రికా రచయితలు కృతకృత్యులవుతున్నారు.

భాష విషయంలో పత్రికలు హద్దులేని స్వేచ్ఛ కలిగి ఉన్నాయి. ఇతర భాషా పదాలు, ప్రఖ్యాతి పొందిన సినీగీతాల్లోని పదాలు, మాండలిక పదాలు..ఒకటేమిటి జరిగిన సంఘటన తాలూకు వార్తను పాఠకుడికి అందించే క్రమంలో పత్రికా రచయితలు భాషా పరంగా నూతన పోకడలు పోవడానికి సిద్ధంగా ఉంటున్నారు. మొత్తమ్మీద సమాజంలో మాతృభాషోపాధ్యాయుడి స్థానాన్ని నేటి పత్రికలు కొంతవరకు ఆక్రమించాయని చెప్పడం అతిశయోక్తికాదు. ఈదృష్ట్యా ప్రస్తుత అధ్యాయంలో కృష్ణాజిల్లా పత్రికల భాషా స్వరూపాన్ని సమగ్రంగా చర్చించడం జరిగింది.

## 5.1 ఉపోద్ఘాతం

భాషలో వాడకూడని పదమంటూ ఏదీ ఉండదు. వాడకూడని శైలీ ఉండదు. కావలసిందల్లా ఔచిత్యాన్ని పాటించడమే. పత్రికా రచన సామూహిక విషయ ప్రసార ప్రక్రియ. పత్రికా రచయిత ఏది రాసినా అనేకమంది, భిన్న అవగాహనస్థాయిలు కలవారు చదవడానికి ఉద్దేశించినదై ఉంటుంది. పత్రికా రచనను సమకాలీన చరిత్ర అనికూడా అంటారు. అంటే చెప్పేది కచ్చితంగా ఉండాలి. నిర్దుష్టంగా ఉండాలి. పత్రికా రచనను ఉరుకుల పరుగుల మీద సృష్టించిన సాహిత్యం అనికూడా అన్నారు కనుక వార్తారచనలో సృజనాత్మకతకు, కాల్పనికతకు అవకాశం ఉండదని అర్థం కాదు.

రాసింది ఉరుకుల పరుగుల మీదనే అయినా దానికీ సాహిత్యస్థాయి ఉండాలనేది దానర్థం. అంటే మొట్టమొదటగా స్పష్టత ఉండాలి. పాఠకుడిని ఆకట్టుకుని చదివించేదిగా ఉండాలి. భాష నేలబారుగా ఉండకూడదు. అలాగని కావ్యభాష వాడడం కూడా పనికిరాదు. భిన్న అవగాహన స్థాయి కలవారందరికీ అర్థమయ్యే విధంగా ఉండాలి. అంటే పదాలను అందరికీ తెలిసిన అర్థాల్లోనే వాడాలి. ప్రామాణిక భాషనే వాడాలి. కొత్త పారిభాషిక పదాలను సృష్టించవచ్చు. కొత్త పదబంధాలను ఏర్పరచవచ్చు. కొత్త ప్రయోగాలను చేయవచ్చు. కాని ఏమిచేసినా ప్రస్తుతం ఉన్న మాటలను ఉపయోగించినప్పటికంటే కొత్తవి ఉపయోగించినందువల్ల పాఠకుడి అవగాహన పెరిగితేనే వాటికి ప్రయోజనం, లేకుంటే పడ్డ కష్టమంతా వ్యర్థం.

భాష విజ్ఞాన వినిమయ సాధనం. పత్రికారచన విషయ ప్రధానమైంది. ఇంగ్లిషులో కమ్యూనికేషన్ అన్నమాటను తెలుగులో విషయ ప్రసారం అని అంటున్నాం. పత్రికలు రోజూ అనేకానేక విషయాలను, ఇదివరకు తెలియని విషయాలను పాఠకుడికి అందజేస్తుంటాయి. ఆకారణంగా కొందరు విజ్ఞులు పత్రికను దైనందిన విజ్ఞాన సర్వస్వంగా వర్ణించారు.

మరి ఆ నిర్వచనానికి సరితూగాలంటే పత్రికలో రాతలు నిర్దుష్టంగా, స్పష్టంగానే కాకుండా ఉదాత్తంగా కూడా ఉండాలి. కనుకు భాషను యథేచ్ఛగా కాక, సందర్భోచితంగా ఆచితూచి వాడవలసి ఉంటుంది. విషయం పత్రికా రచయిత చేతిలో ఉండదు. ఆకాశమే హద్దు అనే సూక్తికూడా పత్రికా రచయితకు వర్తించదు.

విశ్వంలో ఏమూలనో ఏదో ఒక కొత్త పరిణామం సంభవించవచ్చు. దాన్ని గురించి రాయాలి. దాన్ని వర్ణించడానికి అవసరమైన పదజాలం లేకుంటే సృష్టించుకుని పాఠకుడికి అర్థమయ్యేవిధంగా రాయాలి. అందుకే విషయాన్ని బట్టి భాష అన్నారు. ఆవు గురించి రాసినప్పుడు ఉపయోగించినంత సులభ భాష అణుశక్తి గురించి రాసినప్పుడు కుదరదు. ఇక్కడ పరిభాష అవసరం అవుతుంది. విషయాన్ని క్లుప్తంగా, స్పష్టంగా తెల్పడానికే పరిభాష ఉపయోగపడుతుంది. నుడికారం, సామెతలు కూడా అందుకే తోడ్పడుతాయి.

అయితే, ఇవన్నీ పత్రికా రచయిత తన పాండిత్య ప్రకర్ష కోసం కాక, విషయప్రతిపాదనను నిర్దిష్టంగా ఉండడం కోసమే వాడాలి. మాతృభాషలో మాట్లాడేటప్పుడు ఎవరూ తప్పులు పట్టరు. కానీ రాసేటప్పుడు తప్పులు దొర్లే అవకాశం ఉంది. ఇందులో శబ్దదోషాలు, సమాస దోషాలు, వ్యాకరణ దోషాలు, అన్వయదోషాలు, పునరుక్తి దోషాలు, అత్యుక్తి దోషాలు, అన్యభాషా పదాల అనువాద లిప్యంతరీకరణల్లో దోషాలు మొదలైనవి ఉండవచ్చు. వీటిని తెలుసుకుని తప్పులు జరగకుండా జాగ్రత్త పడుతూ దోషరహితంగా వార్తారచన కాని, వ్యాస రచనకాని చేయవలసిన బాధ్యత పత్రికా రచయితపై ఉంది.

భాష నిత్యప్రవాహశీలం కలిగి ఉంటుంది. ఉండాలి కూడా. సమసమాజంలో వ్యవహారంలో ఉన్న స్థానికేతర భాషలనుంచి పదాలు స్వీకరిస్తూ ప్రతిభాషా ఆధునికీకరణ దిశగా మార్పుచెందుతూ ఉండాలి. లేకుంటే సమాజ ప్రగతి మందగిస్తుంది. ప్రపంచం మొత్తాన్ని పాఠకుడి అరచేతిలో పెట్టే పత్రికలు ఈ బాధ్యతను అందరికన్నా ఎక్కువగా వహించాల్సి ఉంటుంది. తొట్టతొలి తెలుగు దినపత్రిక దేశాభిమాని మొదలు నేటి పత్రికల్లో వయస్సురీత్యా చిన్న పత్రిక అయిన సాక్షి వరకు పత్రికలన్నీ భాష విషయంలో కొత్తపుంతలు తొక్కడంలో పోటీపడుతున్నాయనేది స్పష్టంగా తెలుస్తుంది.

ఇరవయ్యో శతాబ్దపు ద్వితీయార్థంలో వైజ్ఞానిక, సాంకేతిక, వాణిజ్య, వైద్యరంగాల్లో పెనుమార్పులు వచ్చాయి. వాటికి అనుగుణంగా ప్రపంచభాషల్లో ముఖ్యంగా ఆంగ్లంలో గణనీయంగా నవ్యపదకల్పన, పర్యాయపదకల్పన, పదబంధాల కల్పన నిర్విరామంగా జరుగుతూ వచ్చింది. ఇది పత్రికా రచయితలు అందిపుచ్చుకుని పత్రికాభాషలో నవ్యశకానికి నాంది పలికారు.

## 5.2 దినపత్రికలు - శీర్షికారచన

పత్రికకు ప్రధాన ఆకర్షణ శీర్షికలు. శీర్షికలు ఎంత ఆకర్షణీయంగా ఉంటే పాఠకులు వాటిపట్ల అంత ఎక్కువగా ఆదరణ చూపిస్తారు. పాఠకుడిని వార్త చదివించేలా చేసేది శీర్షికే. వార్తలోని సారాంశాన్ని అతి సంక్షిప్త పదాలతో వ్యక్తం చేయడమే శీర్షిక. చదివిన వెంటనే పాఠకుడికి విషయబోధ జరగడంతో పాటు అతడి మనస్సుని వార్తాపఠనం పట్ల వెంటనే దృష్టికేంద్రీకరించేలా చేయాలంటే చక్కని శీర్షిక తప్పనిసరి.

ఈవిషయాన్ని రూఢిచేస్తూ  పవన్‌కుమార్, పమ్మి. తన *భాషాభూషణం* (2009; 24)లో 'మనిషికి తల ఎటువంటిదో వార్తకు లేదా పత్రికలో ముద్రింపబడే సమాచారానికి దేనికైనా శీర్షిక అటువంటిది. ముఖం చూసి మనం మనిషిని గుర్తుపడతాం. అలాగే, పాఠకుడు శీర్షిక చదివి, ఆ సమాచారం దేనికి సంబంధించినదో గుర్తించగలుగుతాడు' అన్నారు.

పత్రికాపఠనంలో సర్వసాధారణంగా కనిపించే విషయం ఏమిటంటే.. ముందుగా శీర్షికలను చదివి, ఆ తర్వాత తనకు ఇష్టమైన లేదా తనను ఆకట్టుకున్న శీర్షికలోని అంశాన్ని పాఠకుడు చదువుతాడు. అంటే పాఠకుడిని ఆకట్టుకునేలా శీర్షిక ఉండాలనే విషయం స్పష్టమవుతోంది. చదివించేగుణం కలిగి ఉండడం శీర్షికకు తొలి లక్షణం కావాలి. అప్పుడే పత్రికకు పాఠకాదరణ పెరుగుతుంది. 'ఈకారణంగానే శీర్షికలను రాయటం అని కాకుండా శీర్షికారచన అనే మాటను వాడుతున్నామ'ని పవన్‌కుమార్, పమ్మి (*భాషాభూషణం*; 2009: 25) అన్నారు.

శీర్షికారచన బాధ్యతాయుతమైన పని. కొన్ని శీర్షికలను చూడగానే క్షణం ఆలస్యం లేకుండా వార్తను చదవాలనిపిస్తుంది. కొన్ని శీర్షికలు ఆసక్తి కలిగించకపోగా వెంటనే పేజీ తిప్పేయాలని అనిపించేలా ఉంటాయి. అంతిమంగా ఈ లక్షణం పత్రికల వ్యాప్తి (సర్క్యులేషన్)ని ప్రభావితం చేస్తుంది. కాబట్టి, నిత్యనూతనత్వం శీర్షికారచనలో తొలి అంకంగా ఉంటుంది. అలాగని, నూతనత్వానికి ప్రాధాన్యతనిచ్చి భాషను అలక్ష్యం చేస్తే విపరీత ఫలితాలు వచ్చే అవకాశాలు ఉన్నాయి. వచ్చిన సంఘటనలూ ఉన్నాయి. శీర్షికారచనలో కవితాత్మకత, శబ్దచమత్కారం, వ్యంగ్యం, అధిక్షేపం వంటివి ఉంటాయి. ఈతరహా శీర్షికలమీద మొదటగా పాఠకుల దృష్టి పడుతుంది.

## 5.2.1 శీర్షికారచన – వర్గీకరణ

'వార్తారచన ఒక శిల్పం, శీర్షికారచన ఒక కళ. ఇవి 1914 నాటికి అంతగా సంపూర్ణంగా రూపుదిద్దుకోలేదు. శీర్షికారచన అత్యంత సహజంగా, సరళంగా, నిరలంకారికంగా సాగింది. విషయరంజకతకు, కళాత్మకత, కవితాత్మకత, ఆలంకారిక అభివ్యక్తికి అంతగా ఆరాటపడలేదు' అని పగడాల చంద్రశేఖర్ తన *తెలుగు దినపత్రికల భాష ఆధునికీకరణ* (2011: 35)లో అభిప్రాయం వ్యక్తం చేశారు.

"తొలితరం తెలుగు దినపత్రికల్లో వచ్చిన శీర్షికలకు, నేడు వెలువడుతున్న పత్రికల్లోని శీర్షికలకూ ఎంతో తేడా ఉంటోంది. వార్తాంశంలో ఏదిచెప్పదలచుకున్నారో అదే శీర్షికగా ఆరోజుల్లో కనిపించేది. ఇప్పుడు అదే విషయాన్ని భంగ్యంతరంగా చెప్పడం అలవాటుగా మారింది. ఇందుకు అవసరమైన యమకం, గమకం, అనుప్రాస, అంత్యప్రాస, యతిప్రాసమైత్రులతో శీర్షికలు పెట్టడం ఇప్పటి పత్రికల్లో కనిపిస్తోంద"ని తెలుగుదినపత్రికలపై పరిశోధన చేసిన పవన్‌కుమార్, పమ్మి తన *భాషా భూషణం* (2009:26)లో చెప్పారు.

నిర్మొహమాటంగా చెప్పాలంటే కేవలం ప్రాస కోసం, అలంకారిక శ్లేషల కోసం గంటలతరబడి సమయాన్ని ఈ రోజుల్లో పత్రికా విలేకరులు కానీ, డెస్క్‌లో పనిచేసే ఉపసంపాదకులు వెచ్చిస్తున్నారని తెలిస్తే ఆశ్చర్యం కలుగకమానదు. అలాగని ఈ పరిశ్రమ పూర్తిగా వ్యర్థమైనదనీ చెప్పకూడదు.

వార్త వైపు దృష్టిని ఆకర్షించడానికి, మనసుకు హత్తుకు పోవడానికి మంచి శీర్షిక తోడ్పడుతుంది. ఇందులో కవితాత్మకత, శబ్దచమత్కారం, వ్యంగ్యం, అధిక్షేపం వంటివి ఉంటాయి. అటువంటి శీర్షికమీద ముందుగా పాఠకుల దృష్టి వాలుతుంది. వార్త చదివేందుకు ఉత్సాహాన్ని, ఉత్కంఠతను కలిగిస్తుంది. వార్తాపత్రికలో ప్రతి వార్తకూ శీర్షిక తప్పనిసరి. వార్తలోని సారాంశానికి మకుటాయమానంగా నిలిచేది శీర్షిక. శీర్షికా రచన ఒక కళ. వార్త నిడివి, పత్రికలో దానికి లభించే స్థల పరిమితి, వార్త ప్రాముఖ్యత, వైవిధ్యం, భావం.. ఇలా ఎన్నో అంశాలను దృష్టిలో ఉంచుకుని శీర్షిక రాయాల్సి ఉంటుంది. వేగంగా జరిగే పత్రికారచనలో ఇన్ని అంశాలు దృష్టిలో పెట్టుకుని శీర్షిక రాయడమంటే కత్తిమీద సాముచేయడమే అవుతుంది.

అల్పాక్షరాల్లో అనల్పార్థం ఇచ్చే శీర్షిక కావాలి. ఆలంకారికత, సృజనాత్మకతతో కూడిన భాషాజ్ఞానం ఉన్నప్పుడే శీర్షిక రచన తేలిక అవుతుంది. ఆ శీర్షిక పాఠకుల మనసుకు హత్తుకుంటుంది. అందుకే శీర్షిక క్లుప్తంగా ఉండాలి. అసందిగ్ధంగా ఉండకూడదు. ఆకర్షణీయంగా ఉండాలి. నిర్మాణం, వాటిలోని అర్థం ఆధారంగా శీర్షికలను వివిధరకాలుగా వర్గీకరించవచ్చు. ఒక్కొక్కటిగా ఇప్పుడు వాటిని పరిశీలిద్దాం.

### 5.2.1.1 సాభిప్రాయ శీర్షికలు

పత్రికల్లో వచ్చే శీర్షికలు కొన్ని సాభిప్రాయంగా ఉంటాయి. విశేషణ, విశేష్యాలకు పరస్పర సంబంధాన్ని కల్గించి శీర్షిక పెట్టడం ఇందులో ఉంటుంది. వార్తలో ఉన్న కార్యకారణ సంబంధం ఈ శీర్షికలో కనిపిస్తుంది.

ఉదా : 1) ఎంసెట్‌లో 'టాప్'లేపిన అబ్బాయిలు (ఆంధ్రజ్యోతి, 30.6.2012)

ఇక్కడ ఎంసెట్‌లో టాప్ ర్యాంకు సాధించారనే అర్థంలో 'టాప్ లేపిన' అనే ప్రయోగం జరిగింది. వ్యవహారంలో 'టాప్ లేవడం' అనే పదం విపరీత అర్థాన్ని ఒక్కోసారి ఇస్తుంది. కానీ, ఇక్కడ టాప్ ర్యాంకు అనే వ్యవహారం ఉండడంతో ఈ శీర్షిక సముచితంగా ఉంది.

2) ఆర్టీసీలో సమ్మె సైరన్ (ఆంధ్రజ్యోతి, 30.6.2012)

ఆర్టీసీ బస్సులు 'సైరన్' – అంటే హారన్ మోగిస్తాయి. ఇక్కడి కార్మికులు సమ్మె చేయాలని నిర్ణయించుకున్నారు అనే అర్థంలో 'సమ్మె సైరన్' అనే పదాన్ని శీర్షికలో ప్రయోగించడం జరిగింది. ఈవిధమైన ప్రయోగంతో చక్కటి అర్థం సాధ్యపడింది. ఇదే తీరులో సాగిన మరికొన్ని శీర్షికలను డాక్టర్ జె.చెన్నయ్య తన *తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం* (1998:173)లో ఇచ్చారు. అవి..

3) హుస్సేన్‌సాగర్‌లో కన్నీటి కెరటాలు (ఈనాడు)

4) తూనికల అధికారుల్లో కొలతకందని అవినీతి (ఈనాడు)

5) కూత పెట్టని కోళ్ళ పరిశ్రమ (ఈనాడు)

6) తూటాలు పేల్చింది తుపాకీ రాజ్యమే (ఆంధ్రప్రభ)

## 5.2.1.2 వ్యంగ్య శీర్షికలు

వ్యంగ్యం ఉత్తమ రచన శైలికి నిదర్శనం. భాషమీద గట్టిపట్టు ఉన్న రచయిత వ్యంగ్య రచనకు ఇష్టపడతాడు. పత్రికా రచయిత కూడా వ్యంగ్య శీర్షికకోసం ఎక్కువ ఇష్టత చూపిస్తాడు. ఒకింత హాస్యం, ఎత్తిపొడుపు, చమత్కారం ..అన్నీ మేళవించి ఒకే పదంలో ఉండడమే ఇందుకు కారణం. పదానికి ఉన్న మౌలిక అర్థాన్ని అర్థపరివర్తన ద్వారా వ్యతిరేక అర్థం వచ్చేలా చెప్పడం జరుగుతుంది. ఈతీరులో వచ్చిన శీర్షికలు పాఠకుల్ని ఇట్టే ఆకట్టుకుంటాయి. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

1) మోహనా..ఓ సమ్మోహనా (ఆంధ్రజ్యోతి, 30.06.2012)

ఆర్థికమంత్రిగా ఉన్న ప్రణబ్‌ముఖర్జీ రాష్ట్రపతి పదవికి ఎన్నికయ్యేందుకు సిద్ధం కావడంతో ప్రధాని మన్మోహన్‌సింగ్ ఆ శాఖను తనవద్దే ఉంచుకున్నారు. వెంటనే ఏర్పడిన పరిణామాల నేపథ్యంలో రూపాయి విలువ పెరిగింది.

2) ముం'భయ్'పాక్ పనే (ఆంధ్రజ్యోతి, 28.06.2012)

ముంబయిలో జరిగిన మారణకాండ కారణంగా అక్కడి ప్రజలు భయానికి గురయ్యారనే విషయాన్ని ప్రకటిస్తూ ఈ శీర్షిక సాగింది. ఈ హింసాకాండకు పాకిస్తాన్‌కు చెందిన సంస్థల హస్తం ఉందనే విషయం కూడా ఈ శీర్షికలో ప్రకటితం అవుతోంది.

3) శృతి తప్పిన రుతురాగం (ఆంధ్రజ్యోతి, 28.06.2012)

రాష్ట్రంలో నైరుతి రుతుపవనాల ప్రభావం ఎక్కడా కనిపించడం లేదనే విషయాన్ని ప్రకటిస్తూ పెట్టిన శీర్షిక ఇది. ఇలాంటివే మరికొన్ని శీర్షికలను చెన్నయ్య, జె. తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపంలో (1998:174)లో ఇచ్చారు. అవి...

4) మద్దిలేరుకు అవినీతి పునాదిరాళ్ళు (ఆంధ్రప్రభ)

5) విద్యార్థుల భవిష్యత్తుకు 'స్పాట్' పెట్టొద్దు (ఈనాడు)

6) సింహపురిలో కాంగ్రెస్ గర్జన నేడే (వార్త)

### 5.2.1.3 అతిశయోక్తి శీర్షికలు

వాస్తవానికి అతిశయోక్తి జోడిస్తూ పెట్టే శీర్షికల్ని అతిశయోక్తి శీర్షికలుగా వర్గీకరించడం జరిగింది. వాస్తవ సంఘటనలో జరిగిన పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందనే విషయాన్ని అతిశయోక్తిని ఉపయోగించి పాఠకులకు తెలియజేయాలనే లక్ష్యం ఈ తరహా శీర్షికలకు ప్రాణం పోస్తుంది. ఈ రకమైన శీర్షికలు చదవగానే పాఠకుడికి పూర్తివార్త చదవకపోయినా, అందులోని తీవ్రత వెంటనే అర్థమవడంతో పాటు మరింత లోతుగా ఆ వార్తను చదవాలనే ఆసక్తి కలుగుతుంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

1) భగ్గుమంటున్న కూరగాయల ధరలు (ఆంధ్రప్రభ, 15.05.1997)

2) కూర'గాయాలు' (సాక్షి, 23.08.2010)

మొదటి శీర్షికలో కూరగాయల ధరలు బాగా పెరిగాయనే అర్థం స్ఫురిస్తుంది. నిజానికి 'భగ్గుమనడం' అంటే అక్కడేదో అగ్ని వెలిగి ఉండాలి. కానీ కూరగాయలు మండవు. వాటి ధర బాగా పెరిగిందనే అర్థానికి అతిశయోక్తి జోడించి, 'భగ్గుమన్న ధరలు' అనే పదాన్ని ప్రయోగించారు.

రెండో శీర్షిక కూడా కూరగాయలకు సంబంధించినదే. ఇక్కడా ధరలు పెరిగిన విషయాన్నే ప్రస్తావించారు. అయితే కూరగాయల ధరలు పెరగడంతో వినియోగదారులు ఇబ్బందులు పడుతున్నారనే విషయానికి అతిశయోక్తి జోడించారు. నిజానికి కూరగాయలు కొనుగోలు చేస్తే గాయాలు ఎలా అవుతాయి? ఇక్కడ అతిశయోక్తి ప్రధానం.

3) దైన్యాగారం (ఆంధ్రజ్యోతి, 29.06.2012)

ఒకప్పుడు ధాన్యాగారంగా వెలసిన ఆంధ్రరాష్ట్రం ఇప్పుడు వర్షాలు లేక పంటలు పండక పోవడంతో ధాన్యం నిల్వలు కోల్పోతోందని వార్తలోని సారాంశం. దీన్ని చెప్పడానికి అతిశయోక్తి ఉపయోగించారు పత్రికా రచయిత. నిజానికి దైన్యానికి ఆగారం ఉండదు. కానీ, రాష్ట్రంలో నెలకొన్న రైతుల దీనస్థితిని ఉన్నతంగా ప్రకటించడానిని 'దైన్యాగారం' అనే ప్రయోగం చేయడం జరిగింది. ఇందులో ఒకింత శ్లేష కూడా కలసి ఉండడంతో శీర్షిక పాఠకులను బాగా ఆకట్టుకుంది. మరికొన్ని ఉదాహరణలు పుట 169లో చూడవచ్చు.

4) ప్రకృతి బీభత్సాన్ని మరిపిస్తున్న సర్కార్ కూల్చివేతలు (వార్త)

5) ఆకాశాన్నంటిన ధరలు (ఈనాడు)

6) ప్రజాప్రతిఘటన నరమేధం (ఆంధ్రజ్యోతి)

### 5.2.1.4 శ్లేష శీర్షికలు

ఒకటి కన్నా ఎక్కువ అర్థాలు సాధించడం, అర్థాన్ని భంగ్యంతరంగా చెప్పడం శ్లేష అవుతుంది. జరిగిన సంఘనటలోని విశేషం లేదా మరో అంశాన్ని చెప్పడానికి ఒక్కోసారి పత్రికారచయితలు శ్లేషను ఉపయోగించి శీర్షికలు పెట్టడం కనిపిస్తుంది. ఈ కోవలోకి వచ్చే శీర్షికలకు కొన్ని ఉదాహరణలు..

1) 'బల్క్'గా స్వగృహ (ఆంధ్రజ్యోతి, 30.06.2012)

రాజీవ్‌స్వగృహ పథకంలో వ్యక్తిగత ఫ్లాట్లను మాత్రమే అమ్ముకునేందుకు ఉన్న అవకాశాన్ని మారుస్తూ, సామూహికంగా (బల్క్‌గా) విక్రయించేందుకు ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ఈవిషయంలో 'బల్క్' అనే పదాన్ని శ్లేష కోసం ఉపయోగించారు. బల్క్ అనే పదానికి ఏకమొత్తంగా అనే అర్థంతో పాటు 'ఒకే సారి ఒకటి కన్నా ఎక్కువ' అనే రెండు అర్థాలు వస్తాయి. దీన్ని ఉపయోగించుకుని ఇక్కడ పత్రికా రచయిత శీర్షిక పెట్టారు. ఇలాంటివే మరికొన్ని..

2) 'నరావతారం' సమాప్తం (ఈనాడు)

3) నువ్వే 'మో' వెళ్లిపోయావు (ఈనాడు)

ప్రముఖ పత్రికా సంపాదకుడు నండూరి రామ్మోహనరావు మరణించిన సందర్భంలో ఆయన రచనల్లో విఖ్యాతి పొందిన 'నరావతారా'న్ని ఉపయోగించిన తీరు అమోఘంగా ఉంది. అటు రచయిత పుస్తకాన్ని చెబుతూనే ఆ నరుడు మరణించాడని చెప్పడంలో శీర్షికా రచయిత చూపించిన ప్రతిభ ఎంతగానో ప్రశంసనీయంగా ఉంది. రెండో ఉదాహరణకు సంబంధించిన వివరణ ఇది.

ఇక, మూడో ఉదాహరణ కూడా ఇదే తీరులో ఉంది. ప్రముఖ కవి వేగుంట మోహనప్రసాద్ మరణ సందర్భంలో వార్తకు పెట్టిన శీర్షిక ఇది. ఆయన 'మో' అనే కలంపేరుతో ప్రసిద్ధుడు. మరణించిన వ్యక్తి కలంపేరు, 'వెళ్ళిపోయాడు' (మరణించాడు) అనే పలుకుబడి రెండూ ఉపయోగించుకుని పెట్టిన ఈ శీర్షిక ఎంతగానో అర్థవంతంగా ఉంది. ఇలాంటివే మరికొన్ని శీర్షికలను చెన్నయ్య, జె. *తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం*లో (1998:175)లో ఇచ్చారు. అవి...

3) జనారణ్యంలో హిరణ్యాక్షుడు (వార్త)

4) ఒక్క 'నెల'రాజు నాదెండ్ల ఆక్రోశం (ఈనాడు)

నెలరాజు అంటే చంద్రుడు అనే అర్థం ఉంది. నాదెండ్ల కేవలం ఒక నెల మాత్రమే రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా పనిచేశారు. ఆ తర్వాత జరిగిన పరిణామాల్లో ఆయన పదవి కోల్పోయారు. తన ప్రత్యర్థిపై ఆవేశాన్ని వెళ్ళగక్కారు. కేవలం నెలరోజులే ముఖ్యమంత్రిగా పనిచేశారన్న విషయాన్ని చెప్పడానికి ఇక్కడ 'నెలరాజు' అనే పదప్రయోగం చేయడం ఎంతో ఔచిత్యంగా ఉంది.

### 5.2.1.5 అంత్యప్రాస శీర్షికలు

ఉచ్చారణలో సారూప్యత సాధిస్తూ, రెండు భాగాలుగా ఉన్న శీర్షిక పదాంతాల్లో భిన్న అర్థాలు కలిగిన పదాలను ప్రయోగించడం అంత్యప్రాస శీర్షిక రచన అవుతుంది. పాఠకుల్ని ఈ తరహా శీర్షికలు కూడా ఎక్కువగా ఆకట్టుకుంటాయి. ఇలాంటి శీర్షికలకు కొన్ని ఉదాహరణలు..

1) ముంగిట్లో ధాన్యం..ముఖంలో దైన్యం (ఈనాడు, 20.01.1997)

గిట్టుబాటు ధర ఆశించినస్థాయిలో రాకపోవడం వల్ల పంట బాగాపండినా రైతుకు లాభం రాలేదు. ఈ కారణంగా అతడి ముఖంలో ఆనందం కనిపించడంలేదు. ఈ విషయాన్ని చెప్పడానికి ఈ శీర్షిక రచయిత అంత్యప్రాసను ఎంచుకోవడం ఎంతో సముచితంగా ఉంది. ధాన్యం, దైన్యం అనే రెండు పదాల ఉచ్చారణ ఒకేతీరులో ఉన్నా వేర్వేరు అర్థాలు ఇవ్వడంతో వార్తలోని భావం ఇట్టే బోధపడుతుంది.

2) మహారాష్ట్రపై వేటు కేంద్రానికి చేటు (ఆంధ్రజ్యోతి, 19.07.1998)

3) ఆదాయంలో అగ్రస్థానం అభివృద్ధిలో అథమస్థానం (ఆంధ్రప్రభ, 22.06.1995)

4) పొదల్లో తీగలు..గుండెల్లో దిగులు (సన్‌ఫ్లవర్‌న్యూస్, 27.12.2012)

కరెంటు తీగల చుట్టూ పిచ్చిమొక్కలు పొదలుగా పెరిగడం వల్ల ఏ ప్రమాదం ముంచుకొస్తుందోనని ప్రజలు ఆవేదన చెందుతున్నారు. ఈ విషయాన్ని చెప్పడానికి 'పొదల్లో..'; 'గుండెల్లో..' అనేపదాలను ఎంచుకున్న తీరు సముచితంగా ఉంది.

### 5.2.1.6 కవిత్వపాదాల శీర్షికలు

ప్రజల నోళ్ళలో బాగా నానుతున్న కవిత్వ పాదాలు తీసుకుని, సందర్భానికి తగినట్లు శీర్షికను పెట్టడం ఒక్కోసారి పత్రికల్లో కనిపిస్తుంది. ఇలాంటి శీర్షికల వల్ల తొందరగా ప్రయోజనం సిద్ధిస్తుంది. అప్పటికే ఆ వాక్యాలు ప్రజలకు బాగా పరిచయాలు కావడం ఇందుకు దోహదం చేస్తుంది. పేరడీలు, కవుల రచనల్లోని పాదాలు.. ఒక్కోసారి సినీగీతాల్లోని పాదాలు కూడా శీర్షికలుగా పెట్టిన సందర్భాలు ఉన్నాయి. ఈ తరహా శీర్షికలకు కొన్ని ఉదాహరణలు..

1) మనసొక మధుకలశం (సాక్షి, 7.12.2010)

ప్రపంచ మానసిక ఆరోగ్య వారోత్సవాల సందర్భంగా మానసిక ఆరోగ్యం గురించి రాసిన ప్రత్యేక వ్యాసానికి ప్రసిద్ధి చెందిన సినీగీతంలోని పల్లవిని శీర్షికగా పెట్టడం జరిగింది. మనసును జాగ్రత్తగా కాపాడుకోకపోతే శారీరక ఆరోగ్యం ఉన్నా ఉపయోగం లేనిదే అవుతుందనే అర్థం ఇందులో కనిపిస్తుంది. భావానికి తగిన ఉత్తమ శీర్షిక ఇది. ఈ తరహా శీర్షిక పెట్టే ప్రతిసారీ అప్పటికే ప్రజలకు సుపరిచితమైన పంక్తులే వాడాలనే నియమం లేదు. పాత్రికేయుడు తన బుద్ధిబలం, సృజనాత్మకత ఉపయోగించి చక్కటి శీర్షికలు పెట్టవచ్చు.

2) జనావళికి దీపావళి (ఈనాడు, 5.09.1984)

ఆగష్టు (1984) సంక్షోభం అనంతరం ఎన్టీఆర్ తిరిగి ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసారనే వార్తను విలేకరి ఇలా శీర్షికతో ప్రకటించారు. ప్రజల్లో ఆనందం హెచ్చిందని చెబుతూ, అప్పటికి సుమారుగా దీపావళి సమయం కూడా కలసిరావడంతో దీపావళిని తన శీర్షికకు ఆ విలేకరి ఉపయోగించుకున్నారు.

3) ముగ్గు మందారాలు.. ముగ్ధ సింగారాలు (సాక్షి,10.01.2009)

ధనుర్మాసం సందర్భంగా మహిళలు ప్రత్యేకంగా ముగ్గుల అలంకరణపై శ్రద్ధ చూపిస్తారు. తెలుగునాట వ్యాప్తిలో ఉన్న రంగవల్లుల విశేషాలు ప్రకటిస్తూ రాసిన వ్యాసానికి ముగ్గులు, ముగ్ధలు అనే పదాలు వాడడం ఎంతో ఉన్నతి తీసుకువచ్చింది.

### 5.2.1.7 భావార్థక శీర్షికలు

కేవలం విషయ ప్రధానంగా సాగుతూ ఏవిధమైన ప్రత్యేకతలు లేకుండా సాగే శీర్షికలు ఈ కోవలోకి వస్తాయి. విషయాన్ని చెప్పడం మాత్రమే తన బాధ్యతగా భావించే పాత్రికేయుడు ఈవిధమైన శీర్షికలమీద మొగ్గుచూపుతాడని పగడాల చంద్రశేఖర్ తన తెలుగు దినపత్రికల భాష ఆధునికీకరణ (2011:38)లో చెప్పారు. ఇటువంటి శీర్షికల్లో ఆత్మాశ్రయశాన్ని, అనుభూతిని వ్యక్తీకరించడం కనిపించదని ఆయన చెప్పారు. కేవలం తాను ఓ పాఠకుడిగా, ప్రేక్షకుడిగా విలేకరి ఉండడం వల్ల ఇటువంటి శీర్షికలు వస్తాయి.

ఈ తరహా శీర్షికలు ఆంధ్రపత్రిక తొలినాళ్ళలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ తీరు దాదాపు అరవయ్యోదశకం వరకు కొనసాగింది. క్రియాపదాల మీద –ట వర్ణం చేరడం వల్ల భావార్థక క్రియలు ఏర్పడతాయి. –ట వర్ణం తత్సమ, దేశ్యపదాల మీద కూడా చేరుతుంది. సమాసాల్లోను, వ్యస్త పదాల్లోను క్రియల చివర చేరుతుంది. ఈవిధంగా ఏర్పడే శీర్షికలు భావార్థక శీర్షికలు అవుతాయి. ఇందుకు కొన్ని చంద్రశేఖర్, పగడాల తెలుగు దినపత్రికల భాష ఆధునికీకరణ (2011:38)లో ఇచ్చిన ఉదాహరణలు...

1) అల్లరిగుంపు అమెరికనులను జంపుట

2) స్టీమరు మునుగుట

3) క్లార్కు గారు సెలవు పుచ్చుకొనుట

ఈ ఉదాహరణలన్నీ ఆంధ్రపత్రికలోనివే. నేటి దినపత్రికలు మొదలు అన్ని ఇతర పత్రికల్లో ఈ తరహా శీర్షికలు ఇప్పుడు కనిపించడం లేదు. భావార్థక శీర్షికలు నేటి వ్యవహారం నుంచి దాదాపుగా దూరమైనాయనే చెప్పుకోవచ్చు.

### 5.2.1.8 కర్మణ్యర్థక శీర్షికలు

కర్మణిప్రయోగం కూడా పాతకాలం దినపత్రికల్లో కనిపిస్తుంది. విషయవివరణలో కూడా ఇటువంటి వర్ణనలు కనిపిస్తాయి. వార్తా వివరంలో కర్మణి ప్రయోగం ఉండడం మాట ఎలా ఉన్నా శీర్షికల్లో కర్మణి ప్రయోగం ఉండడం నాటి పత్రికల ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. ఇందుకు చంద్రశేఖర్, పగడాల *తెలుగు దినపత్రికల భాష ఆధునికీకరణ* (2011:38)లో ఇచ్చిన ఉదాహరణలు...

1) అమెరికనుల ప్రవర్తన గర్హింపబడుట

2) రేపటి సభలో చర్చింపబడనున్న విషయములు

ఈతరహా శీర్షికలు ఇప్పటి పత్రికల్లో కనిపించవు. ఈ ధోరణి ఇప్పుడు మారింది.

### 5.2.1.9. సమాపక క్రియాసహిత శీర్షికలు

వాక్యాలను శీర్షికలుగా పెట్టడం చాలా అరుదుగా జరుగుతుంది. అందులోను సమాపక క్రియతో ఉన్న వాక్యాలను శీర్షికగా పెట్టడం మరీ తక్కువ సందర్భాల్లోనే జరుగుతుంది. ఇందుకు ఉదాహరణలు..

1) విరోధ ప్రయత్నములేవియు జరుగవు

2) త్వరగా పరిష్కారము కావలెను

ఈ తరహా ప్రయోగాలు నేటి శీర్షికల్లో కనిపించవు. అయితే సమాసాల ప్రయోగాలు ఎక్కువగా ఉంటున్నాయి. ఇక శీర్షిక నిర్మాణమవుతున్న విధానాన్ని బట్టి మరొకొన్ని శీర్షికారకాలను కూడా చెప్పుకోవచ్చు. అవి

### 5.2.1.10 లేబిల్ శీర్షికలు

ఒకే విషయానికి సంబంధించినవి లేదా ఒకే సంస్థకు, వ్యవస్థకు సంబంధించిన వార్తలు చెప్పాల్సివచ్చినప్పుడు, వాటిని ఏ వార్తకు ఆ వార్త ప్రత్యేకంగా ఇవ్వకుండా, అన్నిటినీ కలిపే ఒకే శీర్షిక కింద ఇవ్వడం నేటి పత్రికల్లో కనిపిస్తుంది.

నిజానికి ఈ తీరు 1914 నాటి వార్తారచన కాలానికే ఉందని చంద్రశేఖర్, పగడాల తన 'తెలుగు దినపత్రికల భాష – ఆధునికీకరణ' (2011:36)లో చెప్పారు. ఆంధ్రపత్రిక 1914, ఏప్రిల్ 2వ తేదీ నాటి సంచిక 11వ పేజీలో 'వృత్తాంత లేఖలు' పేరుతో శీర్షిక ఉందని ఆయన చెప్పారు. తుని సమాచారము, గుంటూరు సమాచారము, బాపట్ల వార్తలు.. మొదలైన లేబిల్ శీర్షికలు కూడా అప్పట్లో ఉన్నాయని కూడా చెప్పారు. ఇక, నేటి వార్తాపత్రికల్ని గమనిస్తే 'తిరుమల సమాచారం' (ఈనాడు) మొదలైన లేబిల్ శీర్షికల్ని గమనించవచ్చు.

### 5.2.1.11 డెక్ శీర్షికలు

శీర్షికలో చెప్పాల్సిన అంశం ఎక్కువగా ఉన్నప్పుడు రెండు లైన్లలో శీర్షికను పెట్టడం జరుగుతుంది. సాధారణంగా ఈ శీర్షికలు రెండు వాక్యాలుగా ఉంటాయి. మొదటి వాక్యాన్ని లేదా భాగాన్ని ప్రధాన శీర్షిక అని (మెయిన్), రెండో విభాగాన్ని డెక్ శీర్షిక అంటారు. ప్రధాన శీర్షిక పరిమాణం డెక్ శీర్షిక అంటారు. ఈ రెండిటికి మధ్య ఓ అడ్డుగీత ఆంధ్రపత్రిక తొలినాళ్లలో ఉండేది. ఇలా రెండు శీర్షిక వాక్యాల మధ్య అడ్డుగీత ఇచ్చే విధానం నేటి పత్రికల్లో అరుదైన సందర్భాల్లో కనిపిస్తోంది. ఈ రెండు భాగాల శీర్షిక వల్ల కార్యకారణ సంబంధం తెలుస్తుంది. ప్రధాన శీర్షికలోని ఫలితం, సంఘటన జరిగిన ప్రదేశం, పాల్గొన్న వ్యక్తులు, సంఘటనకు కారణాలు డెక్ శీర్షికలో ఉంటాయి. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

1) ఐక్య ఉద్యమాలకు సిద్ధం కావాలి

కేవీపీఎస్ జిల్లా ఉపాధ్యక్షుడు ఆర్.రఘు (ఆంధ్రజ్యోతి, 19.03.2013)

2) ఎరువుల వ్యాపారానికి వడ్డీలేని రుణాలు

డీసీసీబీ అధ్యక్షుడు పిన్నమనేని వెంకటేశ్వరరావు (ఆంధ్రజ్యోతి, 18.03.2013)

3) ప్రకృతిని పరిరక్షించండి

పోప్ ఫ్రాన్సిస్ పిలుపు (సాక్షి, 20.03.2013)

4) రూలింగ్ ఇస్తే ఎలా?

వ్యవసాయ బడ్జెట్‌పై సర్కారు ఇరకాటం (సాక్షి, 20.03.2013)

## 5.3 దినపత్రికలు – నవ్యపద కల్పన

భాష, సమాజం నిత్య పరిణామ శీలం కలిగినవి. అధునాతన సాంకేతిక పరిజ్ఞానం కారణంగా క్షణక్షణానికి నూతన ఆవిష్కరణలు జరుగుతున్నాయి. కొత్త వస్తువులు అందుబాటులోకి వస్తున్నాయి. విజ్ఞానశాస్త్ర పరిశోధనలు కొత్త పుంతలు తొక్కుతున్నాయి. వీటన్నిటి కారణంగా కొత్తపదాలు సృష్టించాల్సిన అవసరం ఈనాటి విలేకరులకు ఏర్పడుతోంది. ఈక్రమంలో పదాలను ఆదానంగా తెచ్చుకోవడం ఎంతో సులభమైన పని.

అన్యదేశ్యాలను కొద్దిగా లేఖన మార్పులు చేసి తెలుగులో వాడుకోవడం చాలాకాలంగా జరుగుతోంది. అలాకాకుండా, నూతనంగా పదాల్ని తయారుచేయాలనుకున్నప్పుడు విలేకరి శ్రమపడాల్సి వస్తుంది. విస్తృతమైన భాషా పరిజ్ఞానం, నేర్పు, సృజనాత్మకత, ఉత్సాహం పాత్రికేయులకు ఈ సందర్భంలో తప్పనిసరి అవుతాయి.

అనాయాసంగా అన్యదేశ్యాలను ఆశ్రయించడం తేలికైన పనే. అనువాదమార్గంలో ఇది అనుసరణీయమైన విషయమే. అయితే తెలుగులో నూతన పదసృష్టి చేసే ప్రయత్నం ఎల్లప్పుడూ ఆమోదయోగ్యమైందని, ఈ తరహా ప్రయత్నాలతో భాష సజీవంగా నిలుస్తుందని పత్రికారచయితల అభిప్రాయం.

'దినపత్రిక భాష ప్రజలకు సంపూర్ణంగా అర్థం కావడం లేదు. కాబట్టి సాధ్యమైనంతవరకు దేశ్యపదాలనే వాడాలి. తత్సమ, ఆంగ్ల పదాల వాడుకం తగ్గించాలి. గత్యంతరం లేని పరిస్థితుల్లో తప్పదు' అని ప్రసిద్ధ సంపాదకులు ఎబికె ప్రసాద్ అన్నట్లు చెన్నయ్య, జె. తన తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం (1998:153)లో చెప్పారు.

వార్తాపత్రికల పాఠకుల్లో ఎక్కువమంది అక్షరాస్యత దృష్ట్యా సామాన్యులు. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకుని విలేకరి వార్త రాయాలి. అందుకే పత్రికా భాషా శిష్టవ్యావహారిక దశ దాటి సామాన్యీకరణ చెందాలనే వాదన ఇటీవలికాలంలో వినిపిస్తోంది. ఈ వాదాలన్నిటి దృష్ట్యా వార్తాపత్రికల్లో నూతన పద కల్పనకు ముఖ్యంగా మూడు పద్ధతులు వాడుకలో ఉన్నాయి. అవి..

## 5.3.1 మణిప్రవాళ పద్ధతి

శాస్త్ర, వైజ్ఞానిక రంగాల్లో వస్తున్న పరిణామాల ఫలితంగా ప్రపంచవ్యాప్తంగా కొత్తపదాలు, పారిభాషిక పదాలు వాడుకలోకి వస్తాయి. వీటిని యథాతథంగా లిప్యంతరీకరణ చేసుకుని వాడడాన్ని మణిప్రవాళవాదంగా పేరుపొందింది. మూలభాషలోని పదాల్ని తెలుగులోకి ఉన్నదిఉన్నట్లుగా తీసుకోవడం వల్ల అర్థభేదాలు వస్తాయనే సందేహం కలుగదు. భావప్రసారం స్పష్టంగా ఉంటుంది. ఉదాహరణకు Cabinet (క్యాబినెట్) అనే ఆంగ్ల పదాన్ని అలాగే లిప్యంతరీకణం చేసి తెలుగులో క్యాబినెట్ అని పత్రికల్లో ఉపయోగిస్తున్నారు. బస్సు, కాఫీ, టీ, రోడ్డు మొదలైన పదాలన్నీ ఈ కోవకే చెందుతాయి.

## 5.3.2 సహజపరిణామ పద్ధతి

వివిధ భాషల నుంచి వచ్చే పారిభాషిక పదాల్ని ఒకే మాటలో అనువదించేందుకు అనేక ఇబ్బందులు వస్తాయి. ఈకారణంగా పదాన్ని ఏకమొత్తంగా కాకుండా రెండు మూడు పదాల్లో అనువదించడం లేదా నూతన పదాలను కల్పించడం ఈ పద్ధతిలోకి వస్తుంది. ఇలా ఒకటికన్నా ఎక్కువ పదాలు ఉపయోగించడం వల్ల నూతన పదంలో అర్థస్పష్టత ఉంటుంది. వివరణాత్మకంగా అర్థం తెలుసుకోవడం వల్ల క్రమంగా పదసృష్టికి అవకాశం ఏర్పడుతుంది. అయితే ఈ పద్ధతిలో ఒక్కొక్కరు ఒక్కోరీతిలో పదాల్ని అనువదించడం జరుగుతుంది. అందువల్ల ఏకరూపత కష్టమవుతుంది. అయితే ఆమోదయోగ్యతను బట్టి కాలక్రమంలో ఒకే పదం స్థిరపడే అవకాశం ఉంది.

ఉదాహరణకు ఇటీవల 'యూనిఫాం' అనే ఆంగ్ల పదానికి జరుగుతున్న నూతన పదసృష్టి ప్రక్రియను చెప్పుకోవచ్చు. 'యూనిఫాం' అనే పదానికి తెలుగులో సమానార్థక నూతనపదంగా ఒక దినపత్రిక 'సమరూప దుస్తులు' అని, 'ఏకరూప దుస్తులు' అని మరోసారి, 'బడిదుస్తులు' అనే పదాన్ని మూడోసారి ప్రయోగించింది. వీటిల్లో ఏఒక్క పదమూ ఇంతవరకు స్థిరీకరణ పొందలేదు. పాఠశాల విద్యార్థుల సందర్భంలో బడిదుస్తులని, ఇతర కార్యాలయాలకు సంబంధించిన వార్తలో సమదుస్తులనీ వాడడం జరుగుతుంది. కాలక్రమంలో ఏదోఒక పదం స్థిరపడే అవకాశం ఉంది. ఇది సహజపరిణామ పద్ధతి.

## 5.3.3 పరిభాషా వివరణ పద్ధతి

కొన్ని సందర్భాల్లో పారిభాషిక పదాన్ని సంక్షిప్తంగా లక్ష్యభాషలోకి అనువదించడం లేదా నూతన పదాన్ని సృష్టించడం సాధ్యం కాకపోవచ్చు. ఇటువంటి సందర్భాల్లో వివరణపూర్వకంగా భావస్ఫూర్తితో అనువాదం చేయడం పరిభాషా వివరణ పద్ధతిలోకి వస్తుంది. యథాతథంగా లిప్యంతరీకరణం చేయడం కన్నా ఇది మేలైనపద్ధతి. ఈమూడు పద్ధతుల్లో జరిగే నూతన పదకల్పన రీతుల్ని కిందివిధంగా ఉదాహరణలతో చెప్పవచ్చు.

### 5.3.3.1 ప్రతిష్టాపాద ఆదానాలు

అచ్చుతెలుగు పదాలు అందుబాటులో ఉన్నప్పటికీ అనువాదం లేదా నూతన పదకల్పన చేసే సందర్భంలో సంస్కృతం / ఉర్దూ / ఆంగ్ల పదాలను ఉపయోగించడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణలు..

| ఆంగ్లం | తెలుగు | సంస్కృతం/ఇంగ్లిషు/ఉర్దూ |
|---|---|---|
| Smoking | పొగతాగడం | ధూమపానం |
| Goldmedal | బంగారుపతకం | స్వర్ణపతకం |
| First time | తొలిసారి | ప్రథమం |
| Sports | ఆటలు | క్రీడలు |
| And others | మొదలైనవారు | ప్రభృతులు |

### 5.3.3.2 అవశ్యపూరక ఆదానాలు

ఇతర భాషల నుంచి పదాలు తీసుకోవాల్సిన అవసరం ప్రతి భాషకు ఉంటుంది. ఇలా చేయకపోతే ఏ భాషా సజీవంగా ఉండదు. ఈవిషయంలో తెలుగు భాషకు ఎంతో సౌలభ్యం ఉంది. ఆదానాలకు తెలుగు ఎంతో సులువైంది. ఈవిధంగా ఇతర భాషల నుంచి వచ్చిచేరిన పదాలు అవి తెలుగు పదాలు కావంటే నమ్మడానికి వీలులేనంతంగా తెలుగులో కుదురుకున్నాయి.

పత్రికలు వీటిని తమ నిత్యవ్యవహారంలో ఎక్కువగా ఉపయోగించడం కూడా ఇందుకు కారణంగా ఉంది. ఈ తరహా పదాలకు ఉదాహరణలు..

ఆంగ్లం నుంచి వచ్చిన పదాలు : పార్టీ, గవర్నర్, ఎమ్మెల్యే, గేట్లు, బస్సు మొ॥నవి

పర్షో అరబిక్ నుంచి వచ్చిన పదాలు : మాజీ, హోదా, ఖరీదు, జిల్లా, పేషి, తహశీల్దార్ మొ॥నవి

సంస్కృతం నుంచి వచ్చిన పదాలు : ప్రాణం, అధికారం, లేఖ, భవనం, పక్షి, భూమి మొ॥నవి

## 5.3.3.3 సంపూర్ణ పద ఆదానం

ఇతర భాషల నుంచి వచ్చిన పదాలు అనేకం కేవలం లిపి మార్పులతో తెలుగులోకి వచ్చి చేరాయి. ప్రధానంగా ఆంగ్లం నుంచి ఈ తరహా పదాలు ఎక్కువగా వచ్చాయి. బ్రిటీషు కాలంలో ప్రారంభమైన ఆంగ్లవిద్య కారణంగా ఈ మార్పు రావడం ప్రారంభమైంది. తొలినాళ్ళలో ఆంగ్ల పదానికి సమానార్థక తెలుగు పదం తయారుచేయాలన్న ఆలోచన లేకపోవడం లేదా ఆ అవసరాన్ని గుర్తించకపోవడం జరిగింది. విదేశీ విద్యపట్ల ఆకర్షణ కూడా ఇందుకు తోడైంది. దీనివల్ల చాలా పదాలు ఆంగ్లం నుంచి లిప్యంతరీకరణ జరుపుకుని తెలుగులోకి ప్రవేశించాయి. దీన్నే సంపూర్ణ పదాదానం అంటారు. తొలినాళ్ళలో పత్రికలు కూడా లిప్యంతరీకరణకు ప్రాధాన్యత ఇవ్వడం కూడా ఇందుకు కొంత దోహదం చేసి ఉండవచ్చు. ఆంగ్లం నుంచి తెలుగులో లిప్యంతరీకరణ జరుపుకుని వచ్చిన పదాలకు కొన్ని ఉదాహరణలు...

ఆంగ్లం : రాకెట్, క్లబ్, కంప్యూటర్, పార్లమెంట్, ఫోన్, ఆటోరిక్షా, కేబుల్.

## 5.3.3.4 మిశ్రసమాస కల్పన

సమాసాన్ని లేదా పదబంధాన్ని అనువాదం చేసేటప్పుడు అందులోని రెండు పదాల్లో ఒకదాన్ని తెలుగులోకి అనువాదం చేసి రెండో పదాన్ని కేవలం లిప్యంతరీకరణంతో ఉంచడం మిశ్రసమాసకల్పన అవుతుంది. దినపత్రికా రచనలో ఎక్కువగా ఆంగ్ల, తెలుగు పదాల సమ్మిళిత రూపాలు కనిపిస్తాయి. కొన్నిసార్లు ఆంగ్ల, సంస్కృత భాషా పదాలు కలిపి మిశ్ర సమాస కల్పన చేయడం కూడా జరుగుతోంది. కాలక్రమంలో ఇవే నిజమైన తెలుగు పదాలు అనిపించేంతా ఇవి తెలుగుభాషలో కుదురుకున్నాయి.

వీటికి కొన్ని ఉదాహరణలు...వేర్వేరు గ్రూపులు, పార్లమెంటరీ పార్టీ నాయకుడు, ఓటర్ల జాబితా, బడ్జెట్‌ప్రసంగం, హైకోర్టు న్యాయమూర్తి, క్లోరిన్ వాయువు మొ॥నవి.

చాలాకాలం క్రితం భాషలో వేళ్లూనుకున్న దేశ్యపదాలు కొంతకాలానికి భావసారూప్యం కలిగిన కొత్తపదాలతో కలిసి మరో నూతన పదాన్ని ఆవిష్కరిస్తాయి. అంటే రెండు పదాల్లో ఒకటి ప్రాచీనపదం కాగా మరొకటి నూతన పదం అవుతుంది. ఈరెండూ కలసి కొత్తపదంగా ఏర్పడడంతో పాటు కొత్తఅర్థాన్ని తీసుకువస్తాయి. ఇందులో ఉండే ప్రాచీన పదానికి ఈ నూతనపదం వల్ల అర్థం కూడా కొత్తది ఏర్పడుతుంది. పత్రికా రచయితలు సాధారణంగా నూతన పదాలు నిర్మించేటప్పుడు అప్పటికే ప్రజలకు తెలిసిన పదాలతో కొత్త పదబంధాన్ని తయారుచేస్తే వెంటనే ప్రజామోదం పొందుతుందనే ఆలోచనలో ఉంటారు. ఈకారణంగా ప్రాచీన, నవీన పదాలు తీసుకుని, కావలసిన అర్థానికి అనుకూలంగా ఉన్నవాటిని జతకూర్చి కొత్తపదం తయారుచేయడం జరుగుతుంది. ఇదే అర్థానుకూలం అవుతుంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు...

1) ప్రజాస్వామ్యం – ఇక్కడ స్వామ్యం అనేది ప్రాచీనపదం

2) శాసనసభా వ్యవహారాలు – శాసనసభ అనేది ప్రాచీనపదం

3) వాణిజ్యపన్నులు – వాణిజ్యం అనేది ప్రాచీనపదం కాగా పన్నులు అనేది నవీన పదం

4) అంతరిక్ష కర్మాగారం – అంతరిక్షం అనేది ప్రాచీనపదం

5) సినీతారలు – తారలు అనేది ప్రాచీన పదం

### 5.3.3.5 పదానువాదం

మూలభాషలో రెండు లేదా అంతకన్నా ఎక్కువ పదాలతో ఉండే పదబంధానికి సమానమైన పదాన్ని లక్ష్యభాషలో తయారుచేసే సందర్భంలో ఆ పదబంధంలోని పదాల విడివిడి సమానార్థకాలు తీసుకుని నూతన పదాన్ని తయారుచేయడం జరుగుతుంది. అంటే మూలభాషలోని సమాస పదాన్ని అనువాదం చేసేటప్పుడు అందులోని పదాల అర్థాన్ని ఆధారం చేసుకోవడం జరుగుతుంది. ఆవిధంగా తయారుచేసిన పదాలు ఎప్పటిలాగే ప్రాచీనపదాలుగా తెలుగులో మిగిలిపోయాయి. వీటికి కొన్ని ఉదాహరణలు పుట 180లో చూడవచ్చు.

ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ – పరిశ్రమల అభివృద్ధి సంస్థ

రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ – రోడ్డు రవాణా సంస్థ

ఎసెన్షియల్ కమోడిటీస్ – నిత్యావసర వస్తువులు

బేసిక్ ఎమినిటీస్ – కనీస సౌకర్యాలు

ఫస్ట్ ఇన్ఫర్మేషన్ రిపోర్ట్ – ప్రథమ సమాచార నివేదిక

రూరల్ వాటర్ సప్లై – గ్రామీణ నీటి సరఫరా

### 5.3.3.6 తాత్పర్యార్థం

మూలభాషలోని మాటను లక్ష్యభాషలో ఒకటి లేదా రెండు మాటలతో చెప్పలేనప్పుడు మరికొన్ని పదాలు తీసుకుని మూలపదంలోని భావాన్ని వివరణాత్మకంగా చెప్పడం జరుగుతుంది. సాధారణంగా ఈ అనువాదం రెండు కన్నా ఎక్కువ పదాలతో ఉంటుంది. ఉదాహరణలు..

1) భోపాల్‌గ్యాస్ ట్రాజెడీ – భోపాల్ గ్యాస్ విషాదం

2) డిపార్ట్‌మెంటల్‌ఎంక్వైరీ – శాఖాపరమైన దర్యాప్తు

3) వీకర్ సెక్షన్ హౌసింగ్ – బలహీనవర్గాల గృహనిర్మాణం

4) ఫారిన్ ఎక్స్ఛేంజ్ – విదేశీ మారకద్రవ్య నియంత్రణ

5) ఢిల్లీబేస్డ్ కంపెనీ – ఢిల్లీకి చెందిన కంపెనీ

### 5.3.3.7 అర్థపునర్వచనం

ఆధునిక కాలంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా ఒక్కోసారి పాత పదాల్ని కొత్త అర్థాల్లో వాడడం జరుగుతుంది. దీనివల్ల ఆ ప్రాచీన పదానికి నూతన అర్థం రావడంతో పాటు ప్రాచీన అర్థం మరుగున పడిపోతుంది. పాతపదానికి ఉన్న అర్థపరిధి నూతన అర్థంలో మరింత విస్తారం చెందే అవకాశమూ ఉంటుంది. ఒకరకంగా ప్రాచీనపదానికి అర్థాన్ని పునర్వచించడం అన్నమాట. ఇందుకు కొన్ని ఉదాహరణలు పుట 181లో చూడవచ్చు.

**స్ట్రాటజీ :** వ్యూహం (ప్రాచీన అర్థంలో యుద్ధతంత్రానికి మాత్రమే వ్యూహం అనే పదాన్ని ఉపయోగించేవారు)

**హెల్మెట్ :** శిరస్త్రాణం (పూర్వకాలంలో సైనికులు యుద్ధసమయాల్లో వాడే శిరోరక్షణ కవచం. ఇప్పుడు ద్విచక్రవాహనాన్ని నడిపేవారికి ఇది అవసరంగా మారింది.)

**ఇంపీరియలిజం :** – సామ్రాజ్యవాదం (ప్రాచీనకాలంలో సామ్రాజ్యం అనే పదం రాచరిక సంప్రదాయానికి మాత్రమే ఉపయోగించేవారు. ఇప్పుడున్న అర్థం ఇందుకు భిన్నంగా ఉంటుంది)

**ఆల్ఇండియా రేడియో :** ఆకాశవాణి (ప్రాచీనకాలంలో అశరీరవాణిగా ఈ పదం వాడుకలో ఉంది. ఇప్పుడు రేడియో అని అర్థం వస్తోంది)

## 5.3.3.8 అర్థవ్యాకోచం

ఒక కాలంలో పరిమితమైన అర్థాన్ని ఇచ్చి, తర్వాతి కాలంలో తన అర్థపరిధిని విస్తరించి, ఎక్కువ అర్థాన్ని ఇవ్వడాన్ని అర్థవ్యాకోచం అంటారు. కొన్ని సంవత్సరాల క్రితం ఒక పదం తెలుగులో ఏదో ఒక సందర్భానికి మాత్రమే పరిమితమై అర్థాన్ని ప్రకటిస్తుంది. తర్వాతికాలంలో ఆ పదంతో లేదా ఆ పదం ఇచ్చే అర్థానికి సమానమైన సందర్భం మరొకటి వస్తుంది. ఇలా నూతన సందర్భాల ప్రకటన ద్వారా ఆ పదం అంతకుముందు ఇచ్చిన సంక్షిప్త అర్థాన్ని మించి ఎక్కువ పరిధిలో అర్థాన్ని ఇవ్వడమే అర్థవ్యాకోచం. దీనికి కొన్ని ఉదాహరణలు..

1) పట్టువదలని విక్రమార్కుడు – విక్రమార్కుడనే మహారాజు తాను అనుకున్న లక్ష్యాన్ని చేరడం కోసం ఎటువంటి కష్టాలనైనా ఎదుర్కొన్నాడు. పట్టిన పట్టు వదలకుండా పనిచేసేవారికి కూడా విక్రమార్కుడి లక్షణాన్ని అనువర్తింపజేయడం కారణంగా 'పట్టువదలని విక్రమార్కుడు' అనే అర్థం ఖరారైంది.

2) అతిరథమహారథులు

3) భరతవాక్యం

4) మంగళం

5) ఉపసంహారణ

### 5.3.3.9 భావానువాదం

కొన్ని మాటలను యథాతథంగా అనువాదం చెయ్యటం ఒక్కోసందర్భంలో కుదరదు. రెండు పదాలు కలసి ఒక పారిభాషిక పదంగా ఏర్పడిన పదబంధంలో రెండూ వేర్వేరు అర్థాలను ఇవ్వవచ్చు. ఒకోసారి మాటకు ఉన్న అర్థం వేరుగా, పారిభాషిక పదంలో చేరినప్పుడు వచ్చే అర్థం వేరుగా ఉంటుంది. ఈ దృష్ట్యా పదాలకు భావానువాదం తప్పనిసరి అవుతుంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

అప్రాప్రియేషన్ బిల్ – ద్రవ్యవినిమయ బిల్లు

ప్రివిలేజ్ మోషన్ – సభాహక్కుల ఉల్లంఘన తీర్మానం

బ్లాక్ డే – నిరసన దినం

గివ్ అప్ – విరమించడం

గ్రీన్ రివల్యూషన్ – వ్యవసాయ విప్లవం / హరిత విప్లవం

### 5.3.3.10 శబ్దపల్లవీకరణం

ఇంగ్లిషులో క్రియాపదంతో వ్యక్తమయ్యే భావం తెలుగులోకి వచ్చే సరికి నామవాచకానికి సహాయక్రియాపదం తోడుచేయవలసి ఉంటుంది. ఇందులో కొన్నిసార్లు ఇంగ్లిషు లేదా హిందీలో క్రియాపదాన్ని లిప్యంతరీకరణం చేసి ఆ మాటను యథాతథంగా వాడుతూనే దానికి తెలుగులో శబ్దపల్లవం జోడించి అనువాద పదసృష్టి చేయడం కనిపిస్తుంది. దాన్నే శబ్దపల్లవీకరణం అంటారు.

టు కాన్సిల్ – రద్దు చేయడం

(రద్దు అనే హిందీ మాటను 'చేయటం'తో శబ్దపల్లవీకరణ చేయడం జరిగింది)

టు అరెస్ట్ – అరెస్ట్ చేయటం

టు వోట్ – ఓటు వేయటం

## 5.4 తెలుగు దినపత్రికలు – లేఖన పద్ధతులు

భాషకు వాక్కు ఎంత ప్రధానమైనదో లిపి కూడా అంతే ప్రధానం. తొలుత వాగ్రూపంలో ఉన్న క్రమంగా లిఖిత రూపాన్ని సంతరించుకుంది. ఈ లిఖిత రూపం కచ్చితంగా ఇలాగే ఏర్పడింది అనడానికి తగిన ఆధారాలు పూర్తిగా లభించడం లేదు. కానీ, చిత్రలిపి అంటే చిత్రలేఖనం నుంచి ఏర్పడిఉంటుందని భాషాచరిత్రకారులు అంచనా వేస్తున్నారు. ఈ విషయాన్ని మరింతగా విశ్లేషిస్తూ చెన్నయ్య, జె తన *తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం* (1998:162)లో ‘ ఏ భాషకైనా ధ్వని మౌలిక లక్షణం. లిపి దానికి గౌణమే కానీ మౌలిక లక్షణం కాదు. ధ్వనికి, భాషకు ఉండే సంబంధం హేతుబద్ధమైనదేమీ కాదు. అది యాదృచ్ఛికమే కాకుండా పరంపరాగతమైనది కూడా. ఫలానా మాటకు ఫలానా లిఖిత రూపానికి మధ్య హేతుబద్ధమైన కారణాలేమీ లేవు. కాబట్టి ఈ రెండిటి మధ్య అంతరం ఉంది. భాషాధ్వనులకు లిపి నిర్మాణం సమగ్రంగా ఉండదు. ఒక లేఖన రూపానికి అనేక ధ్వనులు ఉండవచ్చు. ఒక ధ్వనికి అనేక లేఖన రూపాలు కూడా ఉండవచ్చు. పూర్తిగా ధ్వని విధేయలిపి అంటూ ఉండదు’ అని ప్రకటించారు. ఈ కారణంగా లిపిలో అనేక భేదాలు కాలక్రమంలో వాడుకలోకి వచ్చాయి. వక్త ముఖయంత్రం నుంచి వచ్చిన ధ్వనిని లిఖితరూపంలో ఇలాగే కచ్చితంగా రాయలనే నియమం ఏదీ లేకపోవడంతో  అనేక లిపిభేదాలు పుట్టుకువచ్చాయి. ప్రధానంగా పత్రికల్లో లిపిభేదాలు ఎక్కువగా కనిపిస్తాయి. ఎందుకంటే పత్రికాభాష శిష్టవ్యావహారికంలో సాగుతుంది. అంటే జనసామాన్యం భాషను ఎలా పలుకుతున్నారో / ఉచ్చారణ తీరు ఎలా ఉంటుందో అదే తీరులో లిపి ఉండాలనేది పత్రికల్లో ఓ నియమంగా కనిపిస్తోంది.

దీనివల్ల కాలక్రమంలో వచ్చిన ఉచ్చారణ భేదాలు క్రమంగా లిపి మార్పులకు కారణంగా నిలుస్తున్నాయి. ఈ లిపి పత్రిక ద్వారా జనసామాన్యంలోకి చొచ్చుకుకపోవడంతో ఆ లిపి రూపం స్థిరపడడం జరుగుతోంది. చంద్రశేఖర్, పగడాల తన *తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ* (2011:79)లో ఇదే విషయాన్ని చెబుతూ ‘పత్రికా రచన శిష్టవ్యావహారికంలో జరుగుతున్నది. అంతేకాక ఉచ్చరించినట్లుగా రాయాలనే భావం కూడా కనబడుతుంది. ధ్వనులు మారటానికి ఉచ్చారణలోనూ, రాతలోను ఉన్న సౌలభ్యాపేక్ష, కాలాంతరం, లిపి నిర్బంధాలను కారణాలుగా పేర్కొనవచ్చు. అసాధారణం (మార్క్‌డ్‌నెస్) నుంచి సాధారణం (అన్‌మార్క్‌డ్‌నెస్) వైపు వర్ణాల ఆధునీకరణ జరుగుతున్నది. అంటే ప్రత్యేకం నుంచి సామాన్యం వైపు సాగుతున్నది. అన్యదేశ్య వర్ణాలు దేశ్యాలుగా, ప్రత్యేకవర్ణాలు సాధారణ వర్ణాలుగా ఆధునీకరణ చెందుతున్నాయి’ అంటూ విశ్లేషించారు.

తెలుగు భాషలో 55 వర్ణాలు (అక్షరాలు) ఉన్నట్లు ప్రాచీన వ్యాకర్తలు గుర్తించారు. అందులో అచ్చులు 19, హల్లులు 36 ఉన్నాయి. వీటికి ప్రత్యేక లిపి రూపాలు ఉన్నాయి. అయితే ప్రాచీన తెలుగులో వర్ణంగా లెక్కించని, ప్రత్యేక లిపిరూపం కలిగిన వర్ణం 'ఱ'. దీంతో కలిపితే తెలుగులో మొత్తం 56 వర్ణాలు ఉన్నట్లవుతుంది. ఈ వర్ణాలన్నిటి ప్రయోగం ఆంధ్రపత్రిక తొలినాళ్ళలో కనిపిస్తుంది. క్రమంగా 1970వ దశకం నాటికి తెలుగులో దేశ్యభాగాన్ని, తద్భవభాగాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకుని వర్ణ విభాగాన్ని ప్రత్యేకంగా ప్రకటించారు. వీటిలో 43 వర్ణాలు ఉన్నట్లు చేకూరి రామారావు గుర్తించారు. అందులో 10 అచ్చులు, 33 హల్లులు ఉన్నాయి. అవి

**అచ్చులు :** అ, ఆ, ఇ. ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఒ, ఓ

**హల్లులు :** క, ఖ, గ, ఘ, జ, చ, ఛ, జ, ఝ, ట, ఠ, డ, ఢ, ణ
త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ
య, ర, ల, వ, శ, ష, స, హ, ళ

ఇక, వార్తారచన పరంగా చూస్తే 1980 దశకం ద్వితీయభాగం వచ్చేసరికి వర్ణాలు ఆధునిక రూపాన్ని సంతరించుకున్నాయి. కొన్ని వర్ణాలు సంయోజనం చెందడం వల్ల కొన్ని లిపులు కూడా లుప్తమయ్యాయి. వార్తాకథన రచన ఆధునిక ప్రామాణిక భాషలో సాగిందని చంద్రశేఖర్, పగడాల *తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ* (2011:80)లో చెప్పారు.

## 5.4.1 ఋ, ౠ; ఱ

ఋ, ౠ – సంస్కృతం నుంచి తెలుగులోకి వచ్చి చేరాయి. ఇవి పూర్తిగా అచ్చులు కావు, హల్లులు కావు. అచ్చు, హల్లు వర్ణధర్మ సమ్మిశ్రితమైన విశేషధ్వనులుగా వీటిని భాషాశాస్త్రవేత్తలు గుర్తించారు. ఈ వర్ణాల్ని వర్తమానకాలంలో ఎవరూ అచ్చుల్లాగా పలకడం లేదు. ఉచ్చారణలో 'ఋ' ను 'రు' గా లేదా 'రి' గా పలుకుతున్నారు. పత్రికారచన విషయానికి వచ్చేసరికి రాయడంలో సౌలభ్యం, స్థలం ఆదా తదితర కారణాల రీత్యా పాత్రికేయులు 'ర' – ప్రయోగానికే మొగ్గుచూపారు. దీనవల్ల 'ఋ' ఎక్కడ వాడాలి 'రు' ఎక్కడ వాడాలి అనే సందిగ్ధతకు తావులేకుండా పోయింది. ఇందుకు ఉదాహరణలు...

ఋణం – రుణం; ఋతువు – రుతువు
ఋజువు – రుజువు; ఋషి – రుషి

ఇదిలా ఉండగా, మరికొన్ని సందర్భాల్లో ‘ఋ’ – ‘రి’గా మారిన సందర్భాలు ఉన్నాయి. సంప్రదాయంగా వస్తున్న ‘ఋ’త్వం ‘రి’గా మారడానికి ఆంగ్లభాష ప్రభావం ఉన్నట్లు భాషావేత్తలు నిర్ధారణ చేశారు. ఆంగ్లం నుంచి తెలుగులోకి లిప్యంతరీకరణ చేసే క్రమంలో ‘ఋ’ – ‘రి’గా మారుతుంది. ఉదాహరణకు

కృష్ణుడు – క్రిష్ణుడు

ఇంగ్లిషులో ‘కృష్ణుడు’ను Krishna అని రాస్తాం. దీన్ని తెలుగులోకి లిప్యంతరీకరణం చేసినసప్పుడు ‘క్రిష్ణ’గా మారుతుంది. అయితే అతిశోధిత రూపాలు అక్కడక్కడా కనిపిస్తాయి.

ధ్రువపత్రం – ధృవపత్రం; ధ్రువీకరణ – ధృవీకరణ మొదలగునవి

ఇక ‘ఱ’ (శకటరేఫ) కూడా ఆధునిక భాషావ్యవహారం నుంచి దూరమైంది. ఆధునిక వర్ణమాలలో దీనికి స్థానం లేదు. ఇప్పుడు శకటరేఫ (ఱ) పూర్తిగా సాధురేఫ (ర)గా మారింది. ఇందుకు ఉదాహరణలు..

చెఱువు – చెరువు

కఱువు – కరువు

గుఱ్ఱం – గుర్రం

ఉఱుములు – ఉరుములు

దొఱకుట – దొరకుట

వెఱ్ఱి – వెర్రి

## 5.4.2 అర్ధానుస్వారం

అరసున్న కూడా నేటి వ్యవహారం నుంచి దూరమైంది. ప్రాచీన వ్యాకర్తల ప్రకారం ‘అర్ధానుస్వారం’ – అరసున్న ఒక వర్ణం. పదంలో దీన్ని రాయాల్సిన చోట రాయకపోతే పద అర్థంలో మార్పువచ్చేది. ఉచ్చారణలోను కొంత భేదం కనిపించేది. అయితే కాలక్రమంలో భాషలో జరిగిన ఆధునికీకరణ కారణంగా అర్ధానుస్వారం భాష నుంచి పూర్తిగా తొలిగింది. పత్రికా రచన లేదా పత్రికల ప్రభావం ఈ విషయంలో ఎంతో ఎక్కువగా ఉంది.

అచ్చుయంత్రం నుంచి అనేక రూపాలకు మారుతూ, సాంకేతిక పరిజ్ఞానాన్ని తనలోకి తీసుకుంటున్న సమయంలో ముద్రణ యంత్రం ఈ భాషామార్పులకు కారణమైంది. పాత్రికేయులు వేగం దీనికి తోడైంది. ఫలితంగా తొలినాటి అర్ధానుస్వారం ఇప్పుడు భాష నుంచి పూర్తిగా తొలగింది. ఆంధ్రపత్రిక తొలినాటి సంచికలు, నేటి దినపత్రికలను పోల్చి చూస్తే ఈవిషయం స్పష్టంగా తెలుస్తుంది. ఉదాహరణకు..

| **ఆంధ్రపత్రిక** | **నేటి దినపత్రికలు** |
|---|---|
| చేయ జాలము | చేయజాలం |
| పెట్ట దలచుకొన్న | పెట్టదలచుకొన్న |
| రా బోవు | రాబోవు |

### 5.4.3 పదాది సంయుక్తాక్షర రేఫ లోపం

పదాది సంయుక్తాక్షకం రేఫతో కూడి ఉంటే నేటి వ్యావహారిక భాషలో అది లుప్తమైంది. లేఖనంలో ఈ మార్పు స్పష్టంగా కనిపిస్తుంది.

క్రొత్త – కొత్త

మ్రాను – మాను

క్రింద – కింద

త్రాచు – తాచు

త్రాగు – తాగు

త్రవ్వించు – తవ్వించు

వ్రేలాడు – వేలాడు

అయితే 'వ్రాయు' నుంచి నిష్పన్నమయ్యే నామ, క్రియా రూపాల్లో పదాది సంయుక్తాక్షరంలోని 'వ'కారం లోపించి 'ర'కారం మిగులుతుంది.

వ్రాత – రాత

వ్రాయు – రాయు

## 5.4.4 పదాంత 'ము'వర్ణకం

ప్రస్తుత వ్యవహార భాషలో పదాంతంలో 'ము'వర్ణకానికి బదులు పూర్ణానుస్వారం రాయడం వ్యాప్తిలో ఉంది. 'ము' వర్ణకంలోని ఉత్వం లోపించగా 'మ్' (పొల్లు మ కారం) మిగులుతుంది. కానీ, పూర్ణానుస్వారం రాయడం కనబడుతోంది. సమాసంలోని పూర్వపదాంత 'ము'వర్ణకం విషయంలోను ఈ వ్యవహారం కనిపిస్తోంది.

| | | |
|---|---|---|
| రాజ్యము | – | రాజ్యం |
| పుస్తకము | – | పుస్తకం |
| విగ్రహము | – | విగ్రహం |
| భయము | – | భయం |
| ఇస్లాము సంఘము | – | ఇస్లాం సంఘం |
| భూకంపము | – | భూకంపం |

## 5.4.5 అల్పప్రాణ, మహాప్రాణ భేదాలు

సర్వసాధారణంగా పత్రికలు చదివేవాళ్లు సామాన్య విద్యావంతులై ఉంటారు. ఇది దినపత్రికల విషయంలో మరింత ఎక్కువగా ఉంటుంది. విద్యావంతులు దినపత్రికలతో పాటు తాము ఎంచుకున్న రంగంలోని ఉన్నతస్థాయి పత్రికలు చదువుతారు. ఈ కారణంగా దినపత్రికల్లో అల్పప్రాణ, మహాప్రాణ అక్షరాల వినియోగంలో అనేక మార్పులు కనిపిస్తాయి. సామాన్యుల ఉచ్చారణ లేదా వ్యవహారంలో అల్పప్రాణ అక్షరాల వినియోగం ఎక్కువగా ఉంటుంది. ఈ కారణంగా దినపత్రికల్లో కూడా అల్పప్రాణ అక్షరాలనే వినియోగించడం జరుగుతోంది. దినపత్రికల ప్రారంభకాలంలో గ్రాంథిక భాష వినియోగంలో ఉండడం తదితర కారణాల వల్ల మహాప్రాణాక్షరాలు వాడేవారు. కాలక్రమంలో ఇవి అల్పప్రాణాక్షరాలుగా స్థిరీకరణ పొందాయి. ఉదాహరణకు..

| | | |
|---|---|---|
| విలేఖరి | – | విలేకరి |
| ఘంటలు | – | గంటలు |
| తెల్లవారుఝాము | – | తెల్లవారుజాము |

| | | |
|---|---|---|
| పటిష్ఠం | – | పటిష్టం |
| పండితశ్రేష్ఠుడు | – | పండిత శ్రేష్టుడు |
| ఇష్టాగోష్ఠి | – | ఇష్టాగోష్టి |

ఈ ఉదాహరణలకు కొన్ని మినహాయింపు కూడా ఉంది. అద్విత్వం, అసంయుక్తంగా ఉన్న 'ఠ' వినియోగం మారలేదు. అంటే 'ఠ' – 'ట'గా మారలేదు. ఉదా : కఠిన – కఠిన, హఠాత్తుగా – హఠాత్తుగా, పాఠం – పాఠం మొదలగునవి

## 5.4.6 థ – ధ; గ – వ; మ – వ; శ – స భేదాలు

మహాప్రాణం అల్పప్రాణంగా మారడం సర్వసాధారణంగా జరుగుతుంది. కానీ, 'థ', 'ధ'ల విషయంలో ఇందుకు కొంత మినహాయింపు కనిపిస్తుంది. మహాప్రాణ తాలవ్య శ్వాస స్పర్శం (థ) మహాప్రాణ తాలవ్య నాదస్పర్శం (ధ)గా మారింది. 'థ', 'ధ' ల విషయంలో ధ్వనిసామ్యం కన్నా లిపిసామ్యం ఎక్కువగా కనిపిస్తుంది. రెండిటికీ తేడా కేవలం పొట్టలో చుక్క మాత్రమే. ఈ కారణంగా 'థ', 'ధ'ల వినియోగంలో మార్పు తీసుకువచ్చి ఉండవచ్చు. ఇందుకు ఉదాహరణలు...

| | | |
|---|---|---|
| జగన్నాథ | – | జగన్నాధ |
| విద్యార్థి | – | విద్యార్ధి |
| అర్థశాస్త్రం | – | అర్ధశాస్త్రం |
| గ్రంథాలయం | – | గ్రంధాలయం |
| రథచక్రాలు | – | రధచక్రాలు |
| దృక్పథం | – | దృక్పధం |
| స్వార్థం | – | స్వార్ధం |
| ప్రగతిపథం | – | ప్రగతిపధం |
| ప్రాథమిక | – | ప్రాధమిక |

వ్యావహారికంగా 'గ'కారం 'వ'కారంగా మారడం అనేక సందర్భాల్లో మనం గమనిస్తున్న విషయమే. పత్రికల్లో కూడా ఇది నియతంగా కనిపిస్తుంది. అయితే పదాదిలో ఉన్న 'గ'కారం 'వ'కారంగా మారడం లేదు. పదాంతం, పదమధ్య అద్విరుక్త 'గ'కారం 'వ'కారంగా మారుతోంది.
ఇందుకు ఉదాహరణలు..

| | |
|---|---|
| కన్నుల పండుగ | – కన్నుల పండువ |
| పరుగులు | – పరువులు |
| నగుబాటు | – నవుబాటు |
| ప్రేగులు | – ప్రేవులు |
| బాగుంది | – బావుంది |

మాండలిక భేదాల కారణంగా 'మ'కారానికి ఉచ్చారణ భేదం ఎక్కువగా కనిపిస్తుంది. ముఖ్యంగా 'మ'కారం 'వ'కారంగా మారడంలో దీన్ని గమనించవచ్చు. ఇందుకు ఉదాహరణలు...

| | |
|---|---|
| మామయ్య | – మావయ్య |
| చందమామ | – చందమావ |
| మనుమడు | – మనువడు |

మాండలిక భేదాల కారణంగా ఆధునికీకరణ పొందిన మరొక వర్ణం 'శ'. కోస్తాజిల్లాల మాండలికంలో 'శ', 'స'ల మధ్య ఉచ్చారణ భేదం ఎక్కువగా కనిపించదు. దీనివల్ల 'శ' 'స'గా మారడంతో పాటు కొన్ని సందర్భాల్లో 'స' 'శ'గా మారింది. ఇందుకు ఉదాహరణలు...

| | |
|---|---|
| శెలవు | – సెలవు |
| చేశారు | – చేసారు |
| చూశారు | – చూసారు |
| సివంగి | – శివంగి |
| సీతాఫలం | – శీతాఫలం |
| సాయి | – శాయి |
| వెరసి | – వెరశి |

ఈ మార్పులన్నీ స్థిరంగాను పత్రికల్లో కనిపించవు. ప్రామాణికీకరణ చేయకపోవడం ఇందుకు ఒక కారణం కావచ్చు. ఈ తీరులో ఉండే పదాలు ఒక్కో పత్రికలో ఒక్కో తీరులో కనిపిస్తాయి.

### 5.4.7 దీర్ఘలోపం

కొన్ని సందర్భాల్లో ఒక పదంలోని ఒక వర్ణం లోపించి, దానికి ముందు ఉన్న వర్ణం దీర్ఘంగా మారుతుంది. దీన్నే దీర్ఘలోపంగా వ్యవహరిస్తారు.ఔ. 'హ' వర్ణం లోపించిన సందర్భాల్లో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. ఇందుకు ఉదాహరణలు..

సహాయం – సాయం

మొహమాటం – మోమాటం

సహోదరుడు – సోదరుడు

రహదారి – రాదారి

మహారాజు – మారాజు

### 5.5 తెలుగు దినపత్రికలు – లిప్యంతరీకరణ

ఒక భాషలోని పదాన్ని మరొక భాషాలిపిలో రాయడాన్ని లిప్యంతరీకరణం అంటారు. దీన్ని 'ప్రతిలేఖనం' అని కూడా పిలుస్తారు. లిప్యంతరీకరణ ప్రధానంగా రెండు భాషల మధ్య జరుగుతుంది. ఇందులో ఏ భాష నుంచి తొలిగా పదాన్ని స్వీకరిస్తున్నామో ఆ భాష మూలభాష అవుతుంది. ఏ భాషలోకి లిప్యంతరీకరణ చేసి రాస్తున్నామో అది లక్ష్యభాష అవుతుంది. ఉదాహరణకు ఆంగ్ల పదాలను తెలుగులోకి లిప్యంతరీకరణ చేస్తున్నట్లయితే ఆంగ్లభాష మూలభాష అవుతుంది. తెలుగు లక్ష్యభాష అవుతుంది.

ఏ భాషలో అయినా లిప్యంతరీకరణం చేసే సందర్భంలో మూలభాష నుంచి తీసుకున్న పదాన్ని లక్ష్యభాష స్వభావానికి అనుగుణంగా మార్చి లిపి రాయడం జరుగుతుంది. ఆంగ్లం, తెలుగు భాషల్ని ఇందుకు ఉదాహరణగా తీసుకుందాం. ఆంగ్లభాష హలంత భాష. తెలుగు అజంత భాష. ఈ కారణంగా ఆంగ్లంలో హలంతం లేదా హలాదిగా ఉన్న పదాలు తెలుగులోకి వచ్చేసరికి అజంతాలుగా మారుతున్నాయి. ఇందుకు ఉదాహరణలు పుట 191లో చూడవచ్చు.

| | |
|---|---|
| Accountant | – అకౌంటెంటు |
| Bank | – బ్యాంకు |
| Band | – బ్యాండు |
| Passenger | – ప్యాసెంజర్ |
| Ballet | – బ్యాలెట్ |
| Banner | – బ్యానర్ |

### 5.5.1 పదాది సంయుక్తాక్షరంలో 'య'కార లోపం

అనేక ఆంగ్ల పదాలను తెలుగులోకి లిప్యంతరీకరణం చేసి రాసే సందర్భంలో 'య' వత్తు లోపిస్తోంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

| **ఆంగ్లం (హల్లు + యకారం)** | **హల్లు** |
|---|---|
| జ్యుడిషియల్ | జుడిషియల్ |
| జ్యూట్ | జూట్ |
| మ్యునిసిపాలిటీ | మునిసిపాలిటీ |
| ప్యాసు | పాసు |

### 5.5.2 అద్విరుక్తీకరణం

లిప్యంతరీకరణలో కూడా కాలక్రమంలో అనేక మార్పులు వస్తుంటాయి. ఇందులో అద్విరుక్తీకరణ ఒకటి. అంటే ఆంగ్ల పదాలను తెలుగులోకి లిప్యంతరీకరణం చేసిన తొలి సందర్భంలో రాసిన రూపానికి, కొంతకాలం తర్వాత అదే ఆంగ్ల పదాన్ని తెలుగులోకి లిప్యంతరీకరణం చేసినప్పుడు రాసే లిపిరూపానికి తేడా ఉంటోంది. తొలిగా ద్విత్వాక్షరాలుగా వాడిన పదాలు కాలప్రభావానికి లోనై అద్విరుక్తాక్షరాలుగా ఉపయోగంలోకి వస్తున్నాయి. ఇందుకు కొన్ని ఉదాహరణలు పుట 192లో ఉన్నాయి.

| ఆంగ్ల పదాలు | తొలినాటి లిప్యంతరీకరణ రూపం | ప్రస్తుత రూపం |
|---|---|---|
| Accountant | అక్కొంటెంటు | అకౌంటెంట్ |
| Head | హెడ్డు | హెడ్ |
| Commission | కమ్మిషను | కమిషన్ |
| Sherif | షెరీఫ్ఫు | షెరీఫ్ |
| William | విల్లియం | విలియం |

### 5.5.3 సంధి స్వరాల్లో మార్పులు

సంధి స్వరాలైన 'ఐ', 'ఔ' లు కాలక్రమంలో 'అయి', 'అవు'గా మారడం కనిపిస్తోంది. ఇందుకు నిరూపణగా కొన్ని ఉదాహరణలు

| | | |
|---|---|---|
| 1) | **ఐ** | **అయి** |
| | స్ట్రైట్ | స్ట్రయిట్ |
| | సప్లై | సప్లయి |
| | రిప్లై | రిప్లయి |
| | ఫ్లైట్ | ఫ్లయిట్ |
| | కార్బైడ్ | కార్బయిడ్ |
| 2) | **ఔ** | **అవు** |
| | బౌండరీ | బవుండరీ |
| | కటౌట్ | కటవుట్ |
| | నాకౌట్ | నాకవుట్ |
| | ఔట్ | అవుట్ |
| | హౌసింగ్ | హవుసింగ్ |
| | సరౌండింగ్స్ | సరవుడింగ్స్ |

## 5.5.4 'వు'; 'వొ' లలో మార్పులు

ఆంగ్లంలో పదాలు 'వు', 'వూ', 'వొ', 'వో'లతో ప్రారంభమయ్యేవి కొన్ని ఉన్నాయి. వీటిని లిప్యంతరీకరణం చేసి రాసేటప్పుడు 'వ'కారం అచ్చుగా మారుతుంది. అంటే లిప్యంతరీకరణ జరిగి 'వొ', 'వో'లకు బదులుగా 'ఒ', 'ఓ'లు వస్తాయి. ఉదాహరణలు

| | | |
|---|---|---|
| వొకేషనల్ | (Vocational) | ఒకేషనల్ |
| వోకల్ | (Vocal) | ఓకల్ |
| వోటింగ్ | (Voting) | ఓటింగ్ |
| వొకాబ్యులరీ | (Vocabulary) | ఒకాబ్యులరీ |
| వోల్టేజీ | (Voltage) | ఓల్టేజీ |
| వోటు | (Vote) | ఓటు |

ఇదిలా ఉండగా ఆంగ్లంలోని సంక్షిప్త రూపాలను లిప్యంతరీకరణం చేసి రాయాల్సివచ్చిన సందర్భంలో 'వొ','ఒ'లు పరస్పర వినిమయాన్ని పొందడం కనిపిస్తోంది. ఉదాహరణలు

| | | |
|---|---|---|
| డి.ఇ.ఒ | (D.E.O) | డి.ఇ.వొ |
| ఎన్.జి.ఒ | (N.G.O) | ఎన్.జి.వొ |
| ఎం.ఓ | (M.O) | ఎం.ఎ |

## 5.5.5 హల్లుల లిప్యంతరీకరణ

ఆంగ్లంలో మూడు హల్లులు వరుసగా ఉన్న పదాలను తెలుగులోకి లిప్యంతరీకరణం చేసేటప్పుడు పద, ప్రత్యయ విభాగం చేసి రాయడం అలవాటుగా వస్తోంది. ఇందుకు సంబంధించిన ఉదాహరణలు పుట 194లో ఉన్నాయి.

| **ఆంగ్ల రూపం** | **లిప్యంతరీకరణం** |
| --- | --- |
| Express | ఎక్స్‌ప్రెస్ |
| Extension | ఎక్స్‌టెన్షన్ |
| Instant | ఇన్‌స్టంట్ |
| Institution | ఇన్‌స్టిట్యూషన్ |
| Transport | ట్రాన్స్‌పోర్ట్ |
| Government | గవర్నమెంట్ |
| Compartment | కంపార్ట్‌మెంట్ |

మరికొన్ని సందర్భాల్లో ఆంగ్లపదంలో వరుసగా వచ్చిన మూడు హల్లులను లిప్యంతరీకరించి ఒకే అక్షరంగా రాసిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఉదాహరణలు..

| **ఆంగ్లరూపం** | **లిప్యంతరీకరణం** |
| --- | --- |
| Electronics | ఎలక్ట్రానిక్స్ |
| Straight | స్ట్రెయిట్ |
| Chemistry | కెమిస్ట్రీ |
| Magistrate | మేజిస్ట్రేట్ |
| Sports | స్పోర్ట్స్ |
| Works | వర్క్స్ |
| Administration | ఆడ్మినిస్ట్రేషన్ |

## 5.5.6 సంజ్ఞావాచకాలు

సంజ్ఞావాచకాల విషయంలో లిప్యంతరీకరణ ఒకే రూపంలో సాగడం లేదు. ఒకేవార్తాకథనంలో భిన్న విధాలుగా మూలభాషలోని పదాన్ని లిప్యంతరీకరణ చేయడం జరుగుతోంది. భిన్నపత్రికలతో పాటు ఒకే పత్రికలోని వివిధ వార్తల్లోను ఈ విషయం స్పష్టంగా కనిపిస్తోంది. ఉదాహరణలు..

| ఆంగ్లరూపం | లిప్యంతరీకరణ |
|---|---|
| Academy | అకాడెమి / అకాడమి |
| Desai | దేసాయ్ / దేశాయ్ |
| Shahrukh | షారూఖ్ / షారూక్ |
| University | యూనివర్సిటీ / యూనివర్శిటీ |
| Afghanistan | ఆఫ్గనిస్తాన్ / ఆఫ్ఘనిస్తాన్ |
| December | డిసెంబరు / డిశెంబరు |
| Reagan | రీగన్ / రేగన్ |

## 5.5.7 పూర్ణానుస్వారం

పూర్ణానుస్వారం విషయంలో లిప్యంతరీకరణ అనేక మార్పులకు లోనవుతోంది. ఆంగ్లంలోని పొల్లు మకారంతో కూడుకున్న పదాలను తెలుగులోకి లిప్యంతరీకరణం చేసే విషయంలో పొల్లు మకారానికి బదులు తెలుగులో పూర్ణానుస్వారం వాడడం జరగుతోంది. ఇందుకు ఉదాహరణలు

| | |
|---|---|
| రామ్‌జెఠ్మలానీ | / రాం జఠ్మలానీ |
| రామ్ లాల్ | / రాం లాల్ |
| భీమ్‌గల్ | / భీంగల్ |
| టైమ్ టేబుల్ | / టైం టేబుల్ |

### 5.5.8 అతిశోధిత రూపాలు

లిప్యంతరీకరణంలో కొన్ని చోట్ల అతిశోధిత రూపాలు కనిపిస్తాయి. మూలపదం ఉచ్చారణకు తగినట్టుగా కాకుండా లక్ష్యభాషలోని పదాల స్వరూపానికి తగినట్లు చేయడం ఇందులో ప్రత్యేకత. కొన్ని ఉదాహరణలు..

| ఆంగ్లరూపం | ఉండాల్సిన లిప్యంతరీకరణ | ఉపయోగిస్తున్న రూపం |
|---|---|---|
| Barrage | బరాజ్ | బ్యారేజీ |
| Express | ఇక్స్‌ప్రెస్ | ఎక్స్‌ప్రెస్ |
| Cassette | కాసెట్ | క్యాసెట్ |
| Examiner | ఇగ్జామినర్ | ఎగ్జామినర్ |
| Electronic | ఇలెక్ట్రానిక్ | ఎలక్ట్రానిక్ |

### 5.5.9 ఉర్దూ పదాలు

మూలభాష ఉర్దూగా ఉన్న సందర్భాల్లోను లక్ష్యభాషగా తెలుగులోకి లిప్యంతరీకరణం చేసే సందర్భంలో అనేక మార్పులు కనిపిస్తున్నాయి. మహాప్రాణాలు, అల్పప్రాణాల విషయంలో ఈ భేదం ఎక్కువగా కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు..

| | | | |
|---|---|---|---|
| ఫకీర్ | పకీర్ | బందిఖానా | బందికానా |
| ఫిర్యాదు | పిర్యాదు | ఖరీద్ | ఖరీదు |
| ఫిరంగ్ | పిరంగి | ఖర్చ్ | ఖర్చు |

ఈవిధంగా పత్రికాభాషలో అనేక విధాలైన మార్పులు వచ్చాయి. ఇతర భాషల నుంచి ఆదానాలుగా వచ్చిన పదాల కారణంగా వచ్చిన మార్పులు కొన్నయితే, సాంకేతిక విజ్ఞాన పురోగతి కారణంగా భాషాప్రయోగాల్లో వచ్చిన మార్పులు మరికొన్ని. అయితే, మార్పులో ఏవి వాంఛనీయం? ఏవి అవాంఛనీయం? అనే ప్రశ్నకు పాఠకులే తమ ఆదరణ ద్వారా జవాబు చెబుతారు.

## అధ్యాయం 6

# కృష్ణా జిల్లా నుంచి వెలువడిన పత్రికలు - భాష, శైలి

తెలుగు సాహిత్యంలో పద్యం, గద్యం, నవల, నాటకం, జీవితచరిత్ర, కథ, గల్పిక మొదలైన ప్రక్రియలెన్నో ఉన్నాయి. ప్రతి ప్రక్రియకు వాటికంటూ సొంతమైన ఓ శైలి ఉంటుంది. అలాగే, ఇటీవలి కాలంలో పత్రికా రచన కూడా ఓ సాహిత్య ప్రక్రియగా గుర్తింపు పొందుతోంది. ఈ క్రమంలో పత్రికా రచన కూడా తనకంటూ ఓ శైలిని ఏర్పరచుకునే దిశగా అడుగులు వేస్తోంది.

భాషా ప్రయోగం అన్ని సందర్భాల్లోను ఒకే తీరులో ఉండదు. సందర్భాన్ని వ్యక్తీకరణ విధానం మారుతూ ఉంటుంది. మాట్లాడడం, రాయడం, ఉపన్యాసం, గృహవ్యవహారం, బహిరంగ వ్యవహారం, రచన ప్రక్రియ, శ్రోతల స్థాయి, పాఠకుల స్థాయి, రచయిత భాషాభినివేశం..ఇలా సందర్భానికి అనుగుణంగా భాషాప్రయోగ విధానం మారుతూ ఉంటుంది. అలాగే, భాషా ప్రయోగంలో సందర్భానికి అనుగుణమైన అంతరం కూడా కనబడుతుంది. మాతృభాషా వ్యవహర్తలు ప్రయోగించే భాషకు, అదే భాషను ద్వితీయ భాషగా అభ్యాసం చేసిన వారు ఉపయోగించే భాషా ప్రయోగానికి తేడా ఉంటుంది. ఇలా, భాషను ఆయా సందర్భాలకు అనుగుణంగా ప్రయోగించే సంవిధానాన్నే 'శైలి'గా చెప్పవచ్చు.

"శైలి అంటే రచన రీతి. భావాభివ్యక్తికి, భావోద్దీపనకు భాషను వాడుకునే తీరు శైలి. భాషా ప్రయోగ నైపుణ్యం, రచనావిధానం అనే మాటలతో కూడా శైలిని సూచించవచ్చు" అని చంద్రశేఖర్, పగడాల తన *తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ (1914-1984)* (2011:195)లో చెప్పారు. ఇవన్నీ సాధారణ రచనకు సంబంధించిన అంశాలు. కానీ, పత్రికా భాష, శైలి విషయాల్లో ఇతర సాహిత్య ప్రక్రియల మాదిరిగా స్పష్టత, కచ్చితమైన సూత్రాల నిర్ణయం జరుగలేదు. అలాగని పత్రికా రచనకు నిర్దిష్టమైన శైలి లేదని చెప్పడమూ సమంజసం కాదు. సమాజం నిత్య చరశీలత కలిగి ఉంటుంది. ఈ కారణంగా సమాజాన్ని ప్రతిబింబించే లేదా ప్రతిబింబించాల్సిన వార్తాపత్రికా నిత్య చరశీలత కలిగి ఉంటుంది. ఉండాలి కూడా. అందుకనే వార్తా రచనలో నిత్యనూతన భాష, శైలీ విధానం కనిపిస్తాయి. నవ్యపద కల్పన, ఎత్తుగడలో వైవిధ్యం, వాక్య నిర్మాణంలో కొత్తదనం, సమాస నిర్మాణంలో నవ్యత... ఇవన్నీ వార్తా రచనలో కనిపిస్తాయి.

ఈ కారణంగా వార్తల నిర్మాణం, ఎత్తుగడ, విషయ వివరణ, ముగింపు తదితర అంశాలు ఇతర సాహితీ ప్రక్రియల కన్నా భిన్నంగా కనిపిస్తాయి. పత్రికా రచనలో విభిన్నత కనపడడానికి కారణం..పత్రిక మొత్తంగా ఏక కర్తృకం కాదు. అనేకమంది విలేకరులు రాసిన వార్తల సమాహారం ఒక పత్రిక అవుతుంది. ప్రతి విలేకరికి అతనికంటూ ప్రత్యేకమైన రచనాశైలి ఉంటుంది. ఇలా విలేకరులందరికీ ఎవరికి వారికి ప్రత్యేకమైన భాషా పాటవం, సృజనాత్మకత, కాల్పనిక శక్తి, ఊహ, రచనశిల్పం, అభివ్యక్తిగాఢత, దృష్టికోణం ఉంటాయి. వీటన్నిటి కారణంగా పత్రికారచనలో శైలీ విభిన్నత కనిపిస్తుంది. అలాగని ఏ వార్తకు ఆ వార్త విభిన్నమై, పత్రిక అతుకుల బొంతగానూ ఉండదు. ఏ వార్తకు ఆ వార్త ప్రత్యేకంగా ఉంటూనే అన్నిటినీ కలిపి ఉండే సాధారణ ప్రామాణిక భాషా శైలిని పత్రిక కలిగి ఉంటుంది. దీనివల్ల పత్రిక స్థూలంగా ఒకే భాషా ప్రయాణంలో సాగుతున్నట్లు అనిపిస్తుంది.

## 6.1 శైలి రకాలు

సాధారణ రచన అయినా, పత్రికా రచన అయినా ప్రతి రచనకు ఓ శైలి తప్పనిసరిగా ఉంటుంది. ఈ శైలి అనేక రకాలుగా ఉంటుంది. వచన రచనను బట్టి శైలీభేదం ఏర్పడుతుంది. ఈ భేదాలను శైలి రకాలుగా చంద్రశేఖర్, పగడాల తన *తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ (1914-1984)* (2011:196)లో ఇచ్చారు. ఆయన ప్రకారం శైలిరకాలను కిందివిధంగా విభజించవచ్చు.

### 6.1.1 కథన పద్ధతిని బట్టి శైలి

1. కథనాత్మక శైలి
2. వాదాత్మక శైలి
3. నాటకీయ శైలి
4. ఉపన్యాసాత్మక శైలి

### 6.1.2 విషయ వివరణను బట్టి శైలి

1. విశదాత్మక శైలి / వివరాణత్మక శైలి
2. సంక్షిప్త శైలి

### 6.1.3 అభివ్యక్తి తీరును బట్టి శైలి

1. వాచ్యార్థక శైలి
2. వ్యంగ్యార్థక శైలి
3. హాస్యాత్మక శైలి
4. అధిక్షేపాత్మక శైలి
5. విమర్శనాత్మక శైలి

### 6.1.4 పదాలు, పదబంధాల ప్రయోగాన్ని బట్టి శైలి

1. సరళ శైలి / శాస్త్ర శైలి
2. పదగుంఫన శైలి
3. వర్ణనాత్మక శైలి
4. సాహిత్య శైలి

## 6.2 పత్రికా రచన – పద నిర్మాణం / పద ప్రయోగం

పత్రికారచనలో శైలీవిభిన్నత ఒక పార్శ్వమైతే, ఒకే పత్రికకు భిన్న ప్రాంతాలు, వర్గాల పాఠకులు ఉండడం మరో పార్శ్వమవుతుంది. పత్రిక సమాజంలోని అందరిదీ. సామాన్య అక్షరాస్యుడు మొదలు పండితప్రకాండుల వరకు అందరూ పత్రికను చదువుతారు. నిరక్షరాస్యులు కూడా వేరొకరితో చదివించుకుని పత్రికలోని విషయాలు, విశేషాలు తెలుసుకుంటారు. పత్రిక చదవడానికి జాతి, కుల, మత, ప్రాంత భేదాలు అడ్డుకావు. పత్రిక ఏ భాషలో వెలువడుతుందో ఆ భాష రాకపోవడం ఒక్కటే పత్రిక చదవలేకపోవడానికి కారణం కావాలి. పత్రిక ఏ భాషలో వెలువడుతోందో ఆ భాష మాట్లాడేవారు లేదా ఆ భాష తెలిసిన వారందరూ చదువుతారు. ఈ కారణాలన్నిటినీ విశ్లేషిస్తే పత్రికలో అందరికీ ఆమోదయోగ్యమైన భాష వాడాలి (ఉండాలి) అనే విషయం స్పష్టమవుతోంది. శబ్ద, పదాడంబరాలు లేకుండా సాగే భాషను పండితులు కూడా అర్థం చేసుకోగలుగుతారు. కానీ, పండితులు అర్థం చేసుకునే కావ్యభాష సామాన్యులకు అర్థం కాదు. అందువల్ల పత్రికలో ఉపయోగించే భాష ఎల్లప్పుడు సాధారణ శైలిలోనే ఉండాలి. ఇందుకు సులభమైన పదాలనే వాడాలి.

## 6.2.1 సులభ పదాలు

పత్రికలు సామాన్య ప్రజానీకం కోసం అని నిర్ధారించుకుంటే అందులో ఉండే లేదా ఉపయోగించాల్సిన భాష ఎలా ఉండాలో అదే నిర్ణయమవుతుంది. పత్రిక ప్రజల కోసం, ప్రజల వల్ల నడుస్తుంది. అందువల్ల ప్రజల నిత్యవ్యవహారంలో ఉండే భాష పత్రికలో ప్రతిఫలించాలి. వార్తారచనలో భావం, ఉద్దేశం స్పష్టంగా తెలియాలి. అందుకోసం భాష సులభంగా, స్పష్టంగా, క్లుప్తంగా ఉండాలి. "భాషాండంబర ప్రదర్శనకు ఏ మాత్రం పోకుండా, ఏ మాత్రం డొక్కశుద్ధి ఉన్నవానికైనా అర్థమయ్యేవిధంగా పత్రికలు రాయాలి. రాసేదాన్ని సూటిగా రాయాలి. మనస్సుకు హత్తుకుపోయేటట్లు చెప్పాలి" అని చంద్రశేఖర్, పగడాల తన *తెలుగు దినపత్రికల భాష ఆధునికీకరణ (1914–1984)* (2011:18)లో అన్నారు.

పత్రికలో పాఠకుని భాషా పాటవానికి అనుగుణమైన పదప్రయోగం తప్పనిసరి. వ్యవహారంలోని పదాలు, రూఢ్యర్థ పదాలు రచనలో చోటు చేసుకోవాలి. మూసలో పోసి అచ్చొత్తిన పదాలు, అరిగిన పదాలు, నిరర్థక పదాలు పత్రికాభాషలో అనర్థాలకు దారి తీస్తాయి. కొన్ని సందర్భాల్లో ఈ తరాహా పదాలను ఉపయోగించడం వల్ల మేలు కన్నా కీడు జరిగే ప్రమాదమూ లేకపోలేదు. అయితే పదప్రయోగంలో ఔచిత్యం, సార్థకత ఉంటే తప్పనిసరిగా ఆ పదాన్నే వాడాలి. వార్తారచనలో కఠినపదాల ప్రయోగం అవసరం లేదు. ఒక్కోసారి సందర్భం పదప్రయోగాన్ని నిర్దేశిస్తుంది. అటువంటి ప్రత్యేక సందర్భాల్లో తప్పించి, ఇతర సందర్భాల్లో ఆడంబరం లేని పదం వాడడమే ఉత్తమం.

పిల్లి, మార్జాలం అనే పదాలు తీసుకుంటే...రెండూ సమానార్థకాలే. పర్యాయపదాలే. అయితే పదప్రయోగంలో, అర్థబోధనలో క్లిష్టత విషయంలో రెంటికీ తేడా ఉంది. కాబట్టి, పిల్లి అనే ప్రయోగం ఉత్తమం. భాషలోని తరతమ భేదాలను అనుసరించి పదప్రయోగం మారుతుంటుంది. మారాలి కూడా. ఉదాహరణకు మరణం అన్న పదాన్ని తీసుకుంటే..ప్రతి ప్రాణీ మరణిస్తుంది. కానీ, మరణాలన్నీ ఒకటి కావు. ప్రమాదంలో అయితే మరణం, దుర్మరణం అని; అకస్మాత్తుగా అయితే హఠాన్మరణం అని ప్రయోగించడం పత్రికల్లో కనిపిస్తుంది. మరణం కంటే మృతి అనేది గౌరవ వాచకం. ముసలివారయితే కాలధర్మం చెందారని, గొప్పవారయితే 'అస్తమయం' అని రాయడం వాడుకలో ఉంది. ఈవిధంగా సంఘటన ఒకటే అయినప్పటికీ సందర్భాన్ని బట్టి పదాన్ని ప్రయోగించడం వల్ల వార్త ఔచిత్యం పెరుగుతుంది.

జాగిలాలు', 'కుక్కలు' అనే పదాలు రెండిటికీ ఒకే అర్థం. కేవలం పదాల అర్థాలుగా మాత్రమే వీటిని తీసుకుంటే పోలీసు జాగిలాలు అనే పదప్రయోగం చేయాల్సి వచ్చిన చోట పోలీసు కుక్కలు అని రాయొచ్చు. అలా రాస్తే అందరికీ అర్థమవుతుందనే మాట వాస్తవం కూడా. అలాగని, ఆ పదాన్ని ప్రయోగిస్తే కొన్ని చిక్కులు వస్తాయి. 'పోలీసు కుక్కలు' అన్నప్పుడు నిందార్థం లేదా విరుద్ధార్థం వచ్చే అవకాశం ఉంది. ఒక వేళ పాఠకులు పోలీసులు కుక్కల వంటి వారనే అర్థం తీసుకుంటే ప్రమాదాలు కొనితెచ్చుకున్నట్లే అవుతుంది. పోలీసులు నేర నిర్ధారణలో ఉపయోగించే కుక్కలు సాధారణ కుక్కల కంటే ప్రత్యేకమైనవి. ఇవి దొంగలను పసిగడతాయి. అంతేకాదు, వీటి జీతభత్యాలు ఉంటాయి. రక్షణ ఉంటుంది. ఈ అర్థభేదం ఉపయోగించుకుని పోలీసు కుక్కలు అనే పద ప్రయోగం చేయడం కన్నా పోలీసు జాగిలాలు అనడమే సముచితంగా ఉంటుంది.

మరొక ఉదాహరణ.. తరలించడం, తీసుకు పోవడం– ఈ రెండు పదాలు సాధారణ అర్థంలో సమానార్థకాలే. ఒక్కోచోట పర్యాయ పదాలు కూడా అవుతాయి. కానీ, కొన్ని సందర్భాల్లో ఈ పదాలు కొన్ని చిక్కులు తెచ్చిపెడతాయి. ఓ పత్రికలో.."ఈ ప్రమాదంలో గాయపడిన రెడ్డిని ప్రథమ చికిత్స అనంతరం మద్రాసులోని అపోలో అసుపత్రికోసం తీసుకుపోయారు" అని వార్త వచ్చింది. ఈ సందర్భంలో వ్యక్తి కదల్లేని స్థితిలో ఉన్నాడు. స్వీయ నియంత్రణ కోల్పోయాడు. ఈ సందర్భంలో అతన్ని ఆసుపత్రికి తరలించారనే పద ప్రయోగం నిండుగా ఉంటుంది. తీసుకుపోయారంటే వ్యతిరేకార్థం స్ఫురించే ప్రమాదం ఉంది.

ఈవిధంగా పాఠకుడికి అర్థమయ్యే భాష / పదాలనే పత్రికా రచనలో ఉపయోగించాలే కానీ, అనవసర పదాడంబరం పత్రికా రచయితలకు మేలు చేకూర్చదు. పత్రికా భాష ఎల్లప్పుడూ సరళంగా ఉండి, సామాన్య విద్యావంతులకు సైతం అర్థమయ్యేలా ఉండాలి. సులభమైన పదం అందుబాటులో ఉన్నప్పుడు కఠినపదాన్ని ఎట్టి పరిస్థితుల్లో వాడకూడదు. తక్కువ అక్షరాలు ఉన్న పదాలనే వార్తా రచనకు ఉపయోగించాలి. ఇదే సమయంలో పునరుక్తి దోషాల నుంచి విలేకరి తప్పించుకోవాలి.

వార్తలోని విషయాన్ని బట్టి భావం మారుతుంది. ఆవు మీద, అణువు మీద ఒకే తీరులో వ్యాసం రాయకూడదు. కుతూహల కథనం రాసినప్పుడు స్వేచ్ఛ ఎక్కువగా ఉంటుంది. హాస్యం, వ్యంగ్యం, వర్ణన, సృజనాత్మక అభివ్యక్తి వంటి కవిత్వాంశాలను జోడించవచ్చు. అయితే ఇవన్నీ పాత్రికేయుడి ప్రతిభా పాటవాల మీద ఆధారపడి ఉంటాయి.

" రెండు తరాలకు పూర్వం ఆంగ్ల పత్రికారంగంలో ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ పట్టభద్రులకు స్థానం ఉండేది కాదు. అనవసరంగా పాండిత్యం ప్రదర్శిస్తారని, సామాన్య ప్రజలకు అర్థంకాని పదజాలం వాడతారని భావించి, వారిని ఫ్లీట్‌స్ట్రీట్ (పత్రికా కార్యాలయాల వీధి) గుమ్మం తొక్కనిచ్చేవారు కాదు." (చంద్రశేఖర్, పగడాల. *తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ;* 2011, పుట 20).

"ప్రజాశక్తి వంటి వామపక్షసిద్ధాంత పత్రికల్లో తేట తెలుగు మాటలతో గ్రామీణ పలుకుబడులతో, చిన్నచిన్న వాక్యాలతో సులభగ్రాహ్యమైన పద్ధతిలో వ్యాసాలనూ, సంపాదకీయాలనూ ఈ పత్రికల్లో రాసేవారు. సామాన్య విద్యావంతులకు కూడా అర్థమయ్యే శైలిని ఈ పత్రికలు రూపొందించాయి" అని లక్ష్మణరెడ్డి, వి తన *తెలుగు జర్నలిజం అవతరణ వికాసం* (2002, పుట 145)లో రాశారు.

పత్రికా రచనలో క్లిష్ట పదాలు ఉండకూడదని పాత్రికేయులు, పాఠకులు, పత్రికా పరిశోధకులు చెబుతున్నారు. దీనివల్ల కఠిన పదాల నిర్ధారణకు ప్రమాణం ఏమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. పాఠకునికి తెలియని ప్రతి పదాన్నీ కఠినపదంగా భావించకూడదు. ఒకవేళ భావిస్తే అదీ తప్పే అవుతుంది.

ప్రతిరంగంలోను ప్రాథమిక విజ్ఞానాన్ని తెలిపే కొన్ని పదాలు ఉంటాయి. అందువల్ల వీటిని కఠినపదాలుగా గుర్తించకూడదు. "కఠినపదాల్ని నిర్ణయించాలంటే లేదా ఓ పదాన్ని కఠినపదంగా గుర్తించాలంటే అందుకు పద పౌనఃపున్యం, పద నిర్మాణాత్మక సంక్లిష్టతలను పరిగణలోకి తీసుకోవాలి. ప్రయోగ బహుళత ఎక్కువగా ఉన్న పదం సులభపదం అవుతుంది. లేకుంటే కఠినపదం అవుతుంది. ఉపసర్గలు, ప్రత్యయాత్మకమైన పదాలు సులభంగా అర్థంకావు. అలాగని పదం పొడవుగా ఉన్నంతమాత్రాన అర్థం కాదని చెప్పలేం. ఇది ఆరోపణాంశమే కానీ నిర్ధారణాంశం కాదు.

దీర్ఘపదం కూడా ప్రయోగబాహుళ్యం ఉంటే అర్థమయ్యే అవకాశం లేకపోలేదు. ఆయా రంగాల్లో ప్రవేశం ఉండి, పాండిత్యం సంపాదించి ఉంటే, అతి సూక్ష్మభావాన్ని తెలిపే కఠినాతికఠినమైన పదం కూడా సులభంగా అర్థమవుతుంది. కాబట్టి, పాఠకునికి అర్థం కాని పదాలన్నింటిని కఠినపదాలుగా లెక్కించాల్సిన అవసరం లేదు." (చంద్రశేఖర్, పగడాల. *తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ;* 2011, పుట 21).

## 6.2.2 సంక్షిప్త పదం

సర్వసాధారణంగా పత్రికా రచయితలందరూ తేలికగా, అతి తక్కువ పదాలు ప్రయోగించడానికి ఇష్టపడతారు. ఇందులో ప్రజలకు వార్త చదవగానే వెంటనే అర్థమవ్వాలనే కోరిక ఒక కోణమైతే, వీలైనన్ని ఎక్కువ వార్తలు పత్రికలో ఇవ్వాలనేది మరో కోణం. వార్త సంక్షిప్తంగా ఉండాలి. అంటే తక్కువ స్థలంలో ఇమిడేటట్లు ఉండడం, పదాలను తగ్గించడం కాదు. వార్తా రచనలో పరిమాణం కన్నా భావ సమగ్రత ముఖ్యంగా ఉంటుంది. సార్థక పదప్రయోగం, వ్యర్థ, నిరర్థక పద నిషేధం, పునరుక్తి పరిహారం వల్ల వార్తా రచనలో సంక్షిప్తత పెంచడానికి అవకాశం ఉంటుంది. వార్తారచనలో చిన్న పదాలకే పట్టం కడతారు. పర్యాయపదాల్లో చిన్న పదాన్నే ఎంపికచేస్తారు. ఆంగ్ల పదాలకు రూఢి అయిన, సులభంగా అర్థమయ్యే అనువాద పదాలు ఉన్నప్పటికీ చిన్నగా ఉన్నందువల్ల ఆంగ్ల పదాలనే ప్రయోగిస్తారు. స్థలాన్ని ఆదా చేయడానికి పదాలను ధ్వని పరిణామాలతో, సంక్షిప్త పదాలతో రాయడం పత్రికల్లో ఎక్కువగా కనిపిస్తోంది. ఇందువల్ల పత్రికలో అతి తక్కువ అక్షరాలతో ఉండే పదాలనే వాడతారు. ఇది శీర్షికారచనలో ఎక్కువగా కనిపిస్తుంది.

శీర్షికలో అక్షరాల సంఖ్య ఎంత తక్కువ ఉంటే అంత తక్కువగా అంత ఎక్కువ స్పష్టత వస్తుంది. ఖతిపరిమాణం (ఫాంట్ సైజ్) కూడా ఎక్కువగా ఇవ్వచ్చు. ఇలాంటి శీర్షిక చూడగానే / చదవగానే ఇట్టే ఆకట్టుకుంటుంది. ఉదాహరణకు.. సాక్షి దినపత్రికలో వచ్చిన బీ'మాయే'నా? అనే శీర్షిక. మచిలీపట్నం ప్రాంతంలో రైతుల బీమా విషయంలో జరిగిన అవకతవకలను వెలుగులోకి తీసుకువస్తూ రాసిన వార్తకు పెట్టిన శీర్షిక అది. శీర్షికలో ఉన్నది కేవలం నాలుగు అక్షరాలు. బీ'మాయే' అనడంలో సంఘటనలో బీమా విషయంలో జరిగినదంతా మాయే అనే ధ్వని ప్రకటిస్తూ ఈ శీర్షిక సాగింది. అతి తక్కువ పదాలు లేదా పద సంక్షిప్తతకు ఇది చక్కని ఉదాహరణ.

## 6.2.3 నవ్య పదకల్పన

పత్రికా రచన సమాజానికి అనుగుణంగా సాగుతుందనడంలో అతిశయోక్తి లేదు. వివాదమూ లేదు. కాబట్టి పత్రికా రచనలో నవ్య పదకల్పన అనివార్య అంశంగా మారింది. ఈ నూతన పదకల్పన ముఖ్యంగా రెండు రకాలుగా జరుగుతుంది. 1. పద ఆదానం 2. పదకల్పన.

పద ఆదానంలో అన్యభాషా పదాలను లేఖన సర్దుబాట్లతో తెలుగులోకి తీసుకురావడం పద ఆదానం అవుతుంది. ఇది చాలా సులభమైన పద్ధతి. ఇందుకు భిన్నంగా పద కల్పన సాగుతుంది. ఇతర భాషలో ఉన్న పదాలను తెలుగు సమాజం, సంప్రదాయాలకు అనుగుణంగా మారుస్తూ, నూతన పదాన్ని సృష్టించాలి. ఈ సందర్భంలో మూలభాషలోని పద అర్థం మారకుండా జాగ్రత్త తీసుకోవాలి. ఈ క్రమంలో నవ్య పదకల్పన పత్రికారచయితను కొద్దిగా ఇబ్బంది పెడుతుంది.

ఈ రెండు విధానాలతో పాటు కృదంతాలు, తద్ధితాల ద్వారా నూతన పదాలను సృష్టించవచ్చు. ప్రాతిపదికలకు ప్రత్యయాలు, ఉపసర్గలు చేర్చడం వల్ల కొత్త పదాలు ఏర్పడతాయి. వీటితోపాటు నామ పదాల నుంచి విశేషణం వంటి భాషాభాగాలను నిష్పన్నం చేసుకోవడం వల్ల కూడా నూతన పదాల కల్పనకు అవకాశం ఏర్పడుతుంది. ఒక భాషాభాగ పదాన్ని వేరొక భాషాభాగ పదంగా నిష్పన్నం చేసుకోవడం వల్ల కూడా నవ్య పదకల్పన సాధ్యపడుతుంది.

ఇవన్నీ నవ్యపద కల్పనలో శాస్త్రీయంగా జరిగేవైతే, చమత్కారం కోసం ఒక్కోసారి పాత్రికేయులు చేసే పదకల్పన కూడా పాఠకులకు ఉత్సాహాన్నిస్తుంది. ఈ తరహా పదకల్పన ఇటీవలికాలంలో అన్ని ప్రధాన పత్రికల్లో విరివిగా కనిపిస్తోంది. ఉదాహరణకు...

**1. అణుబంధం** – అనుబంధం అనే పదాన్ని ఆధారంగా చేసుకుని అణుబాంబు గురించి రాయాల్సిన వార్తకు 'అణుబంధం' అనే శీర్షికను ఈ వార్తకు పెట్టడం జరిగింది.

**2. వస్త్ర సన్యాసం** – అస్త్ర సన్యాసం అనే ప్రాచీన పదాన్ని ఉపయోగించుకుని వస్త్ర వ్యాపారుల నిరసన తెలియజేయడానికి ఈ శీర్షికను పెట్టడం జరిగింది.

**3. బకాయ్ సురులైన మంత్రులు** – మంత్రులే బకాయిలు చెల్లించాల్సి ఉందనే విషయం చెప్పడానికి బకాసురుడు అనే పదాన్ని ఆధారంగా తీసుకోవడం జరిగింది.

**4. బహుళార్థ బాధక ప్రాజెక్ట్** – ఆ ప్రాజెక్ట్ నిర్మించడం ద్వారా లాభాలు చేకూర్చాల్సి ఉండగా, లాభాల మాట ఎలా ఉన్నా ఆ ప్రాజెక్ట్ వల్ల బాధలే కలుగుతున్నాయి. ఈ విషయాన్ని చెప్పడానికి బహుళార్థ సాధక నుంచి సాధక తీసివేసి బాధక తగిలించారు.

**5. ఢీ సిసిబి** – డిసిసిబి ఎన్నికల్లో తీవ్రస్థాయిలో పోటీ జరుగుతోందని, విజయం కోసం ప్రత్యర్థులు ఒకరితోఒకరు తీవ్రంగా పోటీ పడుతున్నారని చెప్పడానికి ఇక్కడ 'ఢీ' అనే అక్షరాన్ని వాడి, కొత్త పదాన్ని సృష్టించుకోవడం జరిగింది.

ఇలా అనేక ఉదాహరణలు ఉన్నాయి. ఇటీవలికాలలో ఈ తరహా పదాలు ప్రయోగించడం పత్రికారచనలో విరివిగా కనిపిస్తోంది. ప్రత్యేకంగా ఆంగ్ల పదాలను నిషేధించడం; తత్సమ, ఉర్దు, హిందుస్తానీ పదాలను ప్రయోగించడం కూడా ఇటీవలికాలంలో అత్యంత స్పష్టంగా కనిపిస్తోంది. ఇవన్నీ పాత్రికేయుల పదకల్పన సామర్థ్యానికి ప్రతీకలుగా నిలుస్తున్నాయి. శాస్త్ర, సాంకేతిక విజ్ఞానానికి సంబంధించిన పదాలను, అత్యంత ఆధునిక విజ్ఞానాన్ని తెలియజేసే ఆంగ్ల పదాలను మాత్రం లిప్యంతరీకరించి వాడడం జరుగుతోంది.

## 6.2.4 పదం – నవ్యార్థ కల్పన

శబ్దానికి, అర్థానికి ఉన్న సంబంధం ఎప్పుడూ నియతం కాదు. అది కేవలం యాదృచ్ఛికమైంది. ఒక శబ్దానికి నియతంగా ఒక అర్థాన్ని ప్రకటించడం భాషావ్యవహర్త మీద ఆధారపడి ఉంటుంది. దీంతోపాటు, ప్రతి పదానికి ఒక మౌలికార్థం ఉంటుంది. ఏదైనా ఒక పదాన్ని విన్నంతనే శ్రోతకు కలిగే భావం లేదా బోధపడిన అర్థమే ఆ పదానికి ఉన్న మౌలికార్థం అవుతుంది. తర్వాత అనేక ప్రభావాలకు లోనై, ఆ పదానికి నిష్పన్న, గౌణ , విస్తరణ అర్థాలు ఏర్పడడం జరుగుతుంది. వీటితోపాటు శబ్దానికి అభిదార్థం, లక్షణార్థం, వ్యంగ్యార్థం, సంకేతార్థం కూడా ఉంటాయి.

ఒక్కోసారి ప్రతీకాత్మక (సింబాలిక్) అర్థాలు కూడా ఉంటాయి. రహస్య భావాలు ప్రకటించడానికి, రహస్య కార్యకలాపాలు నిర్వహించడానికి, పరోక్షంగా చెప్పడానికి ఈ అర్థాలు ఉపయోగిస్తాయి. ఒక శబ్దం భిన్న పరిభాషల్లో భిన్న అర్థాలను ఇస్తుంది. ఇవన్నీ రచయిత ప్రతిభ కారణంగా సాధ్యపడుతున్నాయి.

మనిషికి సామాజిక అవసరాలు నిత్యం మారుతూ ఉంటాయి. ఈ కారణంగా నిత్యనూతన అభివ్యక్తి అవసరమవుతూ ఉంటుంది. ఈవిధంగా నూతన శబ్దప్రయోగం, పరంపరానుగతంగా ఉన్న శబ్దానికి నూతన భావ ప్రకటన వ్యవహారంలోకి వస్తున్నాయి.

ఆధునిక కాలంలో ఉత్పన్నమవుతున్న నూతన భావాభివ్యక్తికి నూతన శబ్దకల్పన, నూతన సమాస కల్పన అత్యంత అవసరమవతున్నాయి. దీంతో ఆధునిక పత్రికా రచనలో నూతన సమాస రచన ఎక్కువగా కనిపిస్తోంది. దీనివల్ల శబ్దం బాహ్యరూపంలో నవ్యత కనిపించకపోయినప్పటికీ అర్థంలో మాత్రం నవ్యత కనిపిస్తోంది. కొన్ని శబ్దాల అర్థాలను వాటి ప్రాచీన ఉపయోగాలతో పోల్చి చూస్తే నవ్యార్థ కల్పన ఎలా జరిగిందో అర్థమవుతుంది. గతంలో ఉన్న అర్థాన్ని పూర్తిగా కోల్పోవడం గాని, లేదా అర్థంలో సంకోచం రావడం గాని జరుగుతుంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

| పదం | ప్రాచీన అర్థం | నవ్యార్థం |
|---|---|---|
| బ్రహ్మాండం | భువనగోళం | అత్యంత |
| వ్యూహం | యోధుల సన్నివేశ విశేషం | ఆలోచన విశేషం |
| బ్రహ్మచారి | వేదాధ్యయనం కోసం వ్రతం చేసేవాడు | అవివాహితుడు |
| బాకా | ఊదెడి వాద్య విశేషం | పొగడ్త |
| బట్టీ (ఉర్దూ) | బట్టలు ఉడకబెట్టే పొయ్యి | కంఠస్తం చేయడం |
| తడి | తేమ | డబ్బు / లంచం |
| కులపతి | వంశశ్రేష్ఠుడు | విశ్వవిద్యాలయానికి అధిపతి |
| ఉపాధి | కపటము, మోసము, స్ఫటికము | ఉద్యోగం |
| శకము | దేశ భేదం, జాతి భేదం | వినూత్న పరిణామ ఆరంభం |
| సవారీ (ఉర్దూ) | వాహనం | వాహనం మీది ప్రయాణికుడు |
| హస్తలాఘవం | చేతి నేర్పు, కనికట్టు విద్య | జేబులు కొట్టడం, దొంగతనం |

### 6.2.4.1 అర్థ వ్యాకోచం

ఓ శబ్దానికి అంతకుముందు ఉన్న భావ పరిధిని విస్తృత పరచి, నూతన అర్థాన్ని చెప్పడం లేదా నూతన అర్థంలో ప్రయోగించడం అర్థవ్యాకోచం అవుతుంది. భాషలో వస్తున్న మార్పులు, సమాజంలో వస్తున్న నూతన సన్నివేశాలు అర్థ వ్యాకోచానికి కారణమవుతున్నాయి. గతంలో పరిమిత అర్థంలో వాడిన పదాన్ని, ఆధునిక అవసరానిక అనుగుణంగా నూతన అర్థంలో, విస్తృత పరిధిలో వాడడం కూడా అర్థవ్యాకోచం అవుతుంది.

| పదం | ప్రాచీన అర్థం | నవ్యార్థం (అర్థవ్యాకోచం) |
| --- | --- | --- |
| ధర్నా | రుణగ్రస్తుని ఇంటిముందు బైఠాయించడం | కోర్కెల సాధన కోసం యజమాని ఇంటి ముందు బైఠాయించడం |
| ఉపసంహరణ | మరలించుట | వెనక్కి తీసుకోవడం |
| అతిరథుడు | ఉత్తమ రథికుడు | గొప్పవాడు |
| సారథ్యం | రథము నడిపే పని | నాయకత్వం |
| శతకం | వంద పద్యాలు కలిగినది | వంద పరుగులు |
| శిబిరం | దండు విడిది చేసిన చోటు | విడిది చోటు |
| భరతవాక్యం | నాటకం చివరలో పలికే పద్యం | ముగింపు |
| బండబూతులు | బండజాతి వారు తిట్టుకునే పదాలు | నీచార్థంలో ఉండే తిట్లు |
| నాంది | పని ప్రారంభంలో చేసే దేవతా పూజ | ప్రారంభం |
| బోణీ | సరుకు తొలిగా అమ్మగా వచ్చిన సొమ్ము | మొదటగా పొందిన లబ్ధి |

ఆంగ్లపదాల అర్థాలను తెలుగులో వ్యక్తం చేయాల్సిన సందర్భాలు అనేకం ఉంటాయి. ఇటువంటి కొన్ని సందర్భాల్లో ఒకే తెలుగు పదాన్ని అనేక ఇంగ్లిషు పదాల భావాలను వ్యక్తం చేయడానికి ఉపయోగించడం జరుగుతోంది. కొన్ని ప్రత్యయాలు లేదా ఉపసర్గలు ఆధారంగా చేసుకుని ఆయా ఇంగ్లిషు పదాలను తెలుగులోకి అనువాదం చేయడం ఇందులో జరుగుతుంది. ఇది ఒకరకంగా అర్థవ్యాకోచం వంటిదే. ఒకే పదాన్ని అనేక సందర్భాల్లో భిన్న అర్థచ్ఛాయల్లో వాడి, విభిన్న పదాలను సృష్టించడం ఈ విధానం. ఇప్పటికే తెలుగు పదాలుగా స్థిరీకరణ పొందిన ఉర్దూ, పార్సీ పదాలను ఇందుకు వాడడం జరగుతోంది. కొన్ని ఉదాహరణలు..

**1. ఉప = ఆసన్నము, సమీపముగా ఉన్నది**

| **తెలుగు పదం** | **ఇంగ్లిషు పదం** |
| --- | --- |
| ఉప ఎన్నికలు | బై ఎలక్షన్స్ |
| ఉప సంపాదకుడు | సబ్ ఎడిటర్ |
| ఉప అధ్యక్షుడు / ఉపాధ్యక్షుడు | వైస్ ప్రెసిడెంట్ |

**2. మాజీ = పదవీ విరమణ చేసిన, విశ్రాంత**

| **తెలుగు పదం** | **ఇంగ్లిషు పదం** |
|---|---|
| మాజీ మంత్రి | ఫార్మర్ మినిస్టర్ |
| మాజీ మంత్రి | ఎక్స్ మినిస్టర్ |

**3. సంఘం = సమాజము, సంస్థ**

| **తెలుగు పదం** | **ఇంగ్లిషు పదం** |
|---|---|
| అంచనాల సంఘం | ఎస్టిమేట్స్ కమిటీ |
| ఉద్యోగుల సంఘం | ఎంప్లాయిస్ అసోషియేషన్ |
| ఎన్నికల సంఘం | ఎలక్షన్ కమీషన్ |
| విద్యార్థి సంఘం | స్టూడెంట్స్ యూనియన్ |

**4. సంస్థ**

| **తెలుగు పదం** | **ఇంగ్లిషు పదం** |
|---|---|
| రోడ్డు రవాణా సంస్థ | రోడ్ ట్రాన్స్‌పోర్టేషన్ కార్పొరేషన్ |
| విద్యాసంస్థ | ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూట్ |

## 6.2.4.2 అర్థాపకర్ష

ఓ పదానికి అంతకుముందు ఉన్న అర్థం మారి, ప్రస్తుతంలో నీచార్థం వాడుకలోకి రావడాన్ని అర్థాపకర్ష అంటారు. దీనివల్ల రూఢిలోని మౌలికార్థానికి నష్టం కలిగి పరిహాసార్థంలో గాని, నిందార్థంలోగాని, నిమ్నార్థంలోగాని పదాన్ని వాడడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణలు పుట 210లో చూడవచ్చు.

| పదం | ప్రాచీన అర్థం | నవ్యార్థం (అర్థాపకర్ష) |
|---|---|---|
| అక్షింతలు | ఆశీర్వదించునపుడు ఉపయోగించు బియ్యం | చీవాట్లు, మందలింపు |
| సుత్తి | చిన్న సమ్మెట / పనిముట్టు | అధికంగామాట్లాడి విసుగు కలిగించడం |
| సన్మానం | గౌరవించడం | అవమానించడం |
| స్వస్తి | క్షేమం, లాభం | నిష్క్రమించడం |
| సన్మానం | గౌరవించడం | అవమానించడం |
| ముడుపు | దేవుడి కోసం కట్టిన డబ్బు మూట | లంచం |
| కైంకర్యం | ఊడిగం, సేవ చెయ్యడం | దొంగతనం |
| చుక్క | నీటి బొట్టు | మద్యం |
| దక్షిణ | బ్రాహ్మణులకు ఇచ్చే ధనం | లంచం |
| దయచేయు | ఇంటికి రావడం | బయటకు వెళ్ళు |
| బరువు | తూకం | లంచం |
| మామూలు | సాధారణం | లంచం |
| ప్రబుద్ధుడు | పండితుడు | బుద్ధిహీనుడు |
| మంగళం | శుభకరం | వినాశం, అశుభం |
| శ్రీముఖం | పెద్దలు రాసి పంపించే పత్రం | మెమో, వివరణ కోరుతూ ఇచ్చే లేఖ |

### 6.2.4.3 సభ్యోక్తి

కొన్ని పదాలను నలుగురి మధ్యలో అంటే సభలో పలకడం మర్యాదగా ఉండదు. శ్రోతకు ఇబ్బందిగా అనిపించవచ్చు. లేదా ఎవరిని ఉద్దేశించి మాట్లాడుతున్నామో వారికి కూడా తలవంపు తేవచ్చు.

ఇటువంటి ఇబ్బందుల నుంచి తప్పించడానికి ఏర్పడిన పదాలే సభ్యోక్తులు. సాధారణంగా కొన్ని నీచవృత్తులు, నిమ్న కులాల పేర్లను బహిరంగంగా చెప్పడం ఇబ్బందికరంగా ఉంటుంది. ఈ పరిస్థితిని నివారించడానిక సభ్యోక్తులు వాడుకలోకి వచ్చాయి. ఇందుకు ఉదాహరణగా కంసాలి – విశ్వబ్రాహ్మణ; గొల్ల – యాదవ; బోయ – వాల్మీకి; చాకలి – రజక; మంగలి – నాయీ బ్రాహ్మణ; బెస్త – గంగపుత్ర మొదలైన వాటిని చెప్పవచ్చు. ఇందుకు వ్యతిరేకంగా అభివ్యక్తి వక్రత వల్ల కొన్నిసార్లు ఉన్నతభావాలతో పదాల్ని వ్యక్తం చేయడం కూడా జరుగుతుంది. జైలు – కృష్ణజన్మస్థానం; బేడీలు – అరదండాలు వంటివి ఇందుకు ఉదాహరణలు.

### 6.2.4.4 అర్థపరివర్తనం

భాష నిత్యప్రవాహ శీలం కలిగినది. ప్రత్యేకించి తెలుగు భాషలో ఈ లక్షణం మరింత ఎక్కువగా కనిపిస్తుంది. ఈ కారణంగా అన్య భాషా పదాలు ఎక్కువగా తెలుగులోకి వచ్చి చేరాయి. ఈ కారణంగా ఆ పదాలకు అప్పటికే తెలుగులో ఉన్న అర్థం మారి, సరికొత్త అర్థం ఏర్పడింది. ఇతర సంస్కృతుల నుంచి సంక్రమించిన భావాలను తెలుగులో వ్యక్తం చేయవలసి రావడం కూడా ఇందుకు ఒక కారణం. ఈవిధంగా జరిగిన పద అర్థాల మార్పులను అర్థ పరివర్తన అంటారు. దీనివల్ల అర్థ నవ్యత సాధ్యపడుతోంది. ఇందుకు ఉదాహరణలు

| **పదం** | **ప్రాచీన అర్థం** | **నవ్యార్థం (అర్థ పరివర్తన)** |
|---|---|---|
| తార | నక్షత్రం | చలనచిత్ర నటులు |
| వాచకము | చెప్పునది, వివరించునది | పాఠ్యపుస్తకం |
| శ్వేతపత్రం | హంస | ప్రభుత్వం విడుదల చేసే పత్రం |

### 6.2.5 సంక్షిప్త పదకల్పన

పత్రికల్లో సంక్షిప్త పదాల ప్రయోగం ఓ ప్రత్యేకత సంతరించుకుని ఉంటుంది. సమాజంలో ప్రసిద్ధి పొందిన వ్యక్తులు, సంస్థలు తదితరుల పేర్లు రాయల్సివచ్చినప్పుడు పాత్రికేయులు వారి పూర్తి పేరును రాయకుండా, వాటిని సంక్షిప్తరూపంలో రాస్తారు. ఈవిధంగా సంక్షిప్త పదాలతో నూతన పదకల్పన జరగుతుంది.

అయితే సంక్షిప్త పదాలు వాడాలనే నియమమేదీ పత్రికలో లేదు. ఇది పాత్రికేయుడి వెసులుబాటు మీద ఆధారపడి ఉంటుంది. సాధారణంగా వ్యక్తులు లేదా సంస్థల పేర్లలో ఎక్కువ పదాలు ఉన్నప్పుడు సంక్షిప్త పద కల్పనకు పాత్రికేయులు ప్రయత్నిస్తారు. పత్రికలో స్థల సమస్య తీవ్రంగా ఉంటుంది. తక్కువ స్థలంలో ఎక్కువ వార్తలు ఇవ్వాల్సి ఉంటుంది. అందువల్ల ఎక్కువ పదాలున్న పేర్లు రాయడానికి బదులు సంక్షిప్త పదాన్ని తయారు చేసి వాడడం జరుగుతుంది. క్రమగా ఆ సంక్షిప్త పేర్లతోనే సదరు వ్యక్తులు / సంస్థలు ప్రఖ్యాతి పొందిన సందర్భాలు అనేకం ఉన్నాయి. సంక్షిప్త పద కల్పన పత్రికలో మూడు రకాలుగా జరుగుతుంది.

**1.** సంజ్ఞావాచకం (పేరు)లోని పదాల మొదటి అక్షరాలను తీసుకుని సంక్షిప్త పదం తయారుచేయడం. ఈవిధానంలో ప్రతి అక్షరానికి మధ్య పూర్ణబిందువు (ఫుల్‌స్టాప్) ఉంటుంది. ఉదాహరణ:

| | | |
|---|---|---|
| ఎం.ఎల్.ఎ | (M.L.A.) | – మెంబర్ ఆఫ్ లెజిస్లేటివ్ అసెంబ్లీ |
| ఒ.ఎన్.జి.సి | (O.N.G.C.) | – ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కంపెనీ |
| ఎన్.డి.ఎ. | (N.D.A.) | – నేషనల్ డెమొక్రటిక్ ఎలయెన్స్ |
| యు.పి.ఎ | (U.P.A.) | – యునైటెడ్ ప్రోగ్రెసివ్ ఎలయెన్స్ |
| జె.ఎ.సి | (J.A.C.) | – జాయింట్ యాక్షన్ కమిటీ |

**2.** ఈ విధానంలో కూడా సంజ్ఞావాచకంలోని పదాల మొదటి అక్షరాలను తీసుకుని సంక్షిప్త పదం తయారుచేయడం జరుగుతుంది. అయితే అక్షరాల మధ్యలో పూర్ణబిందువు ఉండదు. దీనివల్ల పదాది అక్షరాలతో ఏర్పడిన సంక్షిప్త పదం ఓ ప్రత్యేక నూతన పదంగా తయారవుతుంది. ఈవిధంగా తయారైన పదాలను ఇంగ్లిషులో ఆక్రోనిమ్ అంటారు. ఇందుకు ఉదాహరణలు..

| | |
|---|---|
| ఒపెక్ (O.P.E.C.) | – ఒపిఇసి (ఆయిల్ అండ్ పెట్రోలియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్) |
| తుల్ఫ్ (T.U.L.F) | – టియుఎల్ఎఫ్ (తమిళ్ యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్) |

ఇవన్నీ ఇంగ్లిషు నుంచి వచ్చినవైతే, తెలుగులో ఇలాంటి ఉదాహరణలు కొన్ని ఉన్నాయి.

తెదేపా – తెలుగుదేశం పార్టీ

భాజపా – భారతీయ జనతా పార్టీ

వైకాపా – వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ

**3.** కొందరు వ్యక్తులు వారి పేర్లతో కాకుండా వారి ఇంటి పేర్లతో ప్రఖ్యాతి పొందుతారు. మరికొంతమంది వారి పేరులోని మొదటి భాగం లేదా సమాజంలో వారికి గుర్తింపు వచ్చిన పేర్లతో ప్రఖ్యాతి పొందుతారు. ఈ తరహా పేర్లతో సంక్షిప్త పదాన్ని తయారు చేయడం కూడా పత్రికారచనలో వాడుకలో ఉంది. ఇందుకు ఉదాహరణలు..

ఘంటసాల – ఘంటసాల వేంకటేశ్వరరావు

ఇందిర – ఇందిరాగాంధి

రాజీవ్ – రాజీవ్‌గాంధి

సచిన్ – సచిన్ టెండూల్కర్

కాసు – కాసు బ్రహ్మానందరెడ్డి

బాబు – నారా చంద్రబాబు నాయుడు

## 6.2.6 ప్రాచీన పదాల ప్రయోగం

పత్రికా రచనలో కనబడే విశిష్టత / ప్రత్యేకతల్లో ప్రాచీన పద ప్రయోగం ఒకటి. పత్రికలో సాధారణ గ్రామీణ ప్రజలు ఉపయోగించే భాషే ఉపయోగించాలి, భాష అత్యంత సరళంగా ఉండాలి..మొదలైన పత్రికా భాషా నిర్మాణ సూత్రాలు కొన్ని ఉన్నాయి. అయితే వీటికి భిన్నంగా పత్రికల్లో ప్రాచీన పదాలు, సంస్కృత పదాలు, క్లిష్టమైన పదాలను వాడడం తరచుగా జరుగుతోంది. నిజానికి ప్రాచీన పదాలే అయినప్పటికీ పాఠకులు కూడా వీటిని కొత్త పదాలుగా లేదా క్లిష్ట పదాలుగా భావించరు. తమకు తెలిసిన / నిత్య వ్యవహారంలో ఉపయోగించే పదాలుగానే వీటిని స్వీకరిస్తారు.

మరొక కోణంలో పత్రికాభాష అత్యంత ఆధునికీకరణ దిశగా పయనిస్తోంది అనుకుంటున్న తరుణంలోనూ సంస్కృత పదాల వినియోగం తప్పని సరి అవుతోంది. తెలుగు భాష మీద సంస్కృత భాషా ప్రభావం అత్యధికంగా ఉండడమే ఇందుకు కారణమని చెప్పవచ్చు. ఈవిధంగా ఆధునిక పత్రికారచనలోనూ ప్రాచీన పదాల వినియోగం జరుగుతోంది. ఉదాహరణ: ఉద్ఘాటించారు, వెల్లడించారు, స్వీకరించారు, ప్రభృతులు, కైవసం మొదలగునవి.

## 6.2.7 అన్యభాషా పద ప్రయోగం

పత్రికల్లో కనిపించే నవ్యపద ప్రయోగాల్లో ఆంధ్రేతర భాషల నుంచి తీసుకున్న పదాలు ఎక్కువగా ఉంటున్నాయి. ప్రపంచీకరణ ఇందుకు ప్రధానకారణమైతే శతాబ్దాల కాలం మనదేశాన్ని ఏలిన ఇతర దేశీయులు మరొక కారణంగా ఉన్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో ఆంగ్లభాషా వినియోగం ప్రపంచవ్యాప్తంగా పెరిగిందనే విషయం తెలిసిందే. ఇదే సందర్భంలో తెలుగు మీద ఆంగ్ల భాషా ప్రభావం అత్యధికంగా ఉందన్న విషయమూ తెలిసిందే. ఈ కారణంగా తెలుగులో ఉపయోగించే పదాల్లో ఎక్కువభాగం ఇంగ్లిషు నుంచే వస్తున్నాయి. ఆయా ఆంగ్ల పదాలకు తెలుగు విభక్తి ప్రత్యయాలు చేర్చి తెలుగు పదాలుగా వాడడం జరగుతోంది. రైలు, బస్సు, రోడ్డు..ఇలా వందలాది ఉదాహరణలు ఇందుకు ఉన్నాయి.

తెలుగు భాషలో వాడుకలో ఉన్న ఇతర భాషా పదాల్లో రెండవ భాష ఉర్దూ. దేశాన్ని పాలించిన ముస్లింల కాలంలో ఇక్కడ వారి భాష ఉర్దూ ప్రాంతీయభాషల్లో కలిసిపోయింది. ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదు నిజాం పాలనలో ఉండడం వల్ల కూడా తెలుగు భాషలో అనేక పదాలు ఉర్దూ నుంచి వచ్చి చేరాయి. కాలక్రంలో ఆ పదాలు తెలుగు వ్యవహార పదాలుగానే వాడుకలోకి వచ్చాయి. ఇందుకు ఉదాహరణలు..

| **ఉర్దూ పదం** | **తెలుగులో వాడుతున్న అర్థం** |
|---|---|
| అటకాయించు | అడ్డగించు |
| చోరీ | దొంగతనం |
| నల్లా | కుళాయి / కొళాయి |
| ఈనామ్ | బహుమతి |
| గల్లీ | వీధి |
| దోభీఘాట్ | చాకిరేవు |

## 6.2.8 ప్రతీకార్థం

పత్రికా రచయితకు ఉన్న ఊహాశక్తి, కల్పనాచాతుర్యాన్ని బట్టి ఒక్కోసారి విచిత్రమైన పదకల్పనలు జరగుతుంటాయి. విషయాన్ని నిగూఢంగా చెప్పాలనుకున్న సందర్భంలో రచయిత విచిత్రమైన ఉపమానాలు తీసుకోవడం జరుగుతుంది. వాస్తవానికి ఆ ఉపమానానికి, ఉపమేయానికి దగ్గరి పోలిక ఉండదు. ఒక్కోసారి పూర్తిగా విభిన్నంగాను ఉండవచ్చు. కానీ, రచయిత తన ప్రతిభతో ఉపమాన గుణవిశేషాలతో ఉపమేయానికి అభేదం కల్పించడం పత్రికల్లో కనిపిస్తుంది. ఈ తరహాలో సృష్టించిన పదాలు ప్రతీకార్థాన్ని ఇస్తాయి. ఇక్కడ ప్రతీక అంటే ఆంగ్లంలోని సింబల్ అనే పదానికి సమానార్థకంగా తీసుకోవడం జరిగింది. అంటే పత్రికారచయిత తాను తీసుకున్న / చెప్పదలచుకున్న అంశానికి / విషయానికి ప్రతీకగా ఓ పదాన్ని ఎంచుకుంటాడు. దానిద్వారా విషయంలోని ప్రత్యేకతను చాటుతాడు. ఇందుకు ఉదాహరణలు..

| పదం | వాస్తవ అర్థం | ఉపయోగించిన సందర్భం / అర్థం |
|---|---|---|
| ఖాకీ | ఒక రంగు | పోలీసు |
| చుక్క | నీరు తదితర ద్రవరూప వస్తువుల బిందువు | మద్యం |
| పాసింజెర్ | ప్రయాణికుడు | సరసుడు, విటుడు |
| పిట్ట | పక్షి | వేశ్య, వయసులో ఉన్న స్త్రీ |
| మందు | ఔషధం | మద్యం |
| చిలుక | పక్షి | యువతి, వయసులో ఉన్న స్త్రీ |

## 6.3 వ్యాకరణం, వాక్యరచన

పత్రికాభాషకు వ్యాకరణం ఉంటుందా? లేదా? అన్న చర్చ చాలాకాలంగా జరుగతూనే ఉంది. పత్రికా పరిశోధకులూ ఈ విషయంలో కచ్చితమైన నిర్ణయాన్ని ఏకగ్రీవంగా ప్రకటించలేదు. రెండు వాదాలను బలపరిచినవారున్నారు. పత్రికారచన ప్రజోపయోగం ప్రధానంగా సాగే రచన. కాబట్టి, ప్రజలకు ఉపయోగించని / అర్థం కాని ఏ ప్రయోగమూ అభిలషణీయం కాదు.

పాఠకులకు అర్థం కావడం, వారిలో పఠనోత్సాహాన్ని పెంచడం పత్రికారచనకు ప్రధాన లక్షణం..లక్ష్యం కూడా. ఆ దృష్టితో ఆలోచించినపుడు వ్యాకరణ బంధాల నుంచి పత్రికాభాషకు విముక్తి కలిగించాలనేది కొందరి వాదన. అయితే పత్రికాభాషలో వ్యాకరణ నియమాల సడలింపులకు తావేలేదనేది మరొక వాదన. పత్రికలో ఏ స్థాయిలో వ్యాకరణాన్ని ఉపయోగించాలనేది ఆయా పత్రికాధిపతులు, వారి పాఠకుల మధ్య జరిగే అంగీకారం. ఇది పాఠకుల ఆదరణ ద్వారా ప్రకటితమవుతుంది అనేది మరికొందరు పత్రికా పరిశోధకుల వాదన.

వాదాల వివాదాల సంగతి ఎలా ఉన్నా ప్రయోగాన్ని అనుసరించే వ్యాకరణం ఉంటుందని వ్యాకరణ పండితులు తేల్చి చెప్పిన విషయాన్ని ఆధారంగా చేసుకుంటే జనామోదయోగ్యంగా ఉండే భాష, అందుకు తగిన వ్యాకరణమే పత్రిక మనుగడకు కీలకం. కాబట్టి వ్యాకరణబద్ధత కంటే అర్థబోధనకే అధిక ప్రాధాన్యత ఇవ్వాలనేది ఎక్కువమంది పాత్రికేయుల అభిప్రాయంగా కనిపిస్తోంది.

ఇక, పత్రికారచనలో వాక్యరచనను పరిశీలిస్తే సరళ వాక్యాల ఉపయోగమే పత్రిక మనుగడకు అత్యంత అవసరంగా కనిపిస్తుంది. ఎందుకంటే, సంశ్లిష్ట సంయుక్త వాక్యాలను అర్థం చేసుకోవడం కష్టం. ఇవి పాఠకుల ఏకాగ్రతను దెబ్బతీస్తాయి. అవగాహనకు అంతరాయం కలిగిస్తాయి. ఈకారణంగా క్లిష్ట వాక్యాల ప్రయోగాన్ని నేటి పాత్రికేయులు అంగీకరించడం లేదు. రచయితకు అభ్యివక్తి ఎంతో ముఖ్యం. అయితే పాత్రికేయునికి భావ ప్రసారం (కమ్యూనికేషన్) ముఖ్యం. తాను రాసిన వార్త పాఠకుడికి అర్థం అవుతోందా? లేదా? అనేదే పాత్రికేయుడికి ప్రధానం. అంతేకాని, తన పాండిత్య నిరూపణకు పత్రికను వేదికగా చేసుకోవడం తగదు. గ్రామాల్లోని ప్రజలకు సైతం తన వార్త, అందులోని ప్రతి పదం అర్థమవ్వాలనేదే పాత్రికేయుడి లక్ష్యం కావాలి.

## 6.4 వార్తా రచన శైలి

వార్త ఎలాంటిదైనా, దాన్ని రాసే విధానమే ఆ వార్తను పాఠకుల హృదయానికి చేరువ చేస్తుంది. వార్తలు సేకరించడంతోనే పాత్రికేయుడి పని పూర్తికాదు. సేకరించిన వార్తను పాఠకులకు మనోల్లాసం కలిగేట్లు, మనసుకు హత్తుకునేట్లు రాయాలి. అలాసాగిన వార్త మాత్రమే పాఠకుల ప్రశంసలు అందుకుంటుంది. ఈకారణంగానే వర్తమాన పాత్రికేయ వృత్తిలో ఏది వార్త అనేది కాకుండా రాసే తీరు వార్తగా ప్రసిద్ధిపొందింది.

కేవలం ఎముకలాంటి వాస్తవాలకు రక్తం, మాంసం, జీవం తోడు చేసి, దాన్ని వార్తగా తీర్చిదిద్ది, పాఠకులను సంఘటనలో తాదాత్మ్యం చెందించడానికి పత్రికారచయిత నిరంతరం ప్రయత్నిస్తూ ఉంటాడు. ఉండాలి కూడా.

తెలుగులో పత్రికలు వచ్చిన తొలినాళ్ళలో వార్తను పాఠకులకు దృష్టికి తీసుకువెళ్ళడమే ప్రధానంగా ఉండేది. క్రమంగా వార్తలు రాయడంలో అలంకారికత వచ్చి చేరింది. ఈనాడు దినపత్రిక రాకతో తెలుగు పాత్రికేయ వృత్తిలో అలంకారికత మరింతగా పెరిగింది. వార్తాపత్రికలో పాత్రికేయుడి స్వభావ వ్యక్తీకరణ ముఖ్యం కాదు. ఇందులో సామాజిక జాగృత చిత్తవృత్తి ప్రతిఫలిస్తుంది. అలంకారిక రచన, నుడికారాలు ప్రయోగించడం వల్ల వార్తాకథన వాతావరణాన్ని పాఠకుడు అర్థం చేసుకుంటాడు. కేవలం పాఠకులకు వార్తను చదవాలన్న ఆసక్తి కలిగించడం కోసమే పాత్రికేయులు అలంకారిక రచనకు మొగ్గు చూపుతున్నారు.

ఆధునిక పాత్రికేయ రచనలో వార్తను పాఠకుల ముందుకు చక్కని భావావేశంతో తీసుకువెళ్ళేందుకు పాత్రికేయులు ప్రయత్నిస్తున్నారు. పత్రికాధిపతులు, సంపాదకులు కూడా ఈ తీరుగానే వారి పాత్రికేయ సిబ్బందిని సమాయత్త పరుస్తున్నారు. ఉత్తేజితుల్ని చేస్తున్నారు. దీంతో వర్తమానంలో వార్తా కథన రచన అత్యంత ఆకర్షణీయంగా, కళాత్మకంగా రూపుదిద్దుకుంటోంది. పాఠకుల్లో పఠనాసక్తిని పెంపొందిస్తోంది. వార్త చదవాలన్న ఉత్కంఠ పెంచుతోంది. తర్వాత ఏం జరిగిందో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగిస్తోంది.

వార్తను పాత్రికేయుడు రాసే తీరు పాఠకులను వార్త చదివేందుకు ఉన్ముఖులను చేయాలి. అంటే వార్త ఎత్తుగడలోనే నూతనత్వం పాఠకులకు కనిపించాలి. ఇందుకోసం వార్తలను కవితాత్మకంగా రాయడం, తగిన పదగుంఫన శైలిని ఉపయోగించడం నేటి పత్రికల్లో కనిపిస్తోంది. మొత్తమ్మీద పత్రికా సాహిత్యానికి కావ్యగౌరవం సంపాదించితెచ్చేలా నేటి పాత్రికేయులు చక్కని శైలి అనుసరిస్తున్నారు. అంతేకాదు.. పాత్రికేయులు సమకాలీన సంఘటనలకు, సమస్యలకు స్పందిస్తున్నారు. వీటిపట్ల ప్రజలను జాగృతం చేస్తున్నారు. సాంఘిక దురాచారాల పట్ల ప్రజలకు కనువిప్పు కలిగిస్తున్నారు. ఆధునిక పత్రికారచన శైలిలో ఆలంకారికత పెరుగుతోంది. సామెతలు, నుడికారాలు, జాతీయాలు వాడడం అధికమవుతోంది. దీనివల్ల వార్తలు పాఠకులను ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. మరోకోణంలో వర్తమాన పాత్రికేయులు వార్తా కథనాలను విమర్శ స్పర్శతో, వ్యంగ్య వైభవంతో, ప్రతీక ప్రతిభతో కూరుస్తున్నారు.

ఇందుకోసం నూతన ఉపమలు, ప్రతీకలు ఉపయోగిస్తున్నారు. నూతన పదకల్పన చేస్తున్నారు. అభివ్యక్తి పునరుక్తి కాకుండా జాగ్రత్తపడుతున్నారు. అందుకోసం అభివ్యక్తుల్లోని తీరులను పరిపరి విధాలుగా విస్తరింపజేస్తున్నారు. 'పాడిందే పాటగా...' కాకుండా ప్రతిసారి కొత్తగొంతుక వినిపిస్తూ, కొత్తరాగాన్ని పలికిస్తున్నారు.

## 6.5 వార్తా రచన - పరిచయం

వార్తా రచనలో అత్యంత ప్రధానమైన అంశాల్లో పరిచయం ఒకటి. వార్త ప్రారంభంలో వార్తా కథన సారాంశాన్ని వీలైనన్ని తక్కువ పదాలతో, చదవగానే మొత్తం కథనంలోని సారాంశం అర్థమయ్యేలా రాసిన వార్తాభాగం పరిచయం అవుతుంది. సుమారు 30 నుంచి 40 పదాలతో పరిచయ రచన పూర్తవుతుంది. ఎవరు? ఎప్పుడు? ఎక్కడ? ఎందుకు? ఎలా? ఏమిటి? (5W's+1H) అనే ప్రధాన అంశాలు పరిచయంలో ఉంటాయి. వార్తా కథన ప్రారంభవాక్యంలో ఉండే ఈ అంశాలు వార్తలోని మొత్తం సమాచారాన్ని అతి సంక్షిప్తంగా పాఠకుడి ముందుంచుతాయి.

### 6.5.1 ప్రత్యేక సంఘటనలు - పరిచయం

సర్వసాధారణంగా పరిచయ రచన సూటిగా జరుగుతుంది. లేకుంటే పాఠకుడు ఒకింత అయోమయానికి గురయ్యేప్రమాదం ఉంది. చెప్పదలచుకున్న విషయంలో స్పష్టత లోపించే అవకాశమూ ఉంది. అయితే సూటిదనానికి కొన్ని మినహాయింపులు ఉన్నాయి. వార్త ప్రాధాన్యం, తీవ్రతను బట్టి సంబంధిత పరిచయ రచనను సూటిగా కాకుండా కొద్దిపాటి కవిత్వం, శ్లేష, అలంకారాలు, లోకోక్తులు, వివరణలు, అభిప్రాయాలు కలగలిపి రాయడం అవసరమవుతుంది. అలాచేస్తేనే సదరు వార్తకు నిండుదనం, తీవ్రత, స్థాయి ఉంటాయి. మరికొన్నిసార్లు కథనాత్మకంగా, విమర్శనాత్మకంగాను పరిచయాన్ని రాసిన సందర్భాలు పత్రికల్లో కనిపిస్తాయి. ఈ ప్రయోగాలన్నీ వార్తను అత్యంత ఆకర్షణీయంగా, వార్తలోని ప్రధానాంశం వెంటనే మనసుకు హత్తుకునేలా చేయడం కోసం ఉద్దేశించినవే. ఈవిధమైన పరిచయ రచన పాత్రికేయుడి ప్రతిభ మీద ఆధారపడి ఉంటుంది. అతనిలోని భావావేశం, సంఘటన పట్ల అతనికి కలిగిన స్పందన, వార్తను అత్యంత విశ్వసనీయతతో పాఠకులకు చేరవేయాలన్న తపన, వార్తా సందర్భం, వార్తాంశం పట్ల అతనికి ఉన్న అవగాహన తదితర అంశాలు పరిచయ రచన మీద ప్రభావం చూపిస్తాయి.

ఈ అంశాలన్నీ సమపాళ్లలో మేళవించి చేసిన పరిచయ రచన పాఠకులను ఇట్టే ఆకట్టుకుంటుంది. పరిచయాన్ని చదివినంతనే మొత్తం వార్తను చదవాలనే ఉత్సాహం, ఆసక్తి కలిగిస్తుంది. సమాజంలో జరిగే కొన్ని ప్రత్యేక సంఘటనల విషయంలో పాత్రికేయులు సర్వసాధారణంగా పరిచయాన్ని మామూలు రీతికి భిన్నంగా రాస్తారు. విషాదమైనా, వినోదమైనా, విప్లవమైనా, విజ్ఞానమైనా.. అ అంశానికి సంబంధించిన ప్రత్యేకత ఈ పరిచయంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. తద్వారా ఆ వార్తలకు ప్రాధాన్యత కలగడంతో పాటు పత్రికా ప్రమాణం, పాత్రికేయుడి రచనాసామర్థ్యం వెల్లడి అవుతాయి. ఇందుకు కొన్ని ఉదాహరణలు ఈ దిగువున చూడవచ్చు.

### 6.5.1.1 మరోప్రపంచానికి మహాకవి ప్రస్థానం

"గంధర్వలోకాలలో ఊహల తూగుటుయ్యాలలో అప్సరసల వెచ్చని కౌగిళ్ళలో సొక్కి సోలుతున్న తెలుగు కవిత్వాన్ని నేలకు దించి ఇప్పటికి 50 ఏళ్ళుగా అభ్యుదయపథంలో నడిపిస్తున్న యుగకర్త శ్రీశ్రీ ఇవ్వాళ సాహిత్య చరిత్ర గర్భంలో కలిసిపోయారు. నేను సైతం ప్రపంచానికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను. నేను సైతం విశ్వవీణకు తంత్రిపై మూర్ఛనలు పోతాను అంటూ సరిగ్గా 50 సంవత్సరాల క్రితం 1993 జూన్ 2వ వేదీన శ్రీశ్రీ తెలుగు కవితా భువన భవనపు బావుటాయై పైకి లేచాడు. ఆ తర్వాత ఏడాదికే మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది, పదండి తోసుకు పదండి ముందుకు పోదాం పోదాం పైపైకి అని విప్లవ శంఖం పూరించాడు." (ఆంధ్రప్రభ, 1983, జూన్ 16)

### 6.5.1.2 అంతా అయిపోయింది

"బరువెక్కిన గుండెల్లోని దు:ఖం కన్నుల్లో మున్నేరై పారిన వేళ... జనగణాల ఆక్రందనలు ఆకాశపుటంచుల్లో ప్రతిధ్వనించిన వేళ... ఆప్తులు, ఆత్మీయులు, ప్రేమించిన ప్రజల మనసులు వేదనాజ్వాలల్లో కుమిలి కుమిలిపోయినవేళ... అభిమానించి, లాలించి, ఆదరించే 'అమ్మ' ఇంకెక్కడని కోటానుకోట్ల భారత ప్రజా హృదయాలు కంపించిపోతున్న వేళ.. శ్రీరాజీవ్‌గాంధీ వణికేచేతులతో సజల నయనాలతో శ్రీమతి ఇందిరకు కడసారి వందనం చేసి చితాగ్ని అంటించారు. శాంతి, సుఖ, సౌందర్య విలసిత నవభారతదేశ నిర్మాణం కోసం అహరహమూ శ్రమించి, తపించి, కట్టకడపటి నెత్తుటిబొట్టు దాకా భారతమాత సేవకే అంకితమైన శ్రీమతి ఇందిరాగాంధీ శాశ్వతంగా ఏ పిలుపుకూ అందని దూరతీరాలకు తరలిపోయింది. అవును – అంతా అయిపోయింది." (ఆంధ్రభూమి, 1984, నవంబరు 4)

## 6.5.1.3 త్రీడీ... మోడీ

"గుజరాత్‌లో కమలం గుభాళించింది. హిమాచల్‌లో కాంగ్రెస్ గెలుపుబాట పట్టింది. అభివృద్ధి నినాదంతో ఎన్నికలకు వెళ్ళిన నరేంద్రమోడీకి గుజరాత్ ప్రజలు పట్టం కట్టారు. మూడింట రెండొంతుల మెజారిటీ ఆయనకు కట్టబెట్టారు. ఆయన 'ఢిల్లీ' ఆశలకు ఊపిరులూదారు. వెంటనే ఆయనా తన ఆశను దాచుకోలేకపోయారు. హిందీలో విజయోత్సవ ప్రసంగం చేయడం ద్వారా ప్రధాని పీఠానికి గట్టిపోటీదారుననే సంకేతమిచ్చారు. ఇక భాజపా చేతిలో ఉన్న హిమాచల్‌ప్రదేశ్ చేజారిపోయింది. అక్కడ వీరభద్రసింగ్‌పై వచ్చిన అవినీతి ఆరోపణలను తోసిరాజని కాంగ్రెస్ విజయం సాధించింది. గుజరాత్ ఓటమిదెబ్బ నుంచి కాస్త ఊరట చెందింది. గుజరాత్‌లో ముఖ్యమంత్రిగా ప్రస్తుతానికైతే మోడీనే ప్రమాణస్వీకారం చేసే అవకాశం ఉంది. ఆయన జాతీయరాజకీయాల్లోకి వెళ్తే అప్పుడు కొత్తనేతను తెరపైకి తీసుకువచ్చే అవకాశం ఉంది. హిమాచల్‌లో కాంగ్రెస్ ముఖ్యమంత్రి అభ్యర్థులుగా ఇద్దరు తెరమీద ఉన్నారు. వారిలో మాజీ ముఖ్యమంత్రి వీరభద్రసింగ్ ఒకరు కాగా ఆ రాష్ట్ర కాంగ్రెస్‌నేత విద్యాస్టోక్స్ మరొకరు." (ఈనాడు, 2012, డిసెంబరు 21)

## 6.5.1.4 స్వామీ నీ దరి చేరగ...

"అదివో..! బంగారు పద్మపీఠం. ఆ పీఠంపై ఉన్న శ్రీవారి కనకపు పాదాలు.. ఆ పైన ఘనపట్టు పీతాంబరం. ఆ పీతాంబరం కుచ్చిళ్ళపై జీరాడుతూ వేలాడుతున్న సహస్రనామాల మాలలు. నడుమున వడ్డాణం. బంగారు మొలతాడు. అదివో వజ్ర ఖచిత వరదహస్తం.. వక్షస్థలంపై ఆసీనురాలై అనుగ్రహిస్తున్న వ్యూహలక్ష్మి. సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మి. అదివో..! శ్రీదేవి, భూదేవి పతకాల హారాలు.కంఠమాలలు...

అదె..బంగారు యజ్ఞోపవీతం. చేతులకు నాగాభరణాలు. ఆపైన భుజకీర్తులు. భక్తులకు అభయమొసంగే శంఖుచక్రాలు. అదిగో నల్లనిమోము. అదే చెరగని తరగని మందహాసం. భక్తులను కటాక్షిస్తూ ఎడతెగని అరవిరిసిన చూపులు. శిరస్సుపై అమరిఉన్న నవరత్నాల మకుటరాజం.. అపై బంగారు మకరతోరణం..! అయన్ను చూస్తుంటే..ఏదో తెలియని లోకాల్లో విహరిస్తున్న ఆనందపుటంచుల్ని తాకుతున్నట్లుంది కదూ..!" (ఈనాడు, 2013, జనవరి 1)

ఈ ఉదాహరణలన్నీ ఆయా సందర్భాల్లో జరిగిన వార్తల్లోని సారాంశాన్ని ప్రత్యేకంగా ప్రస్తావిస్తూ కొంత ఆలంకారికత, మరికొంత విశ్లేషణ జరుపుతూ సాగినవే. ఏదో సంఘటన జరిగినట్లుగా కాకుండా పాత్రికేయుడు తన ప్రతిభతో విశ్లేషణలు జోడించడం వల్ల వార్త దృశ్యకావ్యంగా మారింది. ఆ ఆనందానుభూతి పాఠకుడికి మిగులుతుంది.

## 6.5.2 విషయాన్ని సూటిగా పరిచయం చేయడం

ఇంతకుముందు ప్రస్తావించిన ఉదాహరణల్లో ఉండే అలంకారికత, ఇతర విశేషాలు అన్ని సందర్భాల్లోను పాఠకులను ఆకట్టుకోలేవు. అనవసర ప్రయోగాల వల్ల అనర్థమూ జరిగే అవకాశం ఉంది. కాబట్టి తీవ్రత అంతగాలేని సందర్భాల్లో పాత్రికేయులు వార్తా పరిచయాన్ని నేరుగా అంటే సూటిగా రాయడానికే మొగ్గుచూపుతారు. ఇందులో ఏవిధమైన వర్ణనలు, విశ్లేషణలు, అభిప్రాయాలు ఉండవు. జరిగిన సంఘటన తాలూకు వార్తాంశ సారాంశాన్ని తేలికైన పదాలతో రాయడం జరగుతుంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు...

### 6.5.2.1 రాష్ట్రంలో 32 పథకాలకు నగదు బదలీ

"రాష్ట్రంలోని ఐదు జిల్లాలో జనవరి 1 నుంచి ఉపకారవేతనాలు, ఆసరా పథకాలకు సంబంధించిన మొత్తాలు మాత్రమే లబ్ధిదారుల బ్యాంకుఖాతాల్లో జమవుతాయి. ఈ పథకాలన్నీ కలిపి 32 వరకు ఉంటాయి. బియ్యం, కిరోసిన్ వంటి వాటి స్థానే లబ్ధిదారులకు నగదును బదలీ చేసే ఉద్దేశమేమీ లేదని ఆర్థికశాఖ ఉన్నతాధికారి ఒకరు స్పష్టం చేశారు." (ఈనాడు, 2012, జనవరి 21)

### 6.5.2.2 వైద్య పీజీకి ప్రత్యేక పరీక్ష

"వైద్య కళాశాలల్లో పీజీ కోర్సుల్లో ప్రవేశాలకు సంబంధించి రాష్ట్రంలో సొంతంగా ప్రవేశ పరీక్ష నిర్వహించడానికి ప్రభుత్వం సన్నాహాలు చేస్తోంది. జాతీయస్థాయిలో ప్రవేశపరీక్ష నుంచి మినహాయింపు ఇస్తూ ఇటీవల హైకోర్టు మధ్యంతర ఉత్తర్వులు జారీచేసిన నేపథ్యంలో వైద్యవిద్యాశాఖ ఈ నిర్ణయం తీసుకుంది." (ఈనాడు, 2012 నవంబరు 19)

### 6.5.2.3 గుటకాయస్వాహా..!

"సహకార ఎన్నికల్లో అధిష్ఠానం పంపిన సొమ్ముపై కాంగ్రెస్‌లో లొల్లి మొదలైంది. ఏదోవిధంగా పార్టీ అభ్యర్థులను గెలిపిస్తే కావలసిన అంగ, అర్థబాలను అందిస్తామని చెప్పిన పార్టీ పెద్దలు ప్రస్తుతం నోరు మెదపడం లేదని ద్వితీయశ్రేణి నేతలు మధనపడుతున్నారు. సొసైటీల ఎన్నికకకు ముందు అధిష్ఠానం భారీగా పంపిన సొమ్మును జిల్లా నేతలు దిగమింగారని వారు ఆరోపిస్తున్నారు. ఇప్పటికే ఈ విషయాలపై కొంతమంది రాష్ట్ర రాజధానికి ఫిర్యాదులు చేస్తున్నారు." (సాక్షి, 10.2.2012)

### 6.5.2.4 దేనికైనా సిద్ధం

"ఈనెల 22న ప్రారంభమయ్యే పార్లమెంటు శీతాకాల సమావేశాల్లో విపక్షాల దాడిని ఎదుర్కొంటూ కీలక బిల్లులను నెగ్గించుకునేందుకు కాంగ్రెస్‌పార్టీ సమాయత్తం అవుతోంది. ఈ క్రమంలో ఎఫ్‌డీఐపై అవిశ్వాస తీర్మానాన్ని ఎదుర్కోవడానికైనా సిద్ధమేనని శుక్రవారం విలేకరుల సమావేశంలో మాట్లాడిన ముగ్గురు కేంద్రమంత్రులు ప్రకటించారు. 2014 వరకు ప్రభుత్వం కొనసాగుతుందని, మధ్యంతర ఎన్నికల ప్రసక్తే లేదని తేల్చిచెప్పారు." (ఈనాడు, 17.9.2012)

## 6.5.3 విషయాన్ని పరోక్షంగా పరిచయం చేయడం

లోకోక్తులు, సూక్తులు, సామెతలు, జాతీయాలు, వ్యంగ్యం, శ్లేష తదితరాలు ఉపయోగిస్తూ వార్తాంశ సారాంశాన్ని పరోక్షంగా పరిచయం చేయడం కూడా కొన్ని సందర్భాల్లో జరుగుతుంది. ఇది పాఠకుడి హృదయాన్ని చూరగొనే ప్రయత్నంలో ఓ భాగం. శ్లేష ఉపయోగిస్తూ భంగ్యంతరంగా విషయాన్ని చెప్పడం వార్తకు చెప్పలేని ఓ అందాన్ని సంతరించిపెడుతుంది. వార్తలోని నూతన కోణానికి ప్రాధాన్యం వస్తుంది. ఈవిధమైన పరోక్ష కథనాల ద్వారా వార్తా పరిచయం రాయడంలో పలు రకాలు ఉన్నాయి. అవి..

### 6.5.3.1 లోకోక్తులతో విషయాన్ని పరిచయం చేయడం

అప్పటికే ప్రజలకు బాగా తెలిసి ఉండడం వల్ల సామెతలు, సూక్తులు, లోకోక్తులు ఉపయోగించి వార్తా పరిచయం రాయడం వల్ల వార్తలో వచ్చే తర్వాతి అంశం పాఠకులకు వెంటనే స్ఫురణకు వస్తుంది.

వార్తాంశాన్ని లోకోక్తులతో కలపడం వల్ల పాఠకుడికి చదివే అంశం ఏదో కొత్తది అనే భావన కాకుండా తన చుట్టుపక్కల జరిగిన సంఘటనే అనే భావనకు గురవుతాడు. దీనివల్ల విషయ స్పష్టత సాధ్యమై, వార్తంశం త్వరగా పాఠక హృదయాలను చేరుతుంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు..

**1.** ప్రతి పురుషుడి విజయం వెనుకా ఓ స్త్రీ ఉంటుందనేది ఆంగ్లోకి.. (ఈనాడు, 1984 నవంబరు 21)

**2.** దెబ్బకు రెండు పిట్టలు అనే సామెత ముమ్మిడివరం ఎమ్మెల్యే సక్కుబాయి విషయంలో మరోసారి రుజువయింది. (ఈనాడు, 1984 నవంబరు 2)

**3.** బ్రహ్మకైనా పుట్టు రిమ్మ తెగులు అని ఊరికే అనలేదని రుజువుచేశాడో మంత్రిగారు. (ఈనాడు, 1984 సెప్టెంబరు 23)

**4.** తోకలేని పిట్ట 49 ఏళ్ళు తిరిగింది. జర్మనీలోని బాడ్‌గాడ్స్‌బెర్గ్ నుంచి గద్రస్ రెస్ట్రోవ్ తన 17 ఏళ్ళ వయసులో లండన్‌లోని తన కలం స్నేహితుడు డెరిక్‌లూయిస్‌కు ఈ ఉత్తరాన్ని పంపారు.(ఈనాడు, 2102, నవంబరు 17)

ఈ ఉదాహరణలన్నిటిలో మొదటిగా వచ్చిన లోకోక్తి తర్వాత జరగబోయే (పాఠకుడు చదువబోయే) వార్తలో ఉండే వార్తాంశాన్ని ముందుగానే సూచిస్తుంది. ఇది పాఠకుడికి విషయసౌకర్యం కలిగిస్తుంది. అంతిమంగా పత్రికా రచయిత పడిన శ్రమ ఫలితానికి వస్తుంది. పత్రిక లక్ష్యం సిద్ధిస్తుంది.

## 6.5.3.2 విమర్శనాత్మకంగా విషయాన్ని పరిచయం చేయడం

విమర్శ ఉపయోగిస్తూ వార్తాంశ పరిచయం రాయడం పరిచయ రచనలో మరొక పద్ధతి. సమాజంలో జరిగిన ఓ సంఘటన (సాధారణంగా అవాంఛనీయ సంఘటనలకు ఈ తరహా పరిచయ రచన చేస్తారు), వ్యక్తులు లేదా సంస్థలు తమ పరిధి దాటి ప్రవర్తించినప్పుడు, రాజకీయ నాయకులు ఇచ్చిన హామీలు నిలబెట్టుకోనప్పుడు విమర్శనాత్మకంగా ఆ వార్తా విషయ పరిచయాన్ని రాస్తారు.

సమాజంలో జరిగిన ఏ సంఘటనకు పాత్రికేయుడు లేదా పత్రిక యాజమాన్యం స్పందించినప్పుడు కూడా ఈ తరహా పరిచయ రచన జరుగుతుంది. సదరు సంఘటన పట్ల సమాజాన్ని జాగృతం చేయాల్సివచ్చినప్పుడు ఈ తరహా పరిచయ రచన చేయడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణలు..

**1.** "అర్ధరాత్రి ఊరి బయట నుంచి స్వేచ్ఛగా స్త్రీ ఇంటికి చేరగలిగిన సంస్కార పూరిత సమాజాన్ని తీర్చిదిద్దగలరని చెప్పిన ముఖ్యమంత్రి శ్రీరామారావు రాజ్యంలో ఆ మాటలకు అర్థాలే వేరులే అని ప్రజలు అనుకుంటున్నారు." (ఆంధ్రభూమి, 1984, నవంబరు 22)

**2.** "పురుష ఆధిక్యతకు, అహంకారానికి నిదర్శనంగా ఈ వ్యవస్థ వికృత రూపాన్ని ప్రతిబింబించే వరకట్నపు హత్యలు ప్రతిరోజు దేశంలో ఏదో ఒక ప్రాంతంలో జరుగుతూనే ఉన్నాయి." (ఆంధ్రభూమి, 1984 నవంబరు 15)

**3.** "మా రాజుగారికి మీసాలే మిగిలాయి. సర్వం పోయింది. 20 ఎకరాలు సాగు చేసి పంట మొత్తం కోల్పోయిన ఓ రైతును ఉద్దేశించి తోటిరైతు చేసిన వ్యాఖ్య ఇది. ఇది రాజుగారొక్కరి వ్యధ కాదు. నీలం తుపాను తర్వాత గోదావరి జిల్లాల్లో అత్యధిక రైతుల పరిస్థితి. ఏ రైతును కదిపినా కళ్ల వెంబడి నీళ్లే. కౌలు రైతులైతే దిక్కుతోచక జీవచ్ఛవాల్లా కనిపిస్తున్నారు." (ఈనాడు, 2012 నవంబరు 19)

ఈ ఉదాహరణలన్నీ ఆయా సందర్భాల్లో జరిగిన సంఘటన తాలూకు వాస్తవాల్ని ప్రతిబింబిస్తున్నాయి. ఆయా వార్త పరిచయ రచనలో చేసిన విమర్శ సంఘటనకు సంబంధించిన తీవ్రతను ప్రకటించడం జరుగుతోంది. తద్వారా వార్తా రచన లక్ష్యం నేరవేరినట్లవుతుంది.

### 6.5.3.3 ఉత్కంఠాత్మకంగా విషయాన్ని పరిచయం చేయడం

ఆధునిక వార్తారచనలో, ప్రత్యేకించి వార్తా పరిచయ రచనలో చోటు చేసుకున్న నూతన విధానం – ఉత్కంఠాత్మకంగా విషయాన్ని పరిచయం చేయడం. శీర్షికలో చెప్పిన అంశాన్ని పరిచయంలో ప్రస్తావనకు తీసుకురాకుండా, సంఘటన నేపథ్యాన్ని పాఠకులకు ఉత్కంఠకలిగేలా తీర్చిదిద్దడం ఈ విధానంలో కనిపిస్తుంది.

ఈ తరహా పరిచయాన్ని చదువుతున్నప్పుడు తర్వాత ఏం జరుగుతుందనే ఆసక్తి పాఠకుడికి కలుగుతుంది. అసలు వార్తాంశం చదవకుండానే పాఠకుడిలో సంఘటన గురించిన ఓ అభిప్రాయం ఏర్పడుతుంది. పరిచయం తర్వాత జరిగిన విషయాన్ని చదివేందుకు పాఠకుడిలో ఆతృత పెరుగుతుంది. అందువల్ల పత్రికా పఠనం శరవేగంతో సాగుతుంది. ఇందుకు ఉదాహరణలు...

**1.** "చలికాలం, చీకటి రాత్రి. భారత సరిహద్దులో ఒక ప్రాంతం. అక్కడ నలుగురు సైనికులు కూర్చుని ఉన్నారు. వాళ్ళలో ఒకతను చటుక్కున లేచాడు. చిమ్మచీకటిలో ఏం కనబడడం లేదు. అతను చెవులు రిక్కించి ఏదో విన్నాడు. సహచరులను అప్రమత్తం చేశాడు. శబ్దం అంతకంతకూ దగ్గరవసాగింది. అకస్మాత్తుగా సైనికులు తుపాకులు ఎత్తి కాల్పులు మొదలుపెట్టారు. దూరంగా ఆర్తనాదం. సైనికులు అటు ఇటు పరుగెత్తారు. పాకిస్తాన్‌లోకి జారుకుంటున్న మరో స్మగ్లర్ సరిహద్దు భద్రతాదళానికి అక్కడ దొరికిపోయాడు." (ఈనాడు, 1984 డిసెంబరు 1)

**2.** "రాష్ట్రంలో చనిపోయినవారి ఆత్మలూ లేచి వస్తున్నాయి. వారి సమాధుల సాక్షిగా నెలనెలా ప్రభుత్వ పింఛన్లు తీసుకొంటున్నాయి. అందుకు ఆధారంగా పింఛను పట్టికల్లో క్రమం తప్పకుండా వేలిముద్రలూ వేస్తున్నాయి. అవును. ఇది నిజం. నమ్మలేని నిజం. వివిధ ప్రభుత్వ విభాగాల వద్ద ఉన్న రికార్డులూ ఇదే చెబుతున్నాయి." (ఈనాడు; 2013 ఫిబ్రవరి 12)

**3.** "ఏ తప్పూ చేయకపోయినా..సమాజం వేలెత్తి చూపుతోంది. అనుమానాస్పద చూపులతో హింసిస్తోంది. ఆంక్షలు, అడ్డుగోడల మధ్య ఒంటరిని చేసి వెంటాడుతోంది. పిల్లల్ని, కుటుంబాన్ని నిలబెట్టుకోవడానికి ఆసరా ఇవ్వకుండా జీవితంతో ఆడుకుంటోంది. సమానత్వం, సాధికారత అంటూ ఎన్నో చట్టాలు, పథకాల పేరుతో ప్రచారం చేసుకుంటున్న పాలకవర్గాలు కనీస మద్దతు ఇవ్వకుండా నిర్లక్ష్యం వహిస్తున్నాయి." (ఈనాడు, 2013 ఫిబ్రవరి 18)

### 6.5.3.4 కథనాత్మకంగా విషయాన్ని పరిచయం చేయడం

సుమారుగా ఓ కథ చదువుతున్న అభిప్రాయాన్ని కలిగించేలా వార్తా పరిచయం రాయడం వార్తా విషయ రచన శైలీభేదాల్లో ఒకటి. ఈ తరహా రచనలో వార్తను సంఘటనగా కాకుండా, వార్త చదువుతున్నప్పుడు అందులోని అక్షరాలకు దృశ్యరూపం పాఠకుల కళ్ళముందు మెదిలేలా పరిచయాన్ని రాయడం జరుగుతుంది. ఈ తరహా విషయ రచనలో ఓ ప్రత్యేకత ఉంది.

సాధారణంగా వార్తా పరిచయ రచన వేరుగా, వార్తాంశం వేరుగా ఉంటాయి. కథనాత్మకంగా విషయాన్ని పరిచయం చేసే సందర్భంలో పరిచయం వేరుగా, వార్తాంశం వేరుగా ఉండవు. రెండూ కలసి పాఠకుడికి ఓ కొత్త అనుభూతిని ఇస్తాయి. వార్తా రచనలో ఇది నూతన పోకడ.

ఈ తరహా వార్తా రచన చేయడానికి పాత్రికేయుడి సామర్థ్యంతో పాటు సందర్భ శుద్ధి కూడా ఎంతో అవసరం. విషయనిష్ఠ లేని అంశానికి ఈ తరహా పరిచయం చేయడం వ్యర్థప్రయత్నం అవుతుంది. కాబట్టి, కథనాత్మక పరిచయం చేసే విషయంలో పాత్రికేయుడు జాగరూకతతో ఉండాలి. కథనాత్మక విషయ పరిచయానికి కొన్ని ఉదాహరణలు..

**1.** "ఉదయం 11 గంటలకు ఎండ చురుగ్గా కాస్తోంది. కడప జిల్లా మద్దునూరుకు కిలో మీటరు దూరంలోని శివాలయ సత్రం దగ్గర అరవైఏళ్ళ ముదుసలి చేతిలో పూలదండ పట్టుకుని రోడ్డు పక్కన నిలబడి ముద్దనూరు వైపు వెళ్ళే వాహనాలవైపు ఆత్రంగా చూస్తోంది. విలేఖరులు ఆమెను పలకరించగా రామారావు కోసం ఉదయం నుంచి వేచి ఉన్నానని, ముద్దనూరులో అయితే జనం తోస్తారని ఊరి బయటకు వచ్చానని, అన్నకు దండ వేయాలని చెప్పింది." (ఈనాడు, 1984)

**2.** "ఎంబీఏ పూర్తిచేసిన సంతోష్‌కుమార్ చోరీచేస్తూ పట్టుబడ్డాడు. ఉన్నత చదువులు అభ్యసించి కూడా దొంగగా మారడంతో ఆశ్చర్యపోయిన పోలీసులు కారణాలు ఆరాతీసి నోరెళ్లబెట్టారు. తన గర్ల్‌ఫ్రెండ్‌కు మల్టీప్లెక్స్‌లో సినిమా చూపించడానికే ఈ దొంగతనానికి పాల్పడ్డానని చెప్పడంతో కంగుతిన్నాడు." (ఈనాడు, 2013, ఫిబ్రవరి 1)

**3.** "మహారాష్ట్ర సింధుదుర్గా జిల్లా వెంగుర్లా గ్రామానికి చెందిన నిఖిల్‌మోరే అమీర్‌పేటలోని ఒక సాఫ్ట్‌వేర్ సంస్థలో డిజైన్ ఇంజినీర్‌గా పనిచేస్తున్నారు. స్నేహితురాలితో కలసి నారాయణగూడలో అద్దె ఇంట్లో నివసిస్తున్నారు. మంగళవారం సాయంత్రం విధులు ముగించుకున్న తర్వాత నిఖిల్ ఆటోలో మాదాపూర్‌లో ఒక బ్యూటీ పార్లర్‌కు వెళ్లారు. అక్కడి నుంచి షేరింగ్ ఆటో ఎక్కి అమీర్‌పేట మైత్రీవనానికి బయలుదేరారు. ఆటోలో అప్పటికే మరో యువతి, ఇద్దరు యువకులు ఉన్నారు." (సాక్షి, 2013, ఫిబ్రవరి 21)

**4.** "నరసింహ వరంగల్‌లో ఓ చిరుద్యోగి. ఈ మధ్య నీరసంగా ఉంటోందని స్థానికంగా ఉన్న వైద్యుడిని కలిశాడు. పరీక్షలు చేసి..గుండె కవాటాల్లో సమస్య ఉందని..హైదరాబాదులో ఓ కార్పొరేట్ ఆస్పత్రికి వెళ్లమన్నారు ఆ వైద్యుడు. ఆ ఆసుపత్రి వివరాలు కూడా రాసిచ్చారు. అక్కడ ఇక్కడా అప్పులు చేసి వెళ్లడానికి సిద్ధమయ్యాడు నరిసింహ. విషయం తెలిసిన ఒక పరిచయస్తుడు.. 'ఇంకా రెండు మూడు ఆసుపత్రుల్లోనూ దీనికి సంబంధించిన నిపుణులు ఉన్నారు. వారి అభిప్రాయాలు కూడా తీసుకుంటే మంచిదని సలహా ఇచ్చాడు.'' (ఈనాడు, 2013 జనవరి 20)

**5**. "గుంటూరు జిల్లా పల్నాడు..ఈ పేరు వింటేనే పౌరుషం కలిగిన చారిత్రక వీరులు, వీరనారీమణులు స్ఫురణకు వస్తారు. చెతనే మానవ నిర్మిత మహాద్భుత కట్టడం నాగార్జునసాగర్ ఉందన్న విషయమూ గుర్తుకువస్తుంది. సిమెంటు పరిశ్రమకు కావలసిన ముడిఖనిజం ఉన్న ప్రాంతం ఇదేనన్న సంగతీ తెలిసిందే. అభివృద్ధికి అన్ని వనరులు ఉన్న పల్నాటిసీమలో చేసిన అప్పులు తీర్చడానికి తమ శరీరభగాలనే అమ్ముకుంటున్న అభాగ్యులూ ఉండడం విషాదకరం." (ఈనాడు, 2013 ఫిబ్రవరి 17)

## 6.6 వార్తా రచన – ముగింపు

వార్తా రచనలో ప్రారంభం / పరిచయం ఎంత ప్రధానమైందో ముగింపు కూడా అంతే ప్రధానమైంది. చక్కని ఎత్తుగడతో ప్రారంభమైన వార్తకు చక్కని ముగింపు ఇవ్వకపోతే వార్తా రచన పరిపూర్ణం కాదు. సాధారణమైన వార్తల విషయంలో అంటే..ఏదైనా సభ, సమావేశం, ఉత్సవం తదితర వార్తల విషయంలో ఎత్తుగడ (పరిచయం), ముగింపు రెండూ సాధారణ స్థాయిలోనే ఉంటాయి.

అంటే ఆ సందర్భంలో ఏం జరిగింది? ఎవరు పాల్గొన్నారు? అతిథులు ఎవరు? వారు మాట్లాడిన అంశాలేమిటి? అనే అంశాలే ఉంటాయి. హత్యలు, ప్రమాదాలు మొదలైన సంఘటనల విషయంలోను ఇదే పరిస్థితి ఉంటుంది. సంఘటన ఎక్కడ జరిగింది? కారణం ఏమిటి? ఎవరు మరణించారు లేదా గాయపడ్డారు? కేసు దర్యాప్తు చేస్తుంది ఎవరు? అనే విషయాలు ఉంటాయి. ఇవన్నీ సాధారణ వార్తల్లో ఉండే అంశాలు.

ఇవికాకుండా కొన్ని ప్రత్యేక సంఘటనలు జరిగినప్పుడు పాత్రికేయుడు తన విశ్లేషణను వార్తకు జోడిస్తాడు. ఇంతకుముందు విభాగాల్లో చర్చించినట్లు వివిధ రీతుల్లో వార్తను పరిచయం చేస్తాడు. ఈ క్రమంలో వార్త ముగింపును కూడా ప్రత్యేకంగా తీర్చిదిద్దుతాడు. కొన్ని ప్రశ్నలను పాఠకులనే అడిగి వార్తను ముగించడం జరుగుతుంది. ఒక్కోసారి నిరాశ, నిస్పృహలతో వార్తను ముగిస్తాడు. వేదాంత ధోరణిలో పలాయనవాదాన్ని ప్రకటిస్తూ వార్తను ముగిస్తాడు.

ఇలా వివిధ రకాలుగా వార్తను ముగించడం జరుగుతుంది. వార్తా పరిచయం తీరులోనే వార్త ముగింపు కూడా సంఘటన తీవ్రతను బట్టి మారుతుంది. సర్వసాధారణ విషయాల్లో ముగింపు కూడా సాధారణంగానే ఉంటుంది. అలాకాకుండా, ఏదైనా దుస్సంఘటన, తీవ్ర విషాదం, కరువు కాటకాలు వంటివి జరిగినప్పుడు వార్తా పరిచయంతో పాటు ముగింపు కూడా కొత్త కోణాన్ని సంతరించుకుంటుంది. ఇది పాఠకుడికి ఉత్కంఠ కలిగించడం కోసమే. వాడుకలో ఉన్న శైలులను బట్టి ముగింపు రచనను కింది విధాలుగా వర్గీకరించవచ్చు.

### 6.6.1 కొసమెరుపు ముగింపు

వార్తా కథనాన్ని వర్ణిస్తున్నప్పుడు పాత్రికేయుడు జరిగిన విషయాలను పూసగుచ్చినట్లు వర్ణిస్తాడు. ఒకదాని తర్వాత మరొక విషయాన్ని కథలాగా చెబుతాడు. వార్తా కథాంశం చివరికి వచ్చేసరికి తన కథనాన్ని ఓ మలుపుతిప్పి, పాఠకుడిని ఉత్కంఠకు గురిచేస్తాడు. కొసమెరుపు ప్రశ్న ఒకటి అడుగుతాడు. లేదా అయ్యో! అనే భావం కలిగించేలా ముగింపు చేస్తాడు. అంతవరకు సాగిన కథాగమనం ఉన్నట్టుండి ఆగిపోతుంది. ఈ రకమైన కొసమెరుపు ముగింపు పాత్రికేయుడి రచనాసామర్థ్యానికి దర్పణం పడుతుంది. ఇందుకు ఉదాహరణ..

**1.** "....నలుగురి ప్రాణాలు కాపాడడం కోసం తన చీర ఇచ్చిన ఆ స్త్రీ మాత్రం ఆ చలికి, వర్షానికి తట్టుకోలేక ప్రాణాలు విడిచింది పాపం." (ఈనాడు, 1984, డిసెంబరు 2). ప్రవాహంలో కొట్టుకుని పోతున్న మనుషుల ప్రాణాలు కాపాడడానికి ఓ స్త్రీ తన చీర ఇచ్చి, వారు ప్రవాహానికి బలికాకుండా కాపాడింది. అందులో నలుగురు బ్రతికారు. కానీ, ఆ స్త్రీమాత్రం మరణించింది. ఇలా స్త్రీ మరణించిందన్న విషయాన్ని వార్తా కథనంలో చివరిదాకా ఎక్కడా చెప్పకుండా, ఉన్నట్టుండి చివరి వాక్యంలో 'ఆ స్త్రీ ప్రాణం విడిచింది' అని పాత్రికేయుడు వార్తను ముగించాడు. ఈ రకమైన ముగింపు వల్ల పాఠకుడికి ఆ స్త్రీ త్యాగం పట్ల సానుభూతి ఏర్పడుతుంది.

## 6.6.2 ప్రశ్నలతో ముగింపు

ప్రశ్నలతో వార్తా కథనాన్ని ముగించడం మరొక పద్ధతి. జరిగిన సంఘటన తాలూకూ సమాచారం ఇస్తూనే, సందర్భ తీవ్రతను పాఠకుడికి తెలియజేయడం కోసం కొన్ని ప్రశ్నల్ని ముగింపులో వేయడం ఈవిధానంలో కనిపిస్తుంది. సమాధానాన్ని పాఠకుల విచక్షణకు పాత్రికేయుడు ఈ సందర్భంలో వదిలివేస్తాడు. తన విశ్లేషణను అందించడు. ఏదైనా అవమానం, అపచారం వంటివి జరిగిన సందర్భాల్లో ఆ వార్తలను అందించే క్రమంలో ఈ తరహా ముగింపు కనిపిస్తుంది. దీనివల్ల పాఠకుల్లో ఆలోచన, స్పందన కలుగుతాయి. ఒక్కోసారి ముగింపు ప్రశ్నలు చర్చలకూ దారితీస్తాయి. ఇందుకు ఉదాహరణలు...

**1.** "జాతీయ జెండాకు చెప్పులు కట్టి మొత్త ం జాతి గౌరవాన్నే అవమాన పరిచిన దేశద్రోహులు ఎవరో? నేరం మాత్రం జరిగిపోయింది. నిందితులు ఎవరు? వారికి శిక్ష ఏమిటి?" (ఈనాడు, 1984 డిసెంబరు 10)

**2.** "బస్‌షెల్టర్‌లో ఉండనిచ్చినందుకు ఆ పేద ప్రజలు ఎవరికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఆర్టీసీకా? టెలిఫోన్ శాఖకా? పన్ను కట్టేవారికా? ఈ వ్యవస్థకా? ఆలోచించండి." (ఆంధ్రప్రభ, 1984 నవంబరు 15)

**3.** "ఒక్కమార్కు చాలు అభ్యర్థుల తలరాతను తారుమారు చేయటానికి. అలాంటిది ఏకంగా పదుల సంఖ్యలో ప్రశ్నలకు జవాబులు మారిపోతుంటే..పోటీ పరీక్షలకు ఏళ్ల తరబడి శ్రమిస్తున్న వారి పరిస్థితి ఎలా ఉంటుంది? అసలు పరీక్షల నిర్వాహక సంస్థ సామర్థ్యంపైనే సందేహం రాదా? ఒకటి అరా తప్పులు జరగటం సహజమే. కానీ, తప్పులు చేయడమే అలవాటుగా మారితే! తప్పులు జరుగుతున్నాయని తెలిసీ.. సవరించటానికి చిత్తశుద్ధితో ప్రయత్నించకపోతే ఆ సంస్థ సామర్థ్యంపై విశ్వాసం ఎలా కలుగుతుంది?" (ఈనాడు, 2013 ఫిబ్రవరి 18)

**4.** "ఎక్కువ హోదా కలిగిన గెజిటెడ్ పోస్టుల భర్తీకి తక్కువ మార్కులతో, దానికంటే తక్కువ హోదా ఉన్న నాన్‌గెజిటెడ్ పోస్టులకు ఎక్కువ మార్కులతో పరీక్షలు నిర్వహించడం ఎంతవరకు సమంజసం? గెజిటెడ్, నాన్‌గెజిటెడ్ పోస్టుల్లో ఏ పోస్టులు గొప్పవని భావించాలి?" (ఈనాడు, 2013 ఫిబ్రవరి 17)

పైన చెప్పిన అన్ని సందర్భాల్లోను పాఠకుడి ఊహకే సమాధానాన్ని వదలివేయడం జరిగింది. వార్తకు కొత్తదనాన్ని ఇవ్వడమే కాకుండా సజీవత్వాన్ని కూడా ఈ తరహా ముగింపు ద్వారా సాధించడానికి వీలవుతుంది.

### 6.6.3 వేదాంత ప్రబోధంతో ముగింపు

విద్యుక్త ధర్మానికి అంకితమైన పాత్రికేయుడు ఒక్కోసారి నిరాశకు గురవుతాడు. తాను కలమెత్తి పోరాడిన సమస్యలు పరిష్కారానికి నోచుకోకపోవడం పట్ల విరక్తి చెందుతాడు. ఇక ఈ పోరాటాల వల్ల లాభం లేదనుకుని, వేదాంతాన్ని ఆశ్రయిస్తాడు. సమస్యల పట్ల ముందుగానే జాగరూకత అవసరమని పాఠకులను హెచ్చరిస్తాడు. వేదాంతాన్ని ఒంటబట్టించుకుని, తన వార్తారచన ముగింపులో ఆ భావాల్ని ప్రకటిస్తాడు. ఇందుకు ఉదాహరణలు..

**1.** "…..ఈ సంఘటన గురించి తెలియరాగా కోరుట్ల ప్రజలు ఆనందపరవశులైనారు. న్యాయ విచారణ జరిపించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. కోరుట్ల పట్టణంలో పూర్తిబంద్ పాటించారు. కానీ ఏమి లాభం? పోయిన వరలక్ష్మి తిరిగిరాలేదు."

**2.** "తూర్పు మండల విద్యుత్తు పంపిణీ సంస్థ (ఈపీడీసీఎల్) పరిధిలో విజయనగరం జిల్లాలో నాలుగు విడతల్లో విద్యుత్తు సరఫరా చేయడంతో రైతులకు ఏమాత్రం ఉపయోగం ఉండట్లేదు. ఇప్పటికైనా ప్రభుత్వం ఒకటి లేదా రెండు విడతల్లోనే 7 గంటలు సరఫరా చేయాలని కోరుతున్నారు. దీనివలన కొంతమేరైనా పంటలు ఎండిపోకుండా కాపాడుకోవచ్చునని ఆశిస్తున్నారు. డిస్కంల వారీగా వ్యవసాయ విద్యుత్తు సరఫరా తీరిలా ఉంది." (ఈనాడు, 2013 ఫిబ్రవరి 11)

## 6.7 ఆలంకారిక రచన

వార్తా రచన ఒక్కోసారి వర్ణనాత్మక శైలిలో ఉంటుంది. ఆ సందర్భంలో పత్రికా రచయిత తన భాషా సామర్థ్యాన్ని సందర్భానికి తగినట్లు ప్రదర్శిస్తాడు. సాధారణ వార్తల్లో ఉపయోగించే భాష కన్నా ఎక్కువస్థాయి భాష ఉపయోగిస్తాడు. సందర్భాన్ని తన కల్పనాచాతుర్యంతో వర్ణించడానికి ప్రయత్నిస్తాడు. ఇది కొద్దిగా ప్రబంధ రచన తీరులో సాగుతుంది. కవితాత్మకత ఈ తరహా వార్తా రచనలో కనిపిస్తుంది.

ఇదంతా ఆయా సంఘటనల తాలూకు భావాలను పాఠకులకు మరింత చేరువ చేయడానికి ఉపయోగించేవే. ప్రతిభావంతుడైన పత్రికారచయిత తాను రాసే వార్తల్ని భిన్న రీతుల్లో పాఠకుల ముందు ఉంచడానికి ప్రయత్నిస్తాడు. ఈ క్రమంలో రసపోషణ చేస్తూ తన వార్తారచన కొనసాగిస్తాడు. ఈ తరహా వార్తారచన ఆలంకారిక రచన అవుతుంది. ఇందుకు ఉదాహరణలు ఈ దిగువున చూడవచ్చు.

**1.** "...సాయంకాలమైతే కొండచిలువలా చుట్టుకుంటున్న చీకటిలో, ఎముకలు కొరికేస్తున్న చలిలో కొరడా దెబ్బల్లా తగులుతున్న చలి గాలుల్లో, ఆకలితో అలమటిస్తున్నారు. తుఫానులో చిక్కుకుని చనిపోయిన తమవారిని తలచుకుని గుండెలు పగిలేలా రోదిస్తున్నారు. ఈ శోకమంతా చీకటిని మరింత చిక్కబరుస్తోంది. ఈ ప్రాంతం గ్రామాల్లో శ్మశాన నిశ్శబ్దం రాజ్యమేలుతోంది." (ఈనాడు, 1984, నవంబరు 24)

**2.** "...సృష్టికి ప్రతీకగా గంభీరముద్రతో నిలిచి ఉండే పర్వతాలు, వాటి సానువులలో నీడనిచ్చే చెట్లు... సమీపంలో గలగల పారే సెలయేరు...ప్రశాంతమైన ఆహ్లాదకరమైన ఆ స్వేచ్ఛా వాతావరణంలో జీవించాలని" (ఈనాడు; 1984, నవంబరు 11)

## 6.8 కరుణరసాత్మక రచన

జరిగిన సంఘటనలోని బాధాకరమైన విషయాన్ని చెప్పడానికి పత్రికారచయిత కరుణరసాత్మకమైన రచనా మార్గాన్ని ఎంచుకుంటాడు. సంఘటన తాలూకు ప్రభావం పాఠకుల మీద కనబడాలంటే ఈ తరహా రచన అనివార్యమవుతుంది. అలాగే, సంఘటన సజీవ దృశ్యకావ్యంగా మారడానికీ ఈ తరహా రచన అవసరమవుతుంది. సర్వసాధారణంగా హత్యలు, ప్రమాదాలు తదితర మరణ వార్తల విషయంలో కరుణరసాత్మక రచనాధోరణి పత్రికా రచయితల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఇందుకు ఉదాహరణలు..

**1.** "ముక్కుపచ్చలారని పసిపాప. పేరు హోలీగ్రఫీ. ఇంకా నెలన్నా నిండలేదు. తల్లిదండ్రుల అచ్చటా ముచ్చటా తీరలేదు. పుట్టిన ఇరవైఎనిమిది రోజులకే నూరేళ్ళు నిండిపోయాయి. పట్టుమని పదిరోజులన్నా కేరింతలు కొట్టిందో లేదో, ఆమెను బతికించాలని వైద్యులు చేసిన యత్నాలన్నీ విఫలమయ్యాయి. అమ్మానాన్నలకు కడుపుకోత మిగిలింది. లండన్‌లోని నేషనల్ హార్ట్ హాస్పిటల్‌లో శుక్రవారం ఆ పాప మరణించింది." (ఆంధ్రభూమి, 1984, ఆగష్టు 20)

**2.** “మలి సంధ్య. అప్పుడే చీకటి తెరలు కమ్ముకుంటున్నాయి. అలసి సొలసిన నగరజీవి ఇళ్లకు చేరుకునే హడావిడిలో ఉన్నాడు. షాపింగ్ పనుల్లో ఇంకొందరున్నారు. అంతటా రద్దీ.. అందరూ బిజీబిజీ. ఇంతలో చెవులు చిల్లులు పడేలా భీకర శబ్దం. మానవ మృగాలు సృష్టించిన దారుణ మారణ హోమం. ఒకటి తర్వాత ఒకటిగా రెండు బాంబు పేలుళ్ళు. రెప్పపాటులో బీభత్స దృశ్యం. ఛిద్రమైన దేహాలు.. చెల్లాచెదురుగా ఎగిరిపడిన క్షతగాత్రులు.. మిన్నంటిన హాహాకారాలు..దగ్ధమైన వాహనాలు.. తగులబడిన దుకాణాలు! చారిత్రాత్మక హైదరాబాదు నగరం మరోసారి నెత్తురోడింది. ఐదేళ్లుగా తీవ్రవాద ఘటనలకు దూరంగా గుండెమీద చెయ్యేసుకుని నిబ్బరంగా ఉంటున్న నగరజీవి ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచాడు. అత్యంత రద్దీగా ఉండే రాజధాని దిల్‌సుఖ్‌నగర్‌లో గురువారం సాయంత్రం 6.45కు, 6.49 గంటలకు రెండు వరుస పేలుళ్లు సంభవించాయి...” (ఈనాడు, 2013, ఫిబ్రవరి 22)

**3.** “ఇది ఆధునిక మహాభారతంలో మరో పర్వం. ఆరుగురే నూరుగురైన మానభంగపర్వం. ప్రాణాన్ని తోడేసిన దుశ్శాసనుల పరిష్వంగం. ఇనుపచువ్వలై గుచ్చిన దుర్యోధనుల దుర్వినీతం. జలగలే జలదరించుకునేలా రక్తాన్ని పీల్చేసిన రాక్షసత్వం. నాగులే నమ్మలేని విధంగా పేగుల్ని పీల్చేసిన పైశాచికత్వం... ఇంతటి భయానక బీభత్స అకృత్యానికి తట్టుకోలేక..13రోజుల చావుబతుకుల పోరులో ఆమె ఓడిపోయింది. ఢిల్లీలో ఈ నెల 16న ఆరుగురు నరరూప రాక్షసుల చేతుల్లో దారుణ మారణ అత్యాచారానికి గురైన యువతి కన్నుమూశారు. సింగపూర్‌లోని ఆధునిక వైద్యసదుపాయాలు కూడా ఆమెను కాపాడలేకపోయాయి....” (ఈనాడు, 2012, డిసెంబరు 30)

**4.** “ఉద్యాన నగరిలో మానవత్వం మంటగలిసింది. అభం, శుభం తెలియని నాలుగేళ్ల మమతను కిడ్నాప్ చేసిన కసాయిలు... లైంగికంగా వేధించి హత్య చేశారు. హత్యకు ముందే బాలిక కనుగుడ్లను పాశవికంగా పీకేశారు. ఈ ఘోరం నగరంలో చోటు చేసుకుంది.” (ఈనాడు, 2013, ఫిబ్రవరి13)

**5.** “నెల్లూరులో ముగ్గురు యువకులు పట్టపగలే దారుణ హత్యలకు తెగించారు. బకాయి వసూలు పేరుతో ఇంటికొచ్చి దోపిడీకి యత్నించారు. అడ్డుకోబోయిన ఇంటి యజమాని భార్యను, ఆమె కుమార్తెను కర్కశంగా చంపేశారు. ప్రాణాలు కోల్పోయిన ఆ యువతి వైద్య విద్యార్థిని. ఆమె చదువుల్లో మేటి. తల్లీ కూతుళ్లను హత్యచేసిన తర్వాత ఆదే ఇంటిలో నక్కిన దుండగులు కుటుంబ యజమానిపైనా, మరో వ్యక్తిపైనా దాడికి దిగి దొరికిపోయారు. (ఈనాడు, 2013, ఫిబ్రవరి 13)

## 6.9 మాండలిక రచన

పత్రికా రచన ఎల్లప్పుడూ ప్రామాణిక భాషలోనే సాగుతుంది. జాతీయ, అంతర్జాతీయ వార్తలన్నీ ప్రామాణిక భాషలోనే వస్తాయి. అయితే, ఒక్కోసారి సందర్భం తప్పనిసరి అయినప్పుడు మాండలిక పదాన్ని లేదా మాండలిక శైలిని వార్తా రచనలో పాత్రికేయుడు ఉపయోగిస్తాడు. వార్తలోని వ్యక్తుల భావాలు పూర్తిగా వ్యక్తం చేయడానికి, ఆ భావాలు పాఠకుడికి అంతే తీవ్రతలో అర్థం కావడానికి మాండలికాల ఉపయోగం లేదా మాండలిక రచన ఎంతో అవసరమవుతుంది. ఇది ఒకరకంగా పాత్రోచిత భాష ఉపయోగించడం లాంటిది. అలాగని వార్త పూర్తిగా మాండలికంలో ఉండదు. ఆయా పాత్రల సంభాషణలు మాత్రం మాండలికంలో కొనసాగుతాయి. ఈ తరహా రచన వల్ల వార్తకు నూతన సొగసులు అద్దినట్లవుతుంది. పాఠకుడూ చక్కని అనుభూతికి లోనవుతాడు. ఇందుకు ఉదాహరణలు..

1. ఆయమ్మ సేసిందంతా మంచే. వాళ్ళ సేతులు కాల. ఎట్లా సంపిండు. ఇందిరమ్మ సావలేదు...అంటూ గట్టిగా కేకలు పెడుతోంది. ఏడుస్తోంది. (ఆంధ్రపత్రిక, 1984, నవంబరు 3)

2. చిన్నప్పటి నుంచి చిన్న చెంపదెబ్బ కూడా ఎరుగని కొడుకు కదల్లేని స్థితిలో ఉండడం చూసి ఆ తల్లి తట్టుకోలేకపోతోంది. 'చిన్నా!.. నీకు ఇదేం గోస బిడ్డా..? అని కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది..'' (ఆంధ్రజ్యోతి, 2013, మార్చి12)

## 6.10 చిత్ర కథనాలు

వార్తా రచనలో చోటుచేసుకున్న నూతన విధానాల్లో చిత్రకథనం ఒకటి. సాధారణంగా వార్తా రచన చేసేటప్పుడే కథాంశానికి తగిన చిత్రాన్ని (ఫొటో) పాత్రికేయుడు ఎంచుకుంటాడు. తాను వార్తలో రాసే అంశం, ఆ వార్తకు పెట్టిన ఫొటోకు సమన్వయం కుదిరేలా అంటే రెండూ ఒకే భావాన్ని ప్రకటించేలా జాగ్రత్తలు తీసుకుంటాడు. ఇది మొదటి దశ అయితే డెస్క్‌లో పనిచేసే ఉపసంపాదకులు కూడా వార్తకు తగిన చిత్రాన్ని (ఫొటో) ఎంపికచేయడంలో ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటారు.

చిత్ర నాణ్యత, అందులో పాఠకుడికి కనిపించే కోణం, వార్తాంశంతో సమన్వయం, చిత్ర పరిమాణం ఇవన్నీ వారు పరిగణించి, ఆ తర్వాత వార్తకు ఆ చిత్రాన్ని జతచేస్తారు. ఇదంతా సర్వసాధారణ ప్రక్రియ.

ప్రతివార్తకు తప్పకుండా చిత్రాన్ని జత చేయాలనే నియమమేదీ లేదు. అలాగే ఒక వార్తకు ఎన్ని చిత్రాలు పెట్టాలనే నియమమూ లేదు. ఇవన్నీ ఉపసంపాదకుడి విచక్షణ మీద ఆధారపడి ఉంటాయి. ఒక్కోసారి చిత్రం లేకుండా కేవలం వార్తను ఇవ్వడం జరుగుతుంది. అయితే, ఒక్కోసారి వార్త కన్నా చిత్రం గొప్పగా ఉండవచ్చు. అంటే పాత్రికేయుడి కలం బలం కన్నా ఛాయాగ్రాహకుడి చిత్రబలం ఎక్కువగా ఉండచ్చు. వందమాటల్లో చెప్పలేని భావాన్ని, అనుభూతిని ఒక చిత్రం కలిగిస్తుంది. ఇటువంటి సందర్భాల్లో వార్తాంశం రాయకుండానే కేవలం చిత్రాన్ని ఉపయోగించి వార్తాంశాన్ని ప్రదర్శించడం జరుగుతుంది.

కాలక్రమంలో..ఛాయాగ్రాహక నైపుణ్యం ఛాయాగ్రాహకుల్లో పెరిగింది. అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం ఉపయోగించి తయారవుతున్న ఛాయాగ్రాహక యంత్రాలు ఎంతో నాణ్యంగా చిత్రాలు తీయడానికి ఉపయోగిస్తున్నాయి. ఎంచుకున్న దృశ్యంలోని చిన్న రేణువు కూడా చిత్రంలో ప్రతిబింబించేంత స్పష్టంగా చిత్రాల్ని తీయడానికి ఇవి ఉపయోగిస్తున్నాయి. వీటన్నిటి కారణంగా ఇటీవలి కాలంలో ఆయా సందర్భాలను బట్టి రెండు మూడు పేరాల వార్త ఇవ్వడం కన్నా ఒక చిత్రాన్ని పెద్ద పరిమాణంలో ఇచ్చి, దానికి సంబంధించిన వివరణను ఒకటి రెండు వాక్యాల్లో ఇవ్వడం వ్యాప్తిలోకి వచ్చింది. చిత్రకథనాలుగా వీటికి ఆయా పత్రికలు శీర్షికలు పెడుతున్నాయి. తెలుగు పత్రికల్లో ఈనాడు, సాక్షి; ఆంగ్ల పత్రికల్లో ది హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికల్లో ఈ తరహా చిత్రకథనాలు ఎక్కువగా కనిపిస్తాయి.

చిత్రకథనాల వల్ల పాఠకుడిలో ప్రధానంగా సౌందర్యానుభూతి కలుగుతుంది. మనోహరమైన ప్రకృతి దృశ్యాలు ఎక్కువగా వీటిలో ఉంటాయి. కరుణ రసావిష్కరణ చేసే చిత్రాలకూ ఇటీవల పత్రికలు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నాయి. అలాగే, ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసుకురావడానికి సైతం ఈ తరహా కథనాలను పత్రికా రచయితలు ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. ఇందుకు ఉదాహరణలు పుట 235–240 పుటల్లో చూడవచ్చు.

## 6.10.1 మసకబారిన నిఘా కన్ను (ఈనాడు దినపత్రిక, 26.02.2013 సంచిక)




రైల్వేస్టేషన్లో తూర్పుద్వారం దగ్గర... మెటల్ డిటెక్టర్లున్నా ప్రయోజనం శూన్యం




బస్టాండ్ ప్రధాన ద్వారం వద్ద ఉన్న కెమెరా తీగలు తెగి... వేలాడుతూ...

# మసకబారిన నిఘా 'కన్ను'!

నగరంలో రైల్వేస్టేషను, పండిట్‌నెహ్రూ బస్టాండ్, ప్రధాన కూడళ్లు, బందరురోడ్డు, బెంజిసర్కిల్... ఇలా పలుచోట్ల ఏర్పాటు చేసిన సీసీ కెమెరాల్లో చాలావరకు పనిచేయడం లేదు. రైల్వేస్టేషన్లో ప్రధాన ద్వారాల వద్ద కూడా భద్రత కరువైంది. బస్టాండ్‌లో కెమెరాలు విరిగి వేలాడుతున్నాయి. బెంజిసర్కిల్ దగ్గర గత కొన్ని నెలల నుంచి కెమెరాలు పనిచేయకపోయినా పట్టించుకునే నాథుడే లేరు.

-ఫొటోలు: జి.నరిదయ్య



నిత్యం కిటకిటలాడే బీసెంట్‌రోడ్డులో నిఘా ఏదీ?



పండిట్‌నెహ్రూ బస్టాండ్‌లో పనిచేయని సీసీ కెమెరా



బస్టాండ్‌లో ఒకేచోట రెండు కెమెరాలు. ఏదీ పనిచేయదు!



స్టేషన్లో కాలిబాట వంతెనపై ఎవరో వదిలేసిన మూటలు

## 6.10.2 ప్రమాదం నడుమ...(ఈనాడు దినపత్రిక, 19.03.2013 సంచిక)


రోడ్డుపైనే విద్యార్థుల ఆటలు


రోడ్డు మధ్యగా సైకిల్ దాటిస్తున్న విద్యార్థి


ప్రమాదం వెంటనే పరుగులు


అటు వాహనాలు... పక్కనే విద్యార్థులు

# ప్రమాదం నడుమ...

సత్యనారాయణపురం బీఆర్టీఎస్ రోడ్డు నిత్యం ప్రమాదాలకు చిరునామాగా మారింది. కొన్నాళ్లుగా ఈ రోడ్డులో ఆర్టీసీ ప్రత్యేక బస్సులు నడుపుతోంది. ఈ మార్గంలో ఇతర వాహనాలు కాని, పాదచారులు కాని వెళ్లరాదంటూ ట్రాఫిక్ పోలీసులు బోర్డులు పెట్టి పట్టించుకోవడం మానేశారు. ఇదే రోడ్డులో ప్రభుత్వ, ప్రయివేటు పాఠశాలలు, కళాశాలలు ఉన్నాయి. సాయంత్రం ఇళ్లకు వెళ్లే విద్యార్థులు బీఆర్టీఎస్ మార్గం మధ్యగా పరుగులు తీస్తున్నారు. దూసుకొచ్చే బస్సుల ముందు వెళుతూ ప్రమాదాల బారిన పడుతున్నారు.

-ఫొటో: జి.మురళిదయ్య

## 6.10.3 రోడ్లపైనే పశువుల సంచారం (సాక్షి దినపత్రిక, 25.02.2013 సంచిక)

### రోడ్లపైనే పశువుల సంచారం



నిత్యం రద్దీగా ఉండే కేదారేశ్వరపేట రైతు బజారు రోడ్డులో పశువులు రాకపోకలకు ఆటంకం కలిగిస్తున్నాయి. సాయంత్రమయ్యే సరికి పశువులు రోడ్లపైకి చేరుకుంటున్నాయని వాహనాలు వచ్చినప్పుడు పక్కకు కూడా జరగడంలేదని స్థానికులు వాపోతున్నారు. మీసాల రాజారావు వంతెన వద్ద కూడా పశువులు నిలిచిపోతున్నాయి. దీంతో వంతెనపై భారీ వాహనాలు కొంత సేపు నిలిచిపోతున్నాయి. దీంతో తరచూ ట్రాఫిక్‌కు అంతరాయం కలుగుతోందని, దీనిపై పశువుల యజమానులు జాగ్రత్తలు తీసుకోవాలని స్థానికులు కోరుతున్నారు.

- న్యూస్‌లైన్, కేదారేశ్వరపేట

### 6.10.4 'అడవి' గాచిన ఆరోగ్యం!(ఈనాడు దినపత్రిక, 16.03.2013 సంచిక)

జనరేటర్ గది చుట్టూ పిచ్చిమొక్కలు

పాములు, విషజంతువులు వచ్చే దారిదే

## 'అడవి'గాచిన ఆరోగ్యం!

ఎంతో మంది రోగులకు సేవలందిస్తున్న కొత్తాసుపత్రి వెనుక భాగం (జనరేటర్ రూం) పిచ్చిమొక్కలతో నిండి విషసర్పాలకు నిలయంగా మారింది. ఆసుపత్రి వెనుక ఉన్న జనరేటర్ గది చుట్టూ పిచ్చిమొక్కలు అయిదడుగులకుపైగా ఎత్తున పెరిగి చిట్టడవిని తలపిస్తున్నాయి. విద్యుత్తు కోత సమయంలో జనరేటర్ ఆన్ చేయడానికి వెళ్లాలంటే సిబ్బంది భయపడే పరిస్థితి. మూత్రశాలకి వెళ్లే మార్గంలో కూడా పాములు సంచరిస్తున్నాయి. ఇక్కడ ఇప్పటివరకు చాలా పాములను చంపినట్లు సిబ్బంది పేర్కొంటున్నారు. లక్షలు ఖర్చుచేసి జనరేటర్లు అమర్చినా పారిశుద్ధ్యం లేమితో ఎలుకలు చేరి రేడియేటర్లు, క్యాబిన్ తలుపులను కొరికేస్తున్నాయి. ఇందుకు బాధ్యులుగా అధికారులు సిబ్బందిపై చర్యలు తీసుకుంటున్నారే తప్ప, అక్కడి పరిస్థితులను చక్కదిద్దేందుకు ప్రయత్నించడంలేదు. జనరేటర్ సిబ్బంది రాత్రిళ్లు విధుల్లో ఉన్నప్పుడు కేబుల్ వైర్లకు ఏర్పాటు చేసిన రంధ్రాలలోంచి పాములు లోపలికి చేరి వైర్లతో కలిసిపోతూ భయపెడుతున్నాయి.

– ఫొటోలు: వై.వి.సత్యనారాయణ

రేడియేటర్‌ను ఎలుకలు కొరికేసిన దృశ్యం

లక్షల విలువైన కొత్త జనరేటర్
క్యాబిన్ తలుపును ఎలుకలు కొరికేసిన దృశ్యం

## 6.10.5 కాలువల కడగండ్లు (ఈనాడు దినపత్రిక, 15.03.2013 సంచిక)

# కాలువల కడ'గండ్లు'

- దుస్థితిలో పోలవరం కాలువ
- పెరిగిన మొక్కలతో చప్టాలు ధ్వంసం..


నీటి ప్రవాహానికి కొట్టుకుపోయిన చప్టా


ధ్వంసమైన సిమెంటు దిమ్మలు

విజయవాడ గ్రామీణ మండలంలోని నున్న ప్రాంతంలోని పాతపాడు వద్ద పోలవరం కాలువ గట్లు ధ్వంసమై దీనస్థితిలో ఉన్నాయి. వర్షాలు కురిసిన సందర్భాల్లో పొలాల్లో నిలిచిన వర్షపునీరు కాలువ గట్లలోకి ప్రవేశించే సమయంలో చప్టాలు ధ్వంసమవుతున్నాయి. కాలువ పొడవునా పలుచోట్ల ఇవే దృశ్యాలు కనిస్తున్నాయి. చప్టాలపై పిచ్చి మొక్కలు వృక్షాలుగా ఎదగడం కూడా అవి ధ్వంసమవడానికి కారణమవుతున్నాయి. వేల ఎకరాల పంటకు నీరందించే పోలవరం కాలువ గట్ల పరిస్థితి దయనీయంగా మారినా అధికారులు ఇటువైపు కన్నెత్తి చూడక పోవడం గమనార్హం.

- ఫొటోలు: వై.వి.సత్యనారాయణ


సిమెంటు చప్టాల మధ్యలో మొలిచిన పిచ్చి మొక్కలు


కాలువకు పడిన గండి

## 6.10.6 మానవత్వం మరణించింది..పేగు బంధం తెగింది

(శ్రీసన్‌ఫ్లవర్‌న్యూస్ దినపత్రిక, 24.02.2013 సంచిక)

### మానవత్వం మరణించింది... పేగు బంధం తెగింది...



ఎక్కడ...! నాకు కడుపు కోత పెట్టిన కసాయి?



నన్ను ఒంటరి దాన్ని చేశావా తల్లీ!



మీరు మనుషులా! పొండి



చిట్టి తల్లికి చివరి ముద్దు

సాటి మనుషి పట్ల సమాజంలో మృగ్యమవుతున్న కరుణ మూగజీవాల విషయంలోనూ నిజమైంది. బీఆర్టీఎస్ రహదారిలో వేగంగా వాహనం నడిపిన ఓ వ్యక్తి ఓ లేగ దూడ మరణానికి కారణమయ్యాడు. జంతువైనా జన్మనిచ్చిన బిడ్డ కళ్లెదుట కన్నుమూసే సరికి ఆ గోమాత ఇలా విలవిలలాడింది.

## 6.11 సంపాదకీయాలు

సంపాదకుడి హృదయాన్ని ఆవిష్కరించేది సంపాదకీయం. వివిధ అంశాలపై సంపాదకుడు వెలిబుచ్చే అభిప్రాయం, చేసే వ్యాఖ్య సంపాదకీయం అవుతుంది. ప్రజలను ప్రభావితం చేసే నిమిత్తం దైనందిన పరిణామాలను పత్రికా సంపాదకుడు విశ్లేషించి రాసే వ్యాసమే సంపాదకీయం. సంపాదకీయంలోని ఎత్తుగడ సంపాదకుడి ధోరణిని సూచిస్తుంది.

### 6.11.1 సంపాదకుడు - నాడు నేడు

ఇంగ్లిషులో 'ఎడిటర్' అనే పదానికి సమానార్థకంగా తెలుగులో 'సంపాదకుడు' అనే పదాన్ని ఉపయోగించడం జరుగుతోంది. నిజానికి సంపాదకుడు అనే పదం 'ఎడిటర్' అనే ఇంగ్లీష్ మాటకు సమానార్థకం కాదు. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు 1911-13 మధ్య ఈ పదాన్ని బొంబాయినుంచి ఆంధ్ర దేశానికి దిగుమతి చేశారు. వ్యుత్పత్తి అర్థం ప్రకారం 'సం' ఉపసర్గ 'పద' అనే ధాతువుతో కలవడం వలన రూపొందిన పదం 'సంపాదకుడు'. ఈ పదానికి కూర్పు చేసేవాడు, సేకరించేవాడు అనే అర్థం వస్తుంది. కాని 'ఎడిట్' 'ఎడిటర్' అనే క్రియావాచక శబ్దాలకు సంపాదక శబ్దంతో సమన్వయం సాధ్యపడదు. కానీ, పత్రికల ద్వారా సంపాదక శబ్దం విరివిగా వ్యాప్తిలోకి తీసుకురావడం వల్ల సంపాదక శబ్దం తెలుగులో స్థిరపడింది.

గత 50 సంవత్సరాల కాలంలో పత్రికా నిర్వహణలో సంపాదకుడి పాత్రకు సంబంధించి విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకున్నాయి. పత్రికల ప్రారంభకాలంలో ఉద్యమాలను నడపాలనుకొన్నవారు సొంతగా పత్రికను పెట్టుకొని నడుపుకొనేవారు. ఇక్కడ సంపాదకుడు, పత్రికాధినేత ఇద్దరూ ఒకరే అయ్యేవారు. ముట్నూరి కృష్ణారావు కృష్ణాపత్రిక సంపూర్ణ ఆధిపత్యం తీసుకున్న తర్వాత పత్రిక యజమాని, సంపాదకుడు రెండూ ఆయనే కావడం ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఆంధ్రపత్రికను ప్రారంభించిన కాశీనాథుని నాగేశ్వరరావు మొదలైన తొలినాటి ప్రముఖ పత్రికా సంపాదకులందరూ ఈ కోవలోకి వస్తారు. ఇలా పత్రికాధినేత, సంపాదకుడు ఇద్దరూ ఒకటే కావడం వల్ల సంపాదకుడి ఆత్మ పత్రికలో ప్రతిఫలించేది. పత్రికను తాను అనుకున్న రీతిలో సంపాదకుడు తీర్చిదిద్దేవాడు. రూపురేఖలు తీర్చిదిద్దడం నుంచి పత్రికకు సంబంధించిన సమస్త విషయాల్లో సంపాదకుడిదే తుది నిర్ణయంగా ఉండేది.

క్రమంగా పెట్టుబడి పెట్టే వ్యక్తి వేరు, పత్రిక సంపాదకుడు వేరు అయ్యారు. పత్రిక సమాజ ఆశయాలకు ప్రతిరూపం అనే దశ నుంచి వ్యాపారమార్గంగా మారింది. ఈపరిస్థితి వచ్చిన తొలినాళ్ళలో కూడా పత్రికకు పెట్టుబడి వ్యక్తి తాను నమ్మిన పాత్రికేయుని పత్రిక బాధ్యత పూర్తిగా అప్పగించేవాడు. ఒకసారి అలా అప్పగింత పెట్టిన తరువాత జోక్యం చేసుకొనేవారు కాదు. అలా చేసుకొని ఉంటే అది చాలా అరుదైన సందర్భం అనుకోవచ్చు. అంటే సంపాదకుడికి స్వేచ్ఛ ఉండేది. ఏ విధానాన్ని అనుసరిస్తే ఏమి కొంప మునుగుతుందో, ఏమి రాస్తే యజమానికి ఆగ్రహం కలిగి ఉద్యోగంలో నుంచి పీకివేస్తాడో అనే భయం ఉండేది కాదు. అలా భయం లేని వాతావరణంలో రాసేటప్పుడు స్పష్టమైన అభిప్రాయాలు వ్యక్తమవుతాయి. సత్యం చెప్పటానికి అవకాశం ఉంటుంది.

మహాత్మాగాంధీ 'యంగ్ ఇండియా', 'హరిజన్' పత్రికలైనా, కాశీనాధుని నాగేశ్వరరావు 'ఆంధ్రపత్రికై'నా ప్రారంభమైన తరువాత చాలాకాలం ఐదువేల నుండి పదివేలలోపు మాత్రమే అమ్ముడవుతుండేవి. కాని ఆ రోజుల్లో పత్రికలు నాయకులను ప్రభావితం చేస్తుండేవి. నాయకులు ప్రజలను ప్రభావితం కావిస్తుండేవారు. ఆ విధంగా సర్క్యులేషన్ తక్కువ అయినా పత్రికలు ప్రజల అభిప్రాయాలను తీర్చిదిద్దుతుండేవి. కావాలని పొగడడం కాని, కావాలని తెగనాడడం కాని అరుదుగా జరిగేవి. నిర్మొహమాటంగా అభిప్రాయ ప్రకటన జరుగుతుండేది. పత్రికా సంపాదకుడికి పూర్తి స్వేచ్ఛ ఉండడం వల్ల ఇదంతా సాధ్యపడింది.

ఇప్పుడు పరిస్థితి మారింది. పత్రికలోని అన్ని ఇతర ఉద్యోగాల మాదిరిగానే సంపాదకుడు అనేది కూడా ఒక ఉద్యోగంగా మారింది. సంపాదకుడికి స్వేచ్ఛ నశించింది. ఇప్పుడు పెట్టుబడి పెట్టేవారే సంపాదకులుగా ఉండి, తమకు నచ్చిన పద్ధతిలో వార్తలు రాయించుకుంటున్నారు. సంపాదకీయాలు రాయించి ప్రచురించుకొంటున్నారు. పత్రికాధినేత ఇష్టానికి అనుగుణంగా సంపాదకుడు సంపాదకీయం రాయాలి. యజమానికి చెప్పిన అంశం మీదనే సంపాదకీయం రాయాలి.

వ్యక్తిగత స్వేచ్ఛ సంపాదకుడికి పూర్తిగా దూరమైంది. సంపాదకీయం రాసే వ్యక్తి తాను ఫలానా పత్రికకు సంపాదకుడిని అని బయటకు చెప్పుకునే స్థితి లేకుండా పోయింది. తాను రాసిన సంపాదకీయం తెల్లవారిన తర్వాత పత్రికలో కనిపించకపోవడంతో ఆశ్చర్యపోయిన సంపాదకులూ ఉన్నారు. పత్రిక పూర్తిగా వ్యాపారధోరణికి మారడం వల్ల వచ్చిన మార్పుల్లో ఇది కూడా ఒకటి.

సుమారు 40 సంవత్సరాలకు పూర్వం వర్కింగ్ జర్నలిస్టులకు భద్రత కలిగించే చట్టం అమలులోకి వచ్చింది. దీనిప్రకారం సంపాదకుడు కూడా వర్కింగ్ జర్నలిస్టే. కానీ, ఇప్పుడు అలాంటి ఉద్యోగ భద్రత లేదు. చట్టాన్ని నిరుపయోగం కావిస్తూ యాజమాన్యాలు కాంట్రాక్టు పద్ధతిలో ఉద్యోగులను నియమించకుంటున్నాయి. ఇతర ఉద్యోగులకు ఉండే భద్రత కూడా సంపాదకుడికి లేకుండా పోయిందనడంలో అతిశయోక్తి లేదు. సంపాదకుడు ఎవరున్నా, అసలెవరూ లేకపోయినా పత్రికలు యథాప్రకారం వస్తుంటాయనే పరిస్థితి ఇప్పుడుంది. సంపాదకుడనే పదానికే విలువ తగ్గుతూ వచ్చింది. (*తెలుగు పత్రికారంగం : నిన్న నేడు రేపు*, వ్యాస సంకలనం,2001, పుట 10)

## 6.11.2 సంపాదకీయాలు – ఆధునిక ధోరణులు

పత్రికా స్వేచ్ఛను సంపాదకుడి స్వేచ్ఛతో ముడిపెట్టడం సహజం. ఎందుకంటే ఇటీవలి వరకూ (కొన్ని యాజమాన్యాలు అంగీకరించకపోయినా.. గుర్తింపు ఇవ్వకపోయినా.. ఇప్పటికీ) సంపాదకుడిది ప్రముఖమైన పాత్ర. ఈ ప్రాముఖ్యం క్రమంగా తగ్గుతున్నది. అందులో సందేహం లేదు. సంపాదకుడి ప్రాముఖ్యం తగ్గిన కొద్దీ వ్యాపార ధోరణుల ప్రాధాన్యం పెరుగుతోంది. లేదా వ్యాపార ధోరణుల ప్రాధాన్యం పెరిగేకొద్దీ సంపాదకుడి ప్రాముఖ్యం తగ్గుతోంది.

పత్రికా స్వేచ్ఛ అంటే స్థూలంగా సంపాదకుడి స్వేచ్ఛగా, సంపాదకుడి ప్రాముఖ్యంగా పరిగణిస్తున్నాం. సమాజ హితం కోసం సంపాదక మండలి ఏమిరాయాలని అనుకుంటే అది రాసే స్వేచ్ఛ ఉండటాన్ని పత్రికా స్వేచ్ఛగా స్థూలంగా నిర్వచించుకోవచ్చు. ఈ స్వేచ్ఛ భంగం ఏ కారణంగా కలిగినా అది పత్రికా స్వేచ్ఛకు హాని కలిగినట్టే భావించవలసి ఉంటుంది. పత్రిక వ్యాపార ప్రయోజనలే అందుకు కారణం కావచ్చు.

సమాజానికి విస్తృతంగా సేవ చేయాలంటే పత్రిక విస్తృతి పెరగాలనీ, అందుకు పత్రిక ఆర్థికంగా బలపడాలనీ వాదిస్తూ ఆర్థికంగా బలపడాలంటే యాజమాన్యం నిర్దేశించిన పద్ధతిలో పత్రిక నడవాలని చెప్పేవారు పెరుగుతున్నారు. నిత్యం నీతులు వల్లించే సంపాదకీయాలు చదివే సమయం, ఆసక్తి పాఠకులకు అంతగా లేదనీ, పాఠకుల అభిరుచికి అనుగుణంగా పత్రికా విధానం మారుతుండాలనీ యజమానులు భావిస్తున్నారు. పత్రిక సర్క్యులేషన్ పెంచుకుంటూ, ప్రకటనలు (అడ్వర్టయిజ్‌మెంట్లు) సేకరిస్తూ ఆర్థికంగా ఎదగాలని యాజమాన్యం ప్రయత్నించడాన్ని ఎవరు తప్పుపడతారు?

పత్రికల పాత్ర కాలానుగుణంగా మారుతూ వస్తున్నది. స్వాతంత్ర్య సమరంలో అది పోరాట పాత్ర. స్వాతంత్ర్య సిద్ధి తర్వాత కొన్నాళ్ళపాటు అది నవభారత నిర్మాణ పాత్ర. ఈ రెండు పాత్రలలోనూ త్యాగం ఉంది. సొంత లాభం కొంత మానుకోవాలన్న సందేశం ఉంది. అందుకే అంత వరకూ పత్రికలు సొంత వ్యాపార ప్రయోజనాలను పక్కన పెట్టి సామాజిక ప్రయోజనాలకు పెద్దపీట వేశాయి. కానీ పత్రికలు ఎప్పుడైతే పరిశ్రమగా మారాయో పరిశ్రమలకు వర్తించే విధానాలన్నీ పత్రికలూ ఆపాదిస్తున్నారు. ఇందులో ఎవ్వరినీ తప్పు పట్టడానికి లేదు. పరిస్థితులు మారుతున్నాయని చెప్పుకోవడమే ఉద్దేశ్యం. వ్యాపార ధోరణి పెరిగే కొద్దీ సంపాదక మండలి స్వేచ్ఛ తగ్గుతూ వస్తుంది. వ్యాపార ప్రయోజనాలు రాజకీయాలకు దారితీసినప్పుడు రెండు రకాల ప్రయోజనాలూ జమిలిగా సంపాదక మండలిని శాసిస్తాయి. ఇది సహజం వ్యాపార ప్రయోజనాలు పత్రికలలో వ్యాపార సంస్థల జోక్యానికి దారితీసినట్టే రాజకీయ ప్రయోజనాలు రాజకీయ జోక్యాన్ని అనివార్యం చేస్తాయి. (*తెలుగు పత్రికారంగం – నిన్న నేడు రేపు;* 2001, పుట 67)

బిపిన్ చంద్రపాల్ 1906లో జరిపిన పర్యటనతో ఆంధ్రప్రాంతంలో జాతీయ ఉద్యమం ప్రారంభమైంది. బిపిన్ చంద్రపాల్ పర్యటన ప్రాముఖ్యాన్ని కృష్ణాపత్రిక తన సంపాదకీయంలో వివరంగా రాసింది. ఆయన పర్యటన ప్రజల్లో కల్గించిన ప్రభావాన్ని కూడా చాటిచెప్పింది. 'బిపిన్ చంద్రపాల్ పట్ల ప్రజలు విశేషంగా గౌరవాభిమానాలు చూపారు. ఆయన ప్రసంగాలపట్ల అమితాసక్తి కనపరిచారు. ఇవి ప్రజల తాత్కాలిక భావోద్వేగాలు కావు. నివురు గప్పిన నిప్పులా ప్రజల్లో రగులుతున్న స్వాతంత్ర్య కాంక్షకు ఇవి సంకేతాలు. ప్రజల్లో పెల్లుబుకుతున్న ఈ కొత్త స్ఫూర్తి సామ్రాజ్యవాదులైన పాశ్చాత్యులకు గుణపాఠం నేర్పుతుంది. ఆయుధాల ద్వారానో, యుద్ధం ద్వారానో కాకుండా రక్తపాతం లేని త్యాగాల ద్వారా ప్రజలు గుణపాఠం చెప్పనున్నారు.' అని ఆ సంపాదకీయంలో ఉంది.

ఈ రకమైన సంపాదకీయాలు ప్రజల్లో దేశభక్తిని తట్టిలేపేవి. కాలక్రమంలో వచ్చిన పత్రికా యాజమాన్య వైఖరి ఈ తరహా సంపాదకీయ రచనను పూర్తిగా పక్కకు నెట్టింది. దీంతో సంపాదకీయ రచనలో తొలినాటికి ఇప్పటికీ స్పష్టమైన తేడా కనిపిస్తోంది. కొన్ని సంవత్సరాల కిందట కనపడిన పరిశోధనాభిలాష, అవకతవకలను కనిపెట్టి అరికట్టే శ్రద్ధ, ఆసక్తి ఇప్పటి పత్రికల్లో పెద్దగా కనిపించడం లేదు. ప్రజాభిప్రాయాన్ని సంపాదించడం కంటే అడ్వర్టయిజ్‌మెంట్లను సంపాదించడమే పత్రికా నిర్వాహకులకు ప్రధానమైంది. విశేష వ్యయ ప్రయాసల కోర్చి, ఉత్పత్తి ఖర్చుకన్నా తక్కువ వెలకు పత్రికను అమ్ముకొన్నందువల్ల ఎవరికీ ఏమీ ఒరగదు. ఒక స్థాయి మించాక సర్క్యులేషన్ ఎంత పెరిగితే అంత నష్టమే తప్ప లాభం ఉండదు.

ఈ రకమైన నష్టాలన్నీ పూడ్చుకొని, లాభాల పూలు పూయించగలగడం గంగిగోవులాంటి అడ్వర్టయిజ్‌మెంట్ల ద్వారానే సాధ్యపడుతుంది. అందుకే ఇవాళ చాలా పత్రికా కార్యాలయాల్లో అడ్వర్టయిజ్‌మెంట్లు తెచ్చేవారికి ఉండే ప్రాధాన్యం సంపాదక సిబ్బందికి ఉండటం లేదు. పేజీలోపల ఇచ్చే వార్తలు, వ్యాఖ్యలు, వార్తా చిత్రాలు మరీ ఆకర్షణీయంగా ఉంటే పాఠకులు వాటినే తప్ప పేజీలో ఉండే అడ్వర్టయిజ్‌మెంట్లను గమనించరు. అడ్వర్టయిజ్‌మెంట్లు గొప్పగా కనపడాలంటే 'ఎడిటోరియల్ మేటరు' (సంపాదకీయం) ఎంత నిస్సారంగా ఉంటే అంతమంచిది. కాబట్టి ముఖ్యమైన పెద్ద అడ్వర్టయిజ్‌మెంట్లు ఉండే పేజీలను సాధ్యమైనంత కాంతిహీనంగా తయారు చేయమని కొన్ని జాతీయ దినపత్రికలవారే శాసిస్తున్నారు. పత్రికా ప్రమాణాలకు ఇది గొడ్డలిపెట్టువంటిది. అయినా, పత్రిక మనుగడ దృష్ట్యా తప్పడం లేదు. (ఈనాడు దినపత్రిక విజయవాడ ఎడిషన్ ఇన్‌ఛార్జి శ్రీ గొడవర్తి శ్రీనివాస భరణికుమార్‌తో పరిశోధకుడి ముఖాముఖి; పూర్తి ముఖాముఖి పుట 271–273లో ఇవ్వబడింది)

గతంలో పేజీల అంచులకు పరిమితమైన 'ప్రకటనల' వారు ఇప్పుడు ఏకంగా పేజీల మధ్యలోనే తిష్టవేసి, క్రీడావార్లనుంచి కథలు, ఫీచర్ల వరకూ స్పాన్సర్ చేస్తూ ఆయా పేజీల్లో ఏమిరాయాలో, ఎవరు రాయాలో, దేన్ని ఎలా ఫీచరు చెయ్యాలో తెగబడి నిర్ణయించడం మొదలెడితే పత్రికల 'విశ్వసనీయత' ఇంకెక్కడ మిగులుతుంది. (*తెలుగు పత్రికా రంగం – నిన్న నేడు రేపు*, 2001, పుట 67). ఒకపత్రిక ప్రాముఖ్యం భాషా స్వరూపాలు, విషయసేకరణ, ముద్రణ, వార్తలు, శీర్షికలు విశ్వసనీయతమీద ఆధారపడి ఉంటుంది. దినపత్రికలలో సంపాదకీయానికి బాధ్యత వహించే వ్యక్తి సంపాదకుడే కాదు, పత్రికాధిపతి పైన కూడా ఆధారపడి ఉంటుంది.

స్వాతంత్ర్యానికి పూర్వం సంపాదకులు నిర్భయంగా నిజాయితీగా ప్రభుత్వ ఆగ్రహానికి వెరవకుండా ప్రజల పక్షాన నిలబడి సంపాదకీయాలు రాసేవారు. ఆ సంపాదకీయాల్లో ప్రత్యక్ష ప్రమాణాలను సేకరించి ఆ సంఘటనల పూర్వాపరాలను విశ్లేషించి సమీక్షించి తమ అభిప్రాయాలను చెప్పేవారు. ఆకారణంగా అప్పుడప్పుడు వారు కొన్ని జాతులు, పార్టీలు, సంఘాలు, మతాలు, చివరకు ప్రభుత్వం లోపాలు చర్చిస్తూ సంపాదకీయాలు రాసిన సందర్భాలలో వాళ్ల ఆగ్రహానికి గురికావాల్సి వచ్చేది. అలాంటప్పుడు సంపాదకులపైన, పత్రిక కార్యాలయంపైన దాడులు జరుగుతుంటాయి. వాళ్లను భయభ్రాంతులను చేసి భవిష్యత్తులో జాగ్రత్త వహించాలని హెచ్చరికలు చేయడం జరుగుతుంది. అలాంటి పత్రికలను మూసివేయించడం కానీ లేక వాటికి జరిమానాలు విధించిన సందర్భాలు లేకపోలేదు.

ఆంగ్లేయుల పరిపాలనలో బాలగంగాధర్ తిలక్, ముట్నూరు కృష్ణారావు, దేశభక్తి కొండా వెంకటప్పయ్య పంతులు జైలు శిక్షను కూడా అనుభించవలసి వచ్చింది. పత్రికలు ప్రజాస్వామ్యం యొక్క నాల్గవ స్తంభమని సగర్వంగా చెప్పే సంఘాలు, న్యాయస్థానాలు సంపాదకులు, పత్రికలపైన జరిగే ఈ దౌర్జన్యాలను అరికట్టలేకపోతున్నాయి. ప్రజల పక్షాన నుంచి ప్రజల యోగక్షేమాల కొరకు పాటుపడే పత్రికలకే ప్రజాస్వామ్యంలో రక్షణ లేకుండా పోతోంది. ఈ దుస్థితిని తొలగించాలంటే ప్రజలు, సంఘం, ఎంతో చైతన్యవంతం కావలసివుంది.

రాజ్యాంగం పౌరులకు వాక్ స్వాతంత్ర్యం ప్రాథమిక హక్కుగా ప్రసాదించింది. అలాంటి హక్కు పరిరక్షణకు పత్రికలు ఎంతగానో కృషి చేస్తున్నాయి. కానీ స్వాతంత్ర్యానంతరం పత్రికలు వ్యక్తుల చేతుల నుంచి పారిశ్రామిక వేత్తల చేతుల్లోకి మారాయి. ఈనాడు పత్రికా ప్రచురణ ఒక పరిశ్రమగా రూపొందింది. అలాంటి పరిశ్రమల్లో పనిచేసే పాత్రికేయులు కొన్ని సందర్భాల్లో స్వేచ్ఛగా తమ అభిప్రాయాలను వ్యక్తం చేయలేకపోతున్నారు. ఒకప్పుడు పత్రికా రచన ఒక బోధనోద్యమంగా ప్రజల, సంఘ, దేశ ప్రయోజనాలకు అంకితమైవుండేది. ఈనాటి పాత్రికేయులు కేవలం ఉద్యోగులుగా పరిశ్రమల యాజమాన్యపు విధానాలకు కట్టుబడి రచనలు చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. యాజమాన్యానికి వ్యతిరేకంగా రచనలు చేసిన వారెందరో ఉద్యోగ విరమణ చేయవలసి వచ్చింది. (ఆంధ్రజ్యోతి దినపత్రిక పూర్వ సంపాదకుడు తుర్లపాటి కుటుంబరావుతో పరిశోధకుడి ముఖాముఖి; పూర్తి ముఖాముఖి పుట 290–293లో ఇవ్వబడింది)

అధ్యాయం - 7

# కృష్ణా జిల్లా పత్రికారంగం అనుబంధ అంశాలు

సర్వసాధారణంగా పత్రిక అనగానే మొదటగా గుర్తుకువచ్చేది పాత్రికేయుడు. ఆ తర్వాత సంపాదకుడు. కానీ, ఒక పత్రిక సర్వాంగ సుందరంగా ముస్తాబై పాఠకుడి చేతిలోకి రావాలంటే అందుకు ఎన్నో విభాగాలు అత్యంత సమర్థవంతంగా, సమష్టిగా కృషి చేయాలి. అప్పుడే పత్రిక పాఠకుల మన్ననలు పొందుతుంది. ముద్రణ విభాగం, ప్రకటనల విభాగం, సర్క్యులేషన్ విభాగం, ఎకౌంట్స్ విభాగం..ఇలా ఎన్నో విభాగాలు తమ బాధ్యతలు పూర్తిగా నెరవేరిస్తేనే పత్రిక మనుగడ సాగుతుంది. ఆ పత్రిక ఉత్తమమైనదిగా, నాణ్యమైన పత్రికగా సమాజంలో గుర్తింపు పొందుతుంది.

ఇవన్నీ భౌతికమైన అంశాలు..అంటే ప్రత్యక్షంగా మనకు కనిపిస్తూ, పత్రికా ప్రచురణలో భాగం పంచుకుంటాయి. ఇవికాకుండా కొన్ని అభౌతికమైన అంశాలు ఉన్నాయి. అవి పాత్రికేయుల నైతిక నియమావళి, పాత్రికేయ సంఘాలు, పత్రికలు - ప్రభుత్వ చట్టాలు మొదలగునవి. ఇలా కొన్ని అంశాలు పత్రికా గమనంలో అంతర్లీనంగా ఉండి, పత్రిక మనుగడకు దోహదం చేస్తాయి. ప్రత్యక్షంగా కనిపించకపోయినా పత్రిక విజయవంతంలో వీటి పాత్ర ఎంతో ఉంటుంది. ఇలా పత్రికారంగంతో ముడిపడిన అనేక ఇతర అంశాలను ఈ అధ్యాయంలో 'పత్రికారంగం అనుబంధ అంశాలు' పేరుతో చర్చించడం జరుగుతుంది.

## 7.1 కృష్ణాజిల్లా పత్రికలు - జాతీయోద్యమాలు

స్వాతంత్ర్య పోరాటంలో ప్రజలు పెద్ద ఎత్తున పాలుపంచుకోవడానికి పత్రికలు ప్రేరణగా నిలిచాయి. ప్రజల్లో దేశభక్తిని, జాతీయ స్పృహను ఏర్పరచడంలో మహత్తర పాత్ర నిర్వర్తించాయి. ప్రజల్లో జాతీయ స్ఫూర్తిని పాదుగొల్పడానికి వైభవోపేత భారతావనిని పత్రికలు ప్రజలకు కళ్లకు కట్టించాయి. తెలుగులో *కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, కాంగ్రెస్, సత్యాగ్రహి*, ఇంగ్లిషులో *స్వరాజ్య, జన్మభూమి, న్యూ ఇండియా* పత్రికలు ఈ కృషిలో ముందునిలిచాయి.

ఆధ్యాత్మిక, మతపరమైన రంగాల్లో ప్రపంచదేశాలకు భారత్ మార్గదర్శిగా నిలిచిందని 1905 మార్చి 1వ తేదీ సంచికలో కృష్ణాపత్రిక ప్రశంసించింది. తమ మాతృభూమిని ప్రేమించటం భారతీయులందరి కర్తవ్యమని ప్రభోధించింది. ఆంధ్రులంతా దేశాభిమానంతో మెలగాలని ఆంధ్రపత్రిక ప్రజలకు ఉద్బోధించింది. దేశానికి సేవచేయటమంత మహోన్నత కర్తవ్యం మరొకటి లేదని ఈ పత్రిక పేర్కొంది. పత్రికలు మతసహనాన్ని కూడా ప్రభోధించాయి. భారతీయ క్రైస్తవులను తమ కుటుంబ సభ్యులుగా అభిమానించాలని హిందువులకు విజ్ఞప్తి చేశాయి. తమ మాతృభూమి సేవకు భారతీయ క్రైస్తవులు అంకితమైతే భారతదేశ నిర్మాణం మరింత సులభమవుతుందని కృష్ణాపత్రిక 1916 డిసెంబర్ 30వ తేదీ సంచికలో పేర్కొంది.

టంగుటూరి ప్రకాశం స్వరాజ్య, ఇతర అనేక పత్రికలు కూడా ఈ ఉద్యమాన్ని ప్రచారం చేశారు. కోర్టులను బహిష్కరించవలసిందిగా కృష్ణాపత్రిక న్యాయవాదులకు పిలుపునిచ్చింది. విధులను బహిష్కరించటం ద్వారా అధికారులను నిస్సహాయులను చేయవచ్చని పేర్కొంది. బ్రిటిషువారికి, భారతీయులకు మధ్య కోర్టులు వివక్ష చూపుతున్నందున ఇలాంటి సంస్థలను బహిష్కరించటం తక్షణ అవసరమని కూడా కృష్ణాపత్రిక పిలుపునిచ్చింది.

సహాయ నిరాకరణ ఉద్యమంలో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొనాలని దేశాభిమాని పిలుపునిచ్చింది. మరింత మంది నాయకులు అవసరం. మరికొందరు న్యాయవాదులు తమ వృత్తిని విడనాడి ఉద్యమంలో పాల్గొనకపోతే సహాయ నిరాకరణ రథం వేగం పుంజుకోదు అని దేశాభిమాని పత్రిక 1920 అక్టోబర్ 10వతేదీ సంచికలో వ్యాఖ్యానించింది. మహాత్మాగాంధీ చేపట్టిన ఈ ఉద్యమం భారతావనికి కొత్త జవజీవాలు సంతరించిపెట్టిందని కూడా ఆ పత్రిక అభిప్రాయపడింది.

ఈ సమయంలోనే లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికలను ప్రకటించారు. ఈ ఎన్నికలను బహిష్కరించవలసిందిగా మహాత్మాగాంధీ పిలుపునిచ్చారు.'పరీక్ష' పేరిట 1920 నవంబర్ 27వ తేదీన కృష్ణాపత్రిక ప్రచురించిన వ్యాసంలో ఓటింగ్‌ను బహిష్కరించాలన్న కాంగ్రెస్ నిర్ణయానికి మనం కట్టుబడి ఉండాలని హితవు చెప్పింది. మనం ఈ పరీక్షకు నిలబడితే మన లక్ష్యం నెరవేరుతుంది. జాతీయ గౌరవం పదిలంగా ఉండి దేశానికి విముక్తి లభించగలదని పేర్కొంది. స్వాతంత్ర్య ఉద్యమానికి ప్రజల విశ్వాసాన్ని పొందేందుకు ఆంధ్రలోని పత్రికలు పండగలను ఉపయోగించుకున్నాయి. విఘ్నేశ్వరుని పూజల ద్వారా ప్రజల్లో జాతీయ భావాలను పాదుగొల్పాలని 1920 సెప్టెంబర్ 18వ తేదీ సంచికలో రాసిన సంపాదకీయంలో కృష్ణాపత్రిక పిలుపునిచ్చింది.

## 7.2 కృష్ణాజిల్లా పాత్రికేయ సంఘం

కళా, సాహిత్య, రాజకీయ రంగాలకు రాజధాని అనిపించుకున్న విజయవాడ తెలుగు పత్రికా రంగానికీ పుట్టినిల్లుగా వినుతికెక్కింది. అనేక ఉద్యమాలకు ఊపిరినిచ్చిన విజయవాడే జర్నలిస్టుల యూనియన్ స్థాపనకూ నాందీ పలికింది. జర్నలిస్టులు, నాన్‌జర్నలిస్టుల ఉద్యమాలకు బీజం పడిందిక్కడే. అనంతరకాలంలో నాన్‌జర్నలిస్టుల యూనియన్ల స్థాపనకూ నాంది పలికింది ఈ బెజవాడ గడ్డమీదే.

కృష్ణాజిల్లాలో స్వాతంత్ర్యోద్యమానికి అక్షరాయుధాలు అందించిన కృష్ణాపత్రిక బందరులో ప్రారంభమయ్యింది, తరువాత *ఆంధ్రప్రభ,* ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ప్రచురణ కూడా విజయవాడ నుంచే ప్రారంభమయ్యింది. అనంతరం *ఆంధ్రజ్యోతి* విజయవాడలో ప్రచురణ ప్రారంభించగా, మద్రాసులో ప్రచురితమవుతున్న *ఆంధ్రపత్రిక* కూడా విజయవాడ నుంచి ప్రచురణ ప్రారంభించింది. *జనశక్తి, ప్రజాశక్తి* పత్రికల ప్రచురణకు కేంద్రస్థానం విజయవాడడే. విజయవాడకు తొలి దినపత్రికను అందించిన ఘనత '*విశాలాంధ్ర*'కే చెందుతుంది.

ఆ విధంగా పత్రికల రాజధానియైన విజయవాడలో 1950లో జర్నలిస్టుల సంఘం స్థాపనకు అంకురార్పణ జరిగింది. దీని తదనంతర చర్యగా 1951 జనవరి 2వ తేదీన ఆంధ్రా ప్రొవిన్షియల్ జర్నలిస్ట్సు అసోసియేషన్ స్థాపన జరిగింది. ప్రారంభంలో ఈ అసోసియేషన్ ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలను చేపట్టలేదు. వృత్తిపరమైన అంశాలకు మాత్రమే ప్రాధాన్యం ఇచ్చింది.

ఐదు సంవత్సరాల తర్వాత 1956 జనవరి 22వ తేదీన ఐ.ఎఫ్.డబ్ల్యు.జె.కు అనుబంధంగా ఆంధ్రప్రాంతానికి చెందిన జర్నలిస్టులతో ఒక సమావేశం జరిగింది. ఆంధ్రలోని వివిధ ప్రాంతాలకు చెందిన 50 మంది జర్నలిస్టులు ఆ సమావేశంలో పాల్గొన్నారు. ఆంధ్రపత్రికలో పనిచేస్తున్న మంగళంపల్లి చంద్రశేఖర్ ఆంధ్రజర్నలిస్టుల యూనియన్‌కు అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. వి.ఆర్.బొమ్మారెడ్డి, తాళ్లూరి సుబ్బారావు, ఫణిభూషణరావు, కంభంపాటి సత్యనారాయణ, ఎ.కె.ఆర్.బి.కోటేశ్వరరావు, రాంభట్ల కృష్ణమూర్తి ఏడుగురితో ఒక కమిటీ ఏర్పాటైంది. దీనికి బొమ్మారెడ్డి కన్వీనర్‌గా ఉన్నారు. ఆ విధంగా విజయవాడలో ఆంధ్ర యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్సుకు ఒక రూపం ఏర్పడింది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆవిర్భావం తరువాత యూనియన్ పేరు 'ఆంధ్రప్రదేశ్ యూనియన్ ఆఫ్ వర్కింగ్ జర్నలిస్ట్స్' (ఎ.పి.యు.డబ్ల్యు.జె)గా మార్పు చెందింది. దీని తొలి సమావేశం 1957 ఆగష్టు 17న హైదరాబాద్‌లో జరిగింది. ఐ.ఎఫ్.డబ్ల్యు.జె. వ్యవస్థాపక అధ్యక్షుడు మనికొండ చలపతిరావు ఆ సమావేశానికి హాజరయ్యారు. ఆ విధంగా విజయవాడలో బీజంపడిన జర్నలిస్టుల యూనియన్ నేడు దేశంలోనే అత్యధిక సభ్యత్వం (సుమారు 16,000 పైగా) కలిగిన జర్నలిస్టు సంఘంగా భాసిల్లుతోంది.

ఈ నేపథ్యంలో ఎ.పి.యు.డబ్ల్యు.జె.తో ఉత్తేజం పొందిన విజయవాడ వర్కింగ్ జర్నలిస్టులు కృష్ణాజిల్లాలోనూ జర్నలిస్టుల యూనియన్ స్థాపించాలని భావించారు. పొత్తూరి పుల్లయ్య, కంచర్ల పూర్ణచంద్రరావు, పరకాల పట్టాభిరామారావు, వి.జి.బాలకృష్ణ వి.కె.ఎం.తిలక్ తదితర సీనియర్ జర్నలిస్టులు 1967లో విజయవాడలో కృష్ణాజిల్లా జర్నలిస్టుల యూనియన్‌ను స్థాపించారు. దీనిని ఎ.పి.యు.డబ్ల్యు.జె.కు అనుబంధంగా చేశారు. ఈ యూనియన్‌కు తొలి అధ్యక్ష కార్యదర్శులుగా పరకాల పట్టాభిరామారావు, వి.కె.ఎం.తిలక్ ఎన్నికయ్యారు. అదే విధంగా 1967లోనే ప్రెస్‌క్లబ్ వ్యవస్థాపక అధ్యక్ష, కార్యదర్శులుగా పొత్తూరి పుల్లయ్య, పి.వెంకట్రావు ఎన్నికయ్యారు.

అనంతరం ఈ నేతల అవిశ్రాంత కృషి ఫలితంగా యూనియన్‌కు ప్రభుత్వం నుంచి విజయవాడ గాంధీనగర్, హనుమాన్‌పేటలో స్థలం మంజూరయ్యింది. అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి, మంత్రులు శీలం సిద్ధారెడ్డి, టి.అంజయ్య, మండలి వెంకటకృష్ణారావు, కాకాని వెంకటరత్నంలాంటి ఎందరో జర్నలిస్టుల శ్రేయోభిలాషులు ఇందుకు సాయపడ్డారు. అనంతరం ఆ స్థలంలో భవన నిర్మాణానికి యూనియన్ ఉద్యమించింది.

ప్రభుత్వ సహకారం, స్టార్‌నైట్ కార్యక్రమాల ద్వారా నిధులు సమకూర్చి భవన నిర్మాణం చేపట్టగలిగారు. కాలక్రమేణా ప్రజాప్రతినిధులు తదితరులు సహాయ సహకారాలతో ప్రెస్‌క్లబ్ హాలుకు కొన్ని హంగులు సమకూర్చగలిగారు. నేడు పత్రికా రంగంలో ప్రింట్ మీడడియాలోను, ఎలక్ట్రానిక్ మీడియాలోను ఉన్నత శిఖరాలనందుకున్న ఐ.వెంకట్రావు, వి.వాసుదేవ దీక్షితులు, కె.రామచంద్రమూర్తి కృష్ణాజిల్లా జర్నలిస్టుల సంఘంలో బాధ్యతగల పాత్ర నిర్వహించినావారే!

విజయవాడలో నెలకొల్పిన కృష్ణాజిల్లా జర్నలిస్టుల యూనియన్ కేవలం జర్నలిస్టుల సమస్యల పరిష్కారానికే పరిమితం కాలేదు. నాన్ జర్నలిస్టుల సమస్యల పరిష్కారానికి కూడా ఉద్యమం తోడ్పాటునందించింది. ఈ యూనియన్ స్థాపన ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి సంస్థలలో ప్లాంటుస్థాయి యూనియన్ల స్థాపనకు ఒక ఉత్తేజాన్నిచ్చింది. 1970లో *ఆంధ్రప్రభ*-ఇండియన్ ఎక్స్‌ప్రెస్ సంస్థలో విజయవాడ న్యూస్‌పేపర్ ఎంప్లాయీస్ యూనియన్ స్థాపన జరిగింది. ఆ తరువాత ఆంధ్రజ్యోతి ఎంప్లాయీస్ యూనియన్ కూడా స్థాపించారు. జర్నలిస్టులు, నాన్ జర్నలిస్టుల సమస్యల పరిష్కారంలో విజయవాడ న్యూస్ పేపర్ ఎంప్లాయీస్ యూనియన్ (గుర్తింపు పొందిన) చూపిన ఉద్యమ స్ఫూర్తి అందుకు ఎ.పి.యు.డబ్ల్యు.జె. అందించిన సహాయ సహకారాలు జర్నలిస్టులు, నాన్ జర్నలిస్టుల ఉద్యమ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయంగా చెప్పుకోవచ్చు.

విజయవాడ న్యూస్‌పేపర్ ఎంప్లాయీస్ యూనియన్ 25ఏళ్ల సుదీర్ఘ ప్రస్థానంలో ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొంది. 1995 అక్టోబర్ 3న రజతోత్సవ వేడుకలు జరుపుకొంది. ఈ రజతోత్సవ సమావేశంలోనే-పత్రికా ఉద్యోగుల చిరకాల వాంఛ అయిన – ఆంధ్రప్రదేశ్ న్యూస్‌పేపర్ ఎంప్లాయీస్ ఫెడరేషన్ (ఎ.పి.ఎన్.ఇ.ఎఫ్.) స్థాపన జరిగింది. ఈ సమావేశానికి అఖిల భారత న్యూస్ పేపర్ ఎంప్లాయీస్ ఫెడరేషన్ (ఎ.ఐ.ఎన్.ఇ.ఎఫ్.) అధ్యక్షులు సంతోష్‌కుమార్ హాజరయ్యారు. దీనికి వ్యవస్థాపక అధ్యక్షులుగా అంబటి ఆంజనేయులు ఎన్నికయ్యారు.

కృష్ణాజిల్లాలో జర్నలిస్టుల సంఖ్యాబలం పెరగడంతో కృష్ణాజిల్లా జర్నలిస్టుల సంఘాన్ని కృష్ణాజిల్లా రూరల్, కృష్ణా అర్బన్ (విజయవాడ) యూనిట్లుగా విభజించారు. విజయవాడ ప్రెస్‌క్లబ్ భవన విస్తరణలో భాగంగా ఆంధ్రపత్రిక యజమాని శివలెంక రాధాకృష్ణ, ప్రభుత్వం ఇచ్చిన నిధులతో తొలి అంతస్తు నిర్మించి హాలుకు 'శివలెంక శంభుప్రసాద్ హాలు' గా నామకరణం చేశారు. అక్కడి గ్రంథాలయానికి ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు, రాజ్యసభ సభ్యులు 'దాసరి నాగభూషణరావు లైబ్రరీ'గా నామకరణం చేశారు.

ఇంతటి ఘన చరిత్ర కల్గిన ఎ.పి.యు.డబ్ల్యు.జె. కృష్ణా అర్బన్ యూనిట్ 2008 నవంబర్ 9వ తేదీన ఎ.పి.యు.డబ్ల్యు.జె. స్వర్ణోత్సవ వేడుకలను విజయవాడలో ఘనంగా నిర్వహించింది. ఈ సందర్భంగా గత 40 ఏళ్ల కాలంలో కృష్ణాజిల్లాలో యూనియన్ అభివృద్ధి కోసం ఎంతో శ్రమించిన జర్నలిస్టులు, ప్లాంట్ యూనియన్ల నాయకులను సత్కరించారు.

ఈ కార్యక్రమంలో బాటుగా 2012లో జర్నలిస్టులు, నాన్ జర్నలిస్టులతో బాటు, వారి కుటుంబాలకు కూడా అనేక సేవా కార్యక్రమాలు యూనియన్ నిర్వహిస్తుంది. దానిలో భాగంగా, నిపుణులైన డాక్టర్లతో కంటి, గుండె, జనరల్ హెల్త్ చెకప్ వంటి శిబిరాలు ఏర్పాటు చేస్తున్నది. జర్నలిస్టుల పైన, పత్రికా సంస్థలపైన జరుగుతున్న అవాంఛనీయ దాడులు, ప్రభుత్వ జులుం వంటి వాటిపై ఐ.జె.యు., ఎ.పి.యు.డబ్ల్యు.జె. ఇచ్చిన పిలుపుమేరకు ధర్నాలు, నిరసన కార్యక్రమాలు నిర్వహిస్తున్నది.

## 7.3 ముద్రణ విభాగం - నాడు నేడు

పత్రిక పాఠకుడికి ఆహ్లాదం కలిగించడానికి, చూడగానే చదవాలని అనిపించడానికి ప్రధానకారణం నాణ్యమైన ముద్రణ. పాత్రికేయుడు ఎంత గొప్ప వార్త రాసినా, సంపాదకుడు దాన్ని ఎంత అందంగా తీర్చిదిద్దినా, ముద్రణ సరిగా లేకపోతే ఆ వార్త పాఠకుడిని ఆనందింపజేయదు. పాత్రికేయుడు ఆశించిన ఫలితం రాదు. కాబట్టి పాత్రికేయుడు, సంపాదకుల నేర్పుతో పాటు ముద్రణ విభాగంలో పనిచేసే వ్యక్తుల నైపుణ్యం కూడా పత్రిక విజయవంతం కావడానికి తోడ్పడుతుంది.

వేదకాలంలో భారతీయులు తమ విజ్ఞాన సంపదను ఒక తరం నుంచి మరొక తరం వారికి మౌఖిక కృత్యాల ద్వారా అందించేవారు. గురువు చెప్పిన విషయాల్ని కంఠస్తం చేయడం ద్వారా శిష్యుడు జ్ఞానం సంపాదించేవాడు. ఇందుకు ఎంతో కాలవ్యవధి అవసరమయ్యేది. ఈవిధంగా వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు తదితరాలన్నీ భావితరాలకు వారసత్వంగా అందాయి.

తరువాత లిపి ఆవిర్భావంతో వైదిక విజ్ఞానాన్ని గ్రంథస్థం చేసేందుకు వీలైంది. ఈ క్రమంలో అమూల్యమైన గ్రంథాలను లేఖకుల సహకారంతో ప్రతులు రాయించి భద్రపరచటం జరిగింది. ఈవిధంగా తొలినాళ్ళలో కేవలం మౌఖిక రూపంలో ఉన్న విజ్ఞానం లిపిబద్ధమై, గ్రంథస్తమైంది. అనంతరకాలంలో ముద్రణ యంత్రాలు అభివృద్ధి చెందడంతో ఈ ప్రక్రియ వేగం పుంజుకుంది. పత్రికల వికాసానికి ముద్రణకు సంబంధించి యాంత్రిక విప్లవం ఎంతో సహకరించింది. స్వల్ప వ్యవధిలో లక్షలాది ప్రతులు అచ్చయి, దేశంలోని ప్రతి ఇంటికి చేరేవిధంగా తోడ్పడింది. ముద్రణ యంత్రాలలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి.

టెలిగ్రాఫ్, టెలిఫోన్, రేడియో ఆవిర్భావం తర్వాత సమాచారాన్ని పంపించే వైజ్ఞానిక సదుపాయాలు అభివృద్ధి చెందడంతో లక్షలాది ప్రతులను స్వల్ప వ్యవధిలో ముద్రించడం జరుగుతోంది. ఉపగ్రహాల ద్వారా ప్రపంచంలోని ఏ సమాచారమైనా కొద్ది వ్యవధిలో ప్రపంచంలోని నలుమూలలకు పంపడం సాధ్యమైంది. ఈవిధంగా సమాచార సేకరణ, పంపిణీ వ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకున్నాయి. చాటింపు ద్వారా ప్రజలకు సమాచారాన్ని అందించే దశ నుండి ఉపగ్రహాల ద్వారా విశ్వాంతరాలకు సమాచారాన్ని అందజేయడం సులభసాధ్యమైంది.

"పత్రికలు ప్రారంభమైన తొలినాళ్ళలో అచ్చులో వెలువడిన విశేషాల పట్ల ప్రజలు చాలా ఆసక్తి చూపేవాళ్లు. (ఇప్పుడూ అంతే!) వర్తమాన తరంగిణి పత్రికలో ప్రజలలో దురాచారాలను, ప్రభుత్వ ఉద్యోగుల దుశ్చర్యలను చదవటానికి ముచ్చటగా, కథాక్రమంలో వర్ణిస్తూ రాసేవాళ్ళు. కానీ అప్పట్లో సరైన కాగితం దొరికేది కాదు. పీచు కాగితం దిగుమతి అయ్యేది. దానిని 'గుజలీ' అనేవాళ్ళు. చెన్నపురిలో గుజలీ బజారు అని ఉన్నదనుకుంటాను. పీచు కాగితం ఒకవైపు అచ్చువేస్తే, ఆ సిరా రెండో పక్కకు ఇంకేది. పాఠకులకు ఆ గజిబిజి అచ్చు బోధపడకపోయేది. పాపం! అచ్చుపడటంలేదు అని జాబులు రాసుకునేవాళ్లు. సంపాదకుడు క్షమాపణ చెప్పుకుని పాఠకుల అభిమానం కావాలని విజ్ఞప్తి చేసుకుంటూ ఉండేవాడు. ఇదెందుకు చెప్తున్నానంటే, అప్పటి పాఠకులు ఆ పత్రికకు అభిమానులు. పాఠకుల అభిమతం సంపాదకుని ధ్యేయం." (*తెలుగు పత్రికారంగం – నిన్న నేడు రేపు*, 2001, పుట 16)

పత్రికలు ప్రారంభమైన తొలినాళ్ళ ముద్రణకు, నేటికి ఎంతో మార్పు వచ్చింది. వేగం పెరిగింది. ఒకప్పుడు ప్రచురణ కేంద్రాలలో పత్రికలు పాఠకులకు కొన్ని గంటలలో అందేవి. గ్రామాలకు చేరాలంటే పన్నెండు గంటల నుంచి 24 గంటలదాకా పట్టేది. ఇప్పుడు ప్రచురణ కేంద్రాలు పెరిగాయి. పల్లెటూళ్ళలో సైతం అర్ధరాత్రి వరకు జరిగిన వార్తలతో పత్రికలు తెల్లవారేసరికి పాఠకులను చేరుతున్నాయి.

అక్షరాస్యత, కొనుగోలు శక్తి పెరగడంతో పత్రికలు కొని చదివేవారి సంఖ్య పెరిగింది. ఇరవయ్యవ శతాబ్ది మధ్యకాలంలో తెలుగు పత్రికల సర్క్యులేషన్ లక్షదాటడం గొప్ప. ఇప్పుడు పదిలక్షలు దాటడడం గొప్ప. అప్పుడు నాలుగు పేజీలకు పరిమితమైన పత్రికలు మూడు రెట్లు పెరిగాయి. ధర పోలిక లేనంత పెరిగింది. రంగుల బొమ్మల ముద్రణ సర్వసాధారణమైంది. రంగులేని ఫొటోను ప్రచురిస్తే పాఠకులు పెదవి విరుస్తున్నారు.

పాఠకులకు ఎక్కువ సమాచారం అందడంలో ఇంత వరకు ఇది మంచి పరిణామమే. అయితే పెద్ద పత్రికల మధ్య ఏర్పడిన పోటీ చిన్న పత్రికలను దెబ్బ కొట్టింది. ఎవరు ఎక్కువ పెట్టుబడి పెట్టగలిగితే వారే పోటీలో నిలవగలుగుతున్నారు.

ఎవరు ఎక్కువకాలం నష్టాలను భరించగలిగితే వారు మాత్రమే పోటీలో మిగిలి, తరువాత కాలంలో నష్టాలను భర్తీ చేసుకోవడంతో పాటు అధిక లాభాలు అర్జిస్తున్నారు. దిన పత్రికలో 'తల్లిపత్రిక', 'పిల్లపత్రిక'లుగా; 'ఆవు–దూడ'లుగా 'బ్రాడ్‌షీట్' పత్రికభాగం ఒకటి, 'టాబ్లాయిడ్' మరొకటి ఉంటున్నాయి.

టాబ్లాయిడ్‌లు జిల్లా స్పెషల్‌గా వెలువడుతూ స్థానిక వార్తలను విస్తృతంగా, వివరంగా ప్రచురిస్తున్నాయి. ఇందువల్ల వారం వారం వెలువడే న్యూస్ మాగజైన్ల ప్రాముఖ్యం తగ్గిపోయింది. దీనికి తోడు పెద్ద పత్రికలు అడ్వర్‌టైజ్‌మెంట్ల మీద దృష్టితో, సర్క్యులేషన్ పెంచడం కోసం ధరను కొన్నిచోట్ల అసాధారణంగా తగ్గించివేశాయి. ఈ పోటీలో చిన్న పత్రికలు తీవ్రంగా నష్టపోయాయి. చివరకు అరవై సంవత్సరాలకు పైగా ఆంధ్ర పాఠకలోకానికి సేవ చేసిన *ఆంధ్రపత్రిక, భారతి* లాంటి పత్రికలు మూతపడ్డాయి.

టెక్నాలజీ రంగంలో సాధించిన అభివృద్ధి పత్రికల స్వరూప స్వభావాలను మార్చివేసింది. వార్తలను క్షణాలమీద ఎక్కడ నుంచి ఎక్కడికైనా పంపగలుగుతున్నాము. ఫొటోలతో సహా సంఘటనలు జరిగిన కొద్ది సేపటిలోనే వార్తలను ప్రజలకు అందించడం సాధ్యమవుతున్నది. కంప్యూటర్లతో అక్షరాల కూర్పు, ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ముద్రణను బాగా మెరుగుపరచాయి. పోతపోసిన లోహపు అక్షరాల అవసరం తీరిపోయింది.

ఈ పెనుమార్పులను చిన్న పత్రికలు సైతం ఉపయోగించుకోవచ్చు. పెద్ద పత్రికలతో పోటీ ఉండని విధంగా వార్తలను, వ్యాఖ్యలను ప్రచురించే మార్గాలు ఉన్నాయి. పద్ధతులు కొన్నింటిని మార్చుకొంటే చిన్న పత్రికలు కూడా బతకవచ్చు. సిద్ధాంతాలు, అభిప్రాయాల విషయంలో రాజీపడలేని జర్నలిస్టులు, రచయితలు సొంతంగా పత్రికలు పెట్టుకొని, స్థానికంగా సర్క్యులేషన్ సంపాదించవచ్చు.

## 7.4 పత్రికా రంగం – పాత్రికేయుల పాత్ర

వార్తా పత్రిక ప్రచురణకు సంపాదకుడు, విలేకరి, ఫొటోగ్రాఫరు, ముద్రాపకుడు ఇలా ఎంతో మంది సంయుక్త సహకారం ఎంతైనా అవసరం. ఇందులో అందరి పాత్రలు సమపాళ్ళలో ఉంటాయి. జర్నలిస్టుల విషయానికి వస్తే మానసికంగానే కాక శారీరికంగా కూడా ఆరోగ్యవంతులై ఉండాలి. అతడు సామాన్య వ్యక్తికంటే మంచి యోగ్యత కలవాడై ఉండాలి.

ఒకప్పుడు పాత్రికేయునికి టైపు, షార్టుహాండుల్లో నైపుణ్యం ముఖ్యమైన అర్హతలుగా పరిగణించేవారు. కానీ ఈనాడు కంప్యూటర్, ఫ్యాక్స్, మోడెమ్ గురించిన పరిజ్ఞానం ఎంతైనా అవసరం. వీటితోపాటు పాత్రికేయుల్లో కలుపుగోలుతనం, చొరవ, అన్ని స్థాయుల వ్యక్తులతోనూ సాధికారంగా మాట్లాడగల సామర్థ్యం ఉండాలి.

పాత్రికేయునికి ఆత్మాభిమానం ఒక గీటురాయి లాంటిది. తన స్వాభిమానాన్ని కాపాడుకొంటూ అతను తన కర్తవ్యాన్ని పూర్తి చేయాల్సి ఉంటుంది. పత్రికారంగం ఈనాడు ఒక వాణిజ్య రంగంగా మారినప్పటికీ పాత్రికేయులు తమ పరిధిలో కర్తవ్యాన్ని నిర్వర్తించుకొంటూ తమ ఆత్మాభిమానం కూడా కాపాడుకోవాల్సి ఉంటుంది. లేకపోతే, ఆ పత్రిక ప్రతిష్ఠతో పాటు అతడు కూడా అపహాస్యం పాలు కావాల్సి వస్తుంది. పాత్రికేయుడు వార్తలను సేకరించే సందర్భంలో యథార్థ సంఘటనలను నిజాయితీగా రిపోర్టు చేయాలి. ఒక రచయితలాగ ఊహాజనితమైన వార్తలను పత్రికలో ప్రచురించడం తగదు.

పాత్రికేయునికి కావలసిన మరొక గుణం అతనిలో ఆత్మవిశ్వాసం సంపూర్ణంగా ఉండాలి. అంతేకాదు తన అర్హతను గురించి విశ్వాసం ఉండాలి. పాత్రికేయునిలో పరిశోధనతో పాటు పర్యటనాభిలాష కూడా ఉండాలి. ఈ రంగంలో సోమరిపోతుకు ఎలాంటి చోటులేదు. పత్రికారంగంలో ప్రవేశించేందుకు ఒక నిశ్చితమైన కొలతబద్ద లాంటి పరీక్షలు అవసరం లేదు. కానీ విశ్వవిద్యాలయాల యోగ్యతలు అతడి నైపుణ్యాభివృద్ధికి ఎంతగానో ఉపయోగిస్తాయి.

తెలుగు పత్రికా ప్రపంచంలో ఇటీవల పెనుమార్పులు వచ్చాయి. ఈ మార్పులు పత్రికా వ్యవస్థపైన, వృత్తిపైన, పత్రికా రచయితలమీద, పాఠకులపైన ఎనలేని ప్రభావాన్ని కలిగించాయి, కలిగిస్తున్నాయి. వీటిలో ప్రధానమైన మార్పులను పుట 257, 258లలో చూడవచ్చు.

– పత్రికల సర్క్యులేషన్, పాఠకుల సంఖ్య ఎన్నోరెట్లు పెరిగింది.

– ఒకే పత్రిక ప్రచురితమయ్యే కేంద్రాలు పెరిగాయి. విశాఖపట్నం, తిరుపతి సహా ఇతర పట్టణాలు ప్రచురణ కేంద్రాలుగా క్రొత్తగా ముందుకు వచ్చాయి.

– పత్రికల ఎడిషన్లు పెరిగి పెరిగి జిల్లాకొక ఎడిషన్‌గా ప్రచురించే స్థాయి (స్థితి)కి చేరుకున్నాం.

– జిల్లా స్థాయిలోనే పూర్తికాలం పూర్తి వేతనం మీద పనిచేసే విలేకరులను నియమించడం ప్రారంభమైంది.

– మండల కేంద్రాల్లో కూడా కంట్రిబ్యూటర్లను నియమించే పద్ధతి వల్ల రాష్ట్రంలో పత్రికా వృత్తిని చేపట్టిన వారి సంఖ్య కొన్ని వేలు దాటతోంది.

– శిక్షణ, రిఫ్రెషర్ కోర్సులు ప్రారంభమయినట్లే ప్రారంభమై, ఆ తర్వాత మటుమాయమై పోయాయి. వార్తలు పంపిస్తామన్న వారికల్లా గుర్తింపు కార్డు ఇచ్చే పరిస్థితి ఏర్పడింది.

– బహుశా ప్రపంచంలోనే అరుదైన విశేషం. అవసరం, ఔచిత్యం, సందర్భ విచక్షణతో నిమిత్తం లేకుండా తెలుగు దినపత్రిక తొలిపేజీ ప్రతిరోజు రంగుల్లో ముద్రితమవుతోంది.

– రాష్ట్రస్థాయి పత్రికలు జిల్లా ఎడిషన్లు ముద్రించడం ప్రారంభించడంతో స్థానిక దినపత్రికలకు ముప్పు ఏర్పడింది.

– పత్రికల ఖరీదు పెరిగింది. ఎంత పెరిగిందంటే ప్రతికూల ఫలితాల దిశగా (Counter-Productive) ఆందోళనకర పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

– అసలు సంపాదకుల పేర్లు అదృశ్యమవుతున్నాయి. పత్రికాధిపతులే సంపాదకులుగా, వారి పేర్లే రోజూ పత్రికల్లో దర్శనమిస్తున్నాయి.

– పత్రికల్లో భాష ప్రామాణికం చేయకపోవడంతో విశృంఖలత పెరిగింది. హెడ్డింగుల్లో సెన్సేషనలిజం, ప్రాస, నివారించదగిన ప్రయాసకు ప్రాధాన్యత ఏర్పడింది.

– ప్రింటింగ్ టెక్నాలజీ, కంప్యూటర్ల రంగ ప్రవేశంతో పత్రికా రచయిత వృత్తిలో చేరగలిగే వారి సంఖ్య తగ్గుతోంది. ప్రింటింగ్ క్వాలిటీ పెరిగిందే కానీ వార్తల నాణ్యతలో కాదు.

– టెక్నాలజీ ప్రవేశంతో పత్రికా నిర్వహణ ఖర్చులు విపరీతంగా పెరిగి, కొత్త పత్రికలు పెట్టే అవకాశం సన్నగిల్లుతోంది. ఉన్నవారిదే, అందులో ఆర్థిక శక్తి ఉన్నవారిదే గుత్తాధిపత్యం అవుతోంది.

– పత్రికా విలేకరులను కొనివేయవచ్చుననే అభిప్రాయం రాజకీయ నాయకుల్లో ఏర్పడింది. శిక్షణ లేకుండా గుర్తింపు కార్డు ఇవ్వడంతో పాత్రికేయ వృత్తిలో అక్కడక్కడ అసాంఘిక శక్తులు ప్రవేశించాయి. తామూ పౌరులం అనే భావన పాత్రికేయుల్లో సన్నగిల్లుతోంది.

– ఫలానా పత్రిక ఫలానా పార్టీది, లేక ఆ పార్టీలో ఫలానా గ్రూపుది, ఫలానా వ్యక్తికి అనుకూలంగా రాస్తుంది. అనే భావన పాఠకుల్లో కలుగుతోంది. ఆ మేరకు విశ్వసనీయత, నిష్పాక్షికత నీరసిస్తోంది.

– పత్రిక ఈ చివరి నుంచి ఆ చివరి వరకూ రాజకీయమే. అందులోనూ వ్యక్తుల చుట్టూ పరిభ్రమించే రాజకీయాలు, ఇతర విషయాలకు ప్రాధాన్యత పెరుగుతోంది. ప్రజల విజ్ఞానాన్ని పెంపొందించడం, రాజకీయేతరంగా ఉన్నా ముఖ్య సమస్యలపై ప్రజలకు సమాచారాన్ని అందజేయడం రానురాను సన్నగిల్లుతోంది.

– పెద్దదైన ప్రతి పత్రికా జర్నలిస్టుల నోట మట్టిగొట్టడానికి తనదైన ఒక వార్తా సర్వీసు ప్రారంభించింది. (*ఆంధ్రప్రదేశ్ దర్శిని వ్యాస సంకలనం*; రాఘవాచారి,సి. *తెలుగు పత్రికలు పరిణామం*, పుట 288–289)

## 7.5 పాత్రికేయులు – నైతిక నియమావళి

కేవలం వార్త రాయడం ఒక్కటే పాత్రికేయుడి పనికాదు. రాసే వార్తలో నిజాయితీ ఉండాలి. తన వ్యక్తిగత అభిప్రాయాన్ని పాత్రికేయుడు వార్తగా ప్రకటించకూడదు. సమాజానికి ఉపయోగించే అంశాలనే పాత్రికేయుడు ఎంచుకోవాలి. తనను నమ్మి సమాచారం అందించిన వ్యక్తి వివరాలను పత్రికా రచయిత గోప్యంగా ఉంచాలి. నేరవార్తలు, మహిళలపై అత్యాచారాల వార్తలు రాసేటప్పుడు కులమతాల ప్రస్తావన తెచ్చి ఆయా వర్గాల మధ్య కలతలు, కలహాలు చెలరేగే విధంగా వార్తలు రాయడం – సమాచారం సరైందే అయినా అనైతికమవుతుంది.

అలాగే మత కలహాలు జరిగినప్పుడు రెచ్చగొట్టే రాతలు రాయడం, ప్రజల నైతిక స్థైర్యాన్ని దెబ్బతీయటం, అధికార వ్యవస్థపై నమ్మకం సడలేట్టు చేయడం తగదు. అయితే సమస్యకు పరిష్కారం చూపటానికి చారిత్రకాంశాలను వివరించి, విశ్లేషించి, సందర్భశుద్ధి గల అభిప్రాయాన్ని ప్రకటించడంలో తప్పులేదు. వ్యంగ్యరచనలు, వెటకారపు రాతలు కేవలం శైలినిబట్టే ఆక్షేపణీయం అయిపోవు. కానీ, అవి దూషణలు, అసభ్యరాతల స్థాయికి దిగజారినట్టయితే అనుచితమవుతాయి.

ఏదో ఒక సంఘటనను ఆధారంగా తీసుకుని ఒక వర్గం, ఒక కులం, ఒక మతం యావత్తును జాతి వ్యతిరేక వర్గంగా, నేర ప్రవృత్తిగల వర్గంగా చిత్రించడం అనైతికమవుతుంది. అయితే ఆయా సంస్థల కార్యకలాపాలను, వాటి అభివృద్ధి నిరోధక, జాతి విద్రోహకర తత్వాన్ని, సహేతుకంగా వివరించడం తప్పు కాదు. వార్తలో అతిశయోక్తులు రాయడం, ముఖ్యమైన అంశాలను రాయకుండడా వదిలేయడం అనుచితమవుతుంది. వార్తారచనలో, ప్రచురణలో పత్రికా రచయితలు పూర్తి జాగ్రత్త వహించాలని నైతిక సూత్రావళి నిర్దేశిస్తున్నది. కొన్నిసార్లు  వార్తలు వాటి సేకరణకు నియమించిన విలేకరి ద్వారా కాక ఇతరుల నుండి అందుతాయి.

కొత్త వ్యక్తుల నుండి అందిన సమాచారాన్ని ధ్రువపరచుకున్నాకే ప్రచురించాలి. పత్రిక నియోగించిన విలేకరులు పంపిన వార్తలను సంపాదకుడు మళ్ళీ ధ్రువపరచుకోవాలసిన అవసరం లేదు. సామాన్యంగా వారిని నమ్మి వార్తలను ప్రచురించడంలో తప్పులేదు. కానీ, తేడా వచ్చినప్పుడు ఆ విషయం తెలిసిన వ్యక్తులు గుర్తు చేస్తే ధ్రువపరచుకున్న తర్వాత సవరణ వేయడం నైతికం. ఖండనవస్తే, దాన్ని ప్రచురించడం వృత్తి ధర్మం.

ఇతర పత్రికలు ప్రచురించిన, తీవ్ర పరిణామాలకు దారితీసే అంశం మీద, అది నిజమో కాదో ధ్రువపరచుకోకుండా సంపాదకీయ వ్యాఖ్యలు రాయగూడదు. వార్తను వెంటనే ప్రచురించడం వృత్తి ధర్మం. కాని ధ్రువపడని వార్తలపై తొందరపడి వ్యాఖ్యలు రాయడం వంటి తొందరపాటువల్ల అనర్థమే తప్ప సాధించే అదనపు ప్రయోజనం ఉండదు. తప్పుడు వార్త ఆధారంగా చేసిన వ్యాఖ్యను నిజం తెలిసిన వెంటనే స్వచ్ఛందంగా సవరించడమేగాక విచారం కూడా ప్రకటించాలి.

నిజానికి, వివరణ ప్రచురించినంత మాత్రానే సరిపోదు. ఒక బహిరంగ సభలో అప్పటి ప్రధాని చేసిన ప్రసంగంలో ఆయన అనని మాటలను ఆపాదించి ప్రముఖ పత్రిక ఒకటి వ్యాఖ్య రాసింది. ఆ సభలో ఉన్న పాఠకుడొకరు సవరణ పంపాడు. పత్రిక ప్రచురించలేదు. పత్రికా మండలిని ఆశ్రయించాడు. పాఠకుడు పంపిన సవరణను ప్రచురించాలని మండలి ఆదేశించింది. పొరపాటు జరిగినప్పుడు ఎవరైనా యదార్థాన్ని తెలియపరుస్తూ సమాచారం పంపినట్టయితే కనీసం లేఖలలో భాగంగానైనా దాన్ని ప్రచురించడం ధర్మం. తొలి సమాచారాన్ని అందించిన వారిపై దూషణలకు దిగకూడదు. అలాంటి దూషణలను, స్పష్టత కొరవడిన సందిగ్ధంగా ఉన్న వివరాలను, మానహాని కలిగించే అంశాలను ప్రచురించడానికి సంపాదకుడు నిరాకరించవచ్చు. (తెలుగు పత్రికారంగం – నిన్న నేడు రేపు, 2001, పుట 95)

## 7.6 పత్రికలు – ప్రభుత్వ ఆంక్షలు

పత్రికలు ప్రజాస్వామ్య పరిరక్షణకు సిపాయిల లాంటివి. ప్రజల హక్కులు, యోగక్షేమాల కొరకు నిరంతరం కాపలాదారుగా జాగరూకత వహిస్తుంటాయి. ఆయుధాలకన్నా అక్షరాలే శక్తివంతమైనవి మేధావులు చెప్పిన సూత్రవాక్యం నూరుపాళ్ళు సత్యం అని చెప్పవచ్చు.

పత్రికలు యువకులను బానిసత్వం నుండి భారతదేశాన్ని విముక్తి కలిగించేందుకు ఎంతగానో ప్రభావితం చేశాయి. అంతేకాకుండా ప్రజలను ఉత్తేజపరిచి పరాయి ప్రభుత్వానికి వ్యతిరేకంగా సమరానికి సమాయత్త పరిచాయి. బ్రిటిషు ప్రభుత్వం భారతీయ ప్రజలను బానిసలుగా చేసుకొని వారిపట్ల అమానుషంగా ప్రవర్తించేది. క్రమంగా భారతీయుల్లో చైతన్యం కలిగింది. 1905లో ప్రారంభమైన వందేమాతరం ఉద్యమం స్వాతంత్ర్య పోరాటానికి బీజం వేసింది. అంతేకాకుండా మహారాష్ట్ర కేసరి పేరుతో ప్రఖ్యాతి గాంచిన మేధావి బాలగంగాధర తిలక్ స్వాతంత్ర్యం మన జన్మహక్కు అనే పిలుపునిచ్చారు. పత్రికలు ఆ ఉద్యమాన్ని ప్రోత్సహించాయి.

ప్రభుత్వం పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించేందుకు 1908, 1910లో కొన్ని చట్టాలు అమలు చేసింది. అంతేకాకుండా 1932లో కొన్ని ఆర్డినెన్స్‌ల ద్వారా పత్రికా వార్తలపైన కొన్ని చర్యలు చేపట్టింది. కానీ పత్రికలను, పత్రికా స్వాతంత్ర్యాన్ని ఆ చట్టాలు అణచివేయలేక పోయాయి. 1910లో ప్రెస్ యాక్ట్ అమలు చేయబడింది. ఆకారణంగా భారతీయ పత్రికలపై ఆంక్షలు విధించబడ్డాయి.

తరువాత కాలంలో మరికొన్ని ఆర్డినెన్స్‌లు అమలు చేసి ప్రభుత్వం పత్రికల గొంతు నొక్కేందుకు శతవిధాల ప్రయత్నించింది. అప్పుడు పత్రికాధిపతులు, పత్రికా సంపాదకులు ఆ చట్టాలకు అతీతంగా చేతిరాత పత్రికలు, గోడపత్రికలు, సైక్లోస్టయిల్ పత్రికలు ప్రారంభించారు. వాటిని కూడ అణచేందుకు 'క్రిమినల్‌లా'ను ప్రవేశపెట్టారు. వాటితో పాటు కొన్ని ఎమర్జెన్సీ చట్టాలను కూడా రూపొందించి జాతీయ పత్రికల అణచివేతకు ఇండియన్ పీనల్‌కోడ్‌ను కూడా ప్రయోగించారు. ఆ పీనల్ కోడ్‌లోని కొన్ని సెక్షన్ల ప్రకారం పత్రికా యాజమాన్యాన్ని, సంపాదకులను నిర్బంధించే ప్రయత్నాలు జరిగాయి. కానీ పత్రికా ప్రపంచం వాటిని లెక్క చేయలేదు.

పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించేవిధంగా 1910లో ఒక చట్టాన్ని ప్రవేశపెట్టి వార్తా పత్రికల యజమానుల నుండి ధరావత్తు క్రింద కొంత మొత్తాన్ని వసూలు చేసేవారు. ఆ చట్టం ముఖ్యమైన ఉద్దేశం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎలాంటి విషయాలైనా ప్రచురిస్తే ముందు చెల్లించిన ధరావత్తును హస్తగతం చేసుకోవడమే కాకుండా అధిక ధరావత్తులను వసూలు చేసేవారు. ఈ యాక్టు ప్రకారం దాదాపు 25 పత్రికలు మూతపడ్డాయి. అంతేకాకుండా కొన్ని పత్రికలను అభ్యంతరకరమైన వ్యాసాలను ప్రచురించారనే నెపంతో మూసి వేయిచండం కూడా జరిగింది.

*ఆంధ్రపత్రిక* వారపత్రిక 1914 ఏప్రిల్ 1వ తేదీన దినపత్రికగా మారింది. ఆ పత్రికలో ప్రచురించిన వ్యాసాలను ప్రభుత్వం అభ్యంతరకరమైన విషయాలుగా భావించి అనేక పర్యాయాలు హెచ్చరికలు చేయడం జరిగింది. అలాగే *కృష్ణాపత్రిక, హితకారిణి* పత్రికలకు కూడా ప్రభుత్వం తరపున హెచ్చరికలు అందుతూ వచ్చాయి. అలాగే క్రమంగా బ్రిటిషు ప్రభుత్వానికి ఏ రకంగా నైనా వ్యతిరేకమైన చిన్న సమాచారం పత్రికల్లో ప్రచురింపబడితే ఆ పత్రికలన్నింటిని కూడా ప్రభుత్వం హెచ్చరికలు చేస్తూనే వచ్చింది. ఆ తరువాత బ్రిటిష్ ప్రభుత్వం మరొక చట్టాన్ని కూడా అమలులోనికి తెచ్చింది. విదేశాల నుండి బ్రిటిషు వ్యతిరేక పత్రికలను, సాహిత్యాన్ని దిగుమతి చేసుకొన్న వారిపట్ల కఠిన చర్యలు తీసుకుంటామని హెచ్చరిక కూడా చేయడం జరిగింది.

ఈ 15వ ప్రెస్‌యాక్ట్ చట్టం ద్వారా ప్రభుత్వం పత్రికా స్వాతంత్ర్యాన్ని అణచివేసేందుకు చేసే ప్రయత్నాలను ప్రజలు, పత్రికలు వ్యతిరేకించాయి. దేశ వ్యాప్తంగా ప్రారంభమైన ఈ ఉద్యమాన్ని తెలుగు పత్రికలు కూడా సమర్థించాయి. అంతేకాదు ఆ చట్టాన్ని విమర్శిస్తూ తీవ్ర పదజాలంతో సంపాదకీయాలు రాయడం కూడా జరిగింది. ఈ చట్టాన్ని జాతీయ పత్రిక అయిన కృష్ణాపత్రిక విమర్శిస్తూ సంపాదకీయం రాసింది. అలాగే కాంగ్రెస్ పత్రిక ఆ చట్టం భారతీయ పత్రికల ఆత్మగౌరవానికి ఒక సవాలుగా అభివర్ణించింది.

ప్రభుత్వం విధించిన ధరావత్తు చెల్లించలేక 1930లో టంగుటూరి ప్రకాశం పంతులు నడిపిన ఇంగ్లీషు 'స్వరాజ్య' పత్రిక, తెలుగు పత్రికలలో '*కృష్ణాపత్రిక*', '*సత్యాగ్రహి*', '*కాంగ్రెస్*' '*ఇంద్రావతి*', '*సింహపురి*' మొదలైన పత్రికలు మూతబడ్డాయి. అయితే పత్రికాధిపతుల ధరావతులు కట్టడం ఇష్టం లేక పోయినా స్వాతంత్ర్యోద్యమ కార్యక్రమాలు ప్రజలకు తెలియకుండా పోతాయని కొన్ని పత్రికలు ధరావత్తు చెల్లించాయి. అందులో *ఆంధ్రపత్రిక* ఒకటి.

తెలుగు పత్రికారంగంలో మొదటిసారి ప్రభుత్వ ఆగ్రహానికి గురై అరెస్టు చేయబడిన వ్యక్తి స్వరాజ్య సంపాదకులైన గాడిచర్ల హరిసర్వోత్తమరావు. ఆ తరువాత కృష్ణాపత్రిక సంపాదకుడైన మట్నూరి కృష్ణారావును నిర్బంధించాలనే ప్రయత్నం జరిగింది. కానీ ఈ పత్రిక కృష్ణాజిల్లా అసోసియేషన్ ఆధ్వర్యంలో నడుపబడేది. ఆ అసోషియేషన్ అధ్యక్షుడు హనుమంతరావు ప్రభుత్వ పబ్లిక్ ప్రసిక్యూటర్‌గా ఉన్నారు. ఆయన జిల్లా మెజిస్ట్రేట్‌ను కలిసి కృష్ణారావును సంపాదకత్వం నుండి తొలగిస్తామని హామీ ఇచ్చి వారెంట్ రద్దు చేయించారు.

అలాగే రాజమండ్రికి చెందిన మద్దూరి అన్నపూర్ణయ్య సంపాదకత్వాన వెలువడుతున్న వారపత్రిక 'కాంగ్రెస్'కు చెందిన అయిదుగురు సంపాదకులు కారాగార శిక్ష అనుభవించారు. పత్రికారంగంలో ఇది ఒక అనూహ్యమైన సంఘటనగా భావించవచ్చు.

ఈవిధంగా బ్రిటీషు పాలనలో భారతదేశ పత్రికారంగం ఎన్నో ఆటుపోట్లు ఎదుర్కొంది. స్వాతంత్ర్యానంతరం మన ప్రభుత్వం పత్రికలకు స్వేచ్ఛ కల్పించింది. ఎమర్జెన్సీ వంటి ఒకటి రెండు పరిస్థితుల్లో తప్ప దేశీయ పత్రికారంగం స్వతంత్ర దేశంలో ఏవిధమైన ఇబ్బందులకు గురికాలేదు. వ్యవస్థాపరమైన ఉన్న ఇబ్బందులను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు లేదా కేంద్ర ప్రభుత్వమే స్వయంగా పరిష్కరించడం జరుగుతోంది. ఈ విషయంలో పాత్రికేయ సంఘాలు.. అందులోను కృష్ణాజిల్లా పాత్రికేయ సంఘం ఎంతో చురుకుగా పనిచేస్తోంది. పత్రికాస్వేచ్ఛకు, పాత్రికేయుల స్వేచ్ఛకు ఏవిధమైన విఘాతం కలుగకుండా అన్ని చర్యలూ తీసుకుంటోంది.

## అధ్యాయం - 8

# ముగింపు

సమాజంలోని ప్రజల మనోభావాలకు ప్రతిబింబాలుగా, సమాజ అభివృద్ధికి మార్గదర్శక తారగా పత్రికలు రూపుదిద్దుకుంటాయి. ప్రజల ఆకాంక్షలకు, ఆశయాలకు ఇవి దర్పణాలు. సమాజంలో జరిగిన సంఘటనలు పత్రికల ద్వారా ప్రకటితమై, ప్రజాబాహుళ్యంలో విస్తృత ప్రచారం పొందుతాయి. సమాజంలోని ప్రతి సంఘటనకు పత్రికలు వేదికగా నిలుస్తాయి. సమాజంలోని ప్రతి వ్యక్తి అవసరానికి పత్రికలు ఆకరాలుగా పనిచేస్తాయి. అందుకనే పత్రికలు లేని సమాజాన్ని ఊహించుకోవడం కష్టమనే నానుడి వ్యాప్తిలోకి వచ్చింది. కేవలం జరిగిన విషయాలను ప్రకటించడం మాత్రమే పత్రికల పని కాదు. తెల్లదొరల పాలనలో మగ్గుతున్న దేశపౌరుల్లో స్వతంత్ర భావాలను ఉద్దీపింపజేయాలనే ప్రధాన లక్ష్యంతోనే తొలినాటి పత్రికలు ఊపిరిపోసుకున్నాయి. నాటి సమాజం యావత్తు పత్రికలను కరదీపికలుగా భావించి, చైతన్యవంతం అయింది. అనంతర కాలంలో కూడా అనేక ఉద్యమాలకు పత్రికలు పురిటిగడ్డగా నిలిచాయి. ప్రకృతి విపత్తులు సంభవించినప్పుడు ఆపన్న హస్తం అందించి, ప్రజలను ఆదుకున్నాయి. ఈవిధంగా పత్రికలు తమ బహుముఖీనమైన కార్యనిర్వహణ ద్వారా సమాజ చైతన్యదీప్తులుగా నిలుస్తున్నాయి.

చట్టసభలు, న్యాయస్థానాలు కూడా చేయలేని పనిని కొన్ని సందర్భాల్లో పత్రికలు పూర్తిచేసిన సంఘటనలు ఉన్నాయి. ప్రభుత్వ లోపాలను ఎత్తిచూపుతూ, ప్రజా సమస్యల పట్ల, ప్రజల దుస్థితి పట్ల, సమాజంలో జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు, ప్రజాప్రతినిధుల దుశ్చర్యల పట్ల పత్రికలు ప్రభుత్వాన్ని అప్రమత్తం చేశాయి. సమాజంలోని అనేక సమస్యలను వెలుగులోని తీసుకువచ్చి, అధికారులు, ప్రభుత్వం వాటి పట్ల స్పందించేలా చేయడం కూడా పత్రికలు సాధిస్తున్న ఘన విజయం. కత్తికి భయపడని వాడు కలానికి భయపడతాడన్న నానుడికి నిఖార్సయిన నకళ్ళుగా పత్రికలు నిలుస్తాయి. దుందుడుకుగా వ్యవహరిస్తున్న ప్రభుత్వాల పతనానికి పత్రికలే దోహదపడిన సంఘటనలూ చరిత్రలో ఉన్నాయి. ఈవిధంగా పత్రికలు ప్రభుత్వాన్ని మార్చివేసే / ఏర్పాటుచేయగలిగే గొప్పశక్తిని కలిగి ఉన్నాయి. అంతేకాదు..మనిషి ఆలోచన క్రమాన్ని, జీవిత విధానాన్ని మార్చివేసే శక్తి పత్రికలకు ఉంది. మొత్తంగా ప్రజాస్వామ్య మనుగడకు, ప్రజాశ్రేయస్సుకు పత్రికలు ఆలంబనగా నిలుస్తున్నాయి.

## 8.1 తొలితరం తెలుగు పత్రికలు

తెలుగులో పత్రికల చరిత్రను గ్రంథస్థం చేయడంలో అనేక లోపాలు జరిగాయి. చరిత్రకారుల నిర్లక్ష్యానికి ఫలితమా అన్నట్లు నేటికీ తెలుగులో తొలిపత్రిక ఏదన్న విషయంలో సందిగ్ధత తొలగలేదు. తెలుగులో మొదటి పత్రిక సత్యదూత అని ఎక్కువమంది అభిప్రాయం వ్యక్తంచేస్తున్నారు. నిడదవోలు వెంకటేశ్వరరావు, నార్ల వేంకటేశ్వరరావు తదితరులు దీన్ని సమర్థించారు. అయితే ఈ పత్రికే తొలి పత్రిక అని నిరూపించే ఆధారాలేవీ ఇంతవరకు పూర్తిగా స్పష్టంగా లభించలేదు. *మద్రాస్ క్రానికల్, కర్నాటిక్ క్రానికల్, ఫోర్ట్‌సెంట్ జార్జ్‌గెజిట్, వృత్తాంతి, వర్తమాన తరంగిణి, హితవాది, దినవర్తమాని* మొదలైనవి తొలినాటి తెలుగు పత్రికలు. ఇవన్నీ ఆకాలంలో తమదైన శైలిలో సమాజం మీద ప్రభవాన్ని చూపించాయి.

## 8.2 కృష్ణాజిల్లా నుంచి వెలువడిన పత్రికలు

చారిత్రకంగా కృష్ణాజిల్లా ఎంతో ప్రసిద్ధి పొందింది. తొట్టతొలి తెలుగు దినపత్రిక దేశాభిమాని కృష్ణాజిల్లాలోని విజయవాడ నుంచే వెలువడింది. తెలుగు పత్రికల చరిత్రలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్న కృష్ణాపత్రిక జిల్లాలోని మచిలీపట్నం నుంచి వెలువడింది. *ఆంధ్రజ్యోతి, ప్రజాశక్తి, విశాలాంధ్ర, ఉదయం* వంటి దినపత్రికలు కృష్ణాజిల్లా విజయవాడలోనే తొలిగా ప్రకటితమయ్యాయి. ఇతర ప్రఖ్యాత దినపత్రికలైన *ఈనాడు, సాక్షి, ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ,* సూర్య మొదలైనవన్నీ కృష్ణాజిల్లా శాఖలు ప్రారంభించి, ఇక్కడి నుంచి కూడా వెలువడుతున్నాయి. ముట్నూరి కృష్ణారావు, కాశీనాథుని నాగేశ్వరరావు, శివలెంక శంభుప్రసాద్, నార్ల వేంకటేశ్వరరావు, నందూరి రామ్మోహనరావు, జి.వి.కృపానిధి, కోలవెన్ను రామకోటీశ్వరరావు, సి.రాఘవాచారి, తుర్లపాటి కుటుంబరావు వంటి ఉద్దండులైన పత్రికా సంపాదకులు కృష్ణాజిల్లాకు చెందిన వారే.

కేవలం దినపత్రికలే కాకుండా వార, పక్ష, మాస, ద్వైమాసిక, త్రైమాసిక, అర్ధవార్షిక, వార్షిక పత్రికలెన్నో కృష్ణాజిల్లా నుంచి వెలువడుతున్నాయి. విద్య, ఉద్యోగం, విజ్ఞానం, రాజకీయం, వాణిజ్యం, రవాణా, సాహిత్యం, వ్యవసాయం, వైద్యం, భక్తి, ఆధ్యాత్మికం... ఇలా అనేక రంగాలకు సంబంధించి, వివిధ ఆవర్తన వ్యవధుల్లో 500కు పైగా పత్రికలు కృష్ణాజిల్లా నుంచి వెలవడుతున్నాయి.

## 8.3 కృష్ణాజిల్లా పత్రికలు - భాషా స్వరూపం

### 8.3.1 శీర్షికలు

పత్రికలకు ప్రధాన ఆకర్షణ శీర్షికలు. ఇవి ఎంత ఆకర్షణీయంగా ఉంటే పాఠకులు వాటిపట్ల అంత ఎక్కువగా ఆదరణ చూపిస్తారు. పాఠకుడిచేత వార్త చదివింపజేయడంలో శీర్షికదే ప్రధాన పాత్ర. ఆసక్తికరంగా లేని శీర్షిక పాఠకుడు వేరొక వార్త వైపునకు తిరిగేలా చేస్తుంది. చదివిన వెంటనే పాఠకుడు సదరు వార్తను పూర్తిగా చదవడానికి ఆసక్తి చూపించేలా చేయడమే శీర్షిక గొప్పదనం / ప్రధానవిధి. శీర్షిక రచనలో కనిపిస్తున్న వైవిధ్యాన్ని ఆధారంగా చేసుకుని, శీర్షికలను వివిధ రకాలుగా వర్గీకరించడం జరిగింది. సాభిప్రాయ శీర్షికలు, వ్యంగ్య శీర్షికలు, అతిశయోక్తి శీర్షికలు, శ్లేష శీర్షికలు, అంత్యప్రాస శీర్షికలు, కవిత్వ పాదాల శీర్షికలు, భావాత్మక శీర్షికలు, కర్మణ్యర్థక శీర్షికలు, సమాపక క్రియా సహిత శీర్షికలు, లేబిల్ శీర్షికలు, డెక్ శీర్షికలు ఈ విభజలో ముఖ్యమైనవి.

### 8.3.2 నవ్యపద కల్పన

భాష, సమాజం- రెండూ నిత్య పరిణామ శీలం కలిగిఉంటాయి. ఈ క్రమంలో పత్రికాభాష కూడా అనేక మార్పులకు లోనవుతూ వచ్చింది. పత్రికా రచనలో నవ్యపద కల్పనకు ప్రాధాన్యత పెరిగింది. ఇందుకు అనేక ఉదాహరణలు ఉన్నాయి.

అచ్చతెలుగు పదాలు అందుబాటులో ఉన్నప్పటికీ పత్రికా రచనలో నూతన పద కల్పన చేసే విషయంలో సంస్కృతం / ఉర్దు / ఆంగ్ల పదాలను విరివిగా ఉపయోగించడం జరుగుతోంది. పొగతాగడం, బంగారు పతకం, తొలిసారి... మొదలైన పదాలు తెలుగులో ఉన్నప్పటికీ వీటికి వరుసగా ధూమపానం, స్వర్ణపతకం, ప్రథమం, ప్రభృతులు పదాలు వాడడాన్ని ఉదాహరణగా చెప్పవచ్చు. ఆంగ్లం నుంచి నేరుగా వచ్చిన పదాలు మరికొన్ని పత్రికారచనలో కనిపిస్తాయి. పార్టీ, గవర్నర్, ఎమ్మెల్యే, గేట్లు, బస్సు మొదలైన పదాలు ఇందుకు ఉదాహరణ. అలాగే పర్షో అరబిక్ నుంచి మాజీ, హోదా, ఖరీదు, జిల్లా, పేషీ, తహశీల్దార్ మొదలైన పదాలు; సంస్కృతం నుంచి ప్రాణం, అధికారం, లేఖ, భవనం, పక్షి, భూమి మొదలైన పదాలు తెలుగులోకి వచ్చి చేరాయి.

మిశ్ర సమాసాలను తయారుచేసే సందర్భంలో అప్పటికే ప్రజల్లో బాగా వ్యాప్తిలో ఉన్న పదాలు తీసుకుంటే తేలికగా ఉంటుందన్న ఆలోచన పత్రికారచయితలకు ఉంటుంది. అంతరిక్ష కర్మాగారం, సినీతారలు, శాసనసభా వ్యవహారాలు, ప్రజాస్వామ్యం, వాణిజ్యపన్నులు మొదలైన పదాలు ఇందుకు ఉదాహరణ.

మూలభాషలో రెండు లేదా అంతకన్నా ఎక్కువ పదాలతో ఉన్న పదబంధాన్ని లక్ష్యభాషలోకి అనువదించే సందర్భంలో పత్రికా రచయిత ఆ పదబంధంలోని విడివిడి పదాల భావాలను తీసుకుని, మొత్తంగా కలిపి నూతన పదబంధం తయారుచేయడం పత్రికారచనలో కనిపిస్తుంది.

రూరల్ వాటర్ సప్లై – గ్రామీణ నీటి సరఫరా; ఎసెన్షియల్ కమోడిటీస్ – నిత్యావసర వస్తువులు, బేసిక్ ఎమినిటీస్ – కనీస సౌకర్యాలు..మొదలైనవి ఇందుకు ఉదాహరణ. మూలభాషలోని పదాలు లేదా పదబంధాలను నేరుగా అనువాదం చేయలేని సందర్భంలో ఆ పదాల అర్థాలను వివరణాత్మకంగా చెబుతూ నూతన పదాలను సృష్టించడం కూడా పత్రికా రచనలో కనిపిస్తుంది. డిపార్ట్‌మెంటల్ ఎంక్వైయిరీ – శాఖాపరమైన దర్యాప్తు; వీకర్ సెక్షన్ హౌసింగ్ – బలహీనవర్గాల గృహనిర్మాణం, ఫారిన్ ఎక్స్ఛేంజ్ – విదేశీ మారకద్రవ్య నియంత్రణ మొదలైన పదబంధాల సృష్టి ఈ తరహా పదకల్పనకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

## 8.3.3 లేఖన పద్ధతులు

వార్తా రచన పరంగా 1980 దశకం ద్వితీయభాగం వచ్చేసరికి వర్ణాలు (అక్షరాలు) ఆధునిక రూపాన్ని సంతరించుకున్నాయి. కొన్ని వర్ణాలు సంయోజనం చెందడం వల్ల లిపులు కూడా లుప్తమయ్యాయి. వార్తా కథారచన ఆధునిక ప్రామాణిక భాషలో సాగింది.

✦ ఋ, ౠ లు పూర్తిగా వాడుక నుంచి దూరమయ్యాయి. ఋణం – రుణం; ఋషి – రుషి..తదితరాలు ఇందుకు ఉదాహరణ.

✦ పదాదిలో ఉండే సంయుక్తాక్షరం రేఫతో కూడి ఉంటే, అది నేటి వ్యవహారం నుంచి దూరమైంది. క్రొత్త – కొత్త; వ్రేలాడు – వేలాడు; త్రవ్వించు – తవ్వించు, క్రింద – కింద.. మొదలైనవి ఇందుకు ఉదాహరణ.

✦ ప్రస్తుత వ్యవహారంలో పదాంతలో 'ము' వర్ణకానికి బదులు పూర్ణానుస్వారం రాయడం వ్యాప్తిలోకి వచ్చింది. రాజ్యము – రాజ్యం; భూకంపము – భూకంపం; విగ్రహము – విగ్రహం మొ॥నవి ఇందుకు ఉదాహరణ.

✦ మహాప్రాణాక్షరాలు పత్రికారచనలో అల్పప్రాణ అక్షరాలుగా స్థిరీకరణ పొందాయి. ఇందుకు ఉదాహరణగా పటిష్ఠం – పటిష్టం, ఘంటలు – గంటలు; విలేఖరి – విలేకరి, ఇష్ఠాగోష్ఠి – ఇష్టాగోష్టి తదితర పదాలను చెప్పవచ్చు.

✦ థ – ద; గ – ప; మ – వ; శ – స భేదాలు ఆధునిక పత్రికా రచన నుంచి దూరమయ్యాయి.

## 8.3.4 లిప్యంతరీకరణ

వర్తమాన తెలుగు భాషలో ఆంగ్లం నుంచి తీసుకున్న పదాల వినియోగం ఎక్కువగా ఉందన్న విషయం తెలిసిందే. ఈ క్రమంలో పత్రికారచనలోను ఆంగ్ల పదాల వినియోగం పెరిగింది. ఈ ఆంగ్ల పదాల విషయంలోను తొలినాటి పత్రికా రచనకు, వర్తమాన పత్రికా రచనకు భేదాలు కనిపిస్తున్నాయి.

✦ ఆంగ్ల పదాలను తెలుగులోకి లిప్యంతరీకరణం చేసి రాసేటప్పుడు 'య' వత్తు లోపిస్తోంది. జ్యుడీషియల్ – జుడీషియల్; జ్యూట్ – జూట్; ప్యాసు – పాసు మొదలైన పదాలు ఇందుకు ఉదాహరణ.

✦ తొలిగా ద్విత్వాక్షరాలుగా వాడిన ఆంగ్ల పదాలు తర్వాత కాలప్రభావానికి లోనై అద్విరుక్తాక్షరాలుగా వినియోగంలోకి వస్తున్నాయి. అక్కౌంటెంటు – అకౌంటెంట్; క్యుషను – కుషన్, విల్లియం – విలియం; హెడ్డు – హెడ్ మొదలైనవి ఇందుకు ఉదాహరణ.

✦ సంధిస్వరాల్లో మార్పులు వచ్చాయి. 'ఐ', 'ఔ'లు కాలక్రమంలో 'అయి'; 'అవు'గా మారాయి. ఉదా: స్ట్రయిట్ – స్ట్రైట్; రిప్లయి – రిప్లై; ఫ్లయిట్ – ఫ్లైట్; సరవుడింగ్స్ – సరౌండింగ్స్; కటవుట్ – కటౌట్, అవుట్ – ఔట్.

✦ లిప్యంతరీకరణలో కొన్నిచోట్ల అతిశోధిత రూపాలు కనిపిస్తున్నాయి. మూలపదం ఉచ్చారణకు తగినట్టుగా కాకుండా లక్ష్యభాషలోని పదాల స్వరూపానికి తగినట్టుగా లిపిని మార్చి రాయడం జరుగుతోంది. ఉదా: బరాజ్ – బ్యారేజీ; ఇలెక్ట్రానిక్ – ఎలక్ట్రానిక్; ఇగ్జామినర్ – ఎగ్జామినర్ మొదలగునవి.

✦ ఉర్దూ నుంచి తెలుగులోకి పదాలను లిప్యంతరీకరణ చేసే సందర్భంలో అల్పప్రాణాలు, మహాప్రాణాక్షరాలు విషయంలో స్పష్టమైన తేడా కనిపిస్తోంది. ఉదా: ఫిర్యాదు – పిర్యాదు; బందిఖానా – బందికానా; ఖరీద్ – ఖరీదు; ఖబర్ – కబురు మొ॥నవి.

## 8.4 కృష్ణాజిల్లా నుంచి వెలువడుతున్న పత్రికలు – శైలి

అన్ని ఇతర సాహిత్య ప్రక్రియల తీరులోనే పత్రికా సాహిత్యం కూడా తనకంటూ ఓ ప్రత్యేకతను సంతరించుకుంది. ఈ క్రమంలో పత్రికా భాషకంటూ ఓ శైలి ఏర్పడింది. అయితే ఇతర సాహిత్య ప్రక్రియల మాదిరిగా పత్రికల భాషాశైలికి స్థిర రూపం ఏర్పడలేదు. పత్రికా రచన స్థూలంగా ఒకే రచయిత చేతిమీదుగా సాగినది కాకపోవడం ఇందుకు కారణం. ఒకరు కన్నా ఎక్కువ మంది రచయితలు రాసినప్పటికీ పత్రికలోని వార్తలన్నీ ఒక అంతస్సూత్రంతో నిండి ఉంటాయి. ఏ వార్తకు ఆ వార్త ప్రత్యేకంగా ఉంటూనే అన్నిటినీ కలిపి ఉంచే సాధారణ ప్రామాణిక భాషాశైలిని పత్రిక కలిగి ఉంటుంది. దీనివల్ల పత్రిక ఒకే భాషలో ప్రయాణించినట్లు అనిపిస్తుంది.

### 8.4.1 శైలి రకాలు

పత్రికా రచన అయినప్పటికీ ప్రతి రచనకూ ఓ శైలి తప్పనిసరిగా ఉంటుంది. ఈ శైలి అనేక రకాలుగా ఉంటుంది. వచన రచనను బట్టి శైలీభేదం ఏర్పడుతుంది. ఈ భేదాలను కింది విధంగా వర్గీకరించడం జరిగింది.

#### 8.4.1.1 కథన పద్ధతిని బట్టి శైలి

1. కథనాత్మక శైలి
2. వాదాత్మక శైలి
3. నాటకీయ శైలి
4. ఉపన్యాసాత్మక శైలి

### 8.4.1.1.2 విషయ వివరణను బట్టి శైలి

1. విశదాత్మక శైలి / వివరాణత్మక శైలి
2. సంక్షిప్త శైలి

### 8.4.1.1.3 అభివ్యక్తి తీరును బట్టి శైలి

1. వాచ్యార్థక శైలి
2. వ్యంగ్యార్థక శైలి
3. హాస్యాత్మక శైలి
4. అధిక్షేపాత్మక శైలి
5. విమర్శనాత్మక శైలి

### 8.4.1.1.4 పదాలు, పదబంధాల ప్రయోగాన్ని బట్టి శైలి

1. సరళ శైలి / శాస్త్ర శైలి
2. పదగుంఫన శైలి
3. వర్ణనాత్మక శైలి
4. సాహిత్య శైలి

## 8.4.2 వార్తా రచన - పరిచయం

వార్తను పాఠకుడు చదివేలా చేయడంలో ఆ వార్త ప్రారంభవాక్యమే ప్రధానపాత్ర పోషిస్తుంది. దీన్నే పరిచయ వాక్యం అంటారు. అన్నిరకాల వార్తలను ఒకే తీరుగా పరిచయం చేయడం వల్ల పాఠకుడికి విసుగు కలుగుతుంది. లేదా చెప్పదలచుకున్న వార్తలోని ప్రాధాన్యత లోపిస్తుంది. ఒక్కోసారి మనసుల్ని కలిచివేసే సంఘటన జరగుతుంది. ఆ సన్నివేశాన్ని సాధారణ వార్తలాగా పరిచయం చేసి రాయడం వల్ల పత్రిక / పాత్రికేయుడు ఆశించిన ప్రయోజనం నెరవేరదు. ఈక్రమంలో వార్తా పరిచయ రచనను వివిధ రకాలుగా వర్గీకరించడం జరిగింది.

- ప్రత్యేక సంఘటనల పరిచయం
- విషయాన్ని సూటిగా పరిచయం చేయడం
- విషయాన్ని పరోక్షంగా పనిచేయించడం
- లోకోక్తులతో విషయాన్ని పరిచయం చేయడం
- విమర్శనాత్మకంగా విషయాన్ని పరిచయం చేయడం
- ఉత్కంఠ కలిగిస్తూ విషయాన్ని పరిచయం చేయడం
- కథనాత్మకంగా విషయాన్ని పరిచయం చేయడం

పరిచయం చేయడంలో విభిన్న రీతులు ఉన్నట్లుగానే వార్త ముగింపులో కూడా భిన్నరీతులు ఉన్నాయి. వాటిని కింది విధంగా వర్గీకరించడం జరిగింది.

- కొసమెరుపు ముగింపు
- ప్రశ్నలతో ముగింపు
- వేదాంత ప్రబోధంతో ముగింపు

పత్రిక కేవలం ఒక ప్రాంతానికి మాత్రమే చెందింది కాదు. పత్రిక ఏ భాషలో వెలువడుతుందో ఆ భాష మాట్లాడే అన్ని ప్రాంతాల వారికీ అర్థమయ్యేలా పత్రికాభాష ఉండాలి. ఆ భాషలో ఉన్న మాండలికాలకు సైతం వార్తలో ప్రాధాన్యత ఉండాలి. అందుకనే ఇటీవలి కాలంలో వార్తారచనలో మాండలిక ప్రయోగాలకు పత్రికా రచయితలు పెద్దపీట వేస్తున్నారు.

ఆధునిక పత్రికా రచనలో కనిపిస్తున్న మరొక ధోరణి – చిత్రకథనం. వేలాది పదాలతో రాసే వార్త కన్నా ఒక చిత్రంతో రచయిత చెప్పదలచుకున్న భావాన్ని పాఠకుడికి చేరవేసేలా చేయడమే చిత్రకథ. ఇటీవలి కాలంలో అన్ని పత్రికలు ఈ తరహా వార్తలు ప్రచురిస్తున్నాయి. సమాజంలో జరిగిన సంఘటన తాలూకు చిత్రాన్ని పెద్ద పరిణామంలో వేసి, ఆ సంఘటన తాలూకు విషయాన్ని అత్యంత సంక్షిప్తంగా దానికింద రాస్తారు. సంఘటన జరిగిన తాలూకు దృశ్యం కళ్ళముందు కనిపిస్తుండడంతో పాఠకుడికి చక్కటి సౌకర్యం కలిగి, భావం వెంటనే పూర్తిగా అర్థమవుతుంది.

ఏ పత్రికైనా పాఠకాదరణ పొందాలంటే అందుకు కారణమైన అంశాల్లో పత్రిక ముద్రణ నాణ్యత కూడా ఒక అంశంగా ఉంటుంది. సాంకేతిక ప్రగతి కారణంగా ముద్రణ రంగం ఎంతో అభివృద్ధి చెందింది. గంటలకు వేల కాపీలు ముద్రించే సామర్థ్యం ఉన్న యంత్రాలు అందుబాటులోకి వచ్చాయి. రంగుల్లో ముద్రించడం కూడా తక్కువ ఖర్చుతో (తొలి రోజులతో పోలిస్తే) పూర్తిచేసే సౌకర్యం వచ్చింది. ముద్రణ రంగంలో వచ్చిన ఈ మార్పులు అటు వార్తాసేకరణ మీద కూడా ప్రభావం చూపించాయి. ఒకప్పుడు సాయంత్రం తర్వాత జరిగిన సంఘటన తాలూకు వార్త రెండో రోజు గానీ పత్రికలో వచ్చేది కాదు. కానీ, ముద్రణలో నేడు పెరిగిన వేగం కారణంగా అర్ధరాత్రి వరకు జరిగిన సంఘటనల తాలూకు విషయాల్ని తీసుకునే అవకాశం సంపాదక వర్గానికి కలుగుతోంది. దీంతో తెల్లవారే సరికి అత్యంత తాజా సమాచారం పాఠకులకు అందించే వీలు కలుగుతోంది. పత్రికలు విజయవంతం కావడానికి ఈ అంశాలు కూడా దోహదం చేస్తున్నాయి.

ఈవిధంగా నిత్యనూతనమైన మార్పులతో కృష్ణాజిల్లా పత్రికారంగం దినదినాభివృద్ధి చెందుతోంది. వార్తా సేకరణ నుంచి పత్రికను తీర్చిదిద్దడం, ముద్రణ, పాఠకుల ఇంటికి చేరవేత.. ఇలా పత్రికకు సంబంధించిన అన్ని అంశాల్లోను వేగం పెరిగింది. నాణ్యత పెరిగింది. తొలినాళ్ళలో లేని పాత్రికేయ సంఘాలు ఏర్పడ్డాయి. పాత్రికేయుల సంక్షేమానికి ఇవి కృషి చేస్తున్నాయి. వారి సమస్యలు తీర్చడంలో ఎంతగానో సహాయపడుతున్నాయి. ప్రభుత్వం కూడా పత్రికలు, పాత్రికేయుల ప్రయోజనాలు కాపాడడానికి ఎన్నో చట్టాలు చేసింది.

ఒకరి కోసం అందరు, అందరి కోసం ఒకరు అన్నట్లు పత్రిక కోసం ప్రజలు, ప్రజల కోసం పత్రికలు పనిచేస్తూ, సమ సమాజం, నవ్య సమాజం స్థాపించే దిశగా వడివడిగా అడుగులు వేస్తున్నాయి. ఆంధ్రరాష్ట్రంలో ప్రత్యేకించి కృష్ణాజిల్లా పత్రికారంగ రాజధానిగా వెలుగొందుతోంది. ప్రస్తుతం అన్ని ప్రధాన దినపత్రికలు తమ ప్రధానకార్యాలయాల్ని హైదరాబాదులో ఏర్పాటుచేసుకున్నప్పటికీ రాజకీయంగా ఎక్కువ చైతన్యం ఉన్న ప్రాంతం కావడం వల్ల విజయవాడ / కృష్ణాజిల్లా విభాగానికి పత్రికలన్నీ ఎంతో ప్రాధాన్యత ఇస్తున్నాయి. తద్వారా తెలుగు పత్రికారంగంపై నాటికీ, నేటికీ కృష్ణాజిల్లా తన ప్రత్యేక ముద్ర చూపిస్తూనే ఉంది.

# ఉపయుక్త గ్రంథ సూచి

1. గోపాల్‌రెడ్డి, జి., హరిహరశర్మ, టి. (సం) 2003. జనమాధ్యమాలు సామాజిక బాధ్యత. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

2. పవన్‌కుమార్, పమ్మి. 2009. భాషా భూషణం. హైదరాబాదు

3. రామానుజరావు, దేవులపల్లి. 1988. కాశీనాథుని నాగేశ్వరరావు. హైదరాబాదు : తెలుగు విశ్వవిద్యాలయం

4. రాజగోపాలరావు, సి.వి. 2008. స్వాతంత్ర్య పోరాటం జర్నలిస్ట్ యోధులు – జైలు శిక్షలు. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమి

5. వెంకట సత్యనారాయణ, రావూరు. 1981. మన ముట్నూరి. హైదరాబాదు : డాక్టర్ రావూరు డెబ్బయ్యవ జన్మదినోత్సవ సన్మాన సంఘం

6. నరసింహారెడ్డి, సి.వి. 2006. ఉత్తమ ప్రజా సంబంధాలు. హైదరాబాదు : తెలుగు అకాడమి

7. సుబ్రహ్మణ్యం, పి.ఎస్. 2007. ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలు. హైదరాబాదు :పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

8. నరసింహారెడ్డి, సి.వి. 2005. సమాచార వైతాళికులు. హైదరాబాదు : మీడియా హౌస్ పబ్లికేషన్స్

9. గోపాల్‌రెడ్డి, జి., చక్రధర్ గోవిందరాజు. (సం) 2005. తెలుగు పత్రికలు ఆధునిక ధోరణులు. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

10. వెంకటేశ్వరరావు, నార్ల. 2004. నార్ల రచనలు. తెనాలి : నార్ల కుటుంబం

11. వెంకటేశ్వరరావు, టి. 2008. విజయవాడ సమగ్రదర్శిని. విజయవాడ

12. వెంకట సూర్యారావు, దామెర. 2013. తెలుగు కీర్తి కేతనాలు. న్యూఢిల్లీ : రీమ్ పబ్లికేషన్స్ ప్రైవేట్ లిమిటెడ్

13. రామమోహనరావు, నండూరి. 2013. అక్షరయాత్ర. విజయవాడ : విక్టరీ పబ్లికేషన్స్

14. ప్రసాద్, ఎబికె. 2010. కదిలేదీ... కదిలించేదీ. ఎమ్మిగనూరు : బసవేశ్వర ప్రచురణలు

15. చంద్రశేఖర్, పగడాల. 2011. తెలుగు దినపత్రికల భాష ఆధునీకరణ (1914–1984). హైదరాబాదు : పగడాల పబ్లికేషన్స్

16. చెన్నయ్య, జె. 1998. తెలుగు దినపత్రికలు భాషా సాహిత్య స్వరూపం. హైదరాబాదు : రవికిరణ్ పబ్లికేషన్స్

17. బాలశౌరిరెడ్డి. 2010. తెలుగు పత్రికల చరిత్ర (1947–2006). విజయవాడ : ఎమెస్కో పబ్లికేషన్స్

18. కృష్ణ, కొమాండూరి. 2008. సి.రాఘవాచారి గారి సంపాదకీయశైలి. విజయవాడ

19. కుటుంబరావు, తుర్లపాటి. 2012. నా కలం – నా గళం. విజయవాడ : శ్రీసుందర శేషమాంబ పబ్లికేషన్స్

20. గోపాలరెడ్డి, జి., చక్రధర్, గోవిందరాజు (సం). 2001. తెలుగు పత్రికారంగం నిన్న నేడు రేపు. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

21. వరదాచారి, జిఎస్. 1999. దిద్దుబాటు. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

22. లక్ష్మణరెడ్డి, వి. 2002. తెలుగు జర్నలిజం అవతరణ వికాసం. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

23. రామచంద్ర, తిరుమల. 1989. తెలుగు పత్రికల సాహిత్య సేవ. హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

24. మీనా, బిఆర్. 2003. కృష్ణా తరంగాలు – 2003. కృష్ణా మహోత్సవాల ప్రత్యేక సంచిక. విజయవాడ : కృష్ణా మహోత్సవాల నిర్వహణ కమిటీ

25. మీనా, బిఆర్. 2003. కృష్ణా తరంగాలు – 2002. కృష్ణా మహోత్సవాల ప్రత్యేక సంచిక. విజయవాడ : కృష్ణా మహోత్సవాల నిర్వహణ కమిటీ

26. కృష్ణారావు, వైవి. 2007. ఆంధ్రప్రదేశ్ దర్శిని. హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

27. వెంకటప్పయ్య, వెలగా. 2004. ఆంధ్రప్రదేశ్ మీడియా డైరెక్టరీ. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమి

28. బొమ్మారెడ్డి, వి. 2002. కమ్యూనిస్టు పత్రికలు. విజయవాడ : శ్రీశ్రీ ప్రింటర్స్

29. కృష్ణారావు, వైవి. 1996. ఆంధ్రప్రదేశ్ దర్శిని. హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

30. వెంకటేశ్వరరావు, పొత్తూరి. 2003. నాటి పత్రికలు మేటి విలువలు. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

31. శేఖర్‌రెడ్డి, కట్టా. 2005. జర్నలిస్టు కరదీపిక. హైదరాబాదు : న్యూమీడియా కమ్యూనికేషన్స్

32. విశ్వేశ్వరరావు, నామాల. 2003. తెలుగు జర్నలిజం చరిత్ర. హైదరాబాదు : ప్రోగ్రెసివ్ క్యూనికేషన్స్

33. రామదాస్, కె. 2001. తెలుగు దినపత్రికల్లో సాహిత్యం. హైదరాబాదు : నవ్య ప్రింటర్స్

34. నరసింహారెడ్డి, సి.వి. ప్రభుత్వం – పత్రికలు. హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమి

35. వరదాచారి, జిఎస్. పత్రికాభాష. హైదరాబాదు. ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమి

36. దత్తాత్రేయశర్మ, ఎం. 1992. ముట్నూరి కృష్ణారావు గారి సంపాదకీయాలు. హైదరాబాదు : ఉస్మానియా విశ్వవిద్యాలయం

37. ఏకాంబరాచార్యులు, రాపాక. 2008. మన ప్రముఖ పత్రికా సంపాదకులు. హైదరాబాదు : శ్రీసాయిరాం కోఆపరేటివ్ ప్రింటింగ్ ప్రెస్ లిమిటెడ్.

38. ఎం.ఎ. (జర్నలిజం). స్టడీ మెటీరియల్. దూరవిద్యాకేంద్రం, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

39. బుద్ధప్రసాద్, మండలి. (సం). వజ్రభారతి. విజయవాడ. కృష్ణాజిల్లా రచయితల సంఘం

40. కృష్ణ, జి. 2001. అప్పుడు ఇప్పుడు. హైదరాబాదు : రచన జర్నలిజం కళాశాల

41. వరదాచారి, జిఎస్. 2011. మన పాత్రికేయ వెలుగులు. హైదరాబాదు : వయోధిక పాత్రికేయ సంఘం

42. సీతారామాచార్యులు, బహుజనపల్లి. 2005. శబ్దరత్నాకరము. విజయవాడ : విక్టరీ పబ్లికేషన్స్

43. బుద్ధప్రసాద్, మండలి. 2011. కృష్ణాజిల్లా సర్వస్వం. విజయవాడ : కృష్ణాజిల్లా రచయితల సంఘం.

44. Ahuja, BN.2011. Theory and Practice of Journalism. New Delhi.: Surjet Publications

45. Some Eminent Indian Editors. 1902. New Delhi. Publications Division, Ministery of Information and Broadcasting

263

## గణిత చంద్రిక, కృష్ణవేణి, తూర్పుగాలి, నూతన తరం పత్రికల తొలి సంచికలు



## ఈనాడు దినపత్రిక విజయవాడ ఎడిషన్ ఇన్‌ఛార్జి

**శ్రీ గొడవర్తి శ్రీనివాస భరణీకుమార్**గారితో ముఖాముఖి



**పరిశోధకుడు** : భాష విషయంలో దినపత్రికల్లో ఎటువంటి మార్పులు వచ్చాయి?

**భరణి** : భాషలో మార్పు అనేది అత్యంత సహజమైంది. ప్రజల వాడుక భాషలో దినపత్రిక వచ్చినప్పుడే దానికి ఆదరణ ఉంటుంది. పత్రిక స్థాపించిన / ప్రచురించిన ప్రయోజనం కూడా అప్పుడే నెరవేరుతుంది. అయితే ఇటీవల కొన్ని విపరీత ధోరణులు చోటుచేసుకుంటున్న మాట వాస్తవం. సినీ మాధ్యమం ద్వారా సమాజంలో వాడుకలోకి వస్తున్న భాషా స్వరూపం / పదాలు ఒక కారణమైతే, ఇతర భాషలు..ప్రధానంగా ఇంగ్లిషు భాష నుంచి తెలుగులోకి వస్తున్న పదాల వరద మరొక కారణం. ఈ రెండిటి వల్ల ఇటీవల తెలుగు దినపత్రికల భాషలో అనూహ్యమైన మార్పులు వచ్చాయి. అయితే ఇప్పటికీ పత్రికా భాష అత్యంత ప్రామాణికంగానే ఉంది. ఉంటోంది. ఎందుకంటే పత్రికా భాష ఎలా ఉండాలో చెప్పేందుకు కొన్ని నియమాలు ఉన్నాయి. పాత్రికేయ సిద్ధాంతాలు ఉన్నాయి. దృశ్యమాధ్యమానికి ఈ నియమాలు, హద్దులు లేకపోవడంతో అక్కడి భాష కొంతవరకు అభిలషణీయంగా ఉండడం లేదు.

**పరిశోధకుడు** : దినపత్రికలు ప్రకటనలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నాయనే మాట వినిపిస్తోంది...

**భరణి** : నిజమే. అన్ని దినపత్రికలు.. దినపత్రికలనేమిటి. ఏ పత్రిక మనుగడకైనా ప్రకటనలనేవి చాలా అవసరం. వాస్తవానికి దినపత్రికను ముద్రించే ధరకి, దాన్ని అమ్ముతున్న ధరకు ఏమాత్రం పొంతన ఉండదు. కేవలం వ్యాపార ప్రకటనలు వచ్చినప్పుడు మాత్రమే పత్రిక నడవడం సాధ్యమవుతుంది. ప్రకటనలే లేకపోతే పత్రికలంటూ అసలు ఉండనే ఉండవు. వర్తమాన ధరలకు అనుగుణంగా ప్రకటనలు లేకుండా పత్రికలు నడపడం ఎవరికీ సాధ్యం కాదు.

**పరిశోధకుడు** : ప్రకటనలకు ప్రాధాన్యత ఇచ్చి వార్తలకు ప్రాధాన్యత తగ్గిస్తున్నారని అంటున్నారు. నిజమేనా?

**భరణి** : కొంతవరకు నిజమే. ఇందాకనే చెప్పానుగా. ప్రకటనే లేకపోతే పత్రికనేదే ఉండదు. అందువల్ల ఒక్కోసారి ప్రకటనకు ప్రాధాన్యత ఇవ్వక తప్పడం లేదు. అయినా ఇప్పుడు మీరంటున్నట్లు ప్రకటనలు కూడా పత్రికలకు రావడం లేదు. అంతర్జాలం, దృశ్యమాధ్యమాల కారణంగా ముద్రిత పత్రికలకు ప్రకటనలు ఇచ్చేవారు బాగా తగ్గారు. మధ్యతరగతి వ్యాపారస్తులు, వ్యక్తిగతంగా వచ్చే ప్రకటనలే ఇప్పుడు పత్రికకు ప్రాణాధారం. ఈ విషయంలో ఏ పత్రికనూ తప్పు పట్టాల్సిన పనిలేదు. ప్రకటనలు లేకుండా ముద్రిత ధరకు అమ్మినా, ఏ ఒక్కరూ పత్రికను కొనలేరు. ఒక పత్రికను ముద్రించడానికి అంత ఖర్చు అవుతుంది.

**పరిశోధకుడు** : నాటికి, నేటికి పత్రికా సంపాదకుడి పాత్రలో వచ్చిన మార్పులేమిటి?

**భరణి** : ఒకప్పుడు సంపాదకుడే పత్రిక యజమాని. ఇప్పుడు యజమాని వేరు. సంపాదకుడు వేరు. సంపాదకుడు కూడా పత్రికలో ఓ ఉద్యోగే. కాకపోతే..కాస్తంత పెద్ద ఉద్యోగి. తనకు నచ్చిన వృత్తాంతం మీద సంపాదకీయం రాసుకునే స్వేచ్ఛ ఇవాళ సంపాదకులకు లేనిమాట వాస్తవం. అలాగని అన్ని పత్రికలూ ఇదే ధోరణిలో లేవు. ఏదిఏమైనా పత్రికల్లో సంపాదకుడి స్థానానికి ప్రాధాన్యత తగ్గుతూ వస్తోంది. యాజమాన్యం దృష్టి పూర్తిగా ఉండడంతో సంపాదకుడు స్వతంత్రత కోల్పోయి, కేవలం కాగితం పులిలా మిగిలే పరిస్థితి ఏర్పడుతోంది.

**పరిశోధకుడు** : పాత్రికేయుల నీతి నియమావళి ఎలా ఉండాలనుకుంటున్నారు?

**భరణి** : ఇది ఎవరూ చెప్పే అంశం కాదు. తాను చేస్తున్న వృత్తికి, తీసుకుంటున్న రూపాయికి న్యాయం చేయాలన్న తపన లేనంతకాలం ఎన్ని సూత్రాలు, నియమాలు చెప్పినా ఉపయోగం లేదు. అంతర్జాలం వినియోగం బాగా పెరగడంతో పాత్రికేయులు కొద్దిగా నియమాలు ఉల్లంఘించే పరిస్థితి సమాజంలో కనిపిస్తోంది.

**పరిశోధకుడు** : అంతర్జాలం, దృశ్యమాధ్యమాలు వచ్చిన తర్వాత పత్రికారంగం ఎలాంటి మార్పులకు లోనైంది?

**భరణి** : దినపత్రికల హవా కొంతవరకు తగ్గిందనే చెప్పాలి. అయితే ఇది శాశ్వతం కాదు. దృశ్యమాధ్యమం ఎంత పెరిగినా దినపత్రికలు చదివే అలవాటు సమాజంలో నాటుకుని పోయింది. విషయం తెలుసుకోవడం మాత్రమే కాకుండా ఉత్తమ పఠన లక్షణాలు కూడా పత్రికా పఠనం వల్ల అలవడుతాయి. దృశ్యమాధ్యమ విప్లవం వచ్చిన తొలిరోజుల్లో తప్పించి, ఇప్పుడు మళ్ళీ ప్రజలందరూ పత్రికలు చదువుతున్నారు.

**పరిశోధకుడు** : పాత్రికేయులకు శిక్షణ అవసరమంటారా?

**భరణి** : పాత్రికేయునికి ఆత్మాభిమానం ఒక గీటురాయి లాంటిది. తన స్వావభిమానాన్ని కాపాడుకొంటూ అతను తన కర్తవ్యాన్ని పూర్తి చేయాల్సి ఉంటుంది. పత్రికారంగం ఈనాడు ఒక వాణిజ్య రంగంగా మారినప్పటికీ పాత్రికేయులు తమ పరిధిలో కర్తవ్యాన్ని నిర్వర్తించుకొంటూ తమ ఆత్మాభిమానం కూడా కాపాడుకోవాల్సి ఉంటుంది. అలా లేనట్లయితే ఆ పత్రిక ప్రతిష్ఠతో పాటు అతడు కూడా అపహాస్యం పాలు కావాల్సి వస్తుంది. పాత్రికేయుడు వార్తలను సేకరించే సందర్భంలో యథార్థ సంఘటనలను నిజాయితీగా రిపోర్టు చేయాలి. ఒక రచయితలాగ ఊహాజనితమైన వార్తలను పత్రికలో ప్రచురించకూడదు. పాత్రికేయునికి కావలసిన మరొక గుణం అతనిలో ఆత్మవిశ్వాసం సంపూర్ణంగా ఉండాలి. అంతేకాదు తన అర్హతను గురించి విశ్వాసం ఉండాలి. పాత్రికేయునిలో పరిశోధనతో పాటు పర్యటనాభిలాష కూడా ఉండాలి. ఈ రంగంలో సోమరిపోతుకు ఎలాంటి చోటులేదు. పత్రికారంగంలో ప్రవేశించేందుకు ఒక నిశ్చితమైన కొలతబద్ద లాంటి పరీక్షలు అవసరం లేదు. కానీ విశ్వవిద్యాలయాల యోగ్యతలు అతనికెంతో ఉపయోగంగా ఉన్నాయి. ప్రస్తుతం పత్రికల్లో పనిచేయటానిక ఏదో ఒక డిగ్రీ అవసరమనుకుంటున్నారేగానీ భాషా పరిజ్ఞానం అవసరమనుకోవడం లేదు. వార్తలను అనువదించుకోవలసిన అవసరముందని గుర్తించినవాళ్లు కూడా మూలభాషలోను (Source Language) తగినంత పరిచయం సంపాదించాలనీ, స్వభాషలో (Target Language) అంతకన్నా విశేష పరిజ్ఞానం అవసరమనీ గుర్తించటం లేదు. ప్రాథమిక విద్య కన్నీటి తుడుపుగా, పాఠశాలా విద్యలో భాషబోధన నామమాత్రంగా, కళాశాల విశ్వకళాపరిషత్తుల్లో విషయ ప్రధానబోధన పరీక్షణలేనిగాని భాషా పాటవ పరిశీలన లేక మొక్కుబడిగా సాగుతున్నందువల్ల పాత్రికేయ వృత్తిలోనో ఆ పేరుగల ఉద్యోగంలోనో ప్రవేశించిన వాళ్లు కాలం దొర్లించటమే ప్రధానంగా జీవిస్తున్నారు. అందువల్ల పత్రికల్లో సాంకేతిక ప్రమాణాలెంత పెరిగాయో విద్యా ప్రమాణాలంత తగ్గుముఖం పట్టాయి.

**పరిశోధకుడు** : పత్రికాభాషకు వ్యాకరణం అవసరం ఎంతవరకు ఉంది?

**భరణి** : జీవద్భాషకు నిశ్చితమైన ఏకైక ప్రమాణంలేదు–ఉండదు. సంప్రదాయ వ్యాకరణ గ్రంథాలు కొన్ని సూత్రాల ద్వారా భాషకు ప్రామాణిక రూపం కల్పించే ప్రయత్నం చేశాయి. ఈ ప్రయత్నాలు ఎందరెన్ని విధాల భిన్నకాలాల్లో చేసిన భాషా సమగ్ర స్వరూపం ఏ ప్రమాణాలకూ లొంగలేదు. వైదిక సంస్కృతం నుంచి లౌకిక సంస్కృతం భిన్నమైన లక్షణాల ప్రదర్శించి భిన్న ప్రమాణాలకు దారితీసింది. అలాగే సమస్త సహజ భాషల్లోనూ భిన్నకాలాల్లో భిన్న ప్రమాణాలేర్పడ్డాయి. ఈ పరిస్థితిని మార్చేందుకు కృత్రిమంగా సృష్టించి భాషలు కూడా మార్పులు పొంది ఏక ప్రమాణ భావన అసాధ్యాదర్శమని నిరూపించాయి.

ఆంధ్రజ్యోతి దినపత్రిక పూర్వ సంపాదకుడు

**'పద్మశ్రీ' తుర్లపాటి కుటుంబరావు**తో పరిశోధకుడి ముఖాముఖి



**పరిశోధకుడు** : నాటికీ, నేటికీ పత్రికా సంపాదకుడి స్థానంలో ఎలాంటి మార్పు వచ్చింది?

**తుర్లపాటి** : కడచిన అర్ధశతాబ్ది కాలంలో వచ్చి ఒక పెద్ద మార్పు పత్రికా నిర్వహణలో సంపాదకుడి పాత్రకు సంబంధించినది. ఒకప్పుడు ఉద్యమాలను నడపాలనుకొన్నవారు సొంతగా పత్రికను పెట్టుకొని నడుపుకొనేవారు. క్రమంగా పెట్టుబడి పెట్టేవారు వేరు, పత్రాకా సంపాదకుడు వేరు అయినారు. పెట్టుబడి పెట్టినవారు సహజంగా తనకు విశ్వాసం ఉన్న జర్నలిస్టుకే సంపాదకత్వ బాధ్యతను అప్పగించేవారు. ఒకసారి అలా అప్పగింత పెట్టిన తరువాత జోక్యం చేసుకొనేవారు కాదు. అంటే సంపాదకుడికి స్వేచ్ఛ ఉండేది. ఏ విధానాన్ని అనుసరిస్తే ఏమి కొంప మునుగుతుందో, ఏమి రాస్తే యజమానికి ఆగ్రహం కలిగి ఉద్యోగంలో నుంచి పీకివేస్తాడో అనే భయం ఉండేది కాదు. అలా భయం లేని వాతావరణంలో రాసేటప్పుడు స్పష్టమైన అభిప్రాయాలు వ్యక్తమవుతాయి. సత్యం చెప్పటానికి అవకాశం ఉంటుంది. ఇప్పుడు పెట్టుబడి పెట్టేవారే సంపాదకులుగా ఉండి, తమకు నచ్చిన పద్ధతిలో వార్తలు రాయించి వేయించుకుంటున్నారు. సంపాదకీయాలు రాయించి ప్రచురించుకొంటున్నారు. నాలుగు దశాబ్దులు క్రిందట వర్కింగ్ జర్నలిస్టులకు భద్రత కలిగించే చట్టం అమలులోకి వచ్చి, ఎంతో మేలు చేసింది. సంపాదకుడు కూడా వర్కింగ్ జర్నలిస్టే. కానీ, ఇప్పుడు అలాంటి ఉద్యోగ భద్రత లేదు. చట్టాన్ని నిరుపయోగం కావిస్తూ యాజమాన్యాలు కాంట్రాక్టు పద్ధతిలో ఉద్యోగులను నియమించకుంటున్నాయి. ఇతర ఉద్యోగులకు ఉండే భద్రత కూడా సంపాదకుడికి లేకుండా పోయిందనడంలో అతిశయోక్తి లేదు. సంపాదకుడు ఎవరున్నా, అసలెవరూ లేకపోయినా పత్రికలు యథాప్రకారం వస్తుంటాయనే పరిస్థితి ఇప్పుడుంది.

**పరిశోధకుడు** : పాత్రికేయుడ వార్తారచనలో ఎలాంటి శైలి పాటించాలంటారు?

**తుర్లపాటి** : పాఠకులకు సబోధకంగా ఉండే తీరున వ్రాయటం పత్రికా రచయిత విధి. పలువురు పత్రికా రచయితలు తాము వ్రాసినది, పాఠకులకు చక్కగా అవగతం కావాలనే అభిలషిస్తూ వ్రాస్తున్నారు. కానీ తెలుగు బాగా రానివాళ్ళు అధికారులు అయినప్పుడు, వాళ్ళకి అర్థం కావటం కోసం (తెలుగును కాదని) ఇంగ్లీషు శబ్దాలు వాడుతూ ఉంటారనవలసి వస్తుంది! భాషా శైలిని డబ్బులలాగా నిక్కచ్చిగా లెక్కగట్టలేము. పైగా పత్రికలలో స్వంత శైలిని వదలివెయ్యాలి. వేరొకరి శైలి వ్రాయాలి. తెలుగులో శైలి అనేదే ఎక్కడోగానీ కానరాదు. ఆ స్థితిలో వేరొకని జోక్యం వలన శైలి రూపొందదు. దస్తావేజుల మతలబువలే రూపొందుతుంది.

**పరిశోధకుడు** : పత్రికాభాషలో ఎలాంటి మార్పులు చోటుచేసుకుంటున్నాయి?

**తుర్లపాటి** : సమాజ ధర్మాల్లో లక్షణాల్లో వచ్చిన పరిణామాలే పత్రికా భాషనూ తలకిందులుగా మార్చివేశాయి. ఈ నేపథ్యంలో పత్రికా భాషలో వచ్చిన పరిణామాలను స్థూలంగా నిర్దేశించవచ్చు. 1938లో జనవాణి పత్రికా సంపాదకీయాల్లో తాపీ ధర్మారావుగారు వ్యవహారిక రూపాలను ప్రవేశపెట్టేదాకా కొన్ని సాహిత్య పత్రికలు వీరగ్రాంధిక భాషలోనే నడిచాయి. అటువంటి అనేక పత్రికల్లో అర్ధగ్రాంథికమె, గ్రాంథికమనే భ్రమతో వాడిన వ్యవహారికమో కనిపించేది. భాషా పరిణామ క్రమం నిరంతరాయం కాబట్టి సంధిరూపాలూ, మాధ్యమిక రూపాలూ ప్రయుక్తం కావటంలో ఆశ్చర్యంలేదు. చిన్నయసూరి వంటివాడు సంపాదకులకు లేఖలు రాసినప్పుడు తరవాతికాలంలో తానే నిషేధించిన 'చేతురు, కోతురు' వంటి 'గ్రామ్య' రూపాలను వాడాడు. 'తమ ఘనతను' అనటానికి బదులు 'ఘనమును' అని ప్రయోగించాడు. ఇది పరిణామదశను సూచిస్తుంది. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక వంటి సాహిత్య పత్రికల్లో కూడా అక్కడక్కడ అపప్రయోగాలుడేవి. కానీ మొత్తం మీద తొలితరం పత్రికలు భాషా విషయంలో చాలా సంయమనం పాటించాయని చెప్పాలి. రాజకీయ సామాజికార్థిక విషయాలకు ప్రాముఖ్యమిచ్చిన పత్రికల్లో ఆయా శాస్త్ర సాంకేతిక పదాలను ఇంగ్లీషునుంచి తెలుగులోకి అనువదించే ప్రయత్నాలు జరిగాయి. సాధ్యమైనంత వరకు. 'అగ్నిమాపకదళం' వంటి అసంబద్ధ పదబంధాలున్నా వాటి సంఖ్య అత్యల్పం – అవి కావాలని కల్పించినవి కావు, పొరపాటున దొర్లినవే. ఆ దశలో ఏ విషయాన్ని వార్తగా ఇచ్చినా, విమర్శించినా, వ్యాఖ్యానించినా భాషలో తెలుగుదనం సాధించాలనే తపన ఉంది. సంస్కృత పదాలను వాడినా అవి తత్సమ తద్భవరూపాల్లో తెలుగు మాటలనే భావించి ప్రయోగించారు. అనువాద రచనల్లో మాత్రం యత్తదర్థక ప్రయోగం, కర్మణి ప్రయోగం అధికంగా ఉండేది. అయితే అందుకు ఆంగ్లమూలాలేగాక సంస్కృత సంప్రదాయం కూడా కారణమని చెప్పాలి.

**పరిశోధకుడు** : సంపాదకుడి స్వేచ్ఛలో ఎలాంటి మార్పులు మీరు గమనించారు?

**తుర్లపాటి** : పత్రికా స్వేచ్ఛను సంపాదకుడి స్వేచ్ఛతో ముడిపెట్టడం సహజం. ఎందుకంటే ఇటీవలి వరకూ (కొన్ని యాజమాన్యాలు అంగీకరించకపోయినా.. గుర్తింపు ఇవ్వకపోయినా.. ఇప్పటికీ) సంపాదకుడిది ప్రముఖమైన పాత్ర. ఈ ప్రాముఖ్యం క్రమంగా తగ్గుతున్నది. అందులో సందేహం లేదు. సంపాదకుడి ప్రాముఖ్యం తగ్గిన కొద్దీ వ్యాపార ధోరణుల ప్రాధాన్యం పెరుగుతోంది. లేదా వ్యాపార ధోరణుల ప్రాధాన్యం పెరిగేకొద్దీ సంపాదకుడి ప్రాముఖ్యం తగ్గుతోంది. పత్రికా స్వేచ్ఛ అంటే స్థూలంగా సంపాదకుడి స్వేచ్ఛగా, సంపాదకుడి ప్రాముఖ్యంగా పరిగణిస్తున్నాం. సమాజ హితం కోసం సంపాదక మండలి ఏమిరాయాలని అనుకుంటే అది రాసే స్వేచ్ఛ ఉండటాన్ని పత్రికా స్వేచ్ఛగా స్థూలంగా నిర్వచించుకోవచ్చు. ఈ స్వేచ్ఛగా భంగం ఏ కారణంగా కలిగినా అది పత్రికా స్వేచ్ఛకు హాని కలిగినట్టే భావించవలసి ఉంటుంది. పత్రిక వ్యాపార ప్రయోజనలే అందుకు కారణం కావచ్చు. మరేదైనా కావచ్చు. సమాజానికి విస్తృతంగా సేవ చేయాలంటే పత్రిక విస్తృతి పెరగాలనీ, అందుకు పత్రిక ఆర్థికంగా బలపడాలనీ వాదిస్తూ ఆర్థికంగా బలపడాలంటే యాజమాన్యం నిర్దేశించిన పద్ధతిలో పత్రిక నడవాలని చెప్పేవారు పెరుగుతున్నారు. నిత్యం నీతులు వల్లించే సంపాదకీయాలు చదివే సమయం, ఆసక్తి పాఠకులకు అంతగా లేదనీ, పాఠకుల అభిరుచికి అనుఉగణంగా పత్రికా విధానం మారుతుండాలనీ యజమానులు భావిస్తున్నారు. పత్రిక సర్క్యులేషన్ పెంచుకుంటూ, ప్రకటనలు (అడ్వర్టయిజ్‌మెంట్లు) సేకరిస్తూ ఆర్థికంగా ఎదగాలని యాజమాన్యం ప్రయత్నించడాన్ని ఎవరు తప్పుపడతారు? పత్రికల పాత్ర కాలానుగుణంగా మారుతూ వస్తున్నది. స్వాతంత్ర్య సమరంలో అది పోరాట పాత్ర. స్వాతంత్ర్య సిద్ధి తర్వాత కొన్నాళ్ళపాటు అది నవభారత నిర్మాణ పాత్ర. ఈ రెండు పాత్రలలోనూ త్యాగం ఉంది. సొంత లాభం కొంత మానుకోవాలన్న సందేశం ఉంది. అందుకే అంత వరకూ పత్రికలు సొంత వ్యాపార ప్రయోజనాలను పక్కన పెట్టి సామాజిక ప్రయోజనాలకు పెద్దపీట వేశాయి. కానీ పత్రికలు ఎప్పుడైతే పరిశ్రమగా మారాయో పరిశ్రమలకు వర్తించే విధానాలన్నీ పత్రికలూ ఆపాదిస్తున్నారు. ఇందులో ఎవ్వరినీ తప్పు పట్టడానికి లేదు. పరిస్థితులు మారుతున్నాయని చెప్పుకోవడమే ఉద్దేశ్యం. వ్యాపార ధోరణి పెరిగే కొద్దీ సంపాదక మండలి స్వేచ్ఛ తగ్గుతూ వస్తుంది. వ్యాపార ప్రయోజనాలు రాజకీయాలకు దారితీసినప్పుడు రెండు రకాల ప్రయోజనాలూ జమిలిగా సంపాదక మండలిని శాసిస్తాయి. ఇది సహజం వ్యాపార ప్రయోజనాలు పత్రికలలో వ్యాపార సంస్థల జోక్యానికి దారితీసినట్టే రాజకీయ ప్రయోజనాలు రాజకీయ జోక్యాన్ని అనివార్యం చేస్తాయి.

**పరిశోధకుడు** : పత్రికలకు ఇటీవల రాజకీయాసక్తి మెండుగా ఉన్నట్లుంది..

**తుర్లపాటి** : నిజాయితీతో వృత్తిధర్మాన్ని నిర్భయంగా నిర్వర్తించే పత్రికలు నేటికీ ఉన్నాయి. కాలక్రమంలో ప్రాచుర్యం తగ్గి వాటిగొంతు మరీ పీల అయింది. ఏదో ఒక పార్టీని కొమ్ము గాయడమే పనిగా పెట్టుకుని, ఆ పార్టీని ఇబ్బంది పెట్టే వాస్తవాలను కప్పిపుచ్చి, ఆ పార్టీ ప్రయోజనాలకు తగట్టు నిజం నడుంవిరిచి, అర్థసత్యాలతో, అసత్యాలతో వార్తలను మలిచి, ఆ పార్టీ నేతలను పనిగట్టుకుని ఆకాశానికెత్తి ఆ పార్టీ శత్రువులను కక్షగట్టి పాతాళానికి అణగతొక్కడమే జర్నలిజంగా చలామణీ అయ్యే రోజులు వచ్చాక పత్రికా రంగం స్వరూపమే మ ఆరిపోయింది. పత్రికా రచనకు, గోబెల్స్ ప్రచారానికి సామాన్యుల దృష్టిలో తేడా లేకుండా పోయింది. ఒక పార్టీని పైకి తేవడానికి, ఇంకో పార్టీకి హాని చేయడానికి సామాన్యుల దృష్టిలో తేడా లేకుండా పోయింది. ఒక పార్టీని పైకి తేవడానికి, ఇంకో పార్టీకి హాని చేయడానికి.. సొంత పార్టీలోనే తన వర్గం బలాన్ని పెంచుకోవడానికీ, విరోధి వర్గం బలాన్ని దెబ్బతీయడానికి.. ఒక కులం ప్రయోజనాలను కావలికాయడానికి, ఇంకో కులం ప్రయోజనాలను కూల్చి వేయడానికి.. తన వ్యాపారం బాగు చేసుకోవడానికి, ఇంకొకరి వ్యాపారం పాడడు చేయడానికి.. కొంతమంది నిక్షేపరాయుళ్ల చేతిలో కొన్ని పత్రికలు పనిముట్లు కావడంతోటే.. అనేక కారణాల వల్ల అలాంటి పత్రికలకే ప్రాచుర్యం హెచ్చి, వృత్తి నిబద్ధతగల పాతపత్రికలు మూలపడటంతోటే పత్రికా రంగంలో విశ్వసనీయత క్రమేణా తగ్గుతూ వచ్చింది. లోగడ ఎన్నికల్లో ఫలానా పార్టీకి విజయావకాశాలు బాగా ఉన్నాయనీ, ఫలానా చోట్ల ఫలానా అభ్యర్థి గెలవవచ్చని పత్రికా విలేకరులు సొంత అభిప్రాయాలు రాస్తేనే అది యధార్థ పరిస్థితికి ప్రతిబింబమైనట్టు పాఠకులు విలువ ఇచ్చేవారు. ఈ రోజు అగ్రశ్రేణి దినపత్రిక రాష్ట్రమంతటా 'శాస్త్రప్రకారం' సర్వేను జరిపించి, భారీ ఎత్తున వేలాది జనం అభిప్రాయాలు సేకరించి, వాటిని గొప్ప కంప్యూటర్లలో వింగడించి, నూటికి నూరుపాళ్ల కరెక్టు ఫలితాలు ఏమిటో అందులో ఏ పార్టీకి ఎన్ని సీట్లు ఇవ్వబోతున్నారో అవతల పార్టీ నాయకులు ఒకరోజు ముందే ప్రెస్‌కాన్ఫరెన్స్ పెట్టి కరెక్టుగా చెప్పగలగడాన్ని బట్టే ఆ బాపతు పత్రికల క్రెడిబిలిటీ ఎంత లక్షణంగా ఉందో విస్పష్టమవుతుంది.

'గణిత చంద్రిక' పత్రిక ప్రధాన సంపాదకుడు

**డాక్టర్ ప్రఖ్య సత్యనారాయణశర్మ** తో పరిశోధకుడి ముఖాముఖి



**పరిశోధకుడు** : లిఖిత పత్రిక నిర్వహించాలనే ఆలోచన మీకు ఎందుకు వచ్చింది?

**శర్మ** : నేను ఉపాధ్యాయవృత్తిలోకి ప్రవేశించిన తర్వాత, విద్యార్థులతో వినూత్న కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉండేవాడిని. అప్పటికే కొందరు లిఖిత పత్రిక నడుపుతున్నట్లు విన్నాను. నా విద్యార్థుల చేత ఈ తరహా కృత్యం చేయించాలని సంకల్పించి 'కృష్ణవేణి' పేరుతో లిఖిత పత్రిక ప్రారంభించాను.

**పరిశోధకుడు** : లిఖిత పత్రిక నిర్వహణ చాలా కష్టం కదా? మీరెలా నిర్వహించారు?

**శర్మ** : కష్టం అనుకుంటే ఏదైనా కష్టమే. మొదట్లో నా ఆలోచన ఎవరికీ అర్థం కాలేదు. నేనే స్వయంగా కాగితాలు తీసుకుని పత్రికలో ఒక్కో పేజీ రాయడం మొదలు పెట్టాను. క్రమంగా ఒక్కొక్కరు నాతో కలిశారు. అదొక మరపురాని అనుభూతి.

**పరిశోధకుడు** : గణిత చంద్రిక అనే పత్రిక కూడా నడుపుతున్నట్లున్నారు?

**శర్మ** : అవును. కృష్ణవేణి అనేది లిఖిత పత్రిక. నేను పనిచేస్తున్న పాఠశాల వరకు పరిమితం. గణిత చంద్రిక అనేది ముద్రిత పత్రిక. విజయవాడకు చెందిన అసోసియేషన్ ఫర్ ఇంప్రూవ్‌మెంట్ ఆఫ్ మాథమెటిక్స్ ఎడ్యుకేషన్ ఆధ్వర్యంలో నడుస్తోంది.ఇందులో పూర్తిగా గణితాంశాలు ఉంటాయి.

**పరిశోధకుడు** : ఇవాల్టి రోజున గణిత విషయాలతో పత్రిక నడపడం సాధ్యమవుతుందంటారా?

**శర్మ** : తలచుకుంటే ఏదైనా సాధ్యమే. గణిత చంద్రికనే తీసుకుంటే ఇప్పటికి 20 ఏళ్ళుగా వస్తోంది. ఇదే గొప్ప విజయం. గణితచంద్రిక స్ఫూర్తితో మరో రెండు గణిత పత్రికలు గోదావరి జిల్లాలో ప్రారంభమయ్యాయి. ఇంతకన్నా కావలసింది ఏముంటుంది?

**పరిశోధకుడు** : మీకు ప్రకటనలు వస్తాయా?

**శర్మ** : పత్రిక ప్రారంభించిన నాటి నుంచి ఇప్పటికి...అంటే 20 ఏళ్లు గడిచినా పట్టుమని 100 ప్రకటనలు కూడా రాలేదు. ఇలా ప్రకటనలు లేకుండా పత్రిక నడపడమూ కష్టమే. అయినా గణితాభిమానుల ఆదరణ ఉండడం వల్ల కొద్దిపాటి ఇబ్బందులు ఉన్నప్పటికీ పత్రికను విజయవంతంగా నడపగలుగుతున్నాం.

**పరిశోధకుడు** : పత్రిక కోసం గణితాంశాలను ఎవరైనా పంపిస్తారా?

**శర్మ** : చాలా తక్కువగా ఉంటాయి. ఒక్కోసారి నేనే ఎవరో ఒక రచయితను ఎంచుకుని, వారికి కాన్సెప్ట్ చెప్పి రాయిస్తుంటాను. తగినన్ని వ్యాసాలు చేతి నిండా ఉండవు. ఇక్కడే సంపాదకుడి ప్రతిభ ఆధారపడి ఉంటుంది.

**పరిశోధకుడు** : ఎలాంటి అంశాలను మీరు పత్రికలోకి తీసుకుంటారు?

**శర్మ** : ఇతర పత్రికల్లాగా గణిత పత్రికకు పాత్రికేయ వ్యవస్థ ఉండదు. కాబట్టి, గణిత కృత్యాలు నిర్వహించే పాఠశాలలు లేదా కళాశాలలతో నిరంతరం సంప్రదింపులు జరపాలి. ఇందుకోసం ఇతర పాఠశాలలు / కళాశాలలు / ఇతర సంస్థలతో సాన్నిహిత్యం తప్పనిసరి. ఇక అంశాల ఎంపిక అనేది విషయపరంగా కాకుండా పాఠశాల / కళాశాల స్థాయిలకు అనుగుణంగా తీసుకుంటాము. ఈ పత్రికను ఎక్కువగా ఆదరించేది / మేం ఆశించేది కూడా విద్యార్థులే. కాబట్టి, విద్యార్థులు గణితంలో ఉత్తమ ప్రతిభ కనబరడానికి వీలుపడే అన్ని అంశాలను ప్రచురిస్తాం.

**పరిశోధకుడు** : పత్రిక జయాపజయాల గురించి..

**శర్మ** : పత్రికలో వచ్చిన వ్యాసాల స్ఫూర్తితో గణిత పరిశోధన రంగంలో ప్రవేశించిన విద్యార్థులు, గణిత కార్యక్రమాల నిర్వహణ ద్వారా పాఠశాలల మధ్య ఏర్పడిన సత్సంబంధాలు పత్రిక సాధించిన విజయాలు. ఇక, పరిశోధనాత్మక వ్యాసాల వంటి స్నాతకోత్తర స్థాయి అంశాలు పాఠశాల విద్యార్థుల స్థాయిని మించి ఉండడం వల్ల పత్రిక ఆశించిన ప్రయోజనం నెరవేరడం లేదు. పాఠశాల స్థాయిలో తెలుగులో గణిత పత్రిక లేదన్న కొరత గణిత చంద్రిక వల్ల తీరినప్పటికీ, కాలక్రమంలో ఆంగ్లంలో ఎక్కువ వ్యాసాలు ప్రచురించడం వల్ల పత్రిక తన నియమాల్ని తానే ఉల్లంఘించినట్లయింది.

**పరిశోధకుడు** : లిఖిత పత్రిక, గణిత పత్రిక – ఈరెండింటిలో దేని నిర్వహణ కష్టంగా అనిపించింది?

**శర్మ** : రెండూ కష్టమైనవే. లిఖిత పత్రిక నిర్వహణలో సంపాదకత్వం, యాజమాన్యంతో పాటు చిత్రకళా నైపుణ్యం కూడా అవసరమవుతుంది. గణిత పత్రిక ముద్రిత పత్రిక కాబట్టి, కంప్యూటర్ వంటి అధునాతన యంత్రాల పరిజ్ఞానం ఉంటే సరిపోతుంది. మిగిలిన అంశాలు రెండిటికీ సమానమే. విద్యార్థుల్లోని సృజనాత్మక శక్తిని వెలికితీయడానికి ఈ రెండింటినీ నేను రెండు విభిన్న మార్గాలుగా ఎంచుకున్నాను.